

4th Anniversary

దీపావళి, రంజాన్ శుభాకాంక్షలతో...

4 ఆంధ్రజ్యోతి వార్షికోత్సవ ప్రత్యేక సంచిక



# ఆంధ్రజ్యోతి

బుధవారం, 25 అక్టోబరు 2006, గుంటూరు

ఆంధ్రజ్యోతి ఆంధ్రజ్యోతి ఆంధ్రజ్యోతి ఆంధ్రజ్యోతి

నిత్య నూతనం... ప్రతిరోజు ప్రత్యేకం

## వైవిధ్యభరితం గుంటూరు జిల్లా



4th Anniversary

# బాపట్ల ఎడ్యుకేషన్ సొసైటీ

## సేవా దృక్పథంతో నడుపబడుతున్న ఏకైక విద్యా సంస్థ

బాపట్ల ఇంజనీరింగ్ కళాశాల భవనం

BAPATLA ENGINEERING COLLEGE

## సాంకేతిక విద్య ప్రపంచానికే సువర్ణ మణిహారం, చదువుల తల్లి నుదుటిపైన సిరులొలికే సింధూరం

★ భారత ప్రభుత్వ మానవ వనరులశాఖ వారి టెక్నికల్, క్వాలిటీ ఇంప్రూమెంట్ ప్రోగ్రాం. క్రింద ప్రపంచ బ్యాంకు నిధులతో అంతర్జాతీయ ప్రమాణాలతో అధునాతన సౌకర్యాల కొరకు ప్రపంచ బ్యాంకు ఆర్థిక సహాయం అందజేస్తున్న ఆంధ్రప్రదేశ్‌లో ప్రైవేటు సెక్టారులోని ఏకైక విద్యా సంస్థ.

★ సబ్సిడీ విధానంతో కాలేజీ క్యాంటీన్, బస్సు సౌకర్యం కల్పిస్తున్న ఏకైక విద్యా సంస్థ.

★ కె.జి. నుండి పి.జి. వరకు విద్యాభ్యాసాన్ని ఒకేచోట అందిస్తూ తొమ్మిది వేలమంది విద్యార్థులతో అలరారుతున్న ఏకైక విద్యాసంస్థ.



శ్రీ ముప్పలనేని శేషగిరిరావు
చైర్మన్, బాపట్ల ఎడ్యుకేషన్ సొసైటీ

★ 4 లక్షల చదరపు అడుగుల భవనాలతో సువిశాలమైన ప్రాంగణం ఇంజనీరింగ్ కళాశాలకు ప్రత్యేకతను సంతరించుకుంది.

★ విద్యార్థులకు, అధ్యాపక, అధ్యాపకేతర సిబ్బందికి ఉచితంగా మినరల్ వాటర్ అందించబడుతుంది.

★ గ్రామీణ వాతావరణంలో 1962లో బాపట్ల ఎడ్యుకేషన్ సొసైటీ ప్రారంభించి గేట్ ర్యాంకులతో పాటు, విశ్వవిద్యాలయాల ర్యాంకులతో అసమాన్యమైన అభివృద్ధి శిఖరాలను అధిరోహిస్తున్న ఏకైక విద్యా సంస్థ.

★ గత 6 సంవత్సరాలలో నగటున పది మంది విద్యార్థులు అఖిల భారత స్థాయిలో 100 లోపు ర్యాంకులు సాధించారు.

అద్వితీయరీతిలో గేట్ ర్యాంకులను సాధిస్తూ దేశ, విదేశాల్లో ఈ కళాశాలల విజయకేతనాన్ని ఎగురవేస్తున్న విద్యార్థినీ విద్యార్థులకు ఇవే మా శుభాకాంక్షలు.



జనరల్ ఇంజనీరింగ్ బిల్డింగ్

### ☛ ఇంజనీరింగ్ కళాశాల ప్రగతి

★ బాపట్ల ఇంజనీరింగ్ కళాశాల 1981లో స్థాపించబడింది ★ AICTE న్యూఢిల్లీ వారిచే ఆమోదించబడింది. ★ కాలేజీలోని 6 కోర్సులు ఎన్‌బిఎ గుర్తింపు స్థాయిని పొందాయి ★ AICTE, UGC వారి ద్వారా త్వరలో స్వయం ప్రతిపత్తి పొందబోతున్నది ★ 'గేట్1997'లో సివిల్ ఇంజనీరింగ్‌లో అఖిల భారతస్థాయిలో ప్రథమ స్థానం సాధించబడింది ★ గేట్ 2005లో అర్హత పొందిన 230 మందిలో 22 మంది విద్యార్థులు 99% పర్సన్‌టైల్ సాధించారు. ★ 1999, 2000, 2003, 2004 మరియు 2005 సంవత్సరాలలో విశ్వవిద్యాలయంలో ప్రథమ స్థానాన్ని ఈ కాలేజి విద్యార్థులు సాధించారు. ★ 2000 నుండి 2003 సంవత్సరాలలో మాథ్స్ ఒలంపియాడ్‌లో ప్రథమ స్థానాన్ని సాధించారు. ★ 600 మంది బాలికల సౌకర్యార్థం రెండు బాలికల వసతి గృహాలు అత్యాధునిక వసతులతో నిర్వహించబడుతున్నాయి. ★ విద్యార్థులందరికి ఉచితంగా ఇంటర్నెట్ సదుపాయం (2 ఎం.బి.బి.ఎస లీజ్‌డ్ లైన్) కల్పించబడుతోంది. ★ బాలికల వసతి గృహంలో ప్రత్యేకంగా ఇంటర్నెట్ సదుపాయంతో కంప్యూటర్ సెంటర్ ఏర్పాటు చేయబడింది ★ 42, 767 సంపుటాలతో 70 విదేశీ పత్రికలతో కలిసి 154 సాంకేతిక పత్రికలతో గ్రంథాలయం నిర్వహించబడుతోంది. ఇందులో విద్యార్థులకు 30 టెర్మినల్స్ ద్వారా 250 విదేశీ పత్రికలు చదువుకునే అవకాశం కల డిజిటల్ లైబ్రరీ సౌకర్యం కూడా కల్పించబడింది.

**కళాశాలలోని కోర్సులు :**
బిటెక్ : సిహెచ్.ఇ., సి.ఇ., సి.ఎస్.ఇ, ఇ.సి.ఇ., ఇ.ఇ.ఇ., ఇ.ఐ.ఇ., ఐ.టి., ఎం.ఇ., బయోటెక్నాలజీ
ఎంటెక్ : ఇ.సి.ఇ (ఎస్.పి. & సి.ఎస్), ఎం.ఇ (సి.ఎ.డి/సి.ఎ.ఎం) ఎం.సి.ఎతో సహా 6 కోర్సులు ఉన్నాయి.



సివిల్ మరియు మెకానికల్ బిల్డింగ్



బిఫార్మసీ కళాశాల

### ★ ఫార్మసీ కళాశాలలో నిర్వహించే కోర్సులు

1. డిఫార్మసీ 2. బిఫార్మసీ 3. ఎమ్ ఫార్మసీ (ఫార్మస్యూటిక్స్)

### ★ పాలిటెక్నిక్ కాలేజీలో నిర్వహించే కోర్సులు

1. ఇసిఇ 2. ఇఇఇ 3. ఎమ్ఇ 4. ఇసిఇ 5. సిఎస్ఇ (3 సంవత్సరాలు) 6. డిప్లమో ఇన్ బయోటెక్నాలజీ (2 సంవత్సరాలు)

### ★ ఆర్ట్స్ అండ్ సైన్సెస్ కళాశాలలోని కోర్సులు

ఇంటర్మీడియట్ : 1. ఎంపిసి (TM & EM) 2. బైపిసి (TM & EM) 3. హెచ్ఇసి (TM) 4. హెచ్‌టిసి (TM) 5. సిఇసి (TM)
బిఎ : 1. హిస్టరీ, పాలిటిక్స్, ఎకనామిక్స్ 2. హిస్టరీ, పాలిటిక్స్, ఇంగ్లీషు 3. హిస్టరీ, పాలిటిక్స్, తెలుగు
బిఎస్సీ : 1. మ్యాథ్స్, ఫిజిక్స్, కెమిస్ట్రీ (TM & EM) 2. బోటనీ, జూవాలజీ, కెమిస్ట్రీ (TM & EM) 3. మ్యాథ్స్, ఫిజిక్స్, కంప్యూటర్ సైన్స్ 4. మ్యాథ్స్, ఫిజిక్స్, ఎలక్ట్రానిక్స్ 5. మ్యాథ్స్, కంప్యూటర్ సైన్స్, ఎలక్ట్రానిక్స్ 6. మ్యాథ్స్, కంప్యూటర్ సైన్స్, స్టాటిస్టిక్స్ 7. బయోకెమిస్ట్రీ, మైక్రోబయాలజీ, కెమిస్ట్రీ 8. బయోటెక్నాలజీ, జువాలజీ, కెమిస్ట్రీ, 9. పి.జి.లో బయోటెక్నాలజి
బికాం : (TM & EM) బి.కాం. కంప్యూటర్ అప్లికేషన్స్ ★ ఈ కళాశాలలో ఎన్‌సిసి, ఎన్ఎస్ఎస్ మరియు స్పోర్ట్స్ విభాగాలలో విద్యార్థులు రాష్ట్ర, జాతీయ స్థాయిల్లో ఉన్నత పురస్కారాలు అందుకుంటున్నారు.



అడ్మినిస్ట్రేటివ్ బిల్డింగ్



ఆర్ట్స్ కళాశాల బాలికల హాస్టల్

### ★ బాపట్ల జూనియర్ కాలేజిలో కోర్సులు

ఎంపిసి మరియు బైపిసి (EM)

### ★ బాపట్ల పబ్లిక్ స్కూల్

LKG నుండి 10th వరకు (EM) తరగతులు నిర్వహిస్తున్నారు.



ఆర్ట్స్ & సైన్సెస్ కళాశాల



ఇంజనీరింగ్ కళాశాల బాలికల హాస్టల్-1



ఆర్ట్స్ & సైన్సెస్ కళాశాల అండ్ టెక్నాలజీ బిల్డింగ్



పబ్లిక్ స్కూల్

# ఆంధ్రజ్యోతి

## 4వ వార్షికోత్సవ శుభాకాంక్షలు

శిక్షణ విలక్షణం



శ్రద్ధ అత్యద్భుతం





నమ్మకం అపారం



భవిత బంగారం



## తల్లి లాంటి శిక్షణ! తండ్రి లాంటి రక్షణ!!





# శ్రీచైతన్య

కళాశాలలు & కోచింగ్ సెంటర్స్

**గుంటూరు :**

**మహిళా రెసిడెన్షియల్ మరియు డేస్కాలర్స్ (బాలుర & బాలికల)**
మెయిన్‌రోడ్, లక్ష్మీపురం, ఫోన్స్ : 0863-2354364, 2255663

**బాలుర రెసిడెన్షియల్ కళాశాలు**
- నవభారత్‌నగర్, 4వ లైను, రింగ్‌రోడ్, ఫోన్ : 0863-2232621.
- అమరావతి రోడ్, గోరంట్ల, ఫోన్స్ : 0863-2254617,618,619

సెంట్రల్ ఆఫీస్ : పోరంకి, విజయవాడ (రూరల్), ఫోన్స్: 2582488, 2582688, 2588051/52.

• హైదరాబాద్ • విజయవాడ • విశాఖపట్నం • తిరుపతి • గుంటూరు • కాకినాడ • ఒంగోలు • నెల్లూరు • ఏలూరు • భీమవరం • రాజమండ్రి • మచిలీపట్నం • తెనాలి • శ్రీకాకుళం • అమలాపురం • చిత్తూరు • అనంతపురం • బళ్ళారి

# వాణిజ్య పంటలకు కేంద్రం

# గుంటూరు జిల్లా



(ఆన్‌లైన్, గుంటూరు)

దేశంలోనే వాణిజ్య పంటలకు గుంటూరు జిల్లా కేంద్రమైంది. వర్జీనియా పొగాకు ఉత్పత్తికి ప్రపంచంలో గుంటూరుకు మొదటిస్థానం ఉంది. ఆసియా ఖండంలోనే గుంటూరు మిర్చియార్డు పెద్దదిగా ఉంది. రాష్ట్రంలో పత్తి ఉత్పత్తిలో గుంటూరు మొదటిస్థానంలో ఉంది. నాలుగు, అయిదు దశాబ్దాల నుంచి వాణిజ్యపంటల ఉత్పత్తులకు గుంటూరు ప్రధాన కేంద్రంగా ఉంది. దీనిని దృష్టిలో పెట్టుకొని గుంటూరులో వ్యవసాయ ఉత్పత్తుల ఎగుమతులకు సంబంధించిన అగ్రికల్చర్ ఎక్స్‌పోర్ట్స్ జోన్‌ను ఏర్పాటు చేయాలనే ప్రతిపాదన ఉంది. వాణిజ్య పంటలకు కేంద్రం కావటంతో వ్యవసాయ ఆధారిత పరిశ్రమలు కూడా ఇక్కడ ఎక్కువగా ఉన్నాయి.

పొగాకు పంటకు సంబంధించి దేశం మొత్తానికి ప్రాతినిధ్యం వహిస్తున్న పొగాకుబోర్డు గుంటూరు కేంద్రంగా ఉంది. ప్రత్తి, మిర్చి పంటల ఆధారంగా ఏర్పాటుచేసిన స్పిన్నింగ్, జిన్నింగ్ మిల్లులు, కోల్డ్‌స్టోరేజ్‌లు ఎక్కువగా ఉన్నాయి. అసియా ఖండంలోనే పేరెన్నిక గల గుంటూరు మిర్చియార్డులో సంవత్సరానికి రూ.600 కోట్ల నుంచి వెయ్యికోట్ల రూపాయల లావాదేవీలు జరుగుతుంటాయి. గుంటూరు మిర్చియార్డు ద్వారా ఉద్యోగులు, కార్మికులు మొత్తం మూడువేల నుంచి ఐదు వేల మందికి ఉపాధి కలుగుతోంది. ప్రస్తుతం స్పైస్‌బోర్డు ప్రాంతీయ కార్యాలయం గుంటూరులో ఉంది. దీనిని జోనల్ ఆఫీసుగా మార్పు చేయాలని ప్రయత్నిస్తున్నారు. గుంటూరు, నరసరావుపేట డివిజన్‌లలో పత్తి, మిర్చి, పొగాకు తదితర వాణిజ్య పంటలు పండిస్తున్నారు. పత్తి, మిర్చిపంటలు ఎక్కువ కావటంతో గుంటూరులో దేశం మొత్తంలో కంటే ఎక్కువ పురుగుమందులు, ఎరువులు వ్యాపారం జరుగుతోంది. దేశస్థాయిలో రైతునాయకులుగా ఎదిగిన ఆచార్య రంగా, వేత్త రఘురామయ్య, డాక్టర్ యలమంచిలి శివాజీ తదితరులు రైతులు సమస్యలను ఆధారం చేసుకొని రాజకీయ జీవితాన్ని ప్రారంభించారు. మిర్చి పండించటంలో కూడా గుంటూరు జిల్లా అగ్రస్థానంలో ఉంది. గుంటూరులో సుమారు 65 కోల్డ్‌స్టోరేజ్‌లు ఉన్నాయి. అంతర్జాతీయ మార్కెట్‌లో పొగాకు ఎగుమతులకు గుంటూరు ప్రధాన కేంద్రంగా ఉంది. జిల్లాలో సుమారు 9 లక్షల హెక్టార్ల వ్యవసాయ భూమి ఉండగా ఐదులక్షల హెక్టార్లలో వాణిజ్య పంటలు పండిస్తున్నారు.

వాణిజ్యపంటలు కేంద్రంగా ఉండటం వలన లాంఫారం, బాపట్ల వ్యవసాయ కళాశాల, కావూరు కృషి విజ్ఞాన కేంద్రం తదితర కేంద్రాలలో వ్యవసాయ పరిశోధనలు నిత్యం జరుగుతున్నాయి. రాష్ట్రంలోని రాయలసీమ, తెలంగాణా జిల్లాల నుంచి కూడా రైతులు గుంటూరు మిర్చి యార్డుకు వస్తుంటారు. ఆరువందల కమీషన్ షాపులు, వందమంది మిర్చి ఎగుమతిదారులు ఇక్కడ పనిచేస్తుంటారు. వాణిజ్య పంటలు విరివిగా పండటం వలన రైతులలో చైతన్యం కూడా బాగా పెరిగింది. ఇటీవల సరైన గిట్టుబాటు ధరలు లేక మిర్చి, పత్తిరైతులు నష్టపోతూ వచ్చారు. కౌలురైతులు ఎక్కువ మంది నష్టపోయి ఆత్మహత్యలు చేసుకొంటున్నారు. రానురాను వాణిజ్య పంటలు వ్యయం పెరిగి రైతులకు భారంగా ఉంది. మొదట్లో పత్తిపంటలు వేసి బాగా లబ్ధి పొందిన రైతులు ఖరీదైన మందులు ఉపయోగించి అధిక లాభాలకోసం ఖర్చులు పెంచుకొంటున్నారు. రానురాను పొగాకు పంట విస్తీర్ణం తగ్గి పత్తి, మిర్చి విస్తీర్ణం పెరుగుతూ వచ్చింది. ఖరీదైన సింథటిక్ పెరిథ్రయిడ్స్ మందులు ఉపయోగించటం వలన వ్యవసాయ ఉత్పత్తులు విషతుల్యాలవుతున్నాయి. దీనివలన మన ఉత్పత్తులు అంతర్జాతీయ మార్కెట్‌లో ఎగుమతులకు పనికి రావటం లేదు.

ప్రస్తుతం వ్యవసాయ శాస్త్రవేత్తలు ఎరువులు, పురుగుమందుల వాడకాన్ని తగ్గించాలని పదేపదే చెబుతున్నారు. రసాయనిక ఎరువుల వాడకాన్ని తగ్గించి కేంద్రీయ ఎరువులను ఉపయోగించాలని చెబుతున్నారు. ఆధునిక వ్యవసాయ పరికరాలు, సాంకేతిక పరిజ్ఞానాన్ని ఉపయోగించటం వలన రైతులకు వాణిజ్యపంటలు పండించటం సులభంగా ఉంది. వాణిజ్యపంటలకు కేంద్రంగా ఉన్న గుంటూరులో దానిపైన ఆధారపడిన ఎరువులు, పురుగుమందుల వ్యాపారం కూడా రాష్ట్రంలోనే అధికంగా ఉంది. ఆధునిక వంగడాలను ఉపయోగించటంలో గుంటూరు ప్రసిద్ధి చెందింది. మిర్చి కిలో రూ.20వేలు అమ్మే విత్తనాలను రైతులు ఉపయోగిస్తున్నారు. పత్తిలో కిలో రెండునుంచి మూడువేల రూపాయలల అమ్మేబట్టి ఇతర విత్తనాలను తెస్తున్నారు. పొగాకు, మిర్చి, పత్తి ఉత్పత్తుల వలన జిల్లాకు విదేశీ మారక ద్రవ్యం సమకూరుతుంది. ఈ విధంగా గుంటూరుజిల్లా వాణిజ్యపంటలకు ప్రసిద్ధిగాంచింది.



## పెరిగిన మిర్చి విస్తీర్ణం

జిల్లాలో ఈ సంవత్సరం మిర్చి విస్తీర్ణం గణనీయంగా పెరిగింది. బిటి పత్తి విత్తనాల రేటు తగ్గినా రైతులు పత్తిపంట కంటే మిర్చివైపు మొగ్గు చూపారు. ఈ సంవత్సరం మిర్చికి మంచి రేటు ఉండటం కూడా దీనికి దోహదపడింది. జిల్లాలో గత సంవత్సరం మూడు లక్షల 47 వేల 658 ఎకరాలు, ఈ ఏడాది మూడు లక్షల ఆరు వేల 812 ఎకరాల్లో పత్తి వేశారు. గత ఏడాది లక్షా 35 వేల ఎకరాల్లో, ఈ సంవత్సరం లక్షా 70 వేల ఎకరాల్లో మిర్చి వేశారు.




ది. 28-10-2005న న్యూఢిల్లీలో భారత రాష్ట్రపతి గౌ॥ డా॥ ఏ.పి.జె.అబ్దుల్ కలామ్ గారి చేతుల మీదుగా 'జాతీయ ఉత్తమ పారిశ్రామిక అవార్డు' అందుకుంటున్న తులసి గ్రూపు సంస్థల ఛైర్మన్ & మేనేజింగ్ డైరక్టరు శ్రీ తులసి రామచంద్ర ప్రభు గారు






## తులసి సీడ్స్ ప్రై. లిమిటెడ్

An ISO 9001 : 2000 certified company

GUNTUR, ANDHRA PRADESH







ఎంతో కాలంగా రైతాంగం ఎదురుచూస్తున్న నాణ్యమైన తులసి 'బీటి' ప్రత్తి విత్తనాలు ఇప్పుడు **ఆంధ్రప్రదేశ్** అంతటా..







**తులసి-4 బీటి** (శ్రీ తులసి బీటి)

**తులసి-117 బీటి** (నమస్కార్ బీటి)

---

### ఖాతాదారులకు, మిత్రులకు, శ్రేయోభిలాషులకు దీపావళి, రంజాన్ శుభాకాంక్షలు...

**➡ మీ ఫొటోలు లేజర్ ప్రింటర్‌ద్వారా**

**Digital Plus**

నెగెటివ్ ఫిల్మ్ ద్వారా సి.డి. లోకి మీ ఫొటోలు నెగెటివ్ ఫిల్మ్, సి.డి., డిజిటల్ కెమెరా, సెల్ ఫోన్, మెమరీ చిప్ మొదలగు అన్నిరకాల మీడియాల నుండి అత్యుత్తమ క్వాలిటీ గల లేజర్ ప్రింట్లు.

ఫొటో ప్రింట్స్ సైజులు :

| | |
|---|---|
| అన్నిరకాలపాస్ పోర్ట్ ఫొటోలు | 12" x 24" |
| | 12" x 30" |
| 6" x 4" | 12" x 34" |
| 6" x 8" | 12" x 36" |
| 10" x 15" | 20" x 16" |
| 10" x 20" | 20" x 24" |
| 10" x 30" | 20" x 30" |
| 12" x 8" | 30" x 40" |
| 12" x 10" | 30" x 72" |
| 12" x 15" | 30" x 100" |
| 12" x 18" | 30" x ----" |

16 పాస్‌పోర్ట్ సైజు ఫొటోలు కేవలం రూ.30/- మాత్రమే



జపాన్ వారి అత్యంత ఆధునిక టెక్నాలజీ కలిగిన లేజర్ ప్రింటర్ NORITSU QSS-3201 Digital



ITALY MADE
DURST Epsilon Plus
Digital Photo Printer



## తులసి డిజిటల్ స్టూడియోస్

మీ రంగుల కలల ప్రపంచం

అరండల్‌పేట 4/2, గుంటూరు ✆ 0863 - 2266036, 6578036

TULASI GROUP

---

**తులసి గ్రూపు సంస్థలు**

- తులసి సీడ్స్ ప్రై. లిమిటెడ్ — ISO 9001 : 2000 Certified Company
- తులసి టెక్నోసాఫ్ట్ ప్రై. లిమిటెడ్
- తులసి ఫైలింగ్ సిస్టమ్స్
- తులసి రామ్ చిట్స్ ప్రై. లిమిటెడ్
- తులసి డిజిటల్ స్టూడియోస్
- చైతన్య ప్యాకేజింగ్స్ ప్రై. లిమిటెడ్ — ISO 9001 : 2000 Certified Company
- కోస్టల్ ప్యాకేజింగ్స్ — ISO 9001 : 2000 Certified Company
- చంద్రా ట్రాన్స్‌పోర్ట్
- వంశీ ట్రేడ్ లింక్స్

కార్పొరేట్ ఆఫీస్
తులసి హౌస్, డోర్ నెం. 6-4-6, అరండల్‌పేట 4/5
గుంటూరు - 522 002

ఫోన్స్
0863 - 2321374, 2224947, 2223254
3290272, 2256330, 2229944, 6533883

Fax : + 91 - 863 - 2221161
Website : www.cpacks.com
E-mail : info@tulasigroup.com

# మిర్చి రైతులకు వరం కోల్డ్‌స్టోరేజ్‌లు

(ఆన్‌లైన్ - గుంటూరు)

సరిగ్గా ఏడు సంవత్సరాల క్రితం 1992వ సంవత్సరం మిర్చిపంట విరగ కాసింది. డిమాండ్ తక్కువగా వుండి ఉత్పత్తి ఎక్కువ కావడంతో ఆ సంవత్సరంలో రైతాంగం నిల్వచేసే సౌకర్యం లేక క్వింటాలు రెండువందల రూపాయలకు తెగనమ్ముకొనే దుస్థితి ఏర్పడింది. ఆ స్థితి నుంచి ప్రస్తుతం మిర్చి రైతాంగం బయటపడింది. గుంటూరు మార్కెట్ యార్డుకు సమీపంలో కోల్డ్ స్టోరేజ్‌లు రావడంతో రైతాంగం ధర లేని సమయంలో తమసరుకును నిల్వచేసుకొని ఆ తరువాత ధరవచ్చిన సమయంలో సరుకు అమ్ముకునే వీలు ఏర్పడింది. కోల్డ్‌స్టోరేజ్‌లు రంగప్రవేశం చేసిన అనంతరం మిర్చి మార్కెట్‌లో స్థిరత్వం ఏర్పడింది. మార్కెట్‌లో అసాధారణంగా వ్యత్యాసం వుండడంవంటి పరిస్థితి తొలగిపోయి మార్కెట్‌లో ధరలు స్థిరంగా వుండడం ప్రారంభించాయి. దీనితోపాటు గతంలో ధరలేని సమయంలో రైతులు తమ సరుకును ప్రైవేట్ గోడౌన్‌లలో నిల్వచేయడం వలన సరుకు నిల్వచేసుకొనే సౌకర్యం ఏర్పడి రంగు తగిపోయే ప్రమాదం తొలగిపోయింది. దీనితోపాటు బరువు కూడా సరిగ్గా వుంటుంది. ఇక ఎగుమతి దారులకు కోల్డ్‌స్టోరేజ్‌లు వరంగా మారాయి. సరుకును నిల్వచేసి ఎగుమతి మార్కెట్ ఆశాజనకంగా వున్న సమయంలో కోల్డ్‌స్టోరేజ్‌లో మంచి సరుకు తీసి అమ్ముతున్నారు.

రాష్ట్రంలో మిర్చి మార్కెట్‌కు ప్రధానకేంద్రంగా విరాజిల్లుతున్న గుంటూరులో కోల్డ్‌స్టోరేజ్‌లు అత్యధిక సంఖ్యలో వచ్చాయి. గుంటూరులో 1993వ సంవత్సరంలో మూడు కోల్డ్ స్టోరేజ్‌లు వుండేవి. ప్రస్తుతం గుంటూరు మార్కెట్‌యార్డ్ పరిసర ప్రాంతాలలో మొత్తం 39 కోల్డ్ స్టోరేజ్‌లు వచ్చాయి. గుంటూరు నుంచి చిలకలూరిపేట వెళ్ళే జాతీయ రహదారికి ఇరువైపుల పొత్తూరు గ్రామంవరకు, మాచర్ల వెళ్ళే రహదారిలో నల్లపాడు రహదారి వరకు వరసగా మనకు కోల్డ్‌స్టోరేజ్‌లు కనిపిస్తాయి. ఒక్కో కోల్డ్‌స్టోరేజ్‌లో 25వేల బస్తాలు నుంచి లక్షా 60 వేల టిక్కీల వరకు నిల్వ చేసే సౌకర్యం వుంటుంది. గుంటూరులో ఎక్కువగా 80వేల నుంచి లక్ష టిక్కీలు వరకు నిల్వచేసే సామర్థ్యం వున్న కోల్డ్‌స్టోరేజ్‌లు అధికంగా వున్నాయి. 1993 సంవత్సరానికి పూర్వం రైతాంగం యార్డ్‌కు సరుకు తీసుకువచ్చిన సమయంలో ధర లేని పక్షంలో రెండురోజులు మాత్రం వేచి చూసి ఆ వెనువెంటనే అయినకాడికి అమ్ముకునే పరిస్థితి నెలకొని వుంది. ప్రస్తుతం రైతాంగం 95 సంవత్సరం నుంచి సరుకును కోల్డ్‌స్టోరేజ్‌లో నిల్వచేయడం రైతాంగం ప్రారంభించింది.

కోల్డ్‌స్టోరేజ్ నిల్వచేసిన సరుకు ధర బహిరంగ మార్కెట్‌లో కంటే ఎక్కువగా వుండటంతో రైతాంగం కోల్డ్ స్టోరేజ్‌లలో సరుకునిల్వకు అలవాటుపడింది. కోల్డ్‌స్టోరేజ్‌లో సరుకు నిల్వచేసిన రైతాంగంకు సరుకుపై 13.5 శాతం వడ్డీతో రుణంను జాతీయబ్యాంకులు ఇస్తున్నాయి. మార్కెట్ రేటులో 50 శాతం వరకు జాతీయ బ్యాంకులు రుణంగా రైతులకు ఇస్తున్నాయి. సుమారు రెండులక్షల రూపాయల వరకు రుణం ఇస్తున్నారు. గృహాల వద్ద సరుకు నిల్వచేస్తే రంగు, తూకం తగ్గిపోతుందని రైతాంగం గ్రహించింది. మార్కెట్‌లో సరుకు ఒకేసారి వచ్చిన సమయంలో ధర తగ్గుతుండటంతో ప్రస్తుతం రైతాంగం ఈ సమయంలో సరుకును కోల్డ్ స్టోరేజ్‌లలో నిల్వచేయడం ప్రారంభించింది. 1997వ సంవత్సరంలో మార్కెట్‌లో మిర్చిధర క్వింటాలుకు రెండువేల రూపాయలు పడిపోయింది. దీనితో రైతాంగం కోల్డ్‌స్టోరేజ్‌లలో అప్పటిలో సరుకు నిల్వచేసింది.

ఎగుమతి మార్కెట్‌కు ఎక్కువగా రంగు కలిగిన మిర్చి అవసరం ఏర్పడుతుంది. కోల్డ్‌స్టోరేజ్‌లలో నిల్వచేసిన మిర్చికి రంగు స్థిరంగా వుంటుంది. గుంటూరులోని కోల్డ్‌స్టోరేజ్‌లలో గుంటూరు, కృష్ణా, ప్రకాశం, నెల్లూరు జిల్లాలకు చెందిన సరుకును నిల్వచేస్తారు. ప్రస్తుతం గుంటూరులో వున్న కోల్డ్‌స్టోరేజ్‌లలో 85 సరుకు నిండివుంటుంది. గుంటూరులో ప్రస్తుతం వున్న కోల్డ్‌స్టోరేజ్‌లలో ఒక్క మిర్చిమాత్రమే నిల్వచేసేందుకు వీలుంటుంది. అదేవిధంగా, అపరాలు నిల్వచేసేందుకు వీలుగా రైతాంగంను చైతన్యవంతం చేయాల్సిన అవసరం వుంది. అదేవిధంగా పసుపు నిల్వచేసేందుకు కూడా సౌకర్యం వుండి, కూరగాయలను నిల్వచేసేందుకు అవసరమైన కోల్డ్‌స్టోరేజ్‌లను నిర్మించేందుకు ప్రభుత్వం ప్రోత్సహించాలని వారు కోరారు.

తమ డిపాజిట్‌లు బ్యాంకులలో వేస్తున్నాయని, ఇది రైతుల నుంచి వసూలుచేసిన సొమ్ము స్టోరేజ్‌లలో నిల్వచేసిన వారికి రుణంగా ఇవ్వాలని అసోసియేషన్ నాయకులు కోరారు. అదేవిధంగా కోల్డ్‌స్టోరేజ్‌లు వున్న ప్రాంతాలలో విద్యుత్‌కోత లేకుండా చేయాలని వారు ప్రభుత్వానికి విజ్ఞప్తి చేశారు.

ఇతర దేశాలకు మిర్చి ఎగుమతి చేసేందుకు మార్క్‌ఫెడ్, నాఫెడ్, ఎస్‌టిసిలు సరుకును, కొనుగోలు చేసి ఎగుమతి చేయాలని కోరారు. దీనివలన మార్కెట్‌లో ధర నిలకడగా వుంటుందని వివరించారు.

**గుంటూరులో 1993వ సంవత్సరంలో మూడు కోల్డ్‌స్టోరేజ్‌లు మాత్రమే వుండేవి. ఒక్కో కోల్డ్‌స్టోరేజ్‌లో 25వేల బస్తాలు నుంచి లక్షా 60 వేల టిక్కీల వరకు నిల్వచేసే సౌకర్యం వుంటుంది. గుంటూరులో ఎక్కువగా 80వేల నుంచి లక్ష టిక్కీలు వరకు నిల్వచేసే సామర్థ్యం వున్న కోల్డ్‌స్టోరేజ్‌లు అధికంగా వున్నాయి. కోల్డ్‌స్టోరేజ్‌లో సరుకు నిల్వచేసిన రైతాంగానికి సరుకుపై 13.5 శాతం వడ్డీతో రుణాన్ని జాతీయబ్యాంకులు ఇస్తున్నాయి. మార్కెట్ రేటులో 50 శాతం వరకు జాతీయ బ్యాంకులు రుణంగా రైతులకు ఇస్తున్నాయి. సుమారు రెండులక్షల రూపాయల వరకు రుణం ఇస్తున్నారు.**



కోల్డ్‌స్టోరేజ్ ప్లాంట్

# పుడమి పుత్రుల సేవలో వ్యవసాయ కళాశాల



బాపట్ల వ్యవసాయ కళాశాల

(ఆన్‌లైన్-బాపట్ల)

పుడమి పుత్రుల సేవలో 60 వసంతాలు పూర్తిచేసుకొని వజ్రోత్సవాలు పూర్తి చేసుకొన్న బాపట్ల వ్యవసాయ కళాశాల ఎందరో విద్యార్థులకు, రైతులకు సేవలందించి అగ్రగామిగా నిలిచింది. గుంటూరుజిల్లాలోని బాపట్ల వ్యవసాయకళాశాల పలు పరిశోధనలు చేస్తూ అత్యున్నత ఫలితాలు సాధించి వ్యవసాయ శాస్త్రవేత్తలకు పుట్టినిల్లుగా అంతర్జాతీయ ఖ్యాతిని గడించింది.

భారతదేశ స్వాతంత్ర్యానికి ముందు బ్రిటిష్ పాలకుల హయంలో ఆంధ్ర రాష్ట్రాన్ని అన్నపూర్ణగా తీర్చిదిద్దే ప్రయత్నంగా దక్షిణాది రాష్ట్రాలలోని కోయంబత్తూర్ తర్వాత ఆంధ్రప్రదేశ్‌లోని ప్రప్రథమంగా ఈ కళాశాలను బాపట్లలో 70 ఎకరాల విస్తీర్ణంలో 1945 జూలై 11న ప్రారంభించారు. అప్పటి తాలూకాలో బోర్డు అధ్యక్షుడు పాములపాటి వెంకట కృష్ణయ్య చౌదరి, వ్యవసాయ సంచాలకులు డాక్టర్ బి.వి.నాథ్, అప్పటి జిల్లా కలెక్టర్ ఎం.డి.సుల్తాన్ మొహిద్దీన్‌ల కృషితో ఆవిర్భించిన ఈ కళాశాల అప్పటి మద్రాసు గవర్నర్ సలహాదారుడైన సాంబి వెంకటరామ్మూర్తి ప్రారంభించారు. ఈ కళాశాలలో పట్టభద్రులైన విద్యార్థులు, జాతీయ, అంతర్జాతీయ స్థాయిల్లో పలురంగాల్లో ఉన్నత కీలక పదవులను నిర్వహిస్తున్నారు. ఐపిఎస్, ఐఎఎస్, ఐఆర్‌ఎస్, బ్యాంకింగ్ రంగాలతో పాటు రాజకీయ, పారిశ్రామిక వేత్తలుగా అత్యున్నత స్థానాల్లో పేరుప్రఖ్యాతులు గడిస్తున్నారు.

అంతర్జాతీయ ఉష్ణమండల వ్యవసాయ పరిశోధన కేంద్రం నైజీరియా మాజీ డైరెక్టర్ డాక్టర్ ఎస్.వి.ఎస్.శాస్త్రి, ఎరిడ్ జాన్ రీసెర్చి ఇన్‌స్టిట్యూట్ సంచాలకులుగా పనిచేసిన డాక్టర్ జి.వెంకటేశ్వర్లు,కేంద్రీయ పరిశోధన సంస్థ డైరెక్టర్‌గా పనిచేసిన డాక్టర్ బత్తిన వెంకటేశ్వర్లు, ఆచార్య ఎన్.జి.రంగా వ్యవసాయ విశ్వవిద్యాలయం, వైస్‌చాన్సలర్‌గా పనిచేసిన ఐ.వి.సుబ్బారావు,మాజీ కేంద్రమంత్రి డాక్టర్ ఉమ్మారెడ్డి వెంకటేశ్వర్లు, హైదరాబాదు దూరదర్శిని కేంద్రం డిప్యూటీ డైరెక్టర్ ఆర్. ఆర్.మిశ్రా ,డిఐజి మాలకొండయ్య తదితరులు ఈ కళాశాలలో విద్యనభ్యసించిన వారే.

కాగా గతంలో ఆంధ్ర విశ్వవిద్యాలయం అనుబంధంగా వున్న ఈ కళాశాల 1964లో ఆంధ్రప్రదేశ్‌లో అగ్రికల్చర్ వర్సిటీ పరిధిలోకి చేర్చారు. ప్రస్తుతం ఆచార్య ఎన్.జి.రంగా అగ్రికల్చర్ వర్సిటీ పరిధిలో వుంది. 1970-71లో రజతోత్సవ వేడుకలు,1994-95లో వ్యవసాయ కళాశాల స్వర్ణోత్సవ వేడుకలు, 2004-2005 వజ్రోత్సవ వేడుకలకు ముస్తాబవుతోంది.

మానవ వనరుల అభివృద్ధి పథకం కింద (ఎ.హెచ్.ఆర్.డి) ప్రపంచబ్యాంకు,ఎఫ్ఓ సౌజన్యంతో వ్యవసాయ కళాశాల అధ్యాపకులు 11మంది సాంకేతిక విజ్ఞానం పెంపొందించుకోవడానికి విదేశాల్లో శిక్షణ పొందారు. అదే విధంగా అయిదు కోట్ల రూపాయల వ్యయంతో అత్యాధునిక వ్యవసాయ పరికరాలు.కొనుగోలు చేసి విద్యార్థులకు విద్యాబోధనను ఆడియో విజువల్స్ ద్వారా అందిస్తున్నారు. వ్యవసాయ పరంగా రైతన్నలకు వ్యవసాయ సాంకేతిక పరిజ్ఞానాన్ని చేరువ చేసేందుకు ప్రతి మూడు సంవత్సరాలకు ఒక గ్రామాన్ని ఎంపిక చేసి వ్యవసాయ రంగంలో వ్యవసాయ ఉత్పత్తులు పెంచేందుకు వ్యవసాయ కళాశాల దత్తత గ్రామం పథకాన్ని అమలు చేస్తోంది.

వ్యవసాయ కళాశాల ఆవరణలో డాక్టర్ బి.వి.నాథ్ ఆడిటోరియం, రైతుల అతిథి గృహం, బాలికల వసతి గృహాలు, బాలుర వసతి గృహాలతో పాటు పిజి హాస్టల్, పెవిలియన్, జిమ్ కాంపెక్స్,ప్రాంతీయ గ్రంథాలయం, జెసిబోస్ బిల్డింగ్, విద్యార్థుల పరీక్ష కేంద్రాల భవన సముదాయాలు ఉన్నాయి. వీటితో పాటు విద్యార్థుల మానసిక వ్యక్తిత్వ వికాసం కోసం ఆరోగ్య వ్యాయామ శాలలను ఏర్పాటు చేశారు. ఎన్.ఎస్.ఎస్, ఎన్‌సిసి యూనిట్లు విభాగాలు ఉన్నాయి. విద్యార్థుల భవిష్యత్‌కోసం స్టూడెంట్ కౌన్సిలింగ్, ప్లేస్ మెంట్‌సెల్, అగ్రికల్చరల్ రీసెర్చి ఇన్‌పర్మేషన్ సెంటర్లు ఏర్పాటు చేశారు. ఇంతటి ప్రాముఖ్యత సంతరించుకున్న కళాశాలకు బాపట్ల-గుంటూరు రోడ్డులో రైల్వేగేట్ వద్ద 400 ఎకరాల విస్తీర్ణం గల వ్యవసాయ క్షేత్రం వుంది.

అత్యధిక ప్రాధాన్యత సంతరించుకొన్న బిపిటి వరి వంగడాన్ని తయారు చేసిన ఘనత బాపట్ల శాస్త్రవేత్తలదే. ఈ క్షేత్రంలో పలు వ్యవసాయ పరిశోధన కేంద్రాలతో పాటు, వ్యవసాయ కళాశాలలో 30 రకాల వివిధ భాగాల అధిపతులు, అధ్యాపకులు, వ్యవసాయ కళాశాల అసోసియేట్ డీన్ కె.భాస్కరరావు విశేష సేవలందిస్తున్నారు. కళాశాలతో పాటు ఆధునిక కాలానికి కావలసిన టెక్నాలజీ అందించిన దిశగా బాపట్ల వ్యవసాయ ఇంజనీరింగ్ కళాశాల ఏర్పాటు జరిగింది. ఈ కళాశాలకు అసోసియేట్ డీన్‌గా డాక్టర్ ఎన్.ఆర్.కె.మూర్తి వ్యవహరిస్తున్నారు. వీటితో పాటు ఆచార్య ఎన్.జి.రంగా, ఫుడ్ టెక్నాలజీ కళాశాల, ఆంధ్రప్రదేశ్ నీటి యజమాన్య ప్రాజెక్టు, మత్స్యపరిశోధన స్థానం, జీడిమామిడి పరిశోధన స్థానం, ఉప్పునీటి పరిశోధన స్థానం, వరి వంగడాల పరిశోధన స్థానం, తమలపాకు పరిశోధన స్థానం బాపట్లలో అనుబంధ రీసెర్చి ఇనిస్టిట్యూట్‌గా పనిచేస్తున్నాయి. ఈ కళాశాల బాపట్లలో ఉండటం బాపట్లకే తలమానికం.

# ఉప్పు సత్యాగ్రహంలో ఉద్యమించిన కొండా వెంకటప్పయ్య పంతులు

(ఆన్‌లైన్ - గుంటూరు)

బ్రిటీష్ సామ్రాజ్యవాదుల ఆదేశాలను ధిక్కరించి ఉప్పు సత్యాగ్రహం సందర్భంగా తన ఇంటి ఆవరణలోనే వందలాది పొయ్యిలు పెట్టించి సముద్రపు నీరు తెప్పించి ఉప్పును తయారు చేయించిన మహానుభానుడు దేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులు. వేలాది మంది ఉప్పు పొట్లాలు కట్టుకొని, నల్లజెండాలు పట్టుకొని గుంటూరు నగరం యావత్తు జాతీయ గీతాలతో హోరెత్తేలా ఉద్యమించిన మహనీయుడు వెంకటప్పయ్య పంతులు.

కొండా వెంకటప్పయ్య పంతులు 1866 ఫిబ్రవరి 22న గుంటూరులో జన్మించారు. చిరుప్రాయం నుంచే ఆయన దేశభక్తి, కళలపట్ల ఆసక్తిని ప్రదర్శించేవారు. రాజమండ్రి ప్రభుత్వ కళాశాలలో ఎఫ్ఎ చదివిన అనంతరం ఉన్నత విద్య కొరకు చెన్నై క్రిస్టియన్ కళాశాలలో చేరారు. 1887లో చెన్నైలో జరిగిన మూడవ జాతీయ కాంగ్రెస్ మహాసభలో ఆయన వాలంటీర్‌గా పని చేశారు. మహాసభలో ప్రముఖుల ప్రసంగాలు ఆయనపై తీవ్ర ప్రభావాన్ని చూపాయి. బిఎల్ పరీక్షను ఆయన ఫస్టు గ్రేడ్‌లో పాస్ అయ్యారు. సంఘసేవకు, ప్రజాహిత కార్యక్రమాలకు కేంద్రంగా వున్న బందరులో 1894లో ఆయన న్యాయవాద వృత్తిని ప్రారంభించారు. తెలుగు ప్రజానీకంలో దేశభక్తి భావాన్ని ప్రజ్వరింపచేసిన కృష్ణా పత్రికకు 1902లో ఆయన ముఖ్య సంపాదకులుగా పని చేశారు. అవినీతి, అక్రమాలకు, సాంఘిక దురాచారాలకు వ్యతిరేకంగా ఆయన రాసిన సంపాదకీయాలు తీవ్ర సంచలనం సృష్టించాయి. స్త్రీ పునర్వివాహ సంస్కరణల కొరకు కృషి చేసి బందరు, గుంటూరు నగరాలలో మంచి పేరు సంపాదించారు.



నాడు బందరులోని నోబుల్ కళాశాలలో ఉపాధ్యాయుడుగా వున్న ప్రముఖ సంఘ సంస్కర్త రఘుపతి వెంకట రత్నంనాయుడు, నోబుల్ కళాశాలకు సర్వస్వం త్యాగం చేసిన కోపల్లె హనుమంతరావు, కృష్ణా పత్రిక ద్వారా సమాజాన్ని జాగృతం చేసిన ముట్నూరి కృష్ణారావు, భోగరాజు పట్టాభి సీతారామయ్యలతో ఆయనకు మంచి స్నేహం కుదిరింది. న్యాయవాద వృత్తిలో శ్రీ వెంకటప్పయ్య ధనార్జనకే కాక నైతిక ఉద్ధరణకు ప్రాధాన్యం ఇచ్చారు. అహ్మదాబాద్‌లో జరిగిన జాతీయ కాంగ్రెస్ మహాసభకు ఆయనకృష్ణా జిల్లా ప్రతినిధిగా హాజరయ్యారు.

1905లో గుంటూరు జిల్లా ఏర్పడిన తరువాత ఆయన తన మకాంను గుంటూరుకు మార్చారు. 1906లో కలకత్తాలో జరిగిన జాతీయ కాంగ్రెస్ మహాసభకు హాజరయ్యారు. స్త్రీ విద్యావ్యాప్తి కొరకు పూనాలో వున్న మహిళా విద్యాలయం తరహాలో ఒక విద్యాలయాన్ని ఏర్పాటు చేయడానికి ఆయన విశేష కృషి సల్పి కొంత మొత్తంలో విరాళాలను సేకరించారు. తాను సేకరించిన ధనంతో ఆయన వేటపాలెంలో కొన్ని భవనాలను నిర్మించారు. కాని తగినన్ని విరాళాలు వసూలు కాకపోవడంతో ఆ కార్యక్రమం మధ్యలో ముగించవలసి వచ్చింది.

గుంటూరులో ఉన్నవ లక్ష్మీనారాయణ దంపతులు స్థాపించిన శారద నికేతన్‌కు ఆయన పది వేల రూపాయల ఆస్తిని విరాళంగా అందజేశారు. ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రం కొరకు కృషి చేశారు. ఈ నేపధ్యంలోనే ఆయన ఆంధ్రోద్యమం అనే గ్రంథాన్ని రచించారు. అనిబిసెంట్ ప్రారంభించిన హోమ్ రూల్ లీగ్ ఉద్యమాన్ని బలపరచి విస్తృతంగా ప్రచారం చేశారు. ఆయన న్యాయవాద వృత్తిని విడిచి మద్రాసు శాసనసభకు జరిగిన ఎన్నికలలో ఆయన జస్టిస్ పార్టీ అభ్యర్థిని ఓడించారు. ఆయన శాసనసభ్యుడిగా వున్నప్పుడు పౌర గ్రంథాలయాలకు గ్రాంట్లు ఇప్పించడమేకాక మహిళలు ప్రైవేటుగా మెట్రిక్ పరీక్షలు రాసేందుకు కృషి చేశారు. అనంతరం ఆయన పన్నుల సహాయ నిరాకరణ ఉద్యమం, చీరాల, పేరాల ఉద్యమం, పుల్లరి సత్యాగ్రహం, పెదనందిపాడు పన్నుల నిరాకరణోద్యమాలలో ఆయన ప్రముఖ పాత్ర వహించారు.

ఆంధ్ర కాంగ్రెస్ అధ్యక్షుడిగా కొండా వెంకటప్పయ్య, ప్రధాన కార్యదర్శిగా గొల్లపూడి సీతారామశాస్త్రిలు ఎన్నికైన తరువాత రాష్ట్రంలో సహాయ నిరాకరణ ఉద్యమం ఉప్పెనలా ఎగిసింది. అప్పటి నుంచి కొండా వెంకటప్పయ్యకు దేశభక్త అనే బిరుదు వ్యాప్తిలోకి వచ్చింది. 1921లో విజయవాడలో అఖిల భారత కాంగ్రెస్ మహాసభకు హాజరవ్వడానికి వచ్చిన మహాత్మాగాంధీతో కలిసి ఆయన పలు ప్రాంతాలలో పర్యటించారు.

వెంకటప్పయ్య ఆధ్వర్యంలో రాష్ట్రంలో విదేశీ వస్తు బహిష్కరణ ఉద్యమం ఉధృతంగా సాగింది. గుంటూరులో నాడు ఆయన నేతృత్వంలో స్వారాజ్యరధ ఉత్సవం అత్యంత కన్నుల పండుగగా జరిగింది.

వందలాది మంది స్త్రీలు జాతీయ గీతాలు పాడుతూ చేనేత వస్త్రాలు ధరించి రధాన్ని లాగిన దృశ్యం చూపరుల చేత కంటతడి పెట్టించింది.

గయా కాంగ్రెస్ మహాసభ జరిగిన తరువాత చిత్తరంజన్‌దాస్ కాంగ్రెస్ అధ్యక్ష పదవికి రాజీనామా చేయడంతో మధ్యేమారంగా వెంకటప్పయ్య ఎన్నికయ్యారు. 1923లో కాకినాడలో జరిగిన కాంగ్రెస్ మహాసభ ఆహ్వానసంఘ అధ్యక్షుడిగా ఆయన ఎన్నికయ్యారు. ఖద్దరు వ్యాప్తి కొరకు ఆయన సీతారామశాస్త్రితో కలిసి ఇల్లిల్లూ తిరిగి విస్తృత ప్రచారం చేశారు. హరిజనోద్ధరణ కార్యక్రమంలో భాగంగా ఆయన మంతెనవారిపాలెం, కొవూరు గ్రామాలలో హరిజనుల దేవాలయ ప్రవేశం కార్యక్రమాన్ని ప్రారంభించారు.

గుంటూరుకు సైమన్ వచ్చిన సందర్భంగా ఆయన నాటి మున్సిపల్ ఛైర్మన్ నడింపల్లి నరసింహరావు, ఉన్నవ లక్ష్మీనారాయణలతో కలిసి నిర్వహించిన నగర హర్తాళ్ విజయవంతం అయింది. రౌండ్ టేబుల్ సమావేశం విఫలం అయిన తరువాత నిర్వహించిన సత్యాగ్రహంలో ఆయన ప్రముఖ పాత్ర వహించారు. పలుమార్లు అరెస్టు అయి జైలుకు వెళ్ళారు. 1937లో మద్రాసు శాసనసభకు జరిగిన ఎన్నికలలో విజయం సాధించారు. జైలు శిక్ష అనుభవిస్తున్నప్పుడు ఆయన పలు గ్రంథాలను రచించారు.

1947లో ఆయన వెంకటేశ్వర సేవా నందలహరి అనే పద్యకావ్యాన్ని రచించారు. దేశ సేవలో తన తుది శ్వాస వరకు గడిపిన వెంకటప్పయ్య 1949 ఆగస్టు 15న కన్ను మూశారు.

# అంతర్జాతీయ ఖ్యాతి నార్జించిన లాం

(ఆన్‌లైన్, గుంటూరు)

'లాం' పేరు వ్యవసాయ పరిశోధనా రంగంలో దేశ విదేశాలలో సైతం మారుమోగుతోంది. తెల్లదోమను తట్టుకునే పత్తి వంగడాలను రూపొందించి జాతీయంగా ఖ్యాతినార్జించిన 'లాం'లోని ప్రాంతీయ వ్యవసాయ పరిశోధనా స్థానంలోని ప్రగతి రైతాంగానికి అందుబాటులోకి వచ్చింది. దేశంలోనే కాకుండా విదేశాల్లో సైతం పేరెన్నికగన్న, తక్కువ కాలంలో అధిక దిగుబడి ఇచ్చే పత్తి, మిర్చి, అపరాలు వంటి పంటలలో అనేక రకాల వంగడాలను కనుగొన్న లాం ప్రాంతీయ పరిశోధనా స్థానానికి దేశంలో విశిష్టమైన స్థానం వుంది. వ్యవసాయరంగంలో మారుతున్న పద్ధతుల కనుగుణంగా అనేక నూతన వంగడాలను రూపొందించిన ఘనత లాం పరిశోధనా స్థానం శాస్త్రజ్ఞులకే దక్కుతుంది. ప్రపంచంలో తొలిసారిగా శనగపచ్చ పురుగు, తెల్లదోమ వంటి చీడపీడలను తట్టుకుని అధిక దిగుబడినిచ్చే పత్తి వంగడాలైన ఎల్‌కె 861, ఎల్‌పిఎస్ 141 వంటి రకాలను కనుగొని లాం పరిశోధనా స్థానం విజయకేతనం ఎగురవేసింది. ప్రస్తుతం ఈ విత్తనాలు కావాలని పంజాబ్‌తో పాటు పొరుగుదేశమైన పాకిస్థాన్ కూడా మనదేశంపై ఒత్తిడి తెస్తున్నాయి. తెల్లదోమను తట్టుకునే ఇతర వంగడాలను కూడా శాస్త్రవేత్తలు రూపొందించారు. వాటన్నింటికి మించి మరో ప్రధాన వాణిజ్య పంట అయిన మిర్చిలో గత 25 సంవత్సరాల నుంచి దేశంలోని వివిధ రాష్ట్ర రైతాంగం వాడుతున్న జి-4, ఎల్‌సిఎ-235 వంటి విత్తనాలను లాం శాస్త్రవేత్తలు కనుగొన్నారు. మిర్చిలో ఘాటుతో పాటు అధిక దిగుబడినిచ్చే వంగడాలుగా ఇవి దేశ వ్యాప్తంగా ప్రసిద్ధికెక్కాయి. వీటిని గుంటూరు మిరప అని పిలుస్తారు. రాష్ట్రంలో అత్యంత సారవంతమైన నేలలు, అధిక దిగుబడినిచ్చే వంగడాలు, ఆధునిక పద్ధతిలో పండించే రైతాంగం వున్న ప్రాంతానికి ఈ వ్యవసాయ పరిశోధనా స్థానం అనేక రకాలైన సలహాలు, సూచనలు ఇవ్వడమే కాకుండా రైతాంగానికి అవసరమైన శాస్త్రీయ పరిజ్ఞానాన్ని నిరంతరం అందిస్తూ వచ్చింది.



గుంటూరు సమీపంలోని లాం వ్యవసాయ పరిశోధనా క్షేత్రం

మొత్తం 103 ఎకరాల్లో విస్తరించి వున్న లాంఫారంలో పత్తి, మిర్చి, అపరాలు వంటి పంటలపై పరిశోధన జరుగుతోంది. మాగాణి భూముల్లో పండించే మినుము, పెసర, కంది వంటి అపరాల పంటల్లో లాం శాస్త్రవేత్తలు పరిశోధన చేసి నూతన వంగడాలను కనుగొనడంతో గతంలో రాష్ట్రంలో లక్ష టన్నులు పండించే మినుము పంట ప్రస్తుతం నాలుగు లక్షల టన్నులకు చేరుకుంది. అదే విధంగా కంది పంటకు శనగపచ్చ పురుగు ఆశించి దిగుబడులు పడిపోయి తీవ్ర నష్టాలకు గురవుతున్న రైతాంగానికి లాంలోని ప్రాంతీయ వ్యవసాయ పరిశోధనా స్థానం శాస్త్రవేత్తలు కనుగొన్న ఎల్‌ఆర్‌జి-30 రకం కంది విత్తనం శనగపచ్చ పురుగును తట్టుకొని నిలబడగలిగింది.

కంది పంటను ఖరీఫ్‌లో కాకుండా రబీకి వేసే విధంగా అనువైన విత్తనాలు రూపొందించారు. దేశంలో తొలిసారిగా సోయాబిన్ విత్తనాలను అధిక దిగుబడి వచ్చే విధంగా రూపొందించి లాం శాస్త్రవేత్తలు నూతన ఒరవడి సృష్టించారు.

కేవలం 65 రోజుల్లో కాపుకు వచ్చే ఎల్‌ఎస్‌వి-1 అనే నూతన వంగడాన్ని కనుగొని సోయాబీన్‌లో అద్భుతమైన పురోగతి సాధించారు. ఖరీఫ్, రబీ సీజన్లలో ఉపయోగపడటంతోపాటు పత్తిలో అంతర్ పంటలుగా సోయాబీన్ వేసేందుకు శాస్త్రవేత్తలు చేసిన కృషి విజయవంతమైంది. గుంటూరు జిల్లాలోని తాడికొండ, ప్రత్తిపాడు, మేడికొండూరు వంటి మండలాల్లో రైతాంగం సోయాబీన్ అంతర్ పంటగా వేసి అధిక లాభాలు ఆర్జించగలుగుతున్నారు. వీటితోపాటు సమగ్ర సస్యరక్షణ విధానం, పంటలు పండించడంలో రైతాంగం తీసుకోవాల్సిన మెలకువలు, పురుగుమందులు ఎక్కువగా వినియోగిస్తున్న తరుణంలో వాటి అవశేషాలు ఉత్పత్తులపై లేకుండా చేసేందుకు అవసరమైన శిక్షణా కార్యక్రమాలను కూడా లాంఫారం చేపట్టింది.

ప్రయోగశాల నుంచి శాస్త్ర పరిజ్ఞానాన్ని పొలాలకు తీసుకువెళ్ళే వినూత్న పంథాను లాం శాస్త్రవేత్తలు విజయవంతం చేశారు. నేరుగా రైతుల వద్దకు వెళ్ళి పంటలు పరిశీలించి అవసరమైన మెళకువలను సూచించడంతో ఈ ప్రాంతీయ పరిశోధనా స్థానం కృష్ణా-గోదావరి జోన్‌లోని రైతాంగంతో మమేకమైంది. కృష్ణా-గోదావరి జోన్‌లో అత్యధిక విస్తీర్ణంలో పండిస్తున్న మిర్చిని విదేశాలకు ఎగుమతి చేసే విధంగా ఆ పంటపై పురుగు మందు అవశేషాలు లేకుండా చూసేందుకు సమగ్ర సస్యరక్షణ వంటి వినూత్న పద్ధతులపై లాంఫారం శాస్త్రవేత్తలు పరిశోధనలు జరుపుతున్నారు. ప్రస్తుతం లాంఫారం అసోసియేట్ డైరెక్టర్‌గా డాక్టర్ తిరుపతిరెడ్డి వ్యవహరిస్తున్నారు.

> తక్కువ కాలంలో అధిక దిగుబడి ఇచ్చే పత్తి, మిర్చి, అపరాలు వంటి పంటలలో అనేక రకాల వంగడాలను కనుగొన్న లాం ప్రాంతీయ పరిశోధనా స్థానానికి దేశంలో విశిష్టమైన స్థానం వుంది. **103** ఎకరాల్లో విస్తరించి వున్న లాంఫారంలో వాణిజ్య పంటలపై పరిశోధన జరుగుతోంది. దేశంలో తొలిసారిగా సోయాబిన్ విత్తనాలను అధిక దిగుబడి వచ్చే విధంగా రూపొందించి లాం శాస్త్రవేత్తలు నూతన ఒరవడి సృష్టించారు. రైతులకు అవసరమైన మెలకువలను సూచించడంలో ఈ ప్రాంతీయ పరిశోధనా స్థానం కృష్ణా-గోదావరి జోన్‌లోని రైతాంగంతో మమేకమైంది.



# క్షీర విప్లవసారధి 'ధూళిపాళ్ల వీరయ్యచౌదరి'

(ఆన్‌లైన్-పొన్నూరు)

స్వయంకృషి-పట్టుదలతో ఉన్నత పదవులను అలకరించి సమర్ధుడైన నాయకునిగా రాష్ట్రస్థాయిలో పేరెన్నిక గన్న స్వర్గీయ ధూళిపాళ్ళ వీరయ్యచౌదరి నేటి తరం నాయకులకు ఆదర్శప్రాయులు..మెట్రిక్‌లేషన్ విద్యను అభ్యసించిన స్వర్గీయ వీరయ్యచౌదరి రాష్ట్ర రెవెన్యూశాఖ మంత్రి పదవిని అత్యంత సమర్ధవంతంగా నిర్వహించి, ఉన్నత విద్యను అభ్యసించక పోయినా పదవులను సమర్ధవంతంగా నిర్వహించవచ్చునని చాటి చెప్పారు. పొన్నూరు నియోజకవర్గ అభివృద్ధిలో కీలకపాత్రను పోషించిన వీరయ్యచౌదరి దివంగతులైన 12ఏళ్ళకాలం గడచినా ప్రజల హృదయాల్లో ఆయన చిరస్మణీయులే.

పొన్నూరు మండలం చింతలపూడి గ్రామంలో 1943వ సంవత్సరంలో ధూళిపాళ్ళ రత్తయ్య,తులశమ్మ దంపతులకు జన్మించిన వీరయ్యచౌదరి ఉన్నత విద్యను అభ్యసించక పోయిన స్వయంకృషితో రాష్ట్ర రెవెన్యూ మంత్రి స్థాయికి ఎదిగారు. 1970లో చింతలపూడి గ్రామసర్పంచ్‌గా రాజకీయ జీవితాన్ని ప్రారంభించిన వీరయ్య చౌదరి 11 సంవత్సరాల కాలం సర్పంచ్ పదవిలో కొనసాగి గ్రామాన్ని ఆదర్శవంతంగా తీర్చిదిద్దారు. సంగం డెయిరీ వ్యవస్థాపక చైర్మన్, సీనియర్ రాజకీయ నాయకుడు యడ్లపాడి వెంకట్రావు శిష్యునిగా తొలుత కాంగ్రెస్ రాజకీయాల్లో ప్రవేశించిన వీరయ్యచౌదరి చింతలపూడిన గ్రామ పాల ఉత్పత్తిదారుల సహకారం సంఘం అధ్యక్షునిగా ఎన్నికై, ఆ తదుపరి సంగం డెయిరీ చైర్మన్ పదవిని 1979లో చేపట్టారు. క్షీరవిప్లవాన్ని జిల్లా నలుదిశలా విస్తరింప జేయుట ద్వారా వ్యవసాయ రంగంలో ఆటుపోట్లను ఎదుర్కొంటున్న రైతాంగానికి పాడి పరిశ్రమ ద్వారా ప్రత్యామ్నాయ ఆదాయాన్ని చూపారు. రాష్ట్రంలో తెలుగుదేశం పార్టీ ఆవిర్భావం తర్వాత అన్న ఎన్టీఆర్ పిలుపు మేరకు ఆ పార్టీలో చేరిన వీరయ్యచౌదరి, 1983,85 అసెంబ్లీ ఎన్నికల్లో పొన్నూరు నియోజకవర్గం నుండి శాసన సభ్యునిగా ఎన్నికయ్యారు.

1986లో రెండవసారి సంగం డెయిరీ చైర్మన్ పదవిని చేపట్టిన వీరయ్యచౌదరి రాష్ట్రపాడి పరిశ్రమాభివృద్ధి కార్పొరేషన్ చైర్మన్‌గా నియమితులయ్యారు. సంగం డెయిరీని గుజరాత్ రాష్ట్రంలోని ఆనంద్ డెయిరీకి ధీటుగా అభివృద్ధి చేసిన వీరయ్యచౌదరి పాల వీరయ్యగా, క్షీర విప్లవసారధిగా పేరు ప్రఖ్యాతి నొందారు. 1988వ సంవత్సరం ఎన్టీఆర్ మంత్రి వర్గంలో అత్యంత కీలకమైన రెవెన్యూశాఖ మంత్రి పదవిని చేపట్టారు. రెవెన్యూశాఖలో పలు సంస్కరణలను ప్రవేశపెట్టి, ప్రభుత్వ భూములు పరిరక్షించిన వీరయ్యచౌదరి సమర్ధుడైన మంత్రిగా అన్న ఎన్టీఆర్ నుండి ప్రశంసలను అందుకొన్నారు. 1989 అసెంబ్లీ ఎన్నికల్లో తిరగి పోటీ చేసిన వీరయ్య చౌదరి కాంగ్రెస్ అభ్యర్ధి చేతిలో స్వల్ప ఓట్ల తేడాతో ఓటమి పాలయ్యారు. 1992లో మూడవసారి సంగం డెయిరీ చైర్మన్ పదవిని చేపట్టిన వీరయ్యచౌదరి 1994లో జరిగిన రోడ్డు ప్రమాదంలో మృతి చెందారు. తొలి నుండి రైతు పక్షపాతిగా పేరొందిన వీరయ్యచౌదరి నియోజకవర్గ వ్యాప్తంగా వున్న సాగునీటి కాల్వలు, డ్రెయిన్ల ఆధునీకరణకు విశేషమైన కృషి సల్పారు.

నియోజకవర్గంలో 'దేశం'పార్టీకి పటిష్టమైన పునాదులు వేసిన వీరయ్యచౌదరి ఆ పార్టీ వాదులకు నేటికి చిరస్మరణీయులే! ఆయన వారసునిగా రాజకీయ రంగప్రవేశం చేసిన ధూళిపాళ్ళ నరేంద్రకుమార్ మూడుసార్లు శాసనసభ్యునిగా ఎన్నికయ్యారు. తండ్రి చూపిన మార్గంలో పయనిస్తూ నియోజకవర్గ అభివృద్ధికి విశేషమైన కృషిని సల్పుతున్న నరేంద్రకుమార్ తండ్రిని మించిన తనయునిగా పేర్కొనవచ్చు.

కాగా తండ్రి పేరిట సేవాసంస్థ ఏర్పాటు చేయుట ద్వారా ఆయన కీర్తిని ప్రజల హృదయాల్లో శాశ్వతం చేసేందుకు నరేంద్రకుమార్ సన్నాహాలను ప్రారంభించారు.

# కృష్ణా డెల్టాను సస్యశ్యామలం చేయనున్న పులిచింతల

పులిచింతల ప్రాజెక్టు ఊహాచిత్రం

**★ జలయజ్ఞంలో మొదటి ప్రాజెక్టు**

**★ 120 మెగావాట్ల విద్యుత్ ఉత్పత్తి**

| | |
|---|---|
| పులిచింతల ప్రాజెక్టు అంచనా వ్యయం | రూ.568.87 కోట్లు |
| ఈ ప్రాజెక్టు వలన మునిగిపోయే భూమి | 27,111 ఎకరాలు |
| రిజర్వాయర్‌లో పూర్తి నీటి సామర్థ్యం | 53.34 మీటర్లు |
| డ్యాం పొడవు | 1289 మీటర్లు |
| పులిచింతల వలన ఆయకట్టు స్థిరీకరణ | 13 లక్షల హెక్టార్లు |

**(ఆన్‌లైన్ - గుంటూరు)**

కృష్ణా డెల్టాను పులిచింతల ప్రాజెక్టు సస్యశ్యామలం చేయనున్నది. స్వర్గీయ కెఎల్ రావు ప్రతిపాదించిన ఈ ప్రాజెక్టుకు ముఖ్యమంత్రి డాక్టర్ వైఎస్ రాజశేఖరరెడ్డి జలయజ్ఞంలో మొదటిసారిగా శంకుస్థాపన చేశారు. ప్రకాశం బ్యారేజికి ఎగువన 85 కిలోమీటర్లు, నాగార్జున సాగర్ ప్రాజెక్టుకు దిగువన 115 కిలోమీటర్ల దూరంలో ఈ ప్రాజెక్టును రూపొందించారు. ఈ ప్రాజెక్టు వలన కృష్ణా డెల్టా సస్యశ్యామలం కానుంది. కృష్ణానది ఎగువన మహారాష్ట్ర, కర్నాటక రాష్ట్రాల్లో అనేక రిజర్వాయర్లను నిర్మించారు. దీనివలన కృష్ణా డెల్టా పరిధిలో సాగునీటిని నిల్వ చేసుకునే అవకాశం క్రమంగా తగ్గిపోతుంది. పులిచింతల ప్రాజెక్టు వలన 45.77 టిఎంసిల నీటిని నిల్వ చేసి 120 మెగావాట్ల విద్యుత్‌ను ఉత్పత్తి చేసే అవకాశం వుంది. ఈ ప్రాజెక్టు నిర్మాణాన్ని ఎస్టిమేషన్ ప్రొక్యూర్‌మెంట్ కన్‌స్ట్రక్షన్ (ఇపిసి) కింద చేపట్టారు. రాష్ట్రంలో ఇపిసి ద్వారా దేవాదుల తర్వాత పులిచింతల నిర్మాణాన్ని చేపట్టింది. ప్రాజెక్టు నిర్మాణాన్ని శ్రీనివాస కన్‌స్ట్రక్షన్స్ సంస్థకు ప్రభుత్వం అప్పగించింది.

## రెండు సంవత్సరాల క్రితం శంకుస్థాపన

ముఖ్యమంత్రి డాక్టర్ వైఎస్ రాజశేఖరరెడ్డి పులిచింతల ప్రాజెక్టుకు 2004 అక్టోబరు 15వ తేదీన శంకుస్థాపన చేశారు. వైఎస్ ప్రభుత్వం ప్రతిష్టాత్మకంగా చేపట్టిన జలయజ్ఞంలో మొదటి సారిగా పులిచింతలకు శంకుస్థాపన చేశారు. ప్రాజెక్టు నిర్మాణం ఆశించినంత వేగంగా జరగటం లేదు. ఇప్పటివరకు పది కోట్ల రూపాయల విలువైన పనులు మాత్రమే పూర్తయ్యాయి. కాంట్రాక్టర్‌కు ఇంజనీరింగ్ సిబ్బంది, ప్రభుత్వ యంత్రాంగం సహకరించకపోవటం వలన పనులు చురుగ్గా జరగటం లేదనే ఆరోపణలున్నాయి. పూర్తి చేసిన పనులకు ఇంకా బిల్లులు కూడా విడుదల చేయలేదు. ప్రాజెక్టు నిర్మాణంలో తీవ్ర జాప్యం జరుగుతుందని రైతు సంఘం నాయకుడు, రాజ్యసభ మాజీ సభ్యుడు డాక్టర్ యలమంచిలి శివాజీ, ముఖ్యమంత్రి డాక్టర్ వైఎస్ రాజశేఖరరెడ్డి దృష్టికి తీసుకెళ్ళారు.

## పూర్తికాని భూసేకరణ

గుంటూరు జిల్లాలో పులిచింతల ప్రాజెక్టు నిర్మాణానికి అవసరమైన భూసేకరణ కార్యక్రమం ఇంకా పూర్తికాలేదు. దీనికి సంబంధించి పబ్లిక్ హియరింగ్ రెండుసార్లు నిర్వహించాల్సి వచ్చింది. భూ సేకరణకు సంబంధించి డి అండ్ డి పబ్లికేషన్స్‌ను చేపట్టారు. బాధితులకు పరిహారం చెల్లించటం, గ్రామాలను (మిగతా 15వ పేజీలో)

*(14వ పేజీ తరువాయి)* ఖాళీ చేయించే కార్యక్రమం ఇంకా చేపట్ట లేదు. నల్గొండ జిల్లాలో ప్రాజెక్టు పనులు చురుగ్గా సాగుతున్నా గుంటూరు జిల్లాలో ఇంతవరకు భూ సేకరణే పూర్తికాలేదని రైతు సంఘం నాయకులు ఆరోపించారు. బాధితులకు పరిహారం చెల్లించే విషయంలో ఇప్పటికే గుంటూరు జిల్లా కలెక్టర్ కార్యాలయంలో అనేకసార్లు మంత్రి కన్నా లక్ష్మి నారాయణ, కలెక్టర్ జయలక్ష్మి, జాయింట్ కలెక్టర్ రాహుల్ బొజ్జాలు సమావేశాలు నిర్వహించారు. పరిహారం చెల్లించే విషయంలో స్థానికులతో కమిటీలను ఏర్పాటు చేశారు.

## పనుల్లో జాప్యంతో పెరుగుతున్న అంచనాలు...

పులిచింతల ప్రాజెక్టు నిర్మాణ పనుల్లో జాప్యం జరగటంతో అంచనా వ్యయం రోజు రోజుకు పెరుగుతుంది. మాజీ ముఖ్యమంత్రి స్వర్గీయ ఎన్టీఆర్ శంకుస్థాపన చేసిన సమయంలో ఈ ప్రాజెక్టు రూ.250 కోట్లతో పూర్తవుతుందని అంచనా వేశారు. తెలుగుదేశం హయాంలో ప్రాజెక్టు నిర్మాణం కాగితాలకే పరిమితమైంది. అప్పట్లో పర్యావరణ అనుమతి లేకపోవటం, కొంత మంది ప్రజాప్రతినిధులు అభ్యంతరం తెలపటంతో దీనికి కొన్ని ఆటంకాలు ఏర్పడ్డాయి. రెండు సంవత్సరాల క్రితం ముఖ్యమంత్రి డాక్టర్ వైఎస్ రాజశేఖర రెడ్డి ప్రాజెక్టు నిర్మాణానికి శంకుస్థాపన చేసిన సమయంలో దీని అంచనా వ్యయం రూ.568.87 కోట్లుగా వుంది. ప్రస్తుతం దీని అంచనా రూ.700 కోట్లకు పెరిగింది. ప్రాజెక్టు నిర్మాణం పూర్తయి నీరు విడుదల చేసే సరికి కనీసం సంవత్సరంన్నర నుంచి రెండు సంవత్సరాలు పడుతుందని ఇంజనీరింగ్ నిపుణులు తెలిపారు. ఈ ప్రకారం అంచనా వ్యయం కూడా అప్పటికి రూ. వెయ్యి కోట్లకు చేరే అవకాశం వుందని నిపుణులు అంచనా వేశారు. నిర్మాణంలో జాప్యం జరిగే కొద్ది ప్రాజెక్టుకు ప్రతిపాదించిన అంచనాల్లో కొన్ని మార్పులను ప్రతిపాదించారు. డ్యాం మధ్య 33 గేట్లు వుండాలని డిజైన్ చేయగా దీనిని 24 గేట్లకు కుదించాలని, కాంక్రీట్ డ్యాంగా అంచనాలు తయారు చేసిన దీనిలో కొన్ని మార్పులు చేపట్టాలని కొంతమంది ప్రతిపాదించారు. దీనిపై అనేక తర్జనభర్జనలు జరుగుతున్నాయి. ప్రాజెక్టు నిర్మాణ పనులను, భూ సేకరణ, ఇతర కార్యక్రమాలను ఎమ్మెల్యేలు, ఎంపిలు, జిల్లా పరిషత్ ఛైర్‌పర్సన్, ఇతర ప్రజాప్రతినిధులు పర్యవేక్షిస్తే వేగవంతం అవుతాయని రైతు నాయకుడు డాక్టర్ యలమంచిలి శివాజీ సూచించారు.

## పులిచింతల వలన కలిగే ప్రయోజనాలు

* 45 టియంసిల నీటిని నిల్వ చేసే అవకాశం వుంది.
* 120 మెగావాట్ల విద్యుత్‌ను ఉత్పత్తి చేయవచ్చు.
* వెయ్యి కోట్ల రూపాయల ఆహార ధాన్యాల ఉత్పత్తిని పెంచవచ్చు.
* హెక్టారుకు 3.43 టన్నుల ఆహార ధాన్యాల దిగుబడిని పెంచే అవకాశం వుంది.
* రూ.130 కోట్ల విలువైన విద్యుత్‌ను ఉత్పత్తి చేయవచ్చు.
* కృష్ణా, నల్గొండ జిల్లాలలో ఉత్పత్తి అయ్యే సిమెంటును గుంటూరు జిల్లాకు బ్యారేజిపై నిర్మించే బ్రిడ్జి ద్వారా రవాణా చేయవచ్చు.
* గుంటూరు జిల్లా నుంచి పులిచింతల బ్రిడ్జి మీదుగా హైదరాబాద్ వెళ్ళే అవకాశం వుంది.
* గుంటూరు-హైదరాబాద్ రాకపోకలకు వయా వాడపల్లి రహదారికి ట్రాఫిక్‌ను తగ్గించవచ్చు.
* పులిచింతలలో నిల్వ చేసే నీటిని గుంటూరు, కృష్ణా జిల్లాల పరిధిలో డెల్టాకు ఉపయోగించుకోవచ్చు.
* పులిచింతల నీటిని డెల్టా కింద ప్రాంతానికి ఉపయోగించుకోవటం వలన సాగర్ నుంచి డెల్టాకు విడుదల చేసే నీటిని తగ్గించే అవకాశం వుంది. దీనివలన శ్రీశైలం నుంచి సాగర్‌కు నీటిని తగ్గించి ఆ నీటిని తెలుగుగంగ ద్వారా రాయలసీమ ప్రాంతానికి ఉపయోగించుకునే అవకాశం వుంది.
* పులిచింతలపైన బ్రిడ్జిని నిర్మించటంతో కృష్ణా జిల్లాలోని ముత్యాల, గుంటూరు జిల్లాలోని అచ్చంపేట మండలం మాదిపాడు ద్వారా రాకపోకలకు దగ్గరగా వుంటుంది.
* రాయలసీమ నుంచి ప్రకాశం బ్యారేజి మీదుగా హైదరాబాద్, తెలంగాణా ప్రాంతాలకు వెళ్ళే వాహనాలను సత్తెనపల్లి, అచ్చంపేట మీదుగా జగ్గయ్యపేట ద్వారా హైదరాబాద్ వెళ్ళే అవకాశం వుంది.


















# సిరులు 'పండిస్తున్న' తమలపాకు

## ఇతర రాష్ట్రాలకు పొన్నూరు నుంచి ఎగుమతి


తమలపాకులను మార్కెట్‌కు తరలించేందుకు సిద్ధంచేస్తున్న దృశ్యం

**పెళ్ళిళ్ళు పేరంటాలు, మరేదైనా శుభకార్యాలు, పూజా కార్యక్రమాల్లో తమల పాకుల పాత్ర ప్రధానమైనది. అంతటి ప్రాధాన్యతను సంరించుకున్న తమలపాకు సాగు పొన్నూరులో అల్లుకుపోయింది. అయితే, తమలపాకుతో పెనవేసుకున్న పొన్నూరు ఒడిదుడుకులను కూడా ఎదుర్కొంటున్నది. ఒకవైపు సాగునీటి కొరత, మరోవైపు ప్రకృతి వైపరీత్యాల దెబ్బ ఈ వాణిజ్య పంటపై తీవ్ర ప్రభావం చూపుతున్నాయి. దాంతో తమలపాకుతో బంధం వున్న రైతులు, కార్మికుల నోళ్ళు మాత్రం పండడం లేదు.**

(ఆన్‌లైన్-పొన్నూరు)

గుంటూరు జిల్లాలో పొన్నూరు, తెనాలి, దుగ్గిరాల, మంగళగిరి, రేపల్లె నియోజకవర్గాల్లోని గ్రామాల్లో సుమారు రెండు వేల ఎకరాల్లో రైతులు తమలపాకు తోటలను సాగుచేస్తున్నారు. పొన్నూరు కేంద్రంగా ఆరు దశాబ్దాలుగా తమలపాకు ఉత్పత్తి, వాణిజ్య పెద్ద ఎత్తున జరిగింది. అయితే ఉత్పత్తి దారులను ప్రోత్సహించే ప్రయత్నాలు ప్రభుత్వపరంగా జరగకపోవడం విచారకరం.

పొన్నూరు మండలం ములుకుదురు, చింతలపూడి,పొన్నూరు, ఆలూరు, ఆరెమండ, కట్టెంపూడి, దండమూడి గ్రామాలతోపాటు కృష్ణానది పరీవాహక లంక గ్రామాలు చిలుమూరు, దోనేపూడి, పోతార్లంక, తిప్పలకట్ట, కిష్కిందపాలెంలో తమలపాకు తోటల పెంపకానికి ప్రసిద్ధిగాంచాయి. పై గ్రామాల నుంచి పొన్నూరు తమలపాకుల ఉత్పత్తి, సరఫరా కేంద్రానికి తమలపాకుల బుట్టలను తరలించుకు వచ్చి నాగపూర్, మహారాష్ట్ర, అమరావతి అకోలా, యావత్‌మాల్, వార్ధా, కాంగామ్, సాంగ్లీ, కొంకణ్ తదితర ప్రాంతాలకు లారీలు, లక్నో, ఝాన్సీ ప్రాంతాలకు రైళ్ళ ద్వారా ఎగుమతి చేస్తుంటారు. సీజన్ సమయంలో వారానికి 20 లారీలు, అన్‌సీజన్‌లో నాలుగు లారీల సరుకు ఇక్కడ నుంచి ఎగుమతి జరుగుతోంది. వందలాది మంది రైతులు, వేలాది మంది కార్మికులకు జీవనోపాధిని కల్పిస్తున్న తమలపాకు తోటలు ప్రకృతి వైపరీత్యాలు, అధిక వర్షాల వల్ల విపరీతంగా దెబ్బ తింటున్నాయి. తోటలు దెబ్బతిన్న తరుణంలో తమలపాకు కొరత ఏర్పడి రేటు విపరీతంగా పెరగడం, ఆకు సమృద్ధిగా లభిస్తే మార్కెట్‌లో రేటు పడిపోవడం గమనార్హం. వాతావరణ పరిస్థితుల ప్రభావం వల్ల పైరుకు తెగుళ్ళు విపరీతంగా సోకి రైతులు తీవ్రంగా నష్టపోతున్నారు.


తమలపాకుల తోటలను పరిశీలిస్తున్న రైతు

సంవత్సరం పొడవునా 750 మి.మీ వర్షపాతం, 15 వందల మి.మీ ఉష్ణపాతం కలిగి నీరు ఇంకే నల్లరేగడి, ఎర్రరేగడి నేలల్లో తమలపాకు తోటల సాగుకు అనుకూలం. వర్షపాతం లేని రోజుల్లో భూగర్భ జలాలను వినియోగించుకునే అవకాశాలు తెనాలి డివిజన్‌లో ఎక్కువగా వున్నందున సంవత్సరం పొడవునా తమలపాకు తోటలు పచ్చదనంతో కళకళలాడుతుంటాయి. తమలపాకు తోటల సాగు ఖర్చుతో కూడుకున్నదైనప్పటికీ రాబడి కూడా అధికంగానే వుంటుంది. పెళ్ళిళ్ళు పేరంటాలు, ఇతర శుభకార్యాలు, దేవుని పూజా కార్యక్రమాల్లో తమలపాకుల పాత్ర ప్రధానమైనది. తమలపాకులు లేకుండా శుభకార్యాలు జరగవంటే అతిశయోక్తి కాదు.

### గాలి వాటంగా మారిన సాగు

గతంలో సిరులను కురిపించిన తమలపాకు తోటల సాగు నేడు లాటరీ, జూదంగా మారిందని పొన్నూరు ప్రాంత తమలపాకు ఉత్పత్తి, సరఫరా దారుల సంఘ నాయకులు మల్లంపాటి సుబ్బారావు, రాయపాటి సుబ్బారావులు ఆవేదన చెందారు. ఎకరా తమలపాకు తోట సాగుకు లక్షల రూపాయల ఖర్చు అవుతుందన్నారు. ప్రకృతి సహకరిస్తే పెట్టుబడితోపాటు లాభాలను పొందవచ్చునని ప్రకృతి కన్నెర్ర చేస్తే నష్టాల పాలుకాక తప్పదన్నారు. తమలపాకు తోటల సాగు జూదంగా మారిన నేపథ్యంలో కొత్త రైతులు, కార్మికులు తోటల సాగు పనులు పట్ల ఆసక్తిని చూపడం లేదన్నారు. ప్రభుత్వం కొన్ని రాయితీలను ప్రకటించడం ద్వారా తమలపాకు సాగును ప్రోత్సహించాలన్నారు. దేశ వ్యాప్తంగా కోటి మంది రైతులు, కార్మికులకు ఉపాధి చూపుతున్న తమలపాకుల పరిశ్రమకు పాన్‌మసాలా, గుట్కాల వల్ల ముప్పు నెలకొందని, వీటిని నిషేధించడం ద్వారా ఈ పరిశ్రమను ప్రోత్సహించాలని ప్రభుత్వానికి సూచించారు.

# పాల ఉత్పత్తిదారుల కల్పవృక్షం

# సంగం డెయిరీ




(ఆన్‌లైన్ - చేబ్రోలు)

సహకార రంగంలో విప్లవాత్మకమైన మార్పులకు శ్రీకారం చుడుతూ పాల ఉత్పత్తిదారుల పాలిట కల్ప వృక్షంగా ఉన్న వడ్లమూడిలోని సంగండెయిరీ నానాటికీ పురోభివృద్ధి సాధిస్తున్నది. దక్షిణ భారతదేశంలో క్షీర విప్లవంలో తనకంటూ ఒక ప్రత్యేకస్థానం సంపాదించుకుంది. జిల్లా పాల ఉత్పత్తిదారుల సహకార యూనియన్ 1997 ఫిబ్రవరి 23న ఆంధ్రప్రదేశ్ సహకార సంఘాల చట్టం 1964 కింద రిజిస్ట్రేషన్ చేయబడింది. అప్పటికే రిజిష్టర్ కాబడిన 81 సహకార సంఘాలు దీనికి అనుబంధమయ్యాయి. ఈ డెయిరీ స్థాపనకు గుంటూరు, కృష్ణా, పశ్చిమగోదావరి జిల్లాల పాల ఉత్పత్తిదారులు 1.50 లక్షలు విరాళంగా ఇచ్చారు. ఈ మొత్తంతో 1973-74 సంవత్సరంలో 34.46 ఎకరాల స్థలం కొనుగోలు చేశారు. అనంతరం మరో 53 ఎకరాల స్థలం కొనుగోలు చేసి అందులో పాల సేకరణ, వనరుల విభాగం, వసతి, వీర్యకేంద్రాలు ఏర్పరిచారు. ఈ విధంగా ప్రారంభమైన సంగండెయిరీ అంచలంచెలుగా ఎదుగుతూ నేడు సుమారు 650 సహకార సంఘాలు సుమారు పాల సేకరణ కేంద్రాలతో రోజుకు రెండులక్షల లీటర్ల పాలను సేకరించగలుగుతున్నది. 1978లో సంగండెయిరీ 1.5లక్షల లీటర్ల వ్యవస్థాపన నిర్వహణ సామర్థ్యంతో రోజుకు 15 టన్నుల పాలపొడి 10 టన్నుల వెన్న, రెండు టన్నుల నెయ్యి తయారీ సామర్థ్యంతో 2.88 కోట్ల వ్యయంతో స్థాపించబడింది. తరువాత దీని సామర్థ్యం రోజుకు 2.5 లక్షల లీటర్లకు చేరింది. సంగం డెయిరీ విస్తరణలో భాగంగా రూ.2.5కోట్ల వ్యయంతో ఎక్కువకాలం పాలు నిల్వ ఉండే టెట్రాప్యాక్ యూనిట్‌ను స్థాపించారు. రాష్ట్ర ప్రభుత్వం ఇచ్చిన రూ.81 లక్షలను షేర్ క్యాపిటల్‌గా మార్చారు. దీంతో అప్పట్లో సంగండెయిరీ ఆస్తుల విలువ రూ.12.60 కోట్లకు చేరుకుంది. డెయిరీకి అనుబంధంగా గురజాలలో 80వేల లీటర్ల, నర్సరావుపేట 50వేల లీటర్లు, వినుకొండలో 30వేల లీటర్ల, భట్టిప్రోలులో 30వేల లీటర్ల పాల శీతలీకరణ కేంద్రాలు ఏర్పాటు చేశారు. 1995-96లో 57 కోట్ల టర్నోవర్ ఉన్న డెయిరీ నేడు 115 కోట్ల రూపాయలకు పెరిగింది. అప్పుడు రెండు కోట్లున్న షేర్ క్యాపిటల్ నేడు రూ.10 కోట్లకు చేరింది. అప్పట్లో రోజుకు 25 వేల లీటర్ల పాల అమ్మకాలు జరుగగా ప్రస్తుతం 85 వేల లీటర్ల పాల అమ్మకాలు జరుగుతున్నాయి. అదేవిధంగా జీతభత్యాలు రూ.5కోట్లు ఏడాదికి ఉండగా నేడు రూ.14 కోట్ల మేర సిబ్బందికి జీతభత్యాలు చెల్లిస్తున్నారు. ఒక లీటరు పాలు హ్యాండిల్ చేసినందులకు జీతభత్యాల కింద రూ.3లు ఖర్చవుతుంది. 1995-96లో రూ.6కోట్లు ఉన్న డెయిరీ నెట్‌వర్క్ నేడు రూ.16 కోట్లకు పెరిగింది. గత 11 ఏళ్లుగా సిబ్బందికి ఎలాంటి సమస్యలకు గురి కాకుండా చూస్తూ సమన్వయంతో ఒక్క స్ట్రైక్ నోటీసు కూడా లేకుండా చేయగలిగిన ఘనత డెయిరీ చైర్మన్ కిలారి రాజన్ బాబు, ఆయన పాలకవర్గ సభ్యులకు దక్కింది. సంగండెయిరీలో ఎన్నో ఏళ్ళుగా దినసరి వేతన కార్మికులుగా పని చేస్తున్న సుమారు 250 మందిని ఒక్కసారిగా పర్మినెంట్ చేసిన ఘనత కూడా ఈ పాలకవరానికే దక్కింది. రాష్ట్ర నూతన సహకార చట్టమైన 1995 మ్యాక్స్ చట్టంలోకి 1997 డిసెంబరు ఒకటవ తేదీన చేరింది. దేశంలో

(మిగతా 19వ పేజీలో...)

# పాల ఉత్పత్తిదారుల కల్పవృక్షం సంగం డెయిరీ

*(18వ పేజీ తరువాయి)*

ఈ విధంగా మారిన తొలి సహకార సంస్థ సంగం డెయిరీ కావటం విశేషం. దీంతో స్వయం ప్రతిపత్తి గల సంస్థగా సంగం డెయిరీగా అవతరించింది. గుంటూరు- అమరావతి రోడ్డులో సిటీ మార్కెటింగ్ కార్యాలయం ఆవరణలో ఉన్న ఇండోసిస్ ప్రాజెక్టు కింద రూ.42లక్షల వ్యయంతో విత్తనశుద్ధి కర్మాగారం నిర్మించారు. డెయిరీ పాలను రాష్ట్రంలోనే గాక ఇతర రాష్ట్రాలైన తమిళనాడు, బెంగుళూరు, పశ్చిమ బెంగాల్, న్యూఢిల్లీ ఎగుమతి చేస్తున్నారు. విమానం, రైళ్ళు తదితర ప్రయాణ వాహనాల్లో కూడా పాల విక్రయాలు జరుపుతున్నారు.

## మేలుజాతి పశువుల దిగుమతి

మేలుజాతి పశువులను దిగుమతి చేసుకొని వాటిని రైతులకు సరఫరా చేసి నాణ్యమైన పాల ఉత్పత్తి పెంచేందుకు డెయిరీ విశిష్టమైన కృషి చేస్తున్నది. ముర్రాజాతి గేదెలు, జెర్సీ, హల్‌స్టీన్ ఫ్రీసయిన్ ఆంబోతుల రకాల నుంచి వీర్యం సేకరించి దానిని ఘనీభవింపజేసి నిల్వ చేస్తున్నారు. వీర్యం పంపటానికి వీలులేని గ్రామాలకు ప్రతి ఏడాది హర్యాయనా నుంచి మేలు జాతి దున్నపోతులను, గేదెలను సహకార సంఘాలకు ఉచితంగా పంపిణీ చేస్తున్నారు. పాల ఉత్పత్తిదారుల పశువుల ఆరోగ్య సంరక్షణకు పశువైద్య శాలలు లేని గ్రామాలకు వినుకొండ, నర్సరావుపేట, గురజాల, సత్తెనపల్లి, వడ్లమూడి, రేపల్లె, బాపట్ల కేంద్రాలుగా సంచార పశు వైద్యశాలలు ఏర్పాటు చేసి పశువులకు వైద్యం అందిస్తున్నారు. ఇందుకు కావాల్సిన మందులను ఉచితంగా డెయిరీ వారు సరఫరా చేస్తున్నారు. బీమా కంపెనీలతో ఒప్పందం కుదుర్చుకొని తక్కువ ప్రీమియంకే పశువుల బీమా, పాల ఉత్పత్తిదారులకు బీమా సౌకర్యం కల్పిస్తుంది.

## నాణ్యమైన పశుగ్రాస ఉత్పత్తి కార్యక్రమం...

అధిక పాల ఉత్పత్తిని సాధించటానికి పోషక విలువలున్న నాణ్యమైన పశుగ్రాసాన్ని కూడా డెయిరీ ఉత్పత్తి చేస్తుంది. పారా గడ్డి, గిన్నిగడ్డి, కో-1, కో-2, కో-3 వంటి బహు వార్షికములను సంగండెయిరీలోని 20 ఎకరాల పొలంలో పెంచుతూ వాటి కణుపులను పాల సహకార సంఘాలకు పంపిణీ చేస్తున్నారు. అంతేగాకుండా పలురకాల గడ్డి విత్తనాలను పాల ఉత్పత్తిదారులకు సరఫరా చేస్తున్నారు. హైబ్రీడ్ పవు గ్రాస విత్తనాలను రైతులతో ఉత్పత్తి చేయించి తక్కువ ధరకు పాల ఉత్పత్తిదారులకు అందజేస్తున్నారు. సబ్సిడీపై గడ్డి కత్తిరించే యంత్రాలను కూడా సరఫరా చేస్తున్నారు. 1982లో డెయిరీకి అనుబంధంగా వడ్లమూడి క్వారీ వద్ద ఏర్పాటు చేసిన కాకాని వెంకటరత్నం పశుదాణా కర్మాగారం రోజుకు 150 టన్నుల పశుదాణా ఉత్పత్తి సామర్థ్యం కలిగి ఉంది. లాభనష్టాలతో పని లేకుండా ఉత్పాదక ధరకే పశుదాణాను రైతులకు అందిస్తున్నారు. పశువులకు అవసరమైన మినరల్ మిక్చర్‌ను 50 శాతం సబ్సిడీపై పాల ఉత్పత్తి దారులకు పంపిణీ చేస్తున్నారు. పాల సేకరణ కేంద్రాలకు వారు సొంత భవనాలు నిర్మించుకోవటానికి సంగం డెయిరీ ఆర్థిక సహాయం చేస్తుంది. డెయిరీలో 40 పడకల శిక్షణా కేంద్రాన్ని ఏర్పాటు చేసి పశువైద్యంలో భాగంగా ప్రథమచికిత్స శిక్షణా తరగతులను యువకులకు నిర్వహిస్తున్నారు. డెయిరీకి వచ్చే లాభాలను దృష్టిలో పెట్టుకొని పాల సహకార సంఘాలకు ధర వ్యత్యాసం కింద బోనస్‌లు ఇస్తున్నారు. పాల ఉత్పత్తిదారులకు డెయిరీ జీవిత బీమా పథకం కింద లక్షమంది పాల ఉత్పత్తిదారులకు బీమా భద్రతను కల్పించింది.

## రాజకీయాలకు దూరంగా 'సంగండెయిరీ'

సహకార రంగంలో రాజకీయాలకు చోటు లేకుండా చూసి పాల ఉత్పత్తిదారుల సంక్షేమానికి డెయిరీలు పాటు పడాలని పాడి పరిశ్రమ పితామహుడు వర్గీస్ కురియన్ అభిప్రాయాలకు అనుగుణంగా డెయిరీ చైర్మన్ రాజన్‌బాబు ఆ దిశగా డెయిరీ అభివృద్ధికి కృషి చేస్తున్నారు. డెయిరీ కార్యకలాపాల్లో రాజకీయ జోక్యానికి తావు లేకుండా సహకార భావంతోనే చైర్మన్ డెయిరీని ముందుకు నడిపిస్తున్నారు. జిల్లాలో పుట్టకొక్కుల్లా పుట్టుకొచ్చిన ప్రైవేట్ డెయిరీల పోటీని తట్టుకొని నిలబడటం జిల్లా పాల ఉత్పత్తిదారులకు డెయిరీపై ఉన్న ప్రతీకకు అద్దం పడుతుంది. డెయిరీ ఉత్పత్తులను విదేశాలకు సైతం ఎగుమతి చేస్తున్నారు.

# మనుగడ కోల్పోతున్న 'మడ' అడవులు

**సముద్ర తీరప్రాంతాల్లోని భూగర్భజలాలు ఉప్పునీరుగా మారకుండా దోహదపడే 'మడ' చెట్లు అంతరించిపోతున్నాయి. అమూల్యమైన మడ అడవులను వంటచెరకు, రొయ్యల చెరువుల కోసం విచక్షణారహితంగా నరికివేస్తున్నారు. పరోక్షంగా జీవనోపాధి కల్పిస్తున్న విషయాన్ని గ్రహించలేని మత్స్యకారులు సైతం వీటిని నరికివేయడం దురదృష్టకరం. గుంటూరు జిల్లాలో నిజాంపట్నం నుంచి బాపట్ల వరకు 30 కి.మీ. మేర వ్యాపించి ఉన్న ఈ అడవులు కాలక్రమంలో తరిగిపోతున్నాయి. మడ అడవులను పరిరక్షించవలసిన అటవీ శాఖ పాత్ర నామమాత్రమే. ఈ ప్రాంతవాసులలో పర్యావరణంపై అవగాహన కల్పించి, మడ అడవుల సంరక్షణలో వారిని చైతన్యపరచవలసిన అవసరం ఎంతైనా ఉంది.**

(ఆన్‌లైన్-బాపట్ల)

తుపాన్ల తీవ్రత తగ్గించేందుకు తీరప్రాంతాలలో భూగర్భజలాలు క్షారమయం కాకుండా కాపాడేందుకు వివిధ పక్షిజాతులు, క్రిమికీటకాదులు, చేపలు వృద్ధిచెందేందుకు దోహదపడుతున్న 'మడ' చెట్లను విచక్షణారహితంగా నరికివేస్తున్నారు. కాకినాడ నుంచి ప్రకాశం జిల్లా చినగంజాం వరకు తీర ప్రాంతంలో దట్టంగా పెరిగిన ఈ 'మడ' చెట్లు మట్టికోతను నివారిస్తూ సముద్రపు నీటివల్ల తీరప్రాంత గ్రామాల్లో భూగర్భ జలాలు ఉప్పుగా మారకుండా చూస్తాయి. ఇవి వాతావరణ సమతౌల్యాన్ని కూడా కాపాడుతూ మనుషులకు, పక్షులకు, చేపలకు జీవనాధారాన్ని కల్పిస్తున్నాయి. తీరప్రాంతాల్లో ఈ చెట్లు అవాసకేంద్రాలై గొప్ప వైవిధ్యాన్ని ప్రదర్శిస్తున్నాయి. అనేక పక్షి, మత్స్యజాతులకు ఈ అడవులు జన్మస్థావరాలు. వీటివల్ల మత్స్యసంపద వృద్ధిచెంది తీరప్రాంత మత్స్యకారులకు జీవనాధారం లభిస్తోంది. ఇలాంటి ఆమూల్యమైన మడ అడవులను వంట చెరుకు కోసం, చేపల, రొయ్యల చెరువుల సాగు కోసం నరికివేస్తున్నారు. తమకు పరోక్షంగా జీవనోపాధి కల్పిస్తున్న విషయాన్ని గ్రహించలేక మత్స్యకారులు సహితం ఈ చెట్లను నరికివేస్తున్నారు. వీటిని వంట చెరకుగా, స్నానపు గదుల చుట్టూ దడులు కట్టుకోవడానికి ఉపయోగిస్తున్నారు. జిల్లాలో నిజాంపట్నం నుంచి బాపట్ల వరకు 30కిలో మీటర్ల విస్తీర్ణంలో వ్యాపించి వున్న మడ అడవులు దశాబ్దకాలంగా నరికివేతకు గురవుతున్నాయి.



నిజాంపట్నం, అడవులదీవి, రేపల్లె మండలం కర్లపాలెం మండలాల్లో ఆక్రమణలకు గురయ్యాయి. ఎక్కువ భాగం చేపలు, రొయ్యల చెరువులుగా రూపాంతరం చెందాయి. ప్రస్తుతం మిగిలి వున్న మడచెట్లు బాపట్ల మండలం ముత్తాయపాలెం ఫారెస్ట్, సూర్యలంక రేవులలో రోజు వంట చెరకు కోసం నరికివేతకు గురవుతున్నారు. అయినా అటవీశాఖ ప్రేక్షక పాత్ర వహిస్తోంది. కొందరు మడచెట్ల కలపతో, పుల్లలతో పట్టుబడినా ఫారెస్ట్ గార్డులు వారి వద్ద ముడుపులు అందుకుని మౌనం వహిచడం జరుగుతోంది.

రాష్ట్రంలో 23 శాతం అటవీ ప్రాంతం ఉంటే, అందులో ఒక శాతం మాత్రమే మడ అడవులు ఉన్నాయి. తూర్పుగోదావరి జిల్లా బంటుమిల్లి, కోరింగ ప్రాంతాల్లో సుమారు 30 వేల హెక్టార్లలో మడ చెట్లు ఉన్నాయి. గుంటూరు జిల్లాలో 1997 ముందు 16 వేల హెక్టార్లలో మాత్రమే మడ చెట్లు కనిపిస్తున్నాయి. ఈ చెట్ల నరికివేతను ఆరికట్టాలంటే ప్రభుత్వం అక్కడికక్కడే వేల రూపాయలు జరిమానా విధించాలి. లేదా కారాగార శిక్ష వేయాలి. అవనిగడ్డ ప్రాంతంలో మాదిరిగా ఆక్రమణల్ని తొలగించి, నిజాంపట్నం, బాపట్ల, రేపల్లె ప్రాంతాల్లో మడచెట్లున అభయారణ్యాలు పెంచాల్సిన ఆవశ్యకత ఎంతైనా వుంది. తరచు తుపాను తాకిడిలను ఎదుర్కొంటున్న పై ప్రాంతాలలో మడచెట్లను అభివృద్ధి చేయాల్సిన బాధ్యత అటవీ శాఖ అధికారులపై ఎంతైనా వుంది. ప్రజలకు పర్యావరణం-దాని పరిరక్షణలో సరైన అవగాహన కల్పించాలి. ప్రజల సహకారం లేనిదే ఈ కార్యక్రమం విజయవంతం కాదు. ఇందుకు ప్రభుత్వం, స్వచ్ఛందసేవా సంస్థలు అటవీ సంరక్షణ, పర్యావరణం, ప్రత్యామ్నాయ ఇంధన వనరుల గురించి తీర ప్రాంత గ్రామాల ప్రజలకు వివరించి, వారిని చైతన్యవంతుల్ని చేసే కార్యక్రమాల్ని ముమ్మరం చేయాల్సి వుంది.

## విచక్షణారహితంగా నరికివేత

కర్లపాలెం మండలంలోని పేరలి, తుమ్మలపల్లి, పెదపులుగువారిపాలెం, పెదపులుగువారిపాలెం శివారు పామర్తి గ్రామాల సముద్రతీరంలో మడ చెట్లను కొందరు తమ స్వార్థ ప్రయోజనాలకు విచక్షణారహితంగా నరికివేస్తున్నారు. రెండు, మూడేళ్ళ క్రితం సుమారు 450 హెక్టార్లపై గ్రామాలలో విస్తారంగా పెరిగిన మడ అడవులు తుపాను తాకిడిలను సమర్థవంతంగా ఎదుర్కొని తీరప్రాంత ప్రజలకు ఎంతగానో మేలు చేకూర్చాయి. మత్స్యకారులకు పరోక్షంగా సహాయపడే ఈ మడ చెట్లను అధిక సంఖ్యలో పెంచి పోషించమని పలు స్వచ్ఛంద సేవాసంస్థలు విజ్ఞప్తులు చేస్తున్నా, అవి స్వార్థపరుల చెవుల కెక్కడం లేదు. కొందరు నిరుపేదలు వీటి ప్రయోజనం తెలియక, నరికి కట్టెపుల్లలుగా విక్రయించుకొని ఉపాధి పొందుతున్నారు. సందట్లో సడేమియాలు అంటూ కొందరు తుమ్మలపల్లి గ్రామంలో మడ అడవులను ఆక్రమించుకొని, రొయ్యల చెరువులుగా మార్చిన సంఘటనలు ఉన్నాయి. అంతేకాకుండా రొయ్యల చెరువులకు నేరుగా సముద్రం నుంచి ఉప్పునీటిని తీసుకునేందుకు సుమారు ఒకటిన్నర కిలో మీటరు దూరంలో అటవీ భూములగుండా పైపులైన్లు రాత్రికి రాత్రే అమర్చారు.

రెండేళ్ళుగా ఈ తంతు జరుగుతున్నా అటవీశాఖ అధికారులు చూసీచూడనట్లు వ్యవహరిస్తున్నారు. దీంతో ఆక్రమణదారులకు అటవీశాఖ అధికారులకు మధ్య బేరసారాలకు కుదిరాయని ఈ ప్రాంత ప్రజలు అనుమానిస్తున్నారు. ఇకనైనా సంబంధిత అధికారులు తగు చర్యలు గైకొని మడ చెట్ల అభివృద్ధికి కృషి చేయాలని పలు పర్యావరణ పరిరక్షణ స్వచ్ఛంద సేవా సంస్థలు, ప్రజలు కోరుతున్నారు.

# నాటి 'రేవుపల్లె' నేటి రేపల్లె

('ఆన్‌లైన్' - రేపల్లె)

కృష్ణానది తీరంలో ఏర్పడిన నాటి 'రేవుపల్లే' నేటి రేపల్లె. ఇక్కడ లభించిన బౌద్ధమతానికి చెందిన శిథిలాలు, బంగారు నాణెల ఆధారంగా ఈ ప్రాంతం బౌద్ధులకాలం నుంచే ప్రఖ్యాతి చెందినట్టు గ్రంథాలు చెబుతున్నాయి. పురాతన కాలంలో రేపల్లె కృష్ణానదికి పడమరవైపున మూడు మైళ్ళ దూరంలో ఓ కుగ్రామంగా వుండేది. నది రేవుకు దగ్గరగా వుండడంవల్ల నాటి రేవుపల్లె నేడు రేపల్లెగా మారింది.

సుమారు రెండు దశాబ్దాల క్రితం ప్రస్తుత పెనుమూడి పంచాయతీలోగల రావిఅనంతవరం, పులిగడ్డల మధ్య 18 గజాల వెడల్పుగా ఏర్పడిన కృష్ణానది ఒక కాల్వగా వుండేది. ఆ కాల్వ నేడు నదిగా మార్పుచెందింది.


కృష్ణానది తీరంలో వున్న పెనుమూడి రేవు

నాడు తాలూకా కేంద్రంగా వున్న రేపల్లె నేడు అయిదు మండలాలుగా విడిపోయింది. ప్రస్తుతం రేపల్లె, నిజాంపట్నం, నగరం, చెరుకుపల్లి, భట్టిప్రోలు మండలాలుగా వున్నాయి. నగరం మండలంలోని పెదపల్లి గ్రామాన్ని నాటి బ్రిటీష్ పాలకులు 'పెట్టిపోలియ' అని పిలిచేవారు. విజయనగర రాజ్యానంతరం నిజాంపట్నం మండలాన్ని పులిగొండ నరసింహునికి వారి పుత్రులైన మల్లప్ప, నంది వీరయ్యలకు ఇబ్రహీం పాదుషా స్వాధీనపరిచాడు. అదేసమయంలో మల్లప్ప, నంది వీరయ్యల మధ్య కలహాలు ఏర్పడడంతో నిజాంపట్నాన్ని అభివృద్ధి చేయడంలో నిర్లక్ష్యం చేశారు. అనంతరం నంది వీరయ్య వంశీకుల కాలంలో ఈ మండలం ఎంతో అభివృద్ధి చెందింది. 'పెరిష్టా' అనే చరిత్రకారుడు నిజాంపట్నంలో పెద్దరేవుపట్నం వుందని, బ్రిటీష్ పాలకులు ఈ ప్రాంతానికి 1621వ సంవత్సరంలో వచ్చారని తన గ్రంథంలో పేర్కొన్నాడు. తెల్లదొరలు ఈ ప్రాంతంలో పెద్ద పెద్ద ఉప్పు కటారులు కట్టించారని చరిత్రకారులు చెబుతున్నారు. ఆ రోజుల్లోనే ఈ రేవుకు పెద్దపెద్ద ఓడలు రావడంతో వాణిజ్యకేంద్రంగా ప్రసిద్ధి చెందింది. బ్రిటీష్ పాలకుల హయాంలో 1921లో పరిశ్రమలు కూడా నెలకొల్పారు. కాని అవి 1953వ సంవత్సరంలో అంతరించిపోయాయి. 1679వ సంవత్సరంలో 'పెట్టిపోలు'ను నిజాంపట్నంగా మార్చారు.

శ్రీకృష్ణదేవరాయల కాలంలో 'మాణిక్యాలరావు' కుటుంబం రేపల్లె ప్రాంతంలో పన్నులు వసూలు చేసేవారు. వీరినే రేపల్లె జమిందారులుగా పిలిచేవారు. వీరి కుటుంబంలో అన్నదమ్ముల మధ్య విబేధాల కారణంగా రెండుగా విడిపోయింది. ఆ తర్వాత ఒకరు రేపల్లెలో, మరొకరు రాచూరులో స్థిరపడ్డారు. రాచూరు జమీ వేలానికి రాగా, దానిని నరసరావుపేట జమిందారు పాడి, ఈ ప్రాంతాన్ని పాలించారు. వీరికాలంలోనే 1705 సంవత్సరంలో రాచూరులో నందికోట కట్టించారు. రేపల్లె జమిందారు భావన్నారాయణ 1824వరకు రేపల్లెను పాలించారు. 1846లో రేపల్లె ప్రాంతం కంపెనీవారికి స్వాధీనం అయింది. 1859వ సంవత్సరం నుంచి రేపల్లె కృష్ణా జిల్లాలో ఒక ప్రత్యేక తాలూకాగా వుండేది.

1904వ సంవత్సరంలో గుంటూరు జిల్లాగా ఏర్పడిన తర్వాత తెనాలిని తాలూకాగా చేసి, రేపల్లెను అందులో ఒక భాగంగా చేశారు. 1909లో పరిపాలన సౌలభ్యం కోసం తిరిగి తెనాలి తాలూకాను రెండుగా విభజించి రేపల్లె తాలూకాగా ఏర్పాటుచేశారు. ఆ కాలంలోనే 1916 మార్చి 8న బ్రిటీష్‌పాలకులు ఒక ప్రైవేటు వాణిజ్యసంస్థ భాగస్వామ్యంతో రైల్వే లైన్లు ఏర్పాటుచేశారు. రేపల్లె రైల్వేలైను ఏర్పడి ఇప్పటికి 90 సంవత్సరాలు పూర్తయ్యాయి. 1956 ఏప్రిల్ ఒకటిన రేపల్లె మున్సిపాలిటీగా ఏర్పడింది. 1987లో మండలంగా ఆవిర్భవించింది.

# పుస్తకాల పురుగు 'ప్రత్తిపాటి'

స్పిరిచ్యువల్ కమ్యూనిజం

(ఆధ్యాత్మిక భౌతిక వాదాల సమన్వయం)



రచన

ప్రత్తిపాటి రామకోటయ్య

రామకోటయ్య రచించిన 'స్పిరిచ్యువల్ కమ్యూనిజం'



పుస్తకప్రియుడు ప్రత్తిపాటి రామకోటయ్య

(ఆన్‌లైన్, పిడుగురాళ్ళ)

'ఇంట్లోకి వెళ్ళే ముందు మౌనం అతిప్రధానం అనే బోర్డు కనిపించింది. లోపలికి వెళ్ళి చూస్తే కప్‌బోర్డులనిండా ఎన్నో పుస్తకాలు. కొన్ని పాతవి. కొన్ని కొత్తవి. అవన్నీ ఆధ్యాత్మిక, తాత్విక, భౌతికవాదాల్లో తలపండిన మేధావులు రాసినవే. వీటన్నిటినీ చదివి పెద్ద పెద్ద ఠావులపై తదేకంగా రాస్తున్నాడా పెద్దమనిషి. వయస్సు ఏడుపదులు దాటవచ్చు. ఐనా పుస్తక పఠనంపై ఆసక్తి మాత్రం ఏమాత్రం తగ్గలేదు'.

ఆయనపేరు ప్రత్తిపాటి రామకోటయ్య. కో- ఆపరేటివ్ సబ్-రిజిస్ట్రార్‌గా పనిచేసి 11 ఏళ్ళ క్రితం పదవీ విరమణ చేశారు. పిడుగురాళ్ళలోని రైల్వే స్టేషన్ రోడ్డులో నివాసముంటున్నారు. వేలాది పుస్తకాలు చదివిన ఘనత ఈయనకే దక్కుతుంది. చదివిన వాటిల్లోనుంచి ముఖ్యమైన అంశాలను పెద్ద పెద్ద ఠావులపై వ్రాయటం, వాటిని చాలా భద్రంగా దాచిపెట్టటం ఆయనకు అలవాటు. అలా వ్రాసిన వాటిల్లో 1960 నుండి భద్రపరచినవీ ఉన్నాయి. చదవటంలోనే ఆనందం ఉందని చెప్పే పుస్తక ప్రియుడు ప్రత్తిపాటి రామకోటయ్య గురించి ఇంకాస్త తెలుసుకోవాలంటే...

## మాట్లాడాలంటే... తెలుసుకోవాలి!

వాస్తవానికి మొదట్లో రామకోటయ్యకు పుస్తక పఠనంపై అట్టే ఆసక్తి లేదు. 1959లో జరిగిన ఓసంఘటన ఆయనలో తెలుసుకోవాలన్న ఆకాంక్షను రగిల్చింది. అప్పట్లో ఉద్యోగ శిక్షణ నిమిత్తం ఆయన హైదరాబాదు వెళ్ళారు. నివాసముండే చోటుకు హైకోర్టు లాయర్లు, కవులు, మేధావులు వచ్చివెళ్తుండేవారు. వాళ్ళు గంటల తరబడి అనేకమైన విషయాలపై చర్చలు జరుపుతుండటం, ఆచర్చలో తలదూర్చి అభాసుపాలు కావటం వంటి అంశాలు రామకోటయ్యలో చదవాలన్న జిజ్ఞాసను కలిగించాయి. ఆనాటినుండి ఎన్నో వేల పుస్తకాలను చదివినట్లు ఆయన తెలిపారు. వాటిలో ముఖ్యంగా తత్త్వశాస్త్రం, భౌతికవాదం, ఆధ్యాత్మిక సంబంధ పుస్తకాలు అధికంగా ఉన్నాయని పేర్కొన్నారు.

## ప్రతి బుక్‌ఫెస్టివల్‌కు వెళ్ళాల్సిందే!

ఏడుపదులు దాటినా రామకోటయ్యలో పుస్తకపఠనం పట్ల ఉన్న ఆపేక్ష మాత్రం తగ్గలేదు. ఇప్పటికీ ప్రతియేడాది జనవరి 1 నుంచి 10 వరకు విజయవాడలో జరిగే బుక్ ఫెస్టివల్‌కు ఈయన వెళ్తూనే ఉంటారు. అక్కడ అన్ని శాఖలను సందర్శించి సుమారు 3 వేల పుస్తకాలనైనా కొనుగోలు చేయంది మనసొప్పుకోదని ఆయన పేర్కొన్నారు. అవిగాక మధ్యమధ్యలో విశాలాంధ్ర, జనశక్తి, నవయుగ బుక్‌స్టాల్స్‌ను సందర్శించి మార్కెట్లోకి కొత్తగావచ్చిన పుస్తకాలను కొనుగోలు చేస్తుంటానని తెలిపారు.

### చదవటంలోనే ఆనందం

ప్రత్తిపాటి రామకోటయ్య

ఎంతచదివినా ఇంకా ఇంకా చదవాలనిపిస్తుంది. చదవటం ద్వారా విజ్ఞానం పెంపొందుతుంది. చదవటంలోనే నాకు ఆనందం దాగి ఉంది. ఇప్పటి యువతకూడా అన్నిరంగాల్లో అవసరమైన విజ్ఞానాన్ని పెంపొందించుకునేందుకు ఎక్కువగా పుస్తకపఠనం చేయాలి.

అందుకేనేమో ఆయా బుక్‌స్టాల్స్‌లోని ఉద్యోగులు ఈపుస్తక ప్రియుడ్ని చూడగానే కొత్త పుస్తకాలు వచ్చాయని కేకలు వేస్తుంటారు.

## పుస్తక రచన

సుమారు 47 ఏళ్ళుగా రోజుకు గంటలతరబడి సాగిన పుస్తక పఠనంలోని సారాంశానికి ప్రత్తిపాటి రామకోటయ్య అక్షర రూపమిచ్చారు. స్పిరిచ్యువల్ కమ్యూనిజం (ఆధ్యాత్మిక, భౌతిక వాదాల సమన్వయం) పేరుతో ఆయన రచించిన పుస్తకం మేధావుల మన్ననలు పొందింది.

### వెలుగులోకి రాని తత్త్వవేత్త 'ప్రత్తిపాటి'

– కత్తి పద్మారావు, రచయిత

రామకోటయ్య రాసిన పుస్తకం చదువుతున్నంతసేపు ఒక విజ్ఞాన సర్వస్వాన్ని చదువుతున్న అనుభూతి కలిగింది. ఎప్పుడో మార్క్స్, ఏంగెల్స్ రాసిన జర్మన్ ఐడియాలజీ చదివిన అనుభూతి పొందాను. ఆ పుస్తకాన్ని రచించిన ప్రత్తిపాటి రామకోటయ్య వెలుగులోకి రాని తత్త్వవేత్తగా భావిస్తున్నాను.

# ఆంధ్రజ్యోతికి




# శుభాకాంక్షలు

అశేష ఆంధ్రుల అభిమాన ఆంధ్రజ్యోతి 4 వసంతాలు దిగ్విజయంగా
పూర్తిచేసుకున్న సందర్భంగా యాజమాన్యానికి, సిబ్బందికి
ఇవే మా హృదయపూర్వక శుభాకాంక్షలు ...

---

మా కస్టమర్లకు, శ్రేయోభిలాషులకు దీపావళి శుభాకాంక్షలు తెలియజేస్తూ ...
ఈ దీపావళి పర్వదినం మీ అందరి లోగిళ్ళలో సుఖసంతోషాలు నింపాలని ఆకాంక్షిస్తూ ...







# ITC LIMITED - ILTD DIVISION

GRAND TRUNK ROAD, P.B.NO.317, GUNTUR - 522 004
Tel : 2354001 to 2354008 (8 Lines)
Fax : 0863 - 2354017 / 2235042, Telegram : INDLEAF

# మేధావులకు ఒడి ... జాగర్లమూడి


సంగం జాగర్లమూడి వ్యూ


గ్రామస్తులు పూజించే బొడ్డురాయి

(ఆన్‌లైన్, తెనాలి)

గలగల పారే కొమ్మమూరు కాల్వ, పచ్చని తోటల ఆహ్లాదం నడుమ ప్రకృతి ఒడిలో ఒదిగినట్టుగా ఉండి పట్టణ, గ్రామీణ వాతావరణం కలబోసిన గ్రామం సంగం జాగర్లమూడి. ఇటు అభివృద్ధిపరంగా, అటు నాగరికతపరంగా ఎంతో ముందంజ వేసి తెనాలి పట్టణానికి కూత వేటు దూరంలో ఉన్న ఈ గ్రామం చరిత్రపరంగానేగాక పలువురు విశిష్ట వ్యక్తులను దేశానికి అందించి గుంటూరు జిల్లా చిత్రపటంలో ఒక ప్రత్యేకతను ఆపాదించుకుంది. ఒక రాజకీయ రథసారథిని, సుప్రసిద్ధ తత్వ శాస్త్రవేత్తను, మహిళా ఉద్యమనేతను, స్వాతంత్ర్య సమరయోధులను, కవులను, పండితులను, గ్రంథకర్తలను, మరెందరో విద్యావంతులను ఈ గ్రామం అందించింది. గ్రామానికి ఒక పక్కగా వయ్యారాలు ఒలకబోస్తూ ప్రవహించే కొమ్మమూరు కాల్వ, పచ్చని దుప్పటి పరచినట్టు తోటల సమాహారం ఈ గ్రామ సౌందర్యాన్ని ద్విగుణీకృతం చేస్తున్నాయి. 12వ శతాబ్దం నుంచి ఈ గ్రామం ఉన్నట్టు చరిత్ర చెబుతోంది. మూడు గ్రామాల శివార్ల కలయికకు ఈ గ్రామం వేదికగా ఉన్నందువల్ల ఇది సంగమ క్షేత్రంగా ప్రసిద్ధికెక్కిందని ప్రతీతి.

గతంలో బ్రాహ్మణ అగ్రహారంగా విరాజిల్లిన ఈ గ్రామానికి క్రీ.శ. 1198-1261 మధ్యకాలంలో ఈ ప్రాంతాన్ని పరిపాలించిన కాకతీయ గణపతిదేవ చక్రవర్తి కంఠంరాజు వారిని కరణాలుగా నియమించారని చరిత్ర చెబుతోంది. 1598-1602 మధ్య రాయబడిన రెండు శాసనాలు ఇప్పటికీ ఇక్కడి సంగమేశ్వరాలయంలో ఉన్నాయి. పూర్వం చాగర్లమూడిగా పిలువబడిన ఈ గ్రామం కాలక్రమంలో సంగం జాగర్లమూడిగా వాసికెక్కింది. ఇక్కడ వెలసిన సంగమేశ్వరుడు బాలా త్రిపురసుందరీ సమేతుడై ప్రధాన దేవతగా పూజలందుకుంటున్నాడు. 1876-77 దాత నామ సంవత్సరంలో కరువు కాటకాలు ఈ గ్రామాన్ని కుదిపివేశాయి. అప్పట్లో దాతలు ముందుకు వచ్చి బావులు తవ్వించడం ద్వారా గ్రామదాహార్తిని తీర్చారు. పూర్వం నుంచి మూడు వేల జనాభా కలిగిన సంగం జాగర్లమూడి నేడు సుమారు ఆరు వేల జనాభాతో తులతూగుతోంది. గ్రామంలో వివాదాలను పరిష్కరించేందుకు 1920వ దశకంలోనే ఇక్కడ పంచాయతీ కోర్టు నడిచింది. ఈ కోర్టుకు కొత్త రామస్వామి, పరుచూరి శివలింగయ్య, పరుచూరి బుచ్చికోటయ్య, కొత్త సుబ్బయ్య, కొత్త హనుమంతరావు అధ్యక్షులుగా పనిచేశారు.


కొత్త రఘురామయ్య

అనంతరం 1932లో పంచాయతీ బోర్డు ఏర్పాటైంది. ఈ బోర్డు మొదటి అధ్యక్షునిగా కొత్త భావయ్య చౌదరి వ్యవహరించారు. అనంతరం కొత్త బుచ్చయ్య చౌదరి అధ్యక్షునిగా పనిచేశారు. తదుపరి 1953 నుంచి 1988 వరకు 35 సంవత్సరాల పాటు పాలడుగు సాంబశివరావు

(మిగతా 25వ పేజీలో)

# మేధావులకు ఒడి... జాగర్లమూడి

(24వ పేజీ తరువాయి)

పంచాయతీ బోర్డు అధ్యక్షునిగా ఏకగ్రీవంగా ఎన్నికయ్యారు. సాంబశివ రావు జిల్లా కేంద్ర సహకార బ్యాంకు ఉపాధ్యక్షునిగా, భూమి తనఖా బ్యాంకు అధ్యక్షునిగా పనిచేశారు. తర్వాత కొత్త సత్యనారాయణ, పాలడుగు సామ్రాజ్యం సర్పంచ్ లుగా పనిచేశారు. ప్రస్తుతం పాలడుగు ప్రసాదరావు సర్పంచ్‌గా వ్యవహరిస్తున్నారు. గ్రామంలో 1908లో పోస్టాఫీసు ఏర్పాటయింది. 1916లో రైల్వే స్టేషన్ నిర్మించారు. 1914 నుంచే ఇక్కడ గ్రంథాలయాలు నడిచాయి. ప్రస్తుతం కొల్లిపర మండలంలో ఉన్న వల్లభాపురం గ్రామానికి చెందిన అచ్యుత గురునాథంగుప్తా గ్రంథాలయానికి భవనాన్ని విరాళంగా ఇచ్చారు. 1930లో వివిధ రంజని నాట్యమండలి గ్రంథాలయ పునరుద్ధరణకు కృషి చేసింది. 1947లో కమ్యూనిస్ట్ నాయకులు కొత్త రామకృష్ణయ్య ప్రజల సహకారంతో గ్రంథాలయాన్ని విస్తరించారు.


ప్రొఫెసర్ కొత్త సచ్చిదానందమూర్తి

## హరిహరుల క్షేత్రం

పూర్వం సంగం జాగర్లమూడి గ్రామం హరిహరుల క్షేత్రంగా భాసిల్లినట్టు చరిత్ర చెబుతోంది. శైవులు, వైష్ణవులు ఇక్కడ కలసిమెలసి సామరస్యంగా జీవించారు. నేటికీ ఈ ఐక్యత గ్రామంలో కనబడుతుంది. ఇక్కడ ప్రజల ప్రధాన వృత్తి వ్యవసాయం. నిమ్మ తోటలను ఈ గ్రామంలో విస్తారంగా సాగుచేస్తున్నారు. పూర్వం జాగర్లమూడి మీదుగా కొమ్మమూరు కాల్వ ద్వారా జల రవాణా జరిగేది. అప్పటిలో ప్రజలు రాకపోకలకు పడవలనే ఆశ్రయించేవారు. ఇక్కడ సుమారు 100 ఎకరాలలో విస్తరించిన చెరువు ద్వారా గుంటూరు నగర ప్రజలకు తాగు నీరు అందిస్తుంది. అన్నింటికీ మించి ఈ గ్రామం ఎందరో మేధావులను దేశానికి అందించింది. కేంద్ర మంత్రిగా, వివిధ పదవులు నిర్వహించి జిల్లా అభివృద్ధికి కృషి చేసిన కొత్త రఘురామయ్య, తత్వశాస్త్ర ప్రావీణ్యునిగా వినుతికెక్కిన ఆచార్య కొత్త సచ్చిదానంద మూర్తి, ప్రముఖ గ్రంథ కర్తలుగా పేరొందిన కొత్త భావయ్య చౌదరి, చింతమనేని భావయ్య చౌదరి, భారత రాష్ట్రపతి సర్వేపల్లి రాధాకృష్ణన్ నుంచి ఉత్తమ ప్రధానోపాధ్యాయునిగా 1965లో అవార్డు అందుకున్న కొత్త రాజబాపయ్య, ప్రముఖ రచయిత డాక్టర్ కొత్త రవీంద్రబాబు, కొత్త వెంకటేశ్వరరావు, కొత్త జగ్గయ్య చౌదరి, మహిళా ఉద్యమనేత కొత్త లక్ష్మి రఘురామయ్య వంటి ప్రముఖులెందరో ఈ గ్రామానికి చెందినవారే. గ్రామంలో హైస్కూలు, గ్రంథాలయం, ప్రాథమిక ఆరోగ్య కేంద్రం, రైల్వే స్టేషన్, ప్రాథమిక పాఠశాలలు, పాల సొసైటీ, పంచాయతీ కార్యాలయం వంటి అన్ని సౌకర్యాలు ఉన్నాయి.


కొత్త లక్ష్మీరఘురామయ్య


కొమ్మమూరు కాల్వ సోయగం-పచ్చని తోటల ఆహ్లాదం


గ్రామ మొదటి మునసబు కొత్త సంగయ్య

# కృష్ణా డెల్టాకు వరప్రదాయని పులిచింతల ప్రాజెక్ట్






2004 అక్టోబర్ 15వ తేదీన పులిచింతల ప్రాజెక్టుకు శంకుస్థాపన చేస్తున్న డా॥ వై.ఎస్




అక్షరజ్యోతి
ఆంధ్రజ్యోతికి
నాల్గవ వార్షికోత్సవ
శుభాకాంక్షలు



నిర్మాణంలో వున్న పులిచింతల డ్యామ్ పిల్లర్

## కృష్ణా డెల్టాకు వరప్రదాయని

- డెల్టా చింతలకు చెల్లు చీటి పులిచింతల
- నిలకడయిన నీటి సరఫరాకు నమ్మకమైన ధాన్యం దిగుబడికి తిరుగులేని మందు పులిచింతల
- 120 మెగావాట్ల విద్యుత్ ఉత్పత్తికి అవకాశం
- సముద్రం పాలయ్యే 45 టి.యం.సి.ల నీటిని నిల్వచేసే అవకాశం
- నల్గొండ , కృష్ణా, గుంటూరు జిల్లాలను కలిపే వారధి పులిచింతల
- 13 లక్షల ఎకరాల ఆయకట్టు స్థిరీకరణకు చివరి సంతకం పులిచింతల
- శతాబ్ద కాలపు రైతాంగ పోరాట సాధనకు నిలువెత్తు సాక్ష్యం పులిచింతల



ఆధునిక పరికరాలతో కొనసాగుతున్న డ్యామ్ పనులు



నిర్మాణంలో వున్న పులిచింతల డ్యామ్



పులిచింతల ప్రాజెక్టు పనులను చురుకుగా సాగిస్తున్న కార్మికులు



డ్యామ్ లేఅవుట్ వ్యూ

# SREENIVASA CONSTRUCTIONS Ltd.

HYDERABAD



గుంటూరు జిల్లా రైతు సోదరులకు, డీలరు మహాశయులకు మరియు శ్రేయోభిలాషులకు




వారి దీపావళి, రంజాన్ శుభాకాంక్షలు






# బి.టి. కాటన్ స్పెషలిస్ట్

బి.టి. పత్తిలో అదనపు లాభం 4000×20×3 = 2.4 క్వింటాళ్ళు




# రినోవా + సాఫ్






ఎకరానికి మోతాదు : రినోవా 50 గ్రా. + సాఫ్ 350 గ్రా.

బి.టి. పత్తిని ఎక్కువగా ఆశించే రసంపీల్చు పురుగులు మరియు పూత, పిందె రాల్చు తెగుళ్ళ నివారణకు UPL వారి దివ్యాస్త్రాలు

UPL
Agriculture is our culture




# కాంకర్ + సాఫ్




ఎకరానికి 400 మి.లీ.

ఎకరానికి 350 గ్రా.

వరిపైరులో సమగ్ర తెగుళ్ళ నివారణకు కాంకర్ మరియు సాఫ్ వాడండి.

మాగుడు తెగులు / పాముపొడ ఎండాకు తెగులు / సుతలు ఎండుట
దుబ్బుకుళ్ళు మరియు జింక్, మాంగనీస్ లోప నివారణకు



## యునైటెడ్ ఫాస్ఫరస్ లిమిటెడ్, ముంబయి

(25 దేశాలలో ఆఫీసులు కలిగి, 110 దేశాలకు పురుగు మందులను ఎగుమతి చేస్తున్న ఏకైక భారతీయ బహుళజాతి సంస్థ)

# భక్తుల ఆరాధ్యదైవంగా పూజలందుకుంటున్న ఫిరోజి ఋషీంద్రులు

నిత్యజీవితంలో అనేక సమస్యలతో కొట్టుమిట్టాడుతున్న లక్షలాది మంది ప్రజానీకానికి ఆధ్యాత్మిక చింతనను బోధించటం ద్వారా వారి జీవితాలలో వెలుగునింపిన మహనీయుడు సత్తెనపల్లికి చెందిన ఫిరోజి అనే తత్వవేత్త. ఇప్పటికి శతాబ్దానికి పైగా సత్తెనపల్లి పరిసర ప్రాంతాలలో ఆ మహానుభావుడు ప్రజల ఆరాధ్య దైవంగా పూజలందుకుంటున్నారు.

దైవశక్తి ప్రపూరితమైన అతీతమైన శక్తి ఆయనకు పుట్టుకతో సంక్రమించగా అనేక సందర్భాల్లో ప్రజాహితం కోరి ఎన్నో మహిమలను ప్రదర్శించారు. వీరు తెలుగు, సంస్కృత భాషల్లో అనేక రచనలను గావించి ప్రజలను ప్రభావితం చేయటంతో పాటు తన సంగీత గానామృతంతో పండిత పామరులను రంజింపచేసి ఆధ్యాత్మిక శిఖరంగా నిలచారు.

ఫిరోజి మహారాష్ట్రకు చెందిన క్షత్రియ వంశంలో శివాజీ మహారాజ్ రాచరికపు వెలుగు క్షీణించిన తర్వాత ఫిరోజి తాతగారైన పాపాజీ నరసరావుపేట జమీందారు కొలువులో ప్రధాన సేనానిగా చేరారు. పాపాజి కుమారులయిన నర్సోజి సత్తెనపల్లి జమిందారు గారైన రాజామానూరు వెంకట గోపాల రాయని కొలువులో సుబేదారుగా చేరారు. ఫిరోజి చిన్న వయసులోనే జరగబోయే విషయాలను ముందుగా చెప్పగలగడం, ఆ చెప్పినవన్నీ జరుగుతూ ఉండటంతో వాక్సుద్ధి కలిగిన మహిమాన్వితునిగా ఆయన పట్ల ప్రజలకు విశ్వాసం కలిగింది.



చిదానందుడు అనే యోగి ప్రబోధించిన తారక మంత్రోపాసనతో ఆధ్యాత్మిక శోధనను ప్రారంభించిన ఫిరోజి పోతులూరి వీరబ్రహ్మం, యోగి వేమనలు అనుసరించిన అచల పరిపూర్ణ సిద్ధాంత మార్గంలో పయనించారు. ఫిరోజి ఋషీంద్రుల సహజ పాండిత్య ప్రకర్షతో పండిత లోకాన్ని ఆశ్చర్యపరచారు. సంస్కృత, ఆంధ్ర భాషల్లో ఆయన రచించిన వేణుగోపాల శతకాన్ని తనకు అంకితం ఇవ్వవలసిందిగా సత్తెనపల్లి జమీందారు కోరగా తన రచనలు భగవంతుని కోసమేనంటూ అపరపోతనామాత్యునిలా తిరస్కరించారు.

ఆ కొలువులో వున్న అనేకమంది పండితులకు ఫిరోజి ఖ్యాతి అసూయ కలిగించింది. ఫిరోజిని ఎలాగైనా అపఖ్యాతిపాలు చేయాలని వారు ఎంతగానో యత్నించి చివరకు శ్రీహరి అనే దేవదాసిని ఆయనపై ఉసిగొల్పారు. ఫిరోజిని కవ్వించబోయిన శ్రీహరిలో ఆయన మాతృతత్వాన్ని వర్తింపజేశారు. ఆయన భౌతికకాయాన్ని వీడిన తర్వాత ఆయన ఆత్మ గుత్తికొండ బిలాలలో మరి కొంతకాలం తపోనిష్ట ఆచరించవలసి ఉందని అనేక దృష్టాంతరాలతో ఇప్పటికీ ఈ ప్రాంతీయులు చెప్పుకోవడం విశేషం. ఫిరోజికి గుంటూరు, ప్రకాశం జిల్లాలో అనేక చోట్ల ఆలయ నిర్మాణాలు జరిగాయి. ఆయన ప్రధాన పీఠమైన సత్తెనపల్లిలోని సమాధిపై నెలకొల్పిన లింగ రూప దర్శనానికి వేల సంఖ్యలో భక్తులు వస్తుంటారు.

# తెల్లదొరలకు గుంటూరంటే హడల్

(ఆన్‌లైన్, గుంటూరు)

అక్కడ స్వాతంత్ర్యోద్యమం ఉధృతంగా సాగుతున్నదా? అని 1932లో భారతదేశ గవర్నర్ జనరల్‌గా పదవీ బాధ్యతలు స్వీకరించిన లార్డ్ వెల్లింగ్‌టన్ అధికారులను ప్రశ్నించారు. దీనిని బట్టి భారతదేశ స్వాతంత్ర్యోద్యమంలో గుంటూరు ఎంత ప్రముఖ పాత్ర వహించిందో ఇట్టే అవగతం అవుతుంది. 1920లో సహాయ నిరాకరణ ఉద్యమం ముమ్మరంగా సాగుతున్న తరుణంలో లార్డ్ వెల్లింగ్‌టన్ మద్రాసు రాష్ట్ర గవర్నర్‌గా వున్నారు. ఉద్యమాన్ని విచ్ఛిన్నం చేయడానికి లార్డ్ వెల్లింగ్‌టన్ విఫలయత్నం చేశారు. వెల్లింగ్‌టన్ చేపట్టిన విద్రోహ చర్యలతో


కన్నెగంటి హనుమంతు

గుంటూరు జిల్లాలో సహాయ నిరాకరణ ఉద్యమం మరింత ఉధృతం అయింది. ఈ సంఘటన వెల్లింగ్‌టన్ మనోఫలకంపై చెరగని ముద్ర వేసింది. అదే సమయంలో పెదనందిపాడు పన్నుల నిరాకరణ ఉద్యమం, పల్నాడులో కన్నెగంటి హనుమంతు ఆధ్వర్యంలో


పర్వతనేని వీరయ్యచౌదరి

పుల్లరి ఉద్యమాలు జరిగాయి. ఈ రెండు ఉద్యమాలను అణచివేయడానికి వెల్లింగ్‌టన్ అనేక ప్రయత్నాలుచేసి విఫలం అయ్యారు. ఈ ఉద్యమాలను అణచివేయడానికి బ్రిటిష్‌వారు చేసిన ప్రయత్నాల ఫలితంగా అనేక చోట్ల హింసాత్మక సంఘటనలు జరిగాయి. దీంతో లార్డ్ వెల్లింగ్‌టన్‌కు గుంటూరు జిల్లా అంటే దడ పుట్టింది. అనంతరం ఆయన భారతదేశ గవర్నర్ జనరల్‌గా 1932లో పదవీ బాధ్యతలు స్వీకరించారు. ఈ నేపథ్యంలో ఆయన గవర్నర్ జనరల్‌గా పదవీ బాధ్యతలు స్వీకరించిన వెంటనే 'గుంటూరు' ఎలా వుంది అంటూ అధికారులను ప్రశ్నించారు.

# కాకలు తీరిన రాజకీయ యోధుడు

# కాసు బ్రహ్మానందరెడ్డి

(ఆన్‌లైన్, నరసరావుపేట)

మారుమూల గ్రామంలో రైతు కుటుంబంలో జన్మించి, అంచలంచెలుగా ఎదిగి రాష్ట్ర ముఖ్యమంత్రిగా, కేంద్రంలో సైతం ఎన్నో ప్రతిష్టాత్మక పదవులు అలంకరించారు ఆయన. కార్యదీక్ష, పట్టుదలలో తనకు తానే సాటి అని నిరూపించుకొన్న మహానేత కాసు బ్రహ్మానందరెడ్డి. రాష్ట్రపతి, ప్రధానమంత్రి పదవులు మినహా, దేశంలోని అన్ని అత్యున్నత పదవులన్నింటినీ ఆయన అధిరోహించారు. ముఖ్యమంత్రిగా సుదీర్ఘ కాలం పని చేసి, రాష్ట్ర అభ్యున్నతికి పాటుపడ్డారు. సాగర్ డ్యాంకు క్రస్ట్ గేట్లు ఏర్పాటు చేసి, ఈ ప్రాంతానికి సాగు నీరు అందించటంలో బ్రహ్మానంద రెడ్డి విశేషంగా కృషి చేశారు. స్వాతంత్ర్య ఉద్యమంలో కూడా చురుకైన పాత్ర పోషించారు. 1929లో ఆయన రాజకీయ జీవితాన్ని ఆరంభించారు.

## కాసు ప్రస్థానం ఇలా...

1909 సంవత్సరం జులై 28న గుంటూరు జిల్లాలోని నాదెండ్ల మండలం, తూబాడు గ్రామంలో కాసు బ్రహ్మానందరెడ్డి జన్మించారు. ఆయన బిఎల్ పట్టభద్రుడు. విద్యార్థి దశ నుంచే రాజకీయాల్లో కాసు చురుగ్గా పాల్గొనే వారు. గాంధీయతత్వాన్ని పుణికిపుచ్చుకొన్న ఆయన ఆ అలవాట్లనే ఆచరణలో చూపే వారు. ఆయన ఇంటి నుంచి బయటకు వస్తే, తల పై ఖద్దరు టోపీ విధిగా వుంటుంది. ఈ ఆచారాన్ని పాటించిన నాయకులు చాలా అరుదు. ఆయన తన టోపీ తిప్పే రీతిని ఇప్పటికీ ప్రత్యేకంగా చెప్పుకొంటారు. తలపై టోపీని తిప్పారంటే, ఒక మంచి ఆలోచనకు ఆయన నాంది పలికినట్లే.

ఆంధ్రకేసరి ప్రకాశం పంతులుకు బ్రహ్మానంద రెడ్డి ముఖ్యమైన శిష్యుడిగా వున్నారు. టంగుటూరు ప్రకాశం పంతులు, కొండా వెంకటప్పయ్య, దుగ్గిరాల గోపాలకృష్ణయ్య, నడింపల్లి నరసింహారావు శాస్త్రిల స్ఫూర్తితో స్వాతంత్ర్య ఉద్యమంలో కాసు జిల్లాలో జరిగిన అనేక కార్యక్రమాల్లో చురుకైన పాత్రను పోషించారు. మద్రాసులో లా చదివే సందర్భంలో సైమన్ కమిషన్‌ను ఆయన బాయ్ కాట్ చేశారు. తమిళనాడు ఒక నాటి ముఖ్యమంత్రి అన్నాదురై బ్రహ్మానందరెడ్డికి సహచర విద్యార్థి.

## స్వాతంత్ర్యోద్యమంలో జైలు...

1940వ సంవత్సరంలో సత్యాగ్రహం చేయాలని పిలుపునిచ్చారు. ఈ సందర్భంగా 1941 ఫిబ్రవరిలో వ్యక్తి సత్యాగ్రహంలో పాల్గొన్న బ్రహ్మానంద రెడ్డికి ఆరు నెలలు జైలు శిక్ష పడింది. 1942లో క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్న కాసు, 1943 సెప్టెంబరు 13న అరెస్టయ్యారు. ఆయన 1945 జనవరి 28న జైలు నుంచి విడుదలయ్యారు. ఎఐసిసిలో సభ్యుడిగా అనేక సంవత్సరాలు పని చేసిన ఆయన, కేంద్రంలో కాంగ్రెస్ ఎగ్జిక్యూటివ్‌గా ప్రధాన పాత్ర పోషించి లాల్ బహదూర్ శాస్త్రి ప్రధాని కావటానికి కారకులయ్యారు. ఆయన రాజకీయ జీవితం 1929లో ప్రారంభమైంది. 1937లో ప్రకాశం పంతులు ఆశీస్సులతో 1937లో ఒంగోలు బోర్డు అధ్యక్షులుగా ఆయన ఎన్నికయ్యారు.

రాజకీయ రంగ ప్రవేశ అనంతరం నరసరావుపేటలో న్యాయవాద వృత్తిని కొంతకాలం నిర్వహించారు. 1946లో మద్రాసు రాష్ట్ర శాసన సభకు జరిగిన ఎన్నికల్లో నరసరావుపేట నియోజకవర్గం నుంచి ఎన్నికయ్యారు. మద్రాసు అసెంబ్లీలో అత్యంత కీలకమైన శాసన సభ్యునిగా పని చేశారు. ఆయనలోని



నాయకత్వ లక్షణాలు గుర్తించి, ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర కాంగ్రెస్ ప్రధాన కార్యదర్శిగా బాధ్యతలు అప్పగించారు. సంజీవయ్య ముఖ్యమంత్రిగా వుండగా, కాసు ఆర్థిక మంత్రిగా పని చేశారు.

## రాష్ట్ర సమైక్యతకు పదవీ త్యాగం...

1964లో బ్రహ్మానందరెడ్డి ముఖ్యమంత్రిగా ప్రమాణ స్వీకారం చేశారు. కాంగ్రెస్ ప్రభుత్వంలో అత్యధిక కాలం ముఖ్యమంత్రిగా ఆయన రికార్డు సృష్టించారు. ముఖ్యమంత్రిగా వుండగా, నాగార్జున సాగర్ డ్యాం పై క్రస్ట్ గేట్లను ఏర్పాటు చేయటంలో విశేష కృషి చేశారు. క్రస్ట్ గేట్లు ఏర్పాటు చేసి, సుమారు 22 లక్షల ఎకరాలకు నీరు అందించటంలో కాసు చేసిన కృషి ప్రశంసనీయం. తన జీవితంలో ముఖ్యమైన విశేషాల్లో నాగార్జున సాగర్ క్రస్ట్ గేట్లు ఏర్పాటు చేయటం ముఖ్యమైనదని, లక్షలాది మంది రైతుల పంట పొలాలకు సాగు నీరు అందించి, అన్నదానం కలకాలం చేశానని జ్ఞాపకం వచ్చినప్పుడు తనకు ఒళ్ళు పులకరిస్తుందని పలు సందర్భాల్లో బ్రహ్మానందరెడ్డి చెప్పుకొన్నారు.

## పక్కా గృహాలకు రాష్ట్రం నుంచే శ్రీకారం...

సిఎం పదవీ కాలంలో రూ 10 కోట్లు హడ్కో రుణాన్ని ఎల్‌ఐసి ద్వారా



సాగర్ డ్యాం ప్రారంభోత్సవంలో అప్పటి భారత ప్రధాని ఇందిరా గాంధీతో కాసు బ్రహ్మానంద రెడ్డి

పొంది రాష్ట్రంలో మొట్టమొదటి సారిగా బలహీన వర్గాల వారికి ఇళ్ళ నిర్మాణం చేపట్టిన పేరు తెచ్చుకొన్నారు. ఉర్దూ బాషకు తెలుగుతో సమాన ప్రతిపత్తిని కల్పించటంతో పాటు, అమలు చేయటంలో కూడా ఆయన ఎంతో కృషి చేశారు. బ్రహ్మానందరెడ్డి నాయకత్వంలో 1964 జనవరి 18న గ్రామ పంచాయతీ చట్టం అమలైంది. 1971 సెప్టెంబరు 23వ తేదీ వరకు ముఖ్యమంత్రిగా బ్రహ్మానందరెడ్డి కొనసాగారు. 1964 నవంబరులో గుంటూరులో జరిగిన అఖిల భారత కాంగ్రెస్ కమిటీకి జరిగిన ఎన్నికల్లో కాకాని వెంకటరత్నాన్ని గెలిపించి రాష్ట్ర రాజకీయాల్లో ఆయనదే పైచేయి అని నిరూపించుకున్నారు. మద్రాసులో స్థిరపడిన చలనచిత్ర పరిశ్రమ హైదరాబాద్ వైపు మళ్ళించటంలో ఆయన పాత్ర ప్రధానమైనది. సమైక్యాంధ్రా కోసం శాసనసభలో మెజార్టీ ఉన్నప్పటికీ ముఖ్యమంత్రి పదవికి రాజీనామా చేసి, మహానేతగా పేరొందారు. రాష్ట్ర సమైక్యత కోసం పాటుపడిన వారిలో బ్రహ్మానందరెడ్డి ముఖ్యులు.

(మిగతా 31వపేజీలో)

# స్వాతంత్ర్య సంగ్రామంలో బాపట్ల

(ఆన్‌లైన్-బాపట్ల)

భారతదేశ స్వాతంత్ర్య సముపార్జనకోసం బ్రిటిష్ పాలకులపై సాగిన సమరంలో బాపట్ల ప్రముఖ పాత్ర వహించింది. బాపట్ల నేతలు అనేక పోరాటాలు, సత్యాగ్రహాలు నిర్వహించి ఈ ప్రాంత ప్రజల్లో ఉద్యమ స్ఫూర్తికి నాంది పలికారు. ప్రజల్లో చైతన్యం తెచ్చేందుకు మహాత్మాగాంధీజీ ప్రకాశం జిల్లాలో చేసిన ప్రసంగాలు నూతనోత్తేజాన్ని కలిగించాయి.

1930-31 స్వాతంత్ర్యోద్యమకాలంలో జాతీయ జెండా వున్న గ్రామాలపై పోలీసులు దాడిచేసి పతాకాలను తొలగించేవారు. మంతెన వెంకటరామరాజు ఆయన స్నేహితులు నల్లూరు గ్రామ నివాసి వెంకట కృష్ణయ్య, ఒంగోలు తాలూకా దేవరంపాడు గ్రామానికి చెందిన సాగి విజయ రామరాజు గుళ్ళపల్లి వాస్తవ్యులు గుళ్ళవల్లి ఆదినారాయణరావులు గ్రామాలలో జెండాలు తీసివేయకుండా బ్రిటిష్ పాలకులకు గుణపాఠం చెప్పాలని నిర్ణయించుకొన్నారు. మహాత్మాగాంధీ 1929 ఏప్రిల్ 17న ఖద్దరు ఉద్యమ వ్యాప్తికోసం మంతెనవారిపాలెం విచ్చేసి, ఆ రాత్రి గ్రామంలోనే బసచేశారు. దీనికి గుర్తుగా 1933 జూన్ 6న మంతెనవారిపాలెం గ్రామం మధ్యనున్న చెరువు అంచున నిజాంపట్నంలోని పల్లెకారుల సహాయంతో స్తంభాన్ని ప్రతిష్ఠించారు. 1934 జనవరి 18న మాగంటి బాపినీడు సతీమణి అన్నపూర్ణమ్మలు ఆవిష్కరించారు. ఈ స్తంభం కోసం తవ్విన గోతిలో గ్రామస్థులు దమ్మిడి,నాణేలు పోసిన తర్వాత గొయ్యిని పూడ్చారు. స్తంభం ఎదురుగా వున్న పురమందిరంలో గ్రంథాలయం వరండాలో పులిజూదం ఆడుకునేవారు. చాలా మంది హిందీ చదువుకునేవారు. పురమందిరం స్థలాన్ని హైస్కూల్‌కు కేటాయించారు.

రేపల్లె మండలం నల్లూరులోని చాట్రగడ్డ రోడ్డు సమీపంలో ప్రతిష్ఠించిన గాంధీజీ సత్రం భవనానికి బీటలు వచ్చాయి. ఈ దంపతులు లిద్దరు అమెరికాలో చదువుకున్నారు. ఆయన భార్య అన్నపూర్ణమ్మ 1933 జనవరి 1న ఆంధ్ర సంచారం (హరిజనోద్ధరణ)కు విచ్చేసిన సమయంలో గాంధీజీ ఆమెను నీ నగలు ఇమ్మని కోరగా మారు మాట్లాడకుండా ఒక్క తాళిబొట్టు మినహా అన్ని నగలు ఇచ్చిన మహిళగా చరిత్ర పుటలకు ఎక్కింది. ఆ సమయంలోనే మహిళలు ప్రభావితులై స్వాతంత్రోద్యమంలో పాల్గొన్నారు.

ప్రముఖ స్వాతంత్ర్య సమర యోధుడు గొల్లపూడి సీతారామశాస్త్రి 1920-21లో బాపూజీ కోరిక మేరకు గుంటూరు పట్టణంలో న్యాయవాద వృత్తి మానుకొని సత్యాగ్రహ ఉద్యమంలో పాల్గొన్నారు. 1933లో వినయాశ్రమంలో గాంధీజీ స్థూపాన్ని నిర్మించారు. 1933 డిసెంబరు 23న వినయాశ్రమం ప్రారంభించారు. ఆ రోజు రాత్రి ఆయన అక్కడ విశ్రమించారు. ప్రముఖ స్వాతంత్ర్య సమర యోధుడు బాపట్ల మాజీ శాసనసభ్యుని తనయుడు మంతెన కృష్ణంరాజు, మంతెన వెంకట రాధాకృష్ణంరాజులు ఈ ఆశ్రమంలో ఏడు సంవత్సరాల వయస్సులో ప్రాథమిక విద్యతో పాటు 1933 నుంచి ఏడాది పాటు గ్రామీణ పరిశ్రమలలో శిక్షణ పొందారు. ఈ ఆశ్రమానికి కారంచేడు వాస్తవ్యులు జాగర్లమూడి కుప్పుస్వామిచౌదరి వందల ఎకరాల భూమిని దానంగా ఇచ్చారు. కావూరి వాస్తవ్యులు కార్యశీలురు తుమ్మల బసవయ్య తమ ఆస్తినంతా ఆశ్రమానికి ఇచ్చి ఆయన సతీమణి దుర్గాంబతో కలసి ఆశ్రమానికి ఆదాయాన్ని కూర్చడానికి వారి శేషజీవితాన్ని ధారపోశారు.

ఇప్పటికీ 90 ఎకరాల మెట్ట,మాగాణి భూములున్నాయి. ఆశ్రమంలో వృత్తి విద్య నేర్చుకునే వారికి ఉచిత భోజన వసతులు ఏర్పాటు చేశారు. ఇక్కడ నూలు వడకడం, నవ్వారు నేయడం, తాటిబెల్లం తయారీ, నూనెగానుక చెక్క తిరుగళ్ళలో ధాన్యం వలచడం, చెప్పులు తయారు చేయడం, పశువుల కొమ్ములతో గుండీలు చేయడంతో పాటు తేనె ఉత్పత్తి కూడా శిక్షణనిస్తున్నారు. హిందీ భాషను కూడా వినయాశ్రమంలో నేర్పించేవారు. శ్రీ స్వామి సీతారామశాస్త్రి తన జీవితాన్ని ధారపోసి ఆయన కుమారునితో ఆయుర్వేద కళాశాలను నెలకొల్పారు. తరువాత కుటీర పరిశ్రమలు చాలావరకు మూతపడ్డాయి. ఆ గ్రామం స్వయం సమృద్ధి దిశకు రాకపోవడంతో కళ తగ్గింది.

ఆ సమయంలో చిత్తూరు జిల్లాకు చెందిన సంఘ సేవకులు,పార్లమెంటు సభ్యులు దివంగత పి.రాజగోపాలనాయుడు వినయాశ్రమానికి 30 ఎకరాల మాగాణి భూమి, 20 ఎకరాల మెట్ట భూమి సీనియర్ పార్లమెంటేరియన్ పద్మవిభూషణ్ ఆచార్య ఎన్.జి.రంగా కృషి విజ్ఞాన కేంద్రాన్ని ఏర్పాటు చేసి అఖిల భారత వ్యవసాయ పరిశోధనా స్థానం (న్యూఢిల్లీ)సహకారంతో ఈ ప్రాంతంలో వ్యవసాయ దారులకు శాస్త్రీయ వ్యవసాయ పద్ధతుల గురించి సూచనలు, ప్రదర్శనలు ఏర్పాటు చేసేందుకు భవనాన్ని నిర్మించారు. వినయాశ్రమాన్ని ఒక ట్రస్టుగా తీర్చిదిద్దారు. ఖద్దరు గ్రామీణ పరిశ్రమల సంస్థ కూడా వినయాశ్రమాన్ని దత్తత తీసుకొంది. సీతారామ శాస్త్రి ప్రభావంతో రెండు గ్రామాల్లోని ప్రతి ఒక్కరూ స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్నారు. ఆ సమయంలో 34మంది జైలు శిక్ష అనుభవించారు.

# కాకలు తీరిన రాజకీయ యోధుడు కాసు బ్రహ్మానందరెడ్డి

(30వ పేజీ తరువాయి)

## కేంద్ర మంత్రిగా...

కేంద్ర మంత్రిగా పలు శాఖల బాధ్యతలు చేపట్టారు. కమ్యునికేషన్‌లు, హోంశాఖ, పరిశ్రమల శాఖల మంత్రిగా కేంద్రంలో పని చేశారు. కమ్యూనికేషన్‌ల శాఖ మంత్రిగా టెలిఫోన్ సౌకర్యాన్ని ప్రజలకు మరింత చేరువ చేయటానికి ఆయన కృషి చేశారు. గ్రామాలకు సైతం ఫోన్ సౌకర్యాన్ని విస్తరింప చేశారు. హోంశాఖ మంత్రిగా, కేంద్ర పాలిత ప్రాంతాల్లో రాష్ట్రాలుగా ఏర్పాటు చేసి, వాటికి స్వయం ప్రతిపత్తిని కల్పించటంలో కాసు చేసిన కృషి ఎంతో వుంది. ఆరవ ఫైనాన్స్ కమిషన్ అధ్యక్షుడుగా పని చేశారు.

## రాష్ట్రంలో రెడ్డి కాంగ్రెస్ ఏర్పాటు...

1977లో కాంగ్రెస్ కేంద్రంలో అధికారాన్ని కోల్పోయింది. ఆ తరువాత భారత మాజీ ప్రధాని ఇందిరా గాంధీతో బ్రహ్మానందరెడ్డికి విభేదాలు ఏర్పడ్డాయి. దీంతో అఖిల భారత కాంగ్రెస్ నిలువునా చీలింది. ఒక వర్గానికి ఇందిరాగాంధీ, మరో వర్గానికి కాసు బ్రహ్మానందరెడ్డి నాయకత్వం వహించారు. ఈ సందర్భంలోనే రెడ్డి కాంగ్రెస్ పార్టీని బ్రహ్మానందరెడ్డి స్థాపించారు. ఈ సందర్భంగా జరిగిన అసెంబ్లీ ఎన్నికల్లో రెడ్డి కాంగ్రెస్ పార్టీ పోటీ చేసింది. కొందరు ఎమ్మెల్యేలుగా కూడా పార్టీ తరపున ఎన్నికయ్యారు. అనంతరం జరిగిన రాజకీయ పరిణామాల్లో 1980లో తిరిగి కాంగ్రెస్(ఐ)లో బ్రహ్మానందరెడ్డి చేరి, అదే పార్టీ పై నరసరావుపేట నుంచి పార్లమెంట్‌కు ఎన్నికయ్యారు. 1982లో కాంగ్రెస్ సమన్వయ అధ్యక్షుడుగా వున్నారు. రాష్ట్రపతి, ప్రధాన మంత్రి పదవులు మినహా, దేశంలో అత్యున్నత స్థానాలన్నింటినీ బ్రహ్మానందరెడ్డి అధిరోహించారు. మహారాష్ట్ర గవర్నర్‌గా కూడా పని చేశారు. జాతీయ, రాష్ట్ర రాజకీయాల్లో తన దైన బాణిలో రాజకీయాలను నెరపిన మేరు మగధీరుడు కాసు బ్రహ్మానందరెడ్డి. ఆయన 1994 మే 20న హైదరాబాద్‌లో మరణించారు.

# ప్రపంచ రైతు ఉద్యమ నిర్మాత ఆచార్య ఎన్‌జి రంగా



ఇందిరాగాంధీ నుంచి అవార్డును స్వీకరిస్తున్న ఆచార్య ఎన్.జి.రంగా



అప్పటి పార్లమెంటు సభ్యులతో ఆచార్య ఎన్.జి.రంగా

(ఆన్‌లైన్-పొన్నూరు)

రైతులు ఎలా ఉండాలో వారికి ఏం చేయాలో అదంతా చేయడానికి కావలసినంత అధికారం గల పదవి కావాలి నాకు అంత పదవి రాదు. అంతకు తక్కువ పదవి నాకు అవసరం లేదు. అని కరాఖండీగా తేల్చి చెప్పి తన సుదీర్ఘ 60 సంవత్సరాల పార్లమెంటరీ రాజకీయాల చరిత్రలో ఎటువంటి పదవినీ చేపట్టని ఆచార్య గోగినేని రంగనాయకులు అలియాస్ ప్రొఫెసర్ ఎన్.జి.రంగా దేశ రాజకీయాల్లో చిరస్మరణీయుడు. రైతు బాంధవుడు, ప్రపంచ రైతు ఉద్యమ నిర్మాతల్లో ప్రముఖుడు, రాజనీతి కోవిదుడు, పార్లమెంటు పితామహుడు, రాజకీయ భీష్మునిగా గణతికెక్కిన గిన్నీస్ బుక్ రికార్డు హోల్డర్ ఆచార్య ఎన్.జి.రంగా రాష్ట్ర ప్రజలకే కాక యావద్భారత దేశానికే గర్వకారకులని చెప్పవచ్చు.

1900వ సంవత్సరం నవంబరు ఏడవ తేదీన గుంటూరుజిల్లా నిడుబ్రోలు గ్రామంలో నాగయ్య, అచ్చమాంబ దంపతులకు జన్మించిన గోగినేని రంగనాయకులు కాలక్రమంలో ఆచార్య ఎన్.జి.రంగాగా పేరు గాంచారు. బాల్యం నుంచి చురుకైన వాడిగా గుర్తింపు నొందిన రంగా ఇరవై ఏళ్ళ యవ్వనంలో పై చదువుల కోసం ఇంగ్లాండు వెళ్ళి ప్రతిష్టాత్మకమైన ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీలో చేరాడు. ఆర్థిక, సాంఘిక, రాజకీయ శాస్త్రాలను అధ్యయనం చేసిన రంగాజీ యూనివర్సిటీ తరపున భారతదేశ ఆర్థిక పరిస్థితులపై పరిశోధనలు సాగించాడు. ఆ తర్వాత కాలంలో చేనేత కార్మికుల జీవితాలను గురించి, వలస దేశాల ప్రజలు సాంఘిక, ఆర్థిక, రాజకీయ రంగాల్లో ఎదుర్కొంటున్న సమస్యలపై పరిశోధనాత్మక గ్రంథాలను రచించారు. 1923లో స్వదేశానికి తిరిగి వచ్చిన రంగా కాంగ్రెస్‌పార్టీ వైపు ఆకర్షితులై పార్టీ కార్యకలాపాల్లో పాలు పంచుకోసాగారు.

1924లో భారతీదేవితో వివాహం తదుపరి మద్రాసు పచ్చయప్ప కళాశాలలో అధ్యాపకునిగా ఉద్యోగ జీవితాన్ని ప్రారంభించిన రంగా ఆ తర్వాత మద్రాసు రాష్ట్ర ఆర్థిక సలహాదారునిగా పని చేశారు. ఆ సమయంలో దేశంలో ఉధృతంగా సాగుతున్న స్వాతంత్రోద్యమ పవనాలు రంగాను తాకాయి. 1930 లో ఉద్యోగాన్ని తృణప్రాయంగా త్యజించిన రంగా స్వాతంత్రోద్యమంలోకి దూకారు. జవహర్‌లాల్ నెహ్రూ, నేతాజీ సుభాష్ చంద్రబోస్‌లతో సన్నిహితంగా మెలుగుతూ స్వాతంత్ర్య సంగ్రామంలో కీలక భూమికను పోషించిన రంగా తాను స్వాతంత్రోద్యమంలో పాలు పంచుకోవడానికి మహాత్మాగాంధీ ప్రేరణని పేర్కొన్నారు.



ఆచార్య ఎన్.జి.రంగా

స్వాతంత్ర సంగ్రామంతో పాటు రైతు సమస్యల పట్ల కూడ దృష్టిని సారించిన రంగాజీ రైతులు ఎదుర్కొంటున్న ఆర్థిక మాంద్య పరిస్థితులను వ్యతిరేకిస్తూ రైతు రుణ విముక్తి ఉద్యమాన్ని ప్రారంభించారు. ఈ ఉద్యమం ఫలితంగానే బ్రిటీష్ ప్రభుత్వం రైతుల రుణాలపై మారటోరియంను ప్రకటించింది. ఆ సంఘటన మొదలు రైతు సమస్యలు ఎక్కడ వుంటే అక్కడ రంగా ప్రత్యక్షమై ఉద్యమాలను నిర్వహించనారంభించారు. ఈ నేపథ్యంలో 1934లో పార్లమెంటు సభ్యునిగా ఎన్నికై రంగా విజయ పరంపరలను కొనసాగిస్తూ రైతుల ప్రతినిధిగా పార్లమెంటులో తన వాణిని వినిపించారు.

ప్రపంచంలో కెల్లా సుదీర్ఘకాలం పార్లమెంటు సభ్యునిగా కొనసాగిన కీర్తి గతంలో విన్‌స్టన్ చర్చిల్‌కు దక్కగా ఆ రికార్డును అధిగమించిన ఎన్.జి.రంగా ప్రపంచ రాజకీయాల్లో తనదైన రికార్డును సృష్టించి గిన్నీస్ బుక్‌లోకి ఎక్కారు.1942లో క్విట్ ఇండియా ఉద్యమ కాలంలో రంగాకొన్నేళ్ళు జైలు జీవితాన్ని, మరికొన్నాళ్ళు అజ్ఞాత వాసాన్ని గడిపారు.1947లో దేశానికి స్వాతంత్ర్యం లభించిన తర్వాత అప్పటి కాంగ్రెస్ నాయకులతో వచ్చిన విభేదాల కారణంగా కాంగ్రెస్‌పార్టీకి రాజీనామా చేసిన రంగా 1950లో టంగుటూరి ప్రకాశం పంతులుతో కలసి కృషీకార్‌లోక్ పార్టీని స్థాపించారు. 1955లో తిరిగి కాంగ్రెస్ పార్టీలో చేరిన రంగా 1958లో కాంగ్రెస్ నుంచి విడిపోయారు. కొంత కాలం స్వతంత్ర పార్టీలో కొనసాగిన రంగా, ఇందిరాగాంధీ ప్రకటించిన గరీబీహటావో నినాదానికి ఉత్తేజితులై తిరిగి కాంగ్రెస్‌లో చేరారు.

దేశ పార్లమెంటు ఆవిర్భావం నుంచి సభ్యునిగా ఎన్నికవుతూ వచ్చిన రంగా 1977లో రాజ్యసభ సభ్యునిగా ఎంపికయ్యారు. సుదీర్ఘ రాజకీయ చరిత్రలో ఏనాడూ ఆయన పదవులను ఆశించలేదు. అత్యున్నతమైన పదవులు చేపట్టే అవకాశాలు వచ్చినా తృణప్రాయంగా త్యజించారు. 1982 పార్లమెంటరీ (మిగతా 34వ పేజీలో)

# దీపావళి, రంజాన్ శుభాకాంక్షలు

స్వర్గీయ ఇందిరాగాంధి

స్వర్గీయ రాజీవ్‌గాంధి

శ్రీమతి సోనియాగాంధి
ఎఐసిసి అధ్యక్షురాలు

శ్రీ మన్‌మోహన్‌సింగ్
ప్రధానమంత్రి

శ్రీ వై.ఎస్. రాజశేఖరరెడ్డి
రాష్ట్రముఖ్యమంత్రి

శ్రీ కె. కేశవరావు
రాష్ట్ర పి.సి.సి. అధ్యక్షులు

శ్రీ కొణిజేటి రోశయ్య
రాష్ట్ర ఆర్థికశాఖామంత్రి

శ్రీ కన్నా లక్ష్మీనారాయణ
రాష్ట్ర సహకార, రవాణాశాఖామాత్యులు

శ్రీమతి దగ్గుబాటి పురందేశ్వరి
కేంద్ర మానవ వనరుల శాఖ సహాయమంత్రి

శ్రీ ధర్మాన ప్రసాదరావు
జిల్లా ఇన్‌ఛార్జిమంత్రి

శ్రీ రాయపాటి సాంబశివరావు
లోక్‌సభ సభ్యులు, గుంటూరు

శ్రీ మేకపాటి రాజమోహనరెడ్డి
లోక్‌సభ, నరసరావుపేట

శ్రీ వల్లభనేని బాలశౌరి
లోక్‌సభ సభ్యులు, తెనాలి

శ్రీమతి కూచిపూడి విజయ
జెడ్.పి. ఛైర్‌పర్సన్, గుంటూరు

శ్రీ జె.డి. శీలం
రాజ్యసభ సభ్యులు

శ్రీ ముప్పలనేని శేషగిరిరావు
డిసిసి అధ్యక్షులు

శ్రీ గాదె వెంకటరెడ్డి
శాసనసభ్యులు, బాపట్ల

శ్రీ కాసు కృష్ణారెడ్డి
శాసనసభ్యులు, నరసరావుపేట

ఆంధ్రజ్యోతి 4 వార్షికోత్సవము

## ఆంధ్రుల అభిమాన పత్రిక
## ఆంధ్రజ్యోతి
## నాల్గవ వార్షికోత్సవం సందర్భంగా
## ఆంధ్రజ్యోతి
## యాజమాన్యానికి, సిబ్బందికి శుభాకాంక్షలు

**సోనియాగాంధి నాయకత్వంలో ప్రధాని మన్‌మోహన్‌సింగ్ ప్రభుత్వంలో**
**రాష్ట్రంలో ముఖ్యమంత్రి డా॥ వైఎస్ రాజశేఖరరెడ్డి నాయకత్వంలో**

★ రాష్ట్ర ప్రభుత్వం పేద ప్రజల సంక్షేమానికి నిరంతరం కృషిచేస్తుంది.
★ పేద ప్రజలకు ఉచిత విద్యుత్ అమలు
★ అప్పుల భారంతో ఉన్న రైతులకు విద్యుత్ బకాయిల రద్దు.
★ 25 పైసల వడ్డీకే డ్వాక్రా సంఘాలకు రుణాలు
★ 25 రూపాయల మినిమమ్ విద్యుత్.

బిల్లులు చెల్లించే ప్రజలకు పదిరూపాయల సబ్సిడీ...
ఇంకా ఎన్నెన్నో మేలైన పథకాలు అమలు చేస్తున్న
కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలకు మద్దతు తెలుపుదాం.

శ్రీ గుదిబండి వెంకటరెడ్డి
శాసనసభ్యులు, దుగ్గిరాల

శ్రీ జంగా కృష్ణమూర్తి
శాసనసభ్యులు, గురజాల

శ్రీ మురుగుడు హనుమంతరావు
శాసనసభ్యులు, మంగళగిరి

శ్రీ మోపిదేవి వెంకటరమణ
శాసనసభ్యులు, కూచినపూడి

శ్రీ నాదెండ్ల మనోహర్
శాసనసభ్యులు, తెనాలి

శ్రీ డి. మాణిక్య వరప్రసాద్
శాసనసభ్యులు, తాడికొండ

శ్రీ తాడిశెట్టి వెంకటరావు
శాసనసభ్యులు, గుంటూరు-2

డా॥ రాయపాటి శ్రీనివాస్
పిసిసి ప్రధాన కార్యదర్శి

రాయపాటి సాయి మోహనకృష్ణ
1వ డివిజన్ కార్పొరేటర్

శ్రీ మక్కెన మల్లికార్జునరావు
శాసనసభ్యులు, వినుకొండ

శ్రీ దేవినేని మల్లికార్జునరావు
శాసనసభ్యులు, రేపల్లె

శ్రీ సతీష్‌పాల్‌రాజ్
శాసనసభ్యులు, వేమూరు

శ్రీ నంబూరు సుభాని
శాసనసభ్యులు, గుంటూరు-1

శ్రీ రావి వెంకటరమణ
శాసనసభ్యులు, ప్రత్తిపాడు

శ్రీ పిన్నెల్లి లక్ష్మారెడ్డి
శాసనసభ్యులు, మాచర్ల

శ్రీ మర్రి రాజశేఖర్
శాసనసభ్యులు, చిలకలూరిపేట

శ్రీ యర్రం వెంకటేశ్వరరెడ్డి
శాసనసభ్యులు, సత్తెనపల్లి

(32వ పేజీ తరువాయి)

జీవిత స్వర్ణోత్సవ మహోత్సవాలు పార్లమెంటు హాలులో ఘనంగా జరిపించుకున్న రంగా భారత ప్రభుత్వంచే 'పద్మవిభూషణ' జపాన్ ప్రభుత్వం నుంచి 'ఒసాకా' అవార్డులను అందుకున్నారు. 95 సంవత్సరాల కాలం జీవించిన రంగాజీ అనారోగ్యంతో నిడుబ్రోలులోని స్వగృహం 'గోభూమి'లో 1995వ సంవత్సరం జూన్ ఎనిమిదవ తేదీన తుది శ్వాసను విడిచారు. రంగాజీ మరణంతో భారత రాజకీయ వినీలాకాశం నుంచి ఒక ధ్రువతార నేల రాలింది.



నిడుబ్రోలులోని ఆచార్య ఎన్.జి.రంగా స్వగృహం (గోభూమి)

## ప్రపంచ రైతు ఉద్యమ నిర్మాత

# ఆచార్య ఎన్‌జి రంగా



రాజీవ్‌గాంధీతో ఆచార్య ఎన్.జి.రంగా, అప్పటి రాష్ట్రపతి ఆర్ వెంకట్రామన్ నుంచి పద్మవిభూషణ్ అవార్డు అందుకుంటున్న రంగా

# అత్రి మహాముని ప్రతిష్ఠించిన శ్రీలక్ష్మీనరసింహస్వామి

(ఆన్‌లైన్- పిట్టలవానిపాలెం)

మన రాష్ట్రంలోని ప్రసిద్ధి చెందిన శ్రీ లక్ష్మీ నరసింహస్వామి ఆలయాలలో పిట్టలవానిపాలెం మండలం అల్లూరు గ్రామంలో వేంచేసియున్న శ్రీ లక్ష్మీనరసింహస్వామి దేవస్థానం ఒకటి. దశావతారాలలో అతి ముఖ్యమైనది, కృతయుగంలో భక్తుని కోసం దిగి వచ్చిన దైవ స్వరూపుడు శ్రీ లక్ష్మీనరసింహస్వామి. అల్లూరులోని లక్ష్మీనరసింహస్వామి వారిని పూర్వము త్రేతాయుగమున అత్రి మహాముని ప్రతిష్ఠించారు. ఈ స్వామి వారిని దర్శించి సేవించుకున్న వారికి అన్ని బాధలు తొలగి, కోరిన కోరికలు నెరవేరుతాయని భక్తుల ప్రగాఢ విశ్వాసం.

రాజకీయాలలో వున్న వారు ఎన్నికలలో పోటీ చేసే ముందు స్వామి వారిని దర్శించుకోవడం ఆనవాయితీగా వస్తోంది. ముందుగా ఎవరు దర్శనం చేసుకుంటే వారు ఎన్నికలలో గెలవడం జరుగుతోంది.

ఈ దేవాలయం కుమార కాకతీయ రుద్ర గజపతి అధీనంలోని కృతి వెంకట్రాది పాలనలో శాలివాహన శకం 1199వ సంవత్సరంలో నిర్మితమైంది. స్వామివారికి సూరనేని వెంకట రామప్పరావుబహుద్దూర్ 1769లో ఈనాం భూములను ఇచ్చారు. 1769వ సంవత్సరంలో నాళం గురివిశెట్టు, నాళం శేషాచలపతిలచే జీర్ణోద్ధరణ జరిగింది. స్పెసిఫిక్ ఎండోమెంట్‌నకు ఉత్పల లక్ష్మీ నరసింహాచార్యులు 1878వ సంవత్సరంలో ఈనాం భూములు ఇచ్చారు.



అల్లూరులోని శ్రీలక్ష్మీ నరసింహ స్వామి వారి ఆలయం

1970లో ఈ దేవాలయం ఆంధ్రప్రదేశ్ దేవాదాయ ధర్మాదాయ శాఖకు అనుసంధానం చేశారు. 1974-78లో దేవాలయ విమాన గోపుర నిర్మాణం జరిగింది. 1985లో సి.జి.ఎఫ్. మరియు దేవాలయ నిధుల నుండి స్వామివారి ముఖ మండప నిర్మాణం,పాలిష్ రాయి మూడు లక్షల రూపాయలతో నిర్మించబడింది. 1988లో దేవాలయ మండపాలలో పాలిష్‌రాయి వేయించడం జరిగింది. 1990-91లో ముఖ మండపానకు గిల్స్ ఏర్పాటు చేయబడ్డాయి. 1995లో ప్రాకారం ఎత్తు లేపడం జరిగింది. 1998-99లో స్వామి వారి పాకశాల నిర్మాణం జరిగింది. ప్రసిద్ధి చెందిన ఈ దేవస్థానాన్ని ఈ ప్రాంత ప్రజలే కాకుండా గుంటూరు,ఉభయగోదావరి జిల్లాల నుంచి కూడా అనేక మంది భక్తులు దర్శిస్తుంటారని ఆలయ చైర్మన్లు అక్కల శ్రీనివాసరెడ్డి, మంతెన రంగరాజు, ఆలయ మేనేజరు పాశం అచ్చిరెడ్డి తెలిపారు.

# బౌద్ధారామంగా విరాజిల్లుతున్న భట్టిప్రోలు

రాష్ట్రంలో అత్యంత ప్రాచీన చారిత్రాత్మక స్థలాలలో గుంటూరు జిల్లాలో మండల కేంద్రమైన భట్టిప్రోలు ప్రసిద్ధి పొందింది. బుద్ధుని అవశేషాలతో నిర్మించిన బౌద్ధస్థూపం ఇక్కడ నిర్మితమైంది. ఆంధ్రుల చరిత్ర భట్టిప్రోలులోనే ప్రారంభమైందని 'పట్టావళి' అనే జైన గ్రంథంలో యదార్థ, చారిత్రక అంశాలు వున్నాయి.


భట్టిప్రోలులోని ప్రాచీన బౌద్ధస్థూపం

క్రీ.శ. ఎనిమిదవ శతాబ్దానికి చెందిన జైనకవి రాసిన నయసేనాని 'ధర్మామృతం కావ్యం'ను బట్టి యశోధరుడనే ఇక్ష్వాకుల రాజకుమారుడు దక్షిణదేశానికి వలసవచ్చి వేంగి రాజ్యములోని ప్రతీపాలనపురం రాజధానిగా రాజ్యపాలన చేశాడు. ఇది క్రీ.పూ. అయిదవ శతాబ్దంలో జరిగింది. ఈ ప్రతీపాలనపురమే భట్టిప్రోలుగా చరిత్రకారులు గుర్తించారు.

క్రీ.శ.1870వ సంవత్సరంలో భట్టిప్రోలు ప్రాశస్త్యం వెలుగులోకి రాసాగింది. బౌద్ధమతానికి ప్రతీకగా మనరాష్ట్రంలో అమరావతి, భట్టిప్రోలు ప్రాంతాలు ప్రధానకేంద్రాలుగా వున్నాయి. అలాగే చంద్రగిరి, గిద్దలూరు, ధూపాడుల వద్ద బయటపడిన శాసనాల ద్వారా బౌద్ధమతాన్ని ప్రాచీన కట్టడాల గురించి తెలియచేస్తున్నాయి. అలనాటి శాతవాహనుల కాలంలో బౌద్ధమతానికి చిహ్నంగా నిర్మించబడిన బౌద్ధస్థూపం నేటికి భట్టిప్రోలులో వుంది.

ఇదేకాక రాష్ట్రంలో బౌద్ధకేంద్రాలుగా అమరావతి, ఘంటసాల, జగ్గయ్యపేట, నాగార్జునకొండ, నందలూరు, చినగంజాం, కామిరెడ్డిపల్లి, తిరుమలగిరి తదితర ప్రాంతాల్లో వుండేవి. బ్రిటీష్ వర్తకులైన రాబర్ట్ సూయల్ ఈ స్థూపాన్ని దర్శించేనాటికి స్థూపం శిలాఫలకాన్ని తవ్వి రోడ్డు, వెల్లటూరు కాల్వపై తూములు నిర్మించటంలో వాడారు.

1892లో జరిగిన తవ్వకాల్లో చక్రాకర పునాదులపై నిర్మించిన బృహత్‌స్థూపం బయల్పడింది. స్థూపం వ్యాసం 132 అడుగులు. స్థూపం మధ్య ఆమూల్యాగ్రంగా ఇటుకలు అమర్చబడి పద్మాకారంలో వుంది. స్థూపం చుట్టూ ప్రదక్షణాపథం, దాని అంచున పాలరాయి ప్రాకారం వుండేది. ప్రాకార వ్యాసం 148 అడుగులు, స్థూపం ఆవరణ వైశాల్యం 1700 చదరపు అడుగులు. ఇంతవరకు లభ్యమైన కొన్ని శిల్పాలను అమరావతి, హైదరాబాదు, చెన్నై, లండన్, ప్యారీస్ మ్యూజియంలో నేటికి భద్రంగా వున్నాయి. నాజూకైన అంగసౌష్టవం, భావ వ్యక్తీకరణ ఈ శిల్పాల్లో ప్రస్ఫుటంగా కనిపిస్తుంది.

భట్టిప్రోలులోని ఈ ప్రాచీన కట్టడానికి కేంద్ర,రాష్ట్ర ప్రభుత్వాలు పురావస్తు ప్రదేశం అవశేషాలు చట్టం 1958 ద్వారా దేశ ప్రాముఖ్యత నెలకొన్నదిగా ప్రకటించాయి. రాష్ట్రంలో చారిత్రాత్మక బౌద్ధమత ప్రాధాన్యత కలిగిన బౌద్ధారామాలకు మరమ్మత్తులు జరిపి సందర్శకులను ఆకర్షించేందుకు కేంద్రప్రభుత్వం చేపట్టిన అభివృద్ధి కార్యక్రమాలు జరుగుతున్నాయి.

ఇందులో భాగంగా బౌద్ధస్థూపం చుట్టూ పెన్సింగ్ ఏర్పాటు చేయటం జరిగింది. అలాగే గతనెలలో పురావస్తు శాఖ అధికారులు స్థూపాన్ని సందర్శించి స్థూప ఆవరణంలో గల గడ్డిని తొలగించి సందర్శకులను ఆకర్షించే విధంగా అభివృద్ధి చేస్తున్నారు. ఈ ఏడాది నవంబరు నెలలో స్థూపంపై గల మట్టిని తొలగించి స్థూపం పూర్వస్థితికి తీసుకువచ్చేందుకు అధికారులు కృషిచేస్తున్నారు.

(ఆన్‌లైన్ - భట్టిప్రోలు)

# దీపావళి రంజాన్ శుభాకాంక్షలతో...


స్వర్గీయ ఇందిరాగాంధి గారు


స్వర్గీయ రాజీవ్ గాంధి గారు
మాజీ ప్రధాన మంత్రి


శ్రీమతి సోనియాగాంధి గారు
కాంగ్రెస్ పార్టీ అధ్యక్షురాలు


శ్రీ మన్‌మోహన్ సింగ్ గారు
ప్రధానమంత్రి


శ్రీ కె.కేశవరావు గారు
రాష్ట్ర కాంగ్రెస్ పార్టీ అధ్యక్షులు


శ్రీ కె. రోశయ్య గారు
రాష్ట్ర ఆర్థిక శాఖా మంత్రి


శ్రీ కన్నా లక్ష్మీనారాయణ గారు
రాష్ట్ర సహకార శాఖా మంత్రి


శ్రీ ధర్మాన ప్రసాదరావు గారు
జిల్లా ఇన్‌చార్జ్ మంత్రి

# రైతు సంక్షేమం కోరే వై.యస్. నాయకత్వమును బలపర్చాలి

రాష్ట్రంలో వై.యస్. రాజశేఖరరెడ్డి నాయకత్వంలో కాంగ్రెస్ ప్రభుత్వము పేద ప్రజలు, రైతుల సంక్షేమునకు కృషిచేస్తుంది. ఉచిత విద్యుత్తు, ఆత్మహత్యలు చేసుకొన్న కుటుంబములకు పునరావాసము, పావలా వడ్డీలకే డ్వాక్రా సంఘములకు ఋణములు, రాజీవ్ నగరబాట, రాజీవ్ పల్లెబాట, ప్రజాపదం, పట్టణంలో పేదలకు రూ॥ 1200/-కు బాలలు, రాజీవ్‌గృహ కల్ప వంటి పథకములలో ప్రజలకు ఎన్నో సేవా కార్యక్రమములను చేపట్టింది. వై.యస్. పాలనను మెచ్చుకొన్న ప్రజలు ఇటీవల మున్సిపాలిటీల్లో మరియు సహకార, స్థానిక ఎన్నికల్లో అద్భుతమైన తీర్పు ఇచ్చారు. రాష్ట్ర ప్రభుత్వం చేపట్టుతున్న అన్ని పథకాలకు ప్రజలు అండగా ఉండాలని కోరుతున్నాము.

వలికుల ఆశాజ్యోతి
రాష్ట్ర ముఖ్యమంత్రి
డాక్టర్ వై.యస్. రాజశేఖరరెడ్డి గారికి
శుభాభి వందన కుసుమాంజలి
తెలుగు మాగాణంలో
సిరుల పురులను అడిగితే
అది మీ పేరే చెబుతుంది

రైతన్న ముఖంలో
సంతోషాలను ప్రశ్నిస్తే
అది మీ కృషికి దర్పణం పడుతోంది
పచ్చని పల్లెటూళ్లలో
ఏ తలుపు తట్టినా
మీ ఆశయం ఎదురౌతుంది
కర్షక జనహితుడా
ఆకుపచ్చ సూర్యుడా
హరితాంధ్ర సాధకుడా
అపర భగీరథుడా
రైతన్నే ఈ దేశానికి వెన్నెముక

అందుకే కణం కణం
క్షణ క్షణం
మీ అలుపెరుగని
ప్రస్థానం
అందుకే అందుకోండి
మా భూమి పుత్రుల
కృతజ్ఞతాపూర్వక
అభినందన చందనం



ఇట్లు
## ముప్పలనేని శేషగిరిరావు
గుంటూరు జిల్లా కాంగ్రెస్ అధ్యక్షులు

## శ్రీ వై.యస్.రాజశేఖరరెడ్డి గారు
రాష్ట్ర ముఖ్యమంత్రి వర్యులు

# అలుపెరుగని పోరాట యోధుడు

# ఆజన్మ బ్రహ్మచారి మన వావిలాల

(ఆన్‌లైన్ - గుంటూరు)

నాడు స్వాతంత్ర్యం కోసం, ఆ తర్వాత ప్రజా సమస్యల పరిష్కారం కోసం అవిశ్రాంతం పోరాటం చేసిన పోరాట యోధుడు వావిలాల. నేడు మన మధ్య లేకపోయినప్పటికీ ప్రతి ఒక్కరి మదిలో సుస్థిరమైన స్థానాన్ని పొందారు. జనజీవనమే బృందావనంగా భావించే గోపాలకృష్ణుడు. 1920లో నాల్గవ తరగతి చదువే సమయంలో అద్దంకి యజ్ఞ నారాయణ మాస్టరు చెప్పిన జాతీయ నాయకుల జీవిత గాథలు విని ప్రభావితమయ్యారు. బాలగంగాధర్ తిలక్, వివేకానందుడు, గాంధీ మహాత్ముడు అంటే పంచప్రాణాలు విడిచే ఆసక్తి యజ్ఞనారాయణ మాష్టారి పాఠాలవలన ఏర్పడింది. తెల్ల దొరతనం, క్రిస్టియన్ పాఠశాల తీరు తెన్నులపై కోపంతో నాల్గవ తరగతిలోనే పాఠశాల చదువుకు స్వస్తి చెప్పి, స్వాతంత్ర్య ఉద్యమంలో చేరారు. దామరాజు పుండరీ కాక్షుడు, ఉన్నవ లక్ష్మి నారాయణల రచనలు వావిలాలను అమితంగా ప్రభావితం చేశాయి. స్వాతంత్ర్య ఉద్యమంలో తరువాత ప్రజా రంగంలో నిముషం తీరిక లేకుండా ఉన్న వావిలాల పెళ్ళి గురించి ఆలోచనే చేయలేదు. స్వరాజ్యం కోసం సర్వ సుఖాలను వదులుకున్న దేశభక్తుడు వావిలాల. మద్రాసులో ఆంధ్రప్రతికలో సబ్ ఎడిటర్‌గా ఉద్యోగంలో చేరారు. మహాత్మాగాంధీ పిలుపుకు ప్రేరేపితుడై ఉద్యోగానికి రాజీనామా చేసి గుంటూరు వచ్చారు. కొండా వెంకటప్పయ్య, దుగ్గిరాల గోపాలకృష్ణయ్య, ఉన్నవ లక్ష్మినారాయణ, స్వామి సీతారామ్‌లతో కలిసి ఆయన యడవల్లి వారి సత్రం కేంద్రంగా ఒక శిబిరాన్ని నిర్వహించారు. బ్రిటిష్ వారి నిషేధాజ్ఞలను సైతం ధిక్కరించి, గుంటూరులో ఉప్పు సత్యాగ్రహం నిర్వహించారు. సత్తెనపల్లిలో ఉప్పుసత్యాగ్రహం శిబిరం ఏర్పాటు చేయడానికి సన్నాహాలు చేస్తున్న తరుణంలో వేపా సుబ్రహ్మణ్యం, దుగ్గిరాల బలరామకృష్ణయ్య, వావిలాల గోపాలకృష్ణయ్య, వావిలాల రామశర్మ, డాక్టర్ భృగుబండ మృత్యుంజయుడులను అరెస్టు చేశారు. అనంతరం వారిని మంగళగిరి కోర్టులో హాజరు పరచగా, రాజమండ్రి జైలుకు పంపారు. రాజమండ్రి జైలు పరిస్థితులు అప్పట్లో ఎలా వుండేవో వావిలాల ఈ విధంగా తెలియజేసేవారు. యమభటులు ఎలా వుంటారో తెలియదుకాని, వారు సైతం చిత్రహింసలు ఎలా పెట్టాలి అనే విషయాన్ని రాజమండ్రి జైలు వార్డెన్ వద్ద నేర్చుకోవాల్సిందే. నాటి రాజమండ్రి జైలు వార్డెన్ నిరంకుశుడు. ఖైదీలను అకారణంగా కొట్టేవాడు. ఉదయం గంజి, మధ్యాహ్నం, సాయంత్రం భోజనం పెట్టేవారు. అన్నం దుర్వాసన రావడం, వాటిలో పురుగులు, మేకులు వుండేవి, రాజమండ్రి జైలులో జనం ఎక్కువ అవ్వడంతో వావిలాలతోపాటు కొంతమందిని 'కోరాపుట్' జైలుకు పంపారు. అక్కడ మంచినీళ్లు అముదం కన్నా చిక్కగా వుంటాయి. దోమలు స్వైర విహారం చేస్తుండేవి. ఆ జైలుకు వచ్చి మలేరియా వాతడని వారుండరనడంలో అతిశయోక్తి లేదు. జైళ్ళలో ఉన్నవారందరికి మలేరియా వచ్చింది. వావిలాలతోపాటు కొందరి పరిస్థితి తీవ్రంగా వుండడంతో వారిని తిరిగి రాజమండ్రి జైలుకు పంపారు. కొరాపుట్ నుంచి వీరిని రాజమండ్రికి తరలిస్తున్న సమయంలో రాజమండ్రి రైల్వేస్టేషన్‌లో మలేరియా కారణంగా వావిలాల సొమ్మసిల్లి పడిపోయారు. దీంతో వావిలాల మరణించాడని భావించిన బ్రిటిష్ పోలీసులు ఆయన్ని రైల్వేస్టేషన్‌లో వదిలి వెళ్ళారు. ఆ సమయంలో రైల్వే స్టేషన్‌లో ఉన్న కొందరు వావిలాలను ఆసుపత్రిలో చేర్చారు. అనంతరం ఆయన కోలుకొని మామూలు మనిషయ్యారు. బ్రిటిష్ పాలకులు ఎన్ని నిర్బంధాలు విధించినా లెక్కచేయకుండా మొక్కవోని ధైర్యంతో వావిలాల స్వాతంత్ర్య ఉద్యమంలో పాల్గొన్నారు.

**కోరా ఖద్దరు పంచ, లాల్చీ, ఖద్దరు ఉత్తరీయం ధరించి, ఖద్దరు సంచి చేత బట్టుకున్న నిండైన ఆరణాల తెలుగు దనంతో ఒక పలచని నిరాడంబర వ్యక్తి, ఆజన్మ బ్రహ్మచారి (రాజకీయంగా మాత్రం సంసారే). ఎప్పుడు తెలుగు ప్రజల గురించి ఆలోచించే నిస్వార్థపరుడు మన వావిలాల గోపాలకృష్ణయ్య.**

## నూలు మిల్లు తెరిపించడమే నిజమైన నివాళి

(ఆన్‌లైన్, సత్తెనపల్లి)

బడుగు వర్గాలకు బాసటగా నిలిచి వారికి ఉపాధి కల్పించడం కోసం అహర్నిశలు శ్రమించిన ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధుడు, పద్మభూషణ్ బిరుదాంకితుడు, సత్తెనపల్లి ముద్దుబిడ్డడు వావిలాల గోపాలకృష్ణయ్య. ఆయన జీవితాన్ని ఒకసారి పునరావలోకనం చేస్తే 1906లో సత్తెనపల్లి

(మిగతా 39లో)

# నూలు మిల్లు తెరిపించడమే నిజమైన నివాళి



సత్తెనపల్లి వావిలాల నగర్‌లోని వావిలాల స్మారక ఘాట్

(38వ పేజీ తరువాయి) లో జన్మించిన వావిలాల నాటి సమాజంలోని రుగ్మతలను దూరం చేయాలనే సదుద్దేశంతో ఎన్నో పోరాటాలు నడిపారు. సాధారణ వ్యక్తిత్వం కలిగి, అసామాన్యంగా జీవించిన వావిలాల 2003 ఏప్రిల్ 29న పరమపదించారు.

కుళ్ళు రాజకీయాలకు వ్యతిరేకంగా గాంధీ సంచితో ఎక్కడికైనా కాలినడకన పోవడం ఆయన నైజం. ఎంఎల్‌ఏగా ఉన్నా విలాస వంతమైన జీవితానికి అలవాటుపడక నేటి రాజకీయ రంగానికి తలమానికంగా నిలిచారనడంలో సందేహం లేదు. మద్యపాన నిషేధ ఉద్యమంలో అలుపెరగని పోరాటం సాగించి ఉద్యమాన్ని విజయవంతం చేశారు. స్వాతంత్ర్య పోరాటానికి సంబంధించిన కమిటీలకు సలహాదారునిగా, రథసారథిగా వ్యవహరించారు. 1952లో అప్పటి ప్రధాని పండిట్ జవహర్‌లాల్ నెహ్రూతో మాట్లాడి నాగార్జునసాగర్ ప్రాజెక్టు సాధనలో కీలకపాత్ర వహించారు.

### వావిలాల నిర్వహించిన పదవులెన్నో.....

1951లో శాంతి సంఘం రాష్ట్ర అధ్యక్షునిగా, ప్రాథమిక విద్యా కమిటీలో సభ్యునిగా, బేసిక్ ఆంధ్రా, వెంకటేశ్వర, ఉస్మానియా, నాగార్జున విశ్వవిద్యాలయాల సెనెట్ సభ్యునిగా పనిచేశారు. అంతేగాకుండా సోవియట్ యూనియన్‌లో జరిగిన శాంతి మహాసభలకు భారత ప్రతినిధిగా, అధికార బాషా కమిషన్‌కు ప్రథమ అధ్యక్షునిగా, ప్రపంచ తెలుగు మహాసభల నిర్వహకునిగా కూడా వావిలాల గోపాలకృష్ణయ్య పనిచేశారు. ముంబై పొట్టి శ్రీరాములు విశ్వ విద్యాలయంలో నిర్వహించిన అఖిల భారత తెలుగు మహాసభలకు ఆయన ప్రతినిధిగా పాల్గొన్నారు. ప్రముఖుల ప్రశంసలతో పాటు పలు పురస్కారాలు అందుకున్నారు.

### చరిత్ర సృష్టించిన గోపాలకృష్ణయ్య

1952లో ఏర్పడిన సత్తెనపల్లి శాసనసభ నియోజకవర్గానికి వరుసగా నాలుగుసార్లు స్వతంత్రఅభ్యర్థిగా ఎన్నికై వావిలాల చరిత్ర సృష్టించారు. 1952, 1955, 1962, 1967లో జరిగిన నాలుగు దఫాల ఎన్నికల్లో ఆయన ఘన విజయం సాధించారు. విచిత్రమైన విషయమేమిటంటే వావిలాల తరువాత 1972 నుంచి నేటి వరకు ఎంఎల్‌ఏగా పనిచేసిన ఏ ఒక్కరూ తిరిగి రెండవసారి గెలుపొందలేదు. శాసనసభ్యునిగా సత్తెనపల్లి ప్రాంత అభివృద్ధికి వావిలాల ఎనలేని కృషిచేశారు. గుంటూరు-మాచర్ల రైల్వే లైనును బ్రాడ్‌గేజ్‌గా మార్చడం, జూనియర్ కళాశాలకు సొంత భవనాల నిర్మాణానికి నిధులు సమకూర్చడం, సత్తెనపల్లి ప్రాంత యువతకు ఉపాధి కల్పించేందుకు శాతవాహన స్పిన్నింగ్ మిల్లును ఏర్పాటు చేయడం, సాగర్ కాలువల ప్రధాన కార్యాలయాలను సత్తెనపల్లిలో ఏర్పాటు చేయడం ఆయన చేసిన పనుల్లో ముఖ్యమైనవి.

### పద్మభూషణ్ పురస్కారం

కాకలు తీరిన పార్లమెంటేరియన్లు స్వర్గీయ పుచ్చలపల్లి సుందరయ్య, అచార్య ఎన్‌జి రంగావంటి నాయకులతో ప్రజా ప్రతినిధిగా పనిచేసిన వావిలాల అందరికీ ఆదర్శప్రాయుడుగా నిలిచారు. స్వలాభాపేక్ష లేకుండా నిస్వార్థంగా చేసిన సేవలను గుర్తించిన భారత ప్రభుత్వం పద్మభూషణ్ పురస్కారాన్ని అందించి వావిలాలను ఘనంగా సత్కరించింది. వావిలాల స్మృతికి చిహ్నంగా సత్తెనపల్లి రైల్వేస్టేషన్ రోడ్డులో పైలాన్ ఏర్పాటు చేశారు.

### నూలుమిల్లు తెరిపించడమే నిజమైన నివాళి

వావిలాల కలల సాకారమైన శాతవాహణ స్పిన్నింగ్ మిల్లు మూతపడం సత్తెనపల్లి ప్రాంతానికి ప్రధాన సమస్యగా పరిణమించింది. దానిని తిరిగి తెరిపించేందుకు ఇంతవరకు ప్రభుత్వం ఎటువంటి చర్యలు తీసుకోలేదు. అదేవిధంగా వావిలాల స్మృత్యర్థం సత్తెనపల్లిలో 70 లక్షల రూపాయలతో పార్కు ఏర్పాటు చేస్తామని అప్పటి ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు హామీ ఇచ్చినా ఇప్పటికీ అమలుకు నోచుకోకపోవడం గమనార్హం. మూతపడ్డ శాతవాహన స్పిన్నింగ్ మిల్లు తెరిపించడమే ప్రభుత్వం వావిలాలకు ఇచ్చే నిజమైన ఘననివాళి అని సత్తెనపల్లి ప్రాంత ప్రజలంటున్నారు.

# కాలచక్రంతో ప్రపంచ గుర్తింపు పొందిన అమరావతి

(ఆన్‌లైన్ - అమరావతి)

కాలచక్రంలో అనేక సంఘటనలు జరుగుతున్నప్పటికీ వాటిలో కొన్ని ప్రధాన సంఘటనలు ప్రజల హృదయాల్లో తీపిగుర్తులుగా మిగిలిపోతాయి. అలాంటిదే అమరావతిలో జనవరిలో జరిగిన కాలచక్ర మహాసభలు. అమరావతి మండల ప్రజలకు మరిచిపోలేని ఒక మహత్తర కార్యక్రమం గా, తిరిగి చూడగలమా అన్న ఆశను మిగిల్చిన మహాసభలతో అమరావతి ప్రపంచ స్థాయిలో గుర్తింపు పొందింది. క్రీస్తు పూర్వం 5వ

(మిగతా 50లో)



అమరావతిలోని పురావస్తు ప్రదర్శనశాల

## స్వాతంత్ర్య పోరాటంలో

# గుంటూరు వాసుల ఘనత

(ఆన్‌లైన్ - గుంటూరు)

దేశ స్వాతంత్ర్య పోరాటంలో గుంటూరు జిల్లాకు మహోజ్వల చరిత్ర వుంది. ఒంగోలు తాలూకా కలిపి ఒకప్పుడు గుంటూరు పెద్ద జిల్లాగా వుండేది. కాటన్ దొర నిర్మించిన బెజవాడ ఆనకట్టతో కృష్ణా వెస్ట్ బ్యాంక్ కాలువ కింద రేపల్లె, తెనాలి, బాపట్ల తాలూకాలలో కొంత భాగం సేద్యపు నీటి సౌకర్యంతో మాగాణి ప్రాంతమైతే, మిగతా ప్రాంతం మెట్ట. పెదనందిపాడు పన్నుల సహకార ఉద్యమం, పల్నాడుపుల్లరి సత్యాగ్రహోద్యమం, చీరాల పేరాల ఉద్యమం వంటి సంఘటనలు చారిత్రాత్మకమైనవి. కన్నెగంటి హనుమంతు కోరమీసం తిప్పిన జిల్లా. ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్య పట్టణ పౌరులందరినీ ఊరి పొలిమేరల్లో పూరిళ్లు వేసి, మకాం పెట్టించి పోరాటం నడిపిన జిల్లా. ఉన్నవవారి మాలపల్లె నవలకు రూపురేఖలు దిద్దిన కథావస్తువు ప్రసాదించిన జిల్లా. బసవరాజు అప్పారావు దేశభక్తి గేయాలకు ఉత్తేజం కలిగించిన జిల్లా. ఇలాంటి మహోన్నత సంప్రదాయాలకు వారసత్వం అందిపుచ్చుకుని కమ్యూనిస్టు, వామపక్ష ఉద్యమాలు పుట్టి పెరిగాయన్న విషయం గమనార్హం. ప్రతాప రామసుబ్బయ్య, జొన్నలగడ్డ రామలింగయ్య, ముక్తేవి మాధవాచారి, దుర్భాకృష్ణమూర్తి, పెండ్యాల లోకనాథం, పి.పార్థసారథి వంటి యోధానుయోధులు భారతీయోద్యమంలో జైళ్లకు వెళ్లారు. కాంగ్రెస్ నాయకత్వం అనుసరించే పోరాట పద్ధతుల మీద విసుగుచెందిన వీరికి జైళ్లలో కమ్యూనిస్టు, ఇతర విప్లకారులతో పరిచయాలు ఏర్పడ్డాయి. దీంతో వారు తొలి కమ్యూనిస్టులుగా ముందుకు వచ్చారు. పి.కృష్ణమూర్తి, పులుపుల వెంకటశివయ్య, తుమ్మల వెంకట్రామయ్య వంటి బెనారస్ విశ్వవిద్యాలయం విద్యార్థులు, విశ్వవిద్యాలయంలోనే కమ్యూనిస్టు భావాలను ఒంటబట్టించుకుని కార్యకర్తలుగా జిల్లాలో ప్రవేశించారు. కాకుమాను సుబ్బారావు, నండూరి ప్రసాదరావు, చదలవాడ పిచ్చయ్య, వాసిరెడ్డి శివలింగప్రసాద్, ఒంగోలు కామేశ్వరరావులు వీరికి స్థానికంగా తోడయ్యారు. టెర్రరిస్టు గ్రూపులతో సంబంధం వున్న అన్నాప్రగడ కామేశ్వరరావుకు కూడా నాటి వామపక్ష రాజకీయాలలో ప్రత్యేక పాత్ర వుంది. జిల్లాలో కమ్యూనిస్టు ఉద్యమానికి బీజాలు వేసిన మహనీయులు వీరే.

ఆర్థికంగా స్థోమత లేక పెళ్లికట్నంగా వచ్చిన నగలు, వెండి కంచాలు, చెంబులు, గ్లాసులు అమ్మి గుంటూరు బ్రాడీపేటలోని దయ్యాల మేడలో ఫ్రెండ్స్ హోం పేరుతో హోటలు పెట్టి తిండితోపాటు రాజకీయాలు కూడా వండిపెడుతూ కమ్యూనిస్టు ఉద్యమానికి పునాదులు నిర్మించారు. దానికి కార్యదర్శి పోలేపెద్ది నరసింహమూర్తి. హోటల్ దివాళా తీసిన తరువాత కొత్తపేటలో రూకయ్య హోటల్‌లో పెసరట్టు తిని, కాఫీ తాగిరావడంతో కార్యక్రమం ప్రారంభమైంది. రాత్రికి భోజనానికి ఇంటికి చేరే నిస్వార్థ కార్యకర్తలు. పోలేపెద్ది ఉన్న ఆస్తి హరించుకుపోగా, మలేరియా వ్యాధి సోకి సరైన వైద్యం లేక మరణించాడు. పుల్లారావు క్షయ వ్యాధి సోకి పుష్టికరమైన ఆహారం లేక మరణించాడు. విద్యార్థి ఉద్యమంలో పాత్రధారి ప్రభల కృష్ణమూర్తి వారి త్యాగాలే కమ్యూనిస్టు ఉద్యమానికి నీరుపోసి పెట్టి పోషించిన విషయం స్మరించుకుంటే శరీరం పులకరిస్తుంది. పోలేపెద్ది తరువాత జిల్లా కార్యదర్శిగా పులుపుల వెంకటశివయ్య బాధ్యత తీసుకున్నారు. కూలీలందరూ ఏకమైతే కూటికేమి కరువురా అన్న పెండ్యాల లోకనాథం గేయం, అన్యాయ కాలంబు దాపురించిందిపుడు, అందరము మేల్కోవాలండీ అన్న గరిమెళ్ల సత్యనారాయణ గేయం, ఆకలి మంటలచే మలమల మాడె అనాథలంతా లేవండోయ్ అన్న కవితల్ని పాడుతూ, సమావేశాలు ఏర్పాటుచేసి గుంటూరు జూట్ మిల్లు కార్మికుల్లోను, లాగుడు బండ్ల ముఠా కార్మికుల్లోను తెనాలి ప్రెస్ వర్కర్స్‌లో పనిచేస్తున్న సమయంలో గుంటూరు ఎసి కాలేజీలో డిటెన్షన్ విధానానికి వ్యతిరేకంగా 1937-38 సంవత్సరాల్లో రెండుసార్లు విద్యార్థులు సమ్మె చేశారు. శివయ్య నాయకత్వంలో అప్పట్లో విద్యార్థులుగా వచ్చిన అనేక మంది రైతు యువకులను వలవేసి పట్టారు. అదే సంవత్సరంలో కొత్తపట్నం, మంతెనవారిపాలెంలో వేసవి రాజకీయ పాఠశాలలు జరిగాయి. అఖిల భారత స్థాయీ కమ్యూనిస్టు నాయకులు అధ్యాపకులుగా వచ్చారు. రాష్ట్రంలోని ఇతర జిల్లాలకు చెందిన యువకులు కూడా ఈ పాఠశాలలకు హాజరయ్యారు. 1934-35 ప్రాంతంలో నిడుబ్రోలులో రంగా ఆధ్వర్యంలో రైతాంగ పాఠశాల జరిగింది.

బసవపున్నయ్య, నాళం నరసింహారావు, మోటూరి హనుమంతరావు, డివి అప్పారావు, వేములపల్లి శ్రీకృష్ణ, ఎల్‌బి గంగాధరరావు, మాదాల నారాయణస్వామి, టి.వెంకటేశ్వరావు, సియస్ నారాయణస్వామి, కొల్లా వెంకయ్య, కంఠంనేని వెంకటరత్నం, కనగాల కుటుంబరావు, గోవాడ నిరీక్షణరావు, ఆంజనేయశాస్త్రి మొదలగు వారు నాటి విద్యార్థి ఉద్యమం నుంచి కమ్యూనిస్టు సిద్ధాంతం వైపు ఆకర్షితులైనవారే. 1938లో (మిగతా 42వ పేజీలో)

# ఆంధ్రజ్యోతి నాల్గవ వార్షికోత్సవ శుభాకాంక్షలు


స్వర్గీయ రాజీవ్ గాంధి
మాజీ ప్రధాని


శ్రీమతి సోనియాగాంధి
ఎఐసిసి అధ్యక్షురాలు


డా॥ వై.ఎస్. రాజశేఖరరెడ్డి
రాష్ట్ర ముఖ్యమంత్రివర్యులు


శ్రీ కె. కేశవరావు
పిసిసి అధ్యక్షులు






అశేష ఆంధ్రుల అభిమాన
దినపత్రిక నాలుగు వసంతాలు
దిగ్విజయంగా పూర్తిచేసుకున్న

పార్టీ కార్యకర్తలకు, ప్రజలకు,
శ్రేయోభిలాషులకు దీపావళి, రంజాన్
శుభాకాంక్షలు తెలియజేస్తూ..
ఈ దీపావళి మీకు సకల శుభాలు
కలుగజేయాలని కోరుకుంటూ...

## రావి వెంకటరమణ

శాసనసభ్యులు, ప్రత్తిపాడు నియోజకవర్గం

# స్వాతంత్ర్యపోరాటంలో గుంటూరు వాసుల ఘనత

(40వ పేజీ తరువాయి)

కలకత్తాలో జరిగిన అఖిల భారత విద్యార్థి మహాసభకు బసవపున్నయ్య, హనుమంతరావు, శ్రీకృష్ణ, కంఠంనేని వెంకటరత్నంలు హాజరయ్యారు. విద్యార్థి సమ్మెలు, రాజకీయ పాఠశాలలు కమ్యూనిస్టు ఉద్యమంలో ఒక మలుపు తీసుకొచ్చాయి. గాంధీజీని బూర్జువా ఏజంటు అని, కాంగ్రెస్‌ని మతవాద సంస్థని, మతం మత్తుమందని ప్రచారం సాగించారు. కాంగ్రెస్ అధ్యక్షుడు బాబు రాజేంద్రప్రసాద్‌కు నల్లజెండాలతో స్వాగతం పలికారు. 1935లో జరిగిన అంతర్జాతీయ కమ్యూనిస్టు సంస్థ 7వ మహాసభలో వలస దేశాలలో కమ్యూనిస్టు కర్తవ్యాలను గురించి చర్చించారు. ఫాసిజాన్ని తుద ముట్టించేందుకు ప్రజా ఐక్య సంఘటనకు శక్తివంచన లేకుండా ప్రయత్నించాలని సమావేశం నిర్ణయించింది. దీంతో కమ్యూనిస్టులు తమ వైఖరి మార్చుకుని కాంగ్రెస్‌లో చేరి వామ పక్ష శక్తులను సమీకరించే ఒక వేదిక ఏర్పాటుచేయాలని నిర్ణయానికి వచ్చారు. వీరు సోషలిస్టులతో కలిసి, కాంగ్రెస్ సోషలిస్టు పార్టీని ఏర్పాటుచేశారు. దీనికి అనుబంధంగా వివిధ సంఘాల ఏర్పాటుకు కృషి జరిగింది. ఈ నేపథ్యంలో ఆంధ్రలో వ్యవసాయ, చేనేత, గీత పనివారల సంఘాలు ఏర్పడ్డాయి. గుంటూరులో జరిగిన కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ మహాసభకు జయప్రకాష్ నారాయణ, ఎస్ఎస్ బాట్లివాలా, ఎస్ఎ డాంగే తదితరులు హాజరయ్యారు. చీరాల ఐఎల్‌టిడి కార్మికుల సమ్మె సందర్భంగా జరిగిన పోలీసు కాల్పులపై మద్రాసు ప్రభుత్వం హార్విల్ విచారణాధి కారిగా నియమించింది. ఆ నివేదిక తప్పుల తడకగా వుండటంతో, నివేదికకు వ్యతిరేకంగా గుంటూరు వచ్చి రాజగోపాల చారికి నిరసన తెలిపారు. ఈ సందర్భంగా ప్రత్యేక రాష్ట్ర నినాదాలు వెలువడ్డాయి. చీరాల కార్మికుల సహాయార్థం కాంగ్రెస్, కమ్యూనిస్టులు కలిసి కన్యాశుల్కం నాటకం ప్రదర్శించి, ఆ నిధిని కార్మికులకు పంపారు. పల్లెకోన, దావులూరు, అనంతవరంలలో వ్యవసాయ కూలీ సంఘాలు ఏర్పడ్డాయి. చీరాల కార్మిక సంఘానికి ప్రధాన బాధ్యుడు పులుపుల వెంకటశివయ్య ఏకగ్రీవంగా ఎన్నికయ్యారు. 1939లో రెండో ప్రపంచ యుద్ధం ప్రారంభం అయింది. యుద్ధానికి వ్యతిరేకంగా కమ్యూనిస్టులు ప్రచా రం ప్రారంభించారు. దీంతో కమ్యూనిస్టు పార్టీని నిషేధించారు. యుద్ధ వ్యతిరేక ప్రచారంలో పాల్గొన్నవారిని అరెస్టు చేశారు. అప్పటికే స్వతంత్ర భారత్ అనే రహస్య పత్రికను నడుపుతుండేవారు. పత్రిక పంచుతున్నారనే నెపంతో మోటూరి హనుమంతరావు నడుపుతున్న స్టూడెంట్ ఎంపోరియంపై దాడిచేశారు. దీంతో అరెస్టులను తప్పించుకోడానికి జిల్లా నాయకత్వం రహస్యంగా పనిచేస్తూ వచ్చింది. అంతకు ముందే గోవాడలో జరిగిన సమావేశంలో బసవపున్నయ్య జిల్లా కార్యదర్శిగా ఎన్నికయ్యారు.

జిల్లాలో కార్మిక హక్కుల కోసం, వ్యవసాయ కూలీల కూలి పెంపు, బంజరు భూముల ఆక్రమణ, ఇళ్ల స్థలాలు, సాగునీటి సమస్యలు, బ్లాక్ మార్కెట్, లంచగొండితనాలకు వ్యతిరేకంగా నిరంతరం పోరాటాలు చేయడం ద్వారా కమ్యూనిస్టు పార్టీ పేద ప్రజల్లోకి చొచ్చుకుపోయింది. ఐక్య విద్యార్థి ఉద్యమంలో మాత్రం చీలిక వచ్చింది. సంస్కృత పునర్వికాస ఉద్యమం ఆంధ్రదేశాన్ని ఊపివేసేలాజరిగింది. జిల్లాలో నాజర్ బుర్రకథ దళం, బాపట్ల షాడోప్లే, అమృతలూరు లంబాడీ నృత్యం, మోటూరి ఉదయం మహిళా బుర్రకథ దళాలు పేరుపొందాయి. పిసి జోషి కేడర్‌లో ఉత్తేజం కల్గించేవారు. 1943లో అభ్యుదయ మహాసభ తెనాలిలో జరిగింది. గుంటూరులో విద్యార్థి, ట్రేడ్ యూనియన్ మహాసభలు జరిగాయి. గుంటూరు, చిలకలూరిపేట, చీరాలలో పొగాకు కార్మికుల ఉద్యమం బాగా విస్తరించింది. గ్రామాల్లో చిన్న గ్రంథాలయాలు నిర్వహించడమేగాక, గోడ పత్రికలు నడుపుతూ, మెగాఫోన్ ద్వారా రోజూ వార్తలు ప్రచారం చేసేవారు. పార్టీ సభ్యులు పలువురు తమ ఆస్తులను పార్టీకోసం త్యాగం చేశారు. ఈ కార్యక్రమాల ప్రవాహానికిఎదురీదవలసి వచ్చినా ఉద్యమం మాత్రం బాగా విస్తరించింది. ఆ రోజుల్లో గుంటూరులోని జిల్లా పార్టీ కార్యాలయంలో జిల్లా కేంద్ర బాధ్యులు, ప్రజా సంఘాల బాధ్యులు, వైజ్ఞానిక దళాల ముఖ్యులు తమ కుటుంబాలతో వుండేవారు. కమ్యూనిస్టు పార్టీ జిల్లాలో కాంగ్రెస్‌తోపాటు ఒక బలమైన రాజకీయ శక్తిగా అభ్యుదయవాదుల అభిమానాన్ని చూరగొంది. ఆజాద్ హిందుఫౌజ్‌పై విచారణ రద్దుచేయాలని ఉద్యమం, విద్యార్థి, పోస్టల్ ఉద్యోగుల సమ్మె, సంస్థాన ప్రజా పోరాటాలు, నౌకా సైనికుల తిరుగుబాటు జరిగాయి. ఈ ఉద్యమాలలో కమ్యూనిస్టు పార్టీ చొరవ చూపింది. ఈ ఉధృతికి తట్టుకోలేక బలహీనపడిన సామ్రాజ్యవాదులు దిగివచ్చి భారతదేశానికి స్వాతంత్ర్యం ఇవ్వడానికి అంగీకరించారు. కానీ దేశాన్ని విభజించారు. తెలంగాణా సాయుధ పోరాటం ప్రారంభమైంది. 1948లో కలకత్తాలో జరిగిన మహాసభలో దేశానికి సంక్రమించింది సంపూర్ణ స్వాతంత్ర్యం కాదని, అర్ధవలస రాజ్యమని, నెహ్రూ ప్రభుత్వం సామ్రాజ్యవాదుల బంటు అని, ఆ ప్రభుత్వాన్ని గద్దె దించాలని ప్రకటించింది. ఈ నేపథ్యంలో మన రాష్ట్రంలో ప్రకాశం ఆర్డినెన్స్ ప్రకటించారు. జిల్లాలో పార్టీ నాయకత్వం రహస్య (మిగతా 44వ పేజీలో)

# శత వసంతాల శోభలో... గుంటూరు జిల్లా

(ఆన్‌లైన్, గుంటూరు)

గుంటూరు జిల్లా సుసంపన్నమైనది. ప్రకృతి శోభలకు ఆలవాలమైనది. ఎత్తయిన కొండలు, కోన లు, లోయలు, సాంద్రారణ్యములు, ఖనిజాలు, తటాకాలు, పంట కాలవలు, నవధాన్యములు ఫలించు భూములు గల గుంటూరు జిల్లాలో కృష్ణానది ప్రవహించి పునీతము చేయుచున్నది. ఇంతటి విశిష్టతను సంతరించుకున్న గుంటూరు జిల్లా 1904 అక్టోబరులో ఏర్పడింది. గత ఏడాది అక్టోబరు మాసంతో జిల్లా ఏర్పడి వందేళ్లు పూర్తయింది. గుంటూరు జిల్లాను క్రీస్తు పూర్వము నాల్గవ శతాబ్ది నుంచి నేటి వరకు గణతంత్ర రాజులు, శాతవాహనులు, ఇక్ష్వాకులు, ప్రాచీన పల్లవులు, ఆనంద గోత్రికులు, బృహత్పలాయనులు, విష్ణుకుండినులు, దుర్జయులు, తూర్పు చాళుక్యులు, చాళుక్య చోళులు, మాండలిక రాజులు, కాకతీయులు, రెడ్డిరాజులు, విజయనగర పాలకులు, కుతుబ్‌షాహీలు, మొగలులు, ఆసఫ్ జాహీలు, బ్రిటీష్ పాలకులు, ప్రజా ప్రతినిధులు పాలిస్తూ వచ్చారు. భూ విజ్ఞాన పరంగా చారిత్రక ప్రాధాన్యతను సంతరించుకుని ప్రముఖ విద్యాకేంద్రంగా విరాజిల్లుతున్న గుంటూరు జిల్లాకు తూర్పున బంగాళా ఖాతం, పశ్చిమాన మహబూబ్‌నగర్, ఉత్తరాన నల్గొండ, ఉత్తర ఈశాన్యాన కృష్ణాజిల్లాతో ఆవరించబడి వుంది. 1904 అక్టోబరు 1న గుంటూరు కేంద్రంగా జిల్లా ఏర్పడగా, ఆ తరువాత 1985 మే నెలలో ఈ జిల్లా 57 రెవిన్యూ మండలాలుగా విభజించబడింది. 11వేల 391 చదరపు కిలోమీటర్లమేర విస్తరించిన ఈ జిల్లాలో చాలా భాగం తూర్పు, ఆగ్నేయదిశగా వాలివున్న విశాలమైన ప్రదేశం, అక్కడక్కడా అవశిష్ట పర్వతాలతో అంతర్లీనమై వుంది. పశ్చిమాన శ్రీశైలం పీఠభూమితోను, తూర్పు వైపున డెల్టా అవక్షేపాలతోను, కృష్ణానది నీటి ప్రవాహ మార్గాలతోను కూడి వుంది. తూర్పు కనుమలతో పరివేష్టితమైన ఈ జిల్లాలో నల్లమల, వెంకటాయపాలెం, కొండవీడు మొదలైనవి ప్రధాన పర్వత శ్రేణులు. సానుకొండ, కాకిర్ల కొండలను ఎత్తైన శిఖరాలుగా పేర్కొనవచ్చు. జిల్లాలో ఉత్తరాన దాదాపు 250 కిలోమీటర్ల పొడవునా ప్రవహించే కృష్ణానది గుంటూరు, కృష్ణాజిల్లాలను విభజించే సరిహద్దుగా వుంది. కృష్ణానది పల్నాడు ప్రాంతంలోని గని కొండ వద్ద జిల్లాలో ప్రవేశించి ఉత్తర, తూర్పు సరిహద్దులను చుడుతూ ప్రవహిస్తోంది. మున్నేరు, చంద్రవంక, నాగులేరు కృష్ణానదికి ముఖ్య ఉపనదులు కాగా గుండ్లకమ్మ ఈ జిల్లా గుండా ప్రవహించే మరో ముఖ్యమైన నది. నాగులేరు వినుకొండ ప్రాంతంలో కొండల్లో పుట్టి ఉత్తరంగా పల్నాడులోకి ప్రవేశించి కృష్ణానదిలో కలుస్తుంది. చంద్రవంక పల్నాటి గుండా ఉత్తరంగా ప్రవేశించి కృష్ణానదిలో కలుస్తున్నది. గుంటూరు జిల్లాలో నాగార్జునసాగర్‌కు 15 కిలోమీటర్ల దూరంలో మాచర్ల, సాగర్ రహదారిపై ఏడో మైలువద్ద ఎత్తిపోతల జలపాతం వుంది.

జిల్లాలో వ్యవసాయానికి అనుకూలించే నాలుగు రకాలైన భూములున్నాయి. నల్లరేగడి, ఎర్రనేలలు, ఇసుక, ఒండ్రు నేలలున్నాయి. నల్లరేగడి నేలలకు ప్రకృతి సిద్ధంగా వాటికి అవే సొంత ఎరువును తయారు చేసుకుని సారవంతమయ్యే గుణం వుంది. గుంటూరు జిల్లాలోని శిలావిన్యాసాలు ఆర్థిక ప్రాధాన్యత కలిగిన అనేక ఖనిజ నిక్షేపాలకు నిలయమై అనేక ఖనిజ ఆధార పరిశ్రమలు నెలకొల్పడానికి అవకాశం కల్పించాయి. ఈ జిల్లాలో లభించే ఖనిజాల్లో వజ్రాలు, సున్నపురాయి, గాజు - ఇసుకలు, రాగి–సీసం–జింకు నిక్షేపాలు, క్వార్ట్జ్ కట్టడపు రాళ్లు, గృహాలంకరణ శిలలు ముఖ్యమైనవి. కృష్ణానది పరీవాహక ప్రాంతమైన అచ్చంపేట మండలం, కోళ్లూరు గ్రామ సమీపాన వున్న గ్రావెల్ క్వారీల్లో అతి విలువైన వజ్రాలను వెలికి తీసినట్లు భూవిజ్ఞాన శాస్త్రవేత్తల వలన తెలుస్తోంది. ప్రపంచ ప్రసిద్ధి చెందిన కోహినూర్ వజ్రం ఇక్కడనే లభించింది. ఈ గ్రామంతో పాటు వెంకటాయపాలెం, అచ్చంపేట, సారంగపల్లి, మాడుగుల, మల్లవరం గ్రామాల్లో కూడా వజ్రాలు లభిస్తుంటాయి. వర్షాకాలంలో నేటికీ ఈ ప్రాంతంలో వజ్రాన్వేషణ ప్రక్రియ కొనసాగుతుండటం విశేషం.

సున్నపురాతి నిక్షేపాలు కూడా జిల్లాలో అధికంగా వున్నాయి. రాష్ట్రంలో ఉత్పత్తి చేయబడే సున్నపురాతిలో 25 శాతం జిల్లాలోనే ఉత్పత్తి చేయడం ప్రధానమైన అంశం. సిమెంటు, పంచదార, టెక్స్‌టైల్,కాగితం, ఔషధాల తయారీ పరిశ్రమల్లో వినియోగించే అనేక శ్రేణుల సున్నపురాళ్లు ఈ జిల్లాలో విస్తరించివున్నాయి. దాచేపల్లి, నడికుడి, పిడుగురాళ్ల, సీతారామ్‌పురం, మాచర్ల, పిల్లుట్ల, పొందుగల తదితర ప్రాంతాల్లో విస్తరించివున్న సున్నపురాళ్లను సిమెంటు పరిశ్రమలో ఉపయోగిస్తున్నారు. దాదాపు 2455 మిలియన్ టన్నుల సున్నపురాతి నిల్వలు ఈ ప్రాంతంలో వున్నాయనేది భూవిజ్ఞాన శాఖ అంచనా.

## స్వాతంత్ర్యపోరాటంలో గుంటూరు వాసుల ఘనత

(42వ పేజీ తరువాయి)

జీవితం గడుపుతూ, అరెస్టు కాకుండా జాగ్రత్త పడింది. నిషేధం వున్న వ్యవసాయ, కార్మిక, యువజన మహాసభలు జరిపి, ఊరేగింపులు, ప్రదర్శనలు నిర్వహించారు. జూపూడిలో చర్చి భూములు కౌలు చేస్తున్న వ్యవసాయ కూలీలను తొలగించడంతో, ఆందోళన జరిగింది. ఈ సందర్భంగా జరిగిన ప్రదర్శనపై పోలీసులు జరిపిన కాల్పులలో జెట్టి సుబ్బారావు మరణించాడు. 43 ప్రదేశాలలో పాలేళ్ల సమస్యలపై ఆందోళన జరిగింది. దీంతో వారు పది నుంచి 30 రోజుల వరకు సెలవు, 25 నుంచి 150 రూపాయల వరకు జీతాలు పొందడం జరిగింది.కూలీ రేట్లపై తెనాలి, రేపల్లె, బాపట్ల తాలూకాలలో తీవ్రస్థాయిలో ఆందోళనలు, సమ్మెలు జరిగాయి. 1952లో జరిగిన సాధారణ ఎన్నికల్లో పాల్గొనాలని పార్టీ నిర్ణయించింది. జిల్లాలోని 18అసెంబ్లీ స్థానాలలో మూడు కాంగ్రెస్ గెలుచుకోగా, మిగతా 15 కమ్యూనిస్టు, కమ్యూనిస్టు బలపరిచిన అభ్యర్థులు గెలుపొందారు. 1953లో కర్నూలు రాజధానిగా ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రం ఏర్పడింది. ప్రొహిబిషన్, బంజరు కౌలుదారీ సమస్యలపై సత్యాగ్రహం జరిగింది. జిల్లాలో వేలాది మంది జైలుకు వెళ్లారు. 1955లో జరిగిన ఎన్నికల్లో మాచర్ల మినహా అన్ని స్థానాల్లో పార్టీ ఓడిపోయింది. దీంతో పార్టీలో అంతర్గత విబేధాలు తలెత్తాయి. 1962లో జరిగిన పార్టీ మహాసభలో రెండు విడి విడి విధాన పత్రాలు మీద చర్చ జరిగినా చివరకు అజయ్‌ఘోష్ ప్రతిపాదన మేరకు విధానం ఏకగ్రీవంగానే రూపొందింది. ఈ విధాన ప్రాతిపదికన బెంగుళూరులో సమావేశమై, 1962 ఎన్నికలకు కార్యాచరణ ప్రణాళిక రూపొందించింది. కాంగ్రెస్ గుత్తాధికారాన్ని దెబ్బతీయడానికి గట్టి ప్రయత్నాలు చేయాలని విజయవాడ పార్టీ శాఖ పిలుపునిచ్చిందని చీలిపోయిన పార్టీ (సి పి ఐ ఎం) మహాసభ నివేదికలో పేర్కొన్నదానిని బట్టి, పాక్షికంగానే విధానాన్ని అర్థం చేసుకున్నారని తెలుస్తోంది.

అందుకు స్వతంత్ర పార్టీలో జిల్లావ్యాప్తంగా సీట్ల సర్దుబాటుకు సిద్ధమయ్యారు. ఈ విధానాన్ని కొందరు నాయకులు, కేడర్‌తోపాటురాష్ట్ర నాయకత్వం అడ్డు తగిలింది. దీంతో కొందరు స్వతంత్ర అభ్యర్థులను కలుపుకుని కాంగ్రెస్, స్వాతంత్ర్య పార్టీలకు వ్యతిరేకంగా ముక్కోణపు పోటీకి దిగడం జరిగింది. ఎన్నికలలో కమ్యూనిస్టు పార్టీకి అత్యధిక సీట్లువచ్చాయి. 1962లో చైనాతో సరిహద్దుఘర్షణతో పార్టీలో విబేధాలు తీవ్రమై, 1964లో పార్టీ చీలిపోయింది. జిల్లా నాయకత్వంలో ఎక్కువమంది మార్క్సిస్టు పార్టీలోకి వెళ్లినా, కొద్దిమంది జిల్లా నాయకులు అధిక భాగం తాలూకా నాయకులు, కేడర్ సిపిఐ లోనే వున్నారు. శాసనసభ్యులలో సగం మంది సిపిఐలో వున్నారు. జిల్లాలో గుంటూరు, చిలకలూరిపేట, చీరాల వంటి బలమైన కేంద్రాలలు సిపిఐతో వున్నాయి. గుంటూరు పట్టణం, తాలూకా, పల్నాడు, నరసరావుపేట, ఒంగోలులో మెజార్టీ సిపిఐలో వుంది. రేపల్లె, తెనాలి, బాపట్ల, సత్తెనపల్లి తాలూకాలలో అధిక సంఖ్య సిపి ఎం వైపు వెళ్లారు. పార్టీలో చీలిక రావడంతో కమ్యూనిస్టులకు కమ్యూనిస్టులే శత్రువులయ్యారు. 1967 ఎన్నికల్లో ఒకరిపై ఒకరు జిల్లా అంతటా పోటీకి దిగి ఓటమిపాలయ్యారు.

# ఆంధ్రజ్యోతికి శుభాకాంక్షలు








**శ్రీమతి సోనియాగాంధీ**
ఎఐసిసి అధ్యక్షురాలు



**డా॥ వై.ఎస్. రాజశేఖరరెడ్డి**
రాష్ట్ర ముఖ్యమంత్రివర్యులు



**శ్రీ రాయపాటి సాంబశివరావు**
పార్లమెంట్‌సభ్యులు, గుంటూరు



**డా॥ రాయపాటి శ్రీనివాసరావు**
పిసిసి ప్రధానకార్యదర్శి



**శ్రీ జె.డి. శీలం**
రాజ్యసభసభ్యులు

కొత్తనెత్తుటి అలజడితో మా అక్షరం మీ ఆయుధం అంటూ పత్రికా రంగంలో సంచలనం సృష్టిస్తూ వార్తలలో నవ్యత, సవ్యతకు నాంది పలుకుతూ అంచెలంచెలుగా అభివృద్ధి చెందుతూ తెలుగు పాఠకుల ఆదరాభిమానాలు చూరగొనుతున్న **ఆంధ్రజ్యోతి** మూడు వసంతాలు పూర్తిచేసుకుని దిగ్విజయంగా పయనిస్తున్న సందర్భంగా పత్రికా యాజమాన్యానికి, పాఠకులకు, సిబ్బందికి నియోజకవర్గ ప్రజలకు, కాంగ్రెస్ పార్టీ నాయకులు మరియు కార్యకర్తలకు, అభిమానులకు నా హృదయపూర్వక శుభాకాంక్షలు ...

★ ముఖ్యమంత్రి డా॥ వైఎస్ నాయకత్వంలో రాష్ట్రంలో రైతుల సంక్షేమానికి అనేక కార్యక్రమాలు చేపట్టడం ★ రాజీవ్ పల్లెబాట సందర్భంగా ముఖ్యమంత్రి వైఎస్ ఇచ్చిన హామీలు నెరవేర్చుట ★ ఉచిత విద్యుత్ అమలుకు అందరూ సహకరించాలి

సదా ప్రజాసేవలో

# డి. మాణిక్య వర ప్రసాదరావు

## శాసనసభ్యులు, తాడికొండ

# అంతర్జాతీయ చదరంగంలో జిల్లా మణిదీపాలు

(గుంటూరు - ఆన్‌లైన్ క్రీడాప్రతినిధి)

క్రీడారంగంలో చెస్ ప్రత్యేక ప్రాధాన్యతను సంతరించుకుంది. మానవుడి మేధస్సుకు పదునుపెట్టి అతనిలో వ్యూహాత్మకంగా మెరుపు లాంటి ఆలోచనలు రేకెత్తించే క్రీడగా చెస్‌ను అభివర్ణిస్తున్నారు. పూర్తిగా యుద్ధతంత్రం ఇమిడి వున్న ఈ క్రీడలో పోటీపడే ఇద్దరు క్రీడాకారులు తమ మెదడుకు పూర్తిగా పదును పెట్టి ఆడుతారు. క్రీడాకారుడి మేధాశక్తికి అగ్నిపరీక్ష వంటిది చెస్ క్రీడ. ఈ చెస్ క్రీడలో అయిదుగురు గుంటూరు జిల్లా బాల,బాలికలు అంతర్జాతీయ ఖ్యాతి గడించడం గుంటూరు క్రీడారంగం మరువలేని విషయం. గుంటూరు క్రీడారంగ చెస్ పుటల్లో పి.హరికృష్ణ, డి.హారిక, జి.రోహిత్‌లు సాధించిన ఘనతను సువర్ణాక్షరాలతో లిఖించవచ్చు.

## పెంటేల హరికృష్ణ



సామాన్య రైతు కుటుంబంలో జన్మించిన హరికృష్ణ అతి స్వల్ప వ్యవధిలోనే 100 అంతర్జాతీయ చెస్ పోటీలలో పాల్గొన్నారు. ప్రస్తుతం ప్రపంచంలో 97వ ర్యాంకు లో నిలిచారు. హరికృష్ణ ఎల్లో పాయింట్లు 2612గా ఇటీవల ఫైడ్ ప్రకటించారు.

### సాధించిన టైటిల్స్

2000 సంవత్సరంలో ఇస్తాంబుల్ చెస్ ఒలింపియాడ్‌లో మొదటి జీఎం నార్మ్‌ని 2001 జనవరి నెదర్లాండ్‌లో జరిగిన కోరస్ ఇంటర్నేషనల్ చెస్ టోర్నీలో రెండో జీఎం నార్మ్‌ని, కోల్‌కత్తాలో జరిగిన ఆసియా వ్యక్తిగత చెస్ ఛాంపియన్‌షిప్ పోటీల్లో మూడవ జీఎం నార్మ్‌ని సాధించాడు. ఇటీవల గ్రీస్‌లో జరిగిన ఫైడ్ సమావేశంలో హరికృష్ణ సాధించిన గ్రాండ్ మాస్టర్ టైటిల్‌ను ఖాయపరచారు. 1996 స్పెయిన్‌లో జరిగిన ప్రపంచ యువ చెస్ పోటీల్లో (అండర్-10) బంగారు పతకం సాధించారు. 1997లో జరిగిన సంగ్లీ ఇంటర్నేషనల్ కామన్‌వెల్త్ చాంపియన్‌షిప్ పోటీల్లో (అండర్-14) బంగారు పతకం, టెహ్రాయిన్‌లో జరిగిన ఆసియన్స్ వార్ చెస్ చాంపియన్‌షిప్ (అండర్-14) పోటీల్లో బంగారు పతకం, టెహ్రాన్‌లో జరిగిన ఏషియన్ జూనియర్ (అండర్ 20) పోటీల్లో సిల్వర్ మెడల్ సాధించారు. లండన్‌లో జరిగిన కామన్‌వెల్త్ చెస్ ఛాంపియన్‌షిప్ పోటీల్లో బంగారు పతకం సాధించారు. 2004 దుబాయ్‌లో జరిగిన అంతర్జాతీయ చెస్ పోటీల్లో సిల్వర్ మెడల్ గెలుచుకున్నారు.

## ద్రోణవల్లి హారిక



ఆసియాలో బాలికల విభాగంలో అతి చిన్న వయస్సులోనే ఉమెన్ ఇంటర్నేషనల్ మాస్టర్ హోదా, ఉమెన్ గ్రాండ్ మాస్టర్ హోదాలు సాధించిన ఘనత గుంటూరు క్రీడాకారిణి ద్రోణవల్లి హారికకు దక్కింది.

### సాధించిన అంతర్జాతీయ టైటిల్స్

2003 ముంబాయిలో జరిగిన బాలికల కామన్‌వెల్త్ చాంపియన్‌షిప్‌లో బంగారు పతకం గెలుచుకుంది. అవే పోటీల్లో మహిళా విభాగంలో రజత పతకం సాధించింది. ఇక్కడే ఉమెన్ గ్రాండ్‌మాస్టర్ నార్మ్, పురుషుల ఇంటర్నేషనల్ నార్మ్ సంపాదించింది. 2003 కోజికోడ్‌లో జరిగిన ఆసియా ఉమెన్ చాంపియన్‌షిప్‌లో రజత పతకం గెలుచుకుంది. 2004 ముంబాయిలో జరిగిన కామన్‌వెల్త్ అండర్ 18 బాలికల విభాగంలో బంగారు పతకం గెలుచుకుంది. ఈ పోటీలలో ఉమెన్ గ్రాండు మాస్టర్ హోదా సాధించి ఆసియాలో అతి చిన్న వయస్సులో ఉమెన్ గ్రాండ్ మాస్టర్ హోదాను సాధించిన క్రీడాకారిణిగా నమోదైంది. 2002 టెహ్రాన్‌లో జరిగిన అండర్-12 బాలికల ఏషియన్ ఛాంపియన్‌షిప్‌లో బంగారు పతకం గెలుచుకుంది. 2000 సంవత్సరం స్పెయిన్‌లో జరిగిన అండర్-10 బాలికల ప్రపంచ యూత్ చెస్ పోటీల్లో బంగారు పతకం సాధించింది. 1999 నుంచి 2004 వరకు జాతీయ పోటీలలో హారిక పాల్గొని పతకాలు సాధించింది. 2004 సంవత్సరం అక్టోబరు 12 నుంచి స్పెయిన్‌లో జరిగే చెస్ ఒలింపియాడ్‌లో భారత మహిళా జట్టు తరపున పాల్గొంటున్నది.

## గోగినేని రోహిత్



ఆంధ్రప్రదేశ్ చెస్ రంగంలో తన సహజ శైలిలో ఆడి అంతర్జాతీయ స్థాయికి ఎదిగిన మరో గుంటూరు బాలుడు గోగినేని రోహిత్ అని చెప్పవచ్చు. చెస్ కుటుంబంలో జన్మించిన రోహిత్ తన తండ్రి రామారావు శిక్షణలో చెస్ శిక్షణ పొందాడు. ముంబాయిలో జరిగిన కామన్‌వెల్త్ చెస్ ఛాంపియన్‌షిప్‌లో, జోధపూర్‌లో జరిగిన ఆసియా చెస్ ఛాంపియన్‌షిప్‌లలో అండర్ 14 విభాగంలో స్వర్ణ పతకాలు రోహిత్ గెలుచుకున్నాడు. రాజస్థాన్‌లోని బికనీర్‌లో జరిగిన ఏషియన్ యూత్ చెస్ ఛాంపియన్‌షిప్ పోటీలలో కాంస్య పతకం సాధించాడు. అహ్మదాబాద్‌లో జరిగిన అండర్ 10 బాలుర విభాగంలో, ఇరాన్‌లోని టెహారాన్‌లో జరిగిన అండర్ 12 బాలుర విభాగంలో జరిగిన ఏషియన్ యూత్ చెస్ ఛాంపియన్‌షిప్ పోటీలలో రజత పతకం పొందాడు. మద్రాసులో జరిగిన ఓఎన్‌జిసి అంతర్జాతీయ రేటింగ్ చెస్ పోటీలలో పాల్గొని ప్రఖ్యాత క్రీడాకారులపై విజయం సాధించి అంతర్జాతీయ రేటింగ్ సాధించాడు.

## కెఎస్ శ్రీకర్



అంతర్జాతీయ చెస్ పోటీలకు గుంటూరు అందించిన ఆణిముత్యం శ్రీకర్. విజయవాడలో జరిగిన అంతర్జాతీయ ఫైడ్ రేటింగ్ చెస్ టోర్నమెంటులో పాల్గొని అద్భుత ప్రతిభ చూపాడు. అదే సంవత్సరం విజయవాడలో జరిగిన అంతర్జాతీయ ఫైడ్ రేటింగ్ ఆల్ ఇండియా ఓపెన్ చెస్ టోర్నమెటులో స్పెషల్ ప్రైజు పొందాడు. జంషెడ్‌పూర్‌లో జరిగిన టాటా ఇంటర్నేషనల్ టోర్నమెంటులో విశేష ప్రతిభ చూపి కాంస్య పతకం పొందాడు. హైదరాబాద్‌లో జరిగిన సౌత్‌జోన్ టోర్నమెంటులో బంగారు పతకం గెలుచుకున్నాడు. తండ్రి కె.త్రినాధరావు, చెస్ కోచ్ జి.శ్రీనివాసరావు ప్రోత్సాహంతో చెస్ క్రీడలో అడుగుపెట్టిన శ్రీకర్ తన మేధాశక్తిని చక్కగా ఉపయోగించి రాష్ట్ర, జాతీయ పోటీల్లో విజయపరంపరతో ముందంజ వేశారు.

## కె.లక్ష్మి ప్రణీత



గుంటూరుకు చెందిన మరొక క్రీడాకారిణి కె.లక్ష్మిప్రణీత జాతీయ, అంతర్జాతీయ పోటీలలో విజయాలు సాధిస్తూ అంచెలంచెలుగా పైకి వస్తున్నది. ముంబాయిలో జరిగిన కామన్‌వెల్త్ చెస్ పోటీలలో అండర్-12 బాలికల విభాగంలో బంగారు పతకం గెలుచుకుంది. కోజికోడ్‌లో జరిగిన ఆసియా యూత్ చెస్ ఛాంపియన్‌షిప్ పోటీలలో అండర్ 12 బాలికల విభాగంలో గోల్డ్ మెడల్ సాధించింది. జాతీయ చెస్ క్రీడాకారుడు జి.రామకృష్ణ దగ్గర శిక్షణ పొందుతున్న లక్ష్మిప్రణీత రాష్ట్ర, జాతీయ స్థాయి పోటీలలో విజయపరంపరలతో అనేక పతకాలు సాధించింది. ఈ క్రీడాకారుల్ని అంతర్జాతీయ చెస్ రంగానికి జిల్లా అందించిన వజ్రాలుగా చెప్పవచ్చు. భవిష్యత్తులో జరగనున్న పలు పోటీలలో పాల్గొని విజయాలు సాధించి రాష్ట్రానికి, జిల్లాకు కీర్తి ప్రతిష్టలు తీసుకురావాలని ఆశిద్దాం.

# అక్షరజ్యోతి 'ఆంధ్రజ్యోతి'కి అభినందనలతో...


శ్రీమతి సోనియాగాంధి
ఎఐసిసి అధ్యక్షురాలు


శ్రీ వై.ఎస్. రాజశేఖరరెడ్డి
రాష్ట్ర ముఖ్యమంత్రివర్యులు


శ్రీ కెవిపి రామచంద్రరావు
రాష్ట్ర ప్రభుత్వ సలహాదారు


శ్రీ కె. కేశవరావు
పిసిసి అధ్యక్షులు


శ్రీ తాడిశెట్టి వెంకటరావు
శాసనసభ్యులు, గుంటూరు-2






ప్రజాపత్రికగా ఎనలేని అభిమానాన్ని సంపాదించుకున్న **'ఆంధ్రజ్యోతి'** దినపత్రిక అభివృద్ధి దిశలో పయనిస్తూ **4** వసంతాలు పూర్తి చేసుకున్న శుభతరుణంలో **'ఆంధ్రజ్యోతి'** యాజమాన్యానికి, సిబ్బందికి మా హృదయపూర్వక శుభాకాంక్షలు.

పార్టీ కార్యకర్తలకు, ప్రజలకు, శ్రేయోభిలాషులకు దీపావళి, రంజాన్ శుభాకాంక్షలు తెలియజేస్తూ.. ఈ దీపావళి మీకు సకల శుభాలు కలుగజేయాలని కోరుకుంటూ...

## తాడిశెట్టి మురళీమోహన్
డిప్యూటీ మేయర్, గుంటూరు

## భువిలో వెలసిన కైలాసం

# జాగర్లమూడి సంగమేశ్వరాలయం


సంగమేశ్వరాలయం. ఇన్‌సెట్‌లో స్వామివారి మూలవిరాట్

(ఆన్‌లైన్, తెనాలి)

జిల్లాలో చరిత్ర ప్రసిద్ధి గాంచిన దేవాలయాలలో సంగం జాగర్లమూడి సంగమేశ్వరాలయం ఒకటి. కొన్ని ఉప నదులు సంగం జాగర్లమూడి సమీపాన తుంగభద్రలో సంగమించడం వల్ల ఇది సంగమ క్షేత్రంగా ప్రసిద్ధికెక్కింది. భువిలో అవతరించిన కైలాసంగా పేర్కొనబడిన సంగమేశ్వరాలయానికి విశిష్ట చరిత్ర ఉంది. పూర్వం గూని గోవిందు అనే బ్రాహ్మణునికి సాక్ష్యం చెప్పేందుకు కాశీ క్షేత్రం నుండి సాక్షాత్తు విశ్వేశ్వరుడు ఈ ప్రాంతానికి వచ్చినట్లు చరిత్ర చెబుతోంది. ఆ విశ్వేశ్వరుడే సంగమేశ్వరునిగా సంగం జాగర్లమూడిలో వెలిసినట్లు పురాణ ప్రసిద్ధి. ఇక్కడ సంగమేశ్వరుడు బాలా త్రిపుర సుందరీ సమేతుడై ప్రధాన దేవతగా పూజలందుకుంటున్నాడు. సంగమేశ్వరునికి దక్షిణ భాగాన వీరభద్రస్వామి, ప్రక్కనే పాపవినాశేశ్వర స్వామి, పార్వతీదేవి కొలువుదీరి ఉన్నారు. ద్వాపర యుగాంతంలో కౌశాంబి పట్టణంలో చంద్ర వంశంలో జన్మించిన హరిస్వామి అనే క్షత్రియుడు ఆ జన్మలో పాప ఫలం కారణంగా మరు జన్మలో గూని గోవిందు అనే బ్రాహ్మణోత్తమునిగా జన్మించి కాశీ విశ్వేశ్వరుడు, భావన్నారాయణ స్వామిని తనకు సాక్ష్యం ఇవ్వమని కాశీలో తపస్సు చేశాడు. తపస్సు ఫలితంగా కాశీ విశ్వేశ్వరుడు, భావన్నారాయణ స్వామి గోవిందుకు సాక్షాత్కరించి అతని వెంట వచ్చారు. గోవిందును వెనుదిరిగి చూడవద్దని ఆదేశించినా, అతను సంగం జాగర్లమూడి సంగమ ప్రదేశంలో వెనుదిరిగి చూడటంతో సంగమేశ్వరుడు అక్కడే నిలిచిపోయి కలియుగంలో పూజలు అందుకుంటున్నాడు. సంగమేశ్వరుని వెనుక వస్తున్న భావన్నారాయణ స్వామి పొన్నూరులో వెలిసి పూజలందుకుంటున్నాడని ప్రతీతి. సంగమేశ్వరుని ఆనతి మేరకు జాగర్లమూడి వాసులు దేవాలయ మండపాలను నిర్మించగా అత్రి మహర్షి శివలింగ ప్రతిష్ట చేశారు. అప్పటి నుండి సంగమేశ్వర స్వామి ప్రజల పూజలందుకుంటూ సంగం జాగర్లమూడిలో కొలువుదీరాడు. రాచూరు జమిందార్లు ఈ ఆలయానికి నిత్య ధూప, దీప, నైవేద్యాల నిమిత్తం భూములను ఈనాములుగా ఇచ్చారు. సంగం జాగర్లమూడికి చెందిన కొత్త వంశస్థులు చాలా కాలం ధర్మకర్తలుగా వ్యవహరించి దేవస్థానంలో నూతన నిర్మాణాలు జరిపించారు. స్వామి పార్శ్వ భాగంలో త్రిపుర సుందరీ దేవి విగ్రహాన్ని ప్రతిష్టించారు. నవగ్రహ దేవాలయాలు నిర్మించి నవగ్రహ ప్రతిష్ఠగావించారు. ఏటా మహాశివరాత్రి, విజయదశమి, ఉగాది పర్వదినాలలో ఇక్కడ వైభవంగా ఉత్సవాలు నిర్వహిస్తున్నారు. కార్తీక మాసంలో నిత్య సమారాధనలు జరుగుతున్నాయి.

# వాలీబాల్ పుట్టిల్లు గుంటూరు

(గుంటూరు, ఆన్‌లైన్ స్పోర్ట్స్)

వాలీబాల్ చరిత్ర పుటల్లో గుంటూరు జిల్లాకు ప్రముఖ స్థానం వుంది. ఆంధ్రప్రదేశ్‌లోనే వాలీబాల్ ఆటకు గుంటూరు పుట్టినిల్లు వంటిది. ఎంతోమంది ఆటగాళ్ళను ప్రసిద్ధ వాలీబాల్ క్రీడాకారులుగా గుంటూరు జిల్లా తీర్చిదిద్దింది. ప్రముఖ క్రీడాకారులను భారతావనికి అందించిన ఘనత గుంటూరు జిల్లాకు దక్కుతుంది. కొంతమంది క్రీడాకారులను ప్రపంచ వ్యాప్తంగా కీర్తి శిఖరాలపై అధిష్టింపజేసిదంటే ఏ మాత్రం అతిశయోక్తిలేదు. ఇటువంటి వారిలో స్వర్గీయ సిహెచ్ బుచ్చిరామయ్య అగ్రగణ్యులు. అలాగే జి.గోపీచంద్, కె.సూరారెడ్డి, ఎ.రమణారావు, యం.శ్యాంసుందర్, ఎస్.కోదండరామయ్యలు కోచ్‌లుగా వుండి ఎంతోమంది క్రీడాకారులను ప్రతిభావంతులుగా, సుశిక్షితులుగా తీర్చిదిద్దడానికి తోడ్పడ్డారు. 1935లో గుంటూరులో ఆనాటికి వాలీబాల్ అంటే ఎవరికీ తెలియదు. ఆ ఆటకు అంత ప్రాముఖ్యత వుండేదికాదు. ఆ రోజుల్లో తొమ్మిది మంది ఆటగాళ్ళు వుండి ఎగిరివచ్చే బంతిని రెండు చేతులు జోడించి ఎదుర్కొనేవారు. ఈ పద్ధతిలో ఆడే వారిలో రత్తయ్య, అబద్దయ్యలకు మంచి పేరుండేది. ఆ తర్వాత పుషింగ్, తేలికగా హిట్ చేయడం నేర్చుకున్నారు. 1938-39 నాటికి వాలీబాల్ ఆట ఆంధ్రరాష్ట్రంలో బాగా పుంజుకున్నది. అప్పటికి కూడా అంతర్జాతీయ నియమాలు పాటించడమంటే ఏమిటో తెలిసేదికాదు. 1939లో శ్యామ్‌రావ్ అనే ప్రముఖ సిలోన్ ఆటగాడు వాలీబాల్ పోటీలలో పాల్గొనేందుకై గుంటూరు రావటం సంభవించింది. ఆయన పు ణ్యమా అని గుంటూరు క్రీడాకారులకు మంచి ప్రావీణ్యం వచ్చింది. శ్యామ్‌రావ్ వద్ద శిక్షణ పొందిన గౌస్ మహమ్మద్ వాలీబాల్ ఆటను శాస్త్రీ య పద్ధతిలో ప్రచారం కావించారు. వాలీబాల్ ఆటకు మంచి ప్రచారం గుర్తింపు రాసాగింది. అప్పటికి గుం టూరులో 20 మంది ఆటగాళ్ళు వుండేవారు. ఆంధ్ర ప్రాంతంలో ఎక్క డ పోటీలు జరిగినా గుంటూరు నుంచి రెండు జట్లు పాల్గొని ట్రోఫీలను సునాయాసంగా సాధించేవారు. ఆంధ్ర అమెచ్యూర్, స్పోర్ట్స్ యూనియన్‌ల పేరిట 1952లో రెండు మంచి వాలీబాల్ జట్లు గుంటూరులో ఏర్పడ్డాయి. క్రీడారంగం ప్రాధాన్యతను గుర్తించిన ప్రభుత్వం ఆర్థిక సహాయం అందించింది. శిక్షకులను నియమించడం జరిగింది. దీని ఫలితంగా రాష్ట్ర వాలీబాల్ అసోసియేషన్, అఖిల భారత వాలీబాల్ ఫెడరేషన్ ఏర్పడ్డాయి. గుంటూరు జిల్లా నుంచి వాలీబాల్ క్రీడలో ఖ్యాతిపొందిన వారిలో మహ్మద్ గౌస్, చలమయ్య, బలరాం, వడ్లమూడి సీతారామయ్య, ఆదివిష్ణు, దత్తు, పి.రమణరావు, మలిశెట్టి సుబ్బారావు, యూసఫ్‌ఖాన్, ఆంజనేయులు, కృష్ణమూర్తి, కంకణాల వెంకటేశ్వరరావు, ఆర్.సాంబశివరావు, ఖాశిం, ఎం.సత్యబాబు, ఎ.సాంబశివరావు, బివి ప్రసాద్, రహమాన్‌ఖాన్, బొల్లయ్య, పూదోట శౌరయ్య మొదలగు క్రీడాకారులను గుంటూరు జిల్లా ప్రజలు ఎన్నటికి మరువలేరు.


వాలీబాల్ ఆడుతున్న క్రీడాకారులు

# అక్షరజ్యోతి ఆంధ్రజ్యోతికి 4వ వార్షికోత్సవ శుభాకాంక్షలు



శ్రీమతి సోనియాగాంధీ
ఎ.ఐ.సి.సి. అధ్యక్షురాలు



శ్రీ మన్మోహన్ సింగ్
ప్రధానమంత్రి



డా॥వై.ఎస్. రాజశేఖరరెడ్డి
రాష్ట్ర ముఖ్యమంత్రివర్యులు



కె. కేశవరావు
పి.సి.సి. అధ్యక్షులు



శ్రీ కన్నా లక్ష్మీనారాయణ
రాష్ట్ర సహకార & రవాణా శాఖామాత్యులు



శ్రీ రాయపాటి సాంబశివరావు
గుంటూరు పార్లమెంటుసభ్యులు



శ్రీ ముప్పలనేని శేషగిరిరావు
డిసిసి అధ్యక్షులు

మా అక్షరం మీ ఆయుధం నినాదంతో పత్రికారంగంలో సంచలనాలను సృష్టిస్తున్న "ఆంధ్రజ్యోతి" దినపత్రిక 4 వసంతాలు పూర్తిచేసుకొని 5వ వసంతంలోకి అడుగుడితున్న శుభసందర్భంలో పత్రికా యాజమాన్యానికి సిబ్బందికి, నా హృదయపూర్వక శుభాకాంక్షలు

పార్టీ కార్యకర్తలకు, ప్రజలకు, శ్రేయోభిలాషులకు, దీపావళి, రంజాన్ శుభాకాంక్షలు తెలియజేస్తూ..

## యర్రం వెంకటేశ్వరరెడ్డి, బి.ఇ.

శాసనసభ్యులు, సత్తెనపల్లి. సెల్ : 94402 64464


ధ్యానాంజనేయస్వామి

# కాలచక్రతో ప్రపంచ గుర్తింపు పొందిన అమరావతి

(39వ పేజీ తరువాయి) శతాబ్దం నుంచి అమరావతి బౌద్ధ క్షేత్రంగా క్రీస్తు శకం 14వ శతాబ్దం వరకు విరాజిల్లిందని చరిత్ర ఆధారాలు చెబుతున్నాయి. కాలక్రమేణా అమరావతిలో బౌద్ధప్రాశస్త్యం తగ్గి అలనాటి ఆధారాలకు ఆనవాళ్లుగా శిల్పాలు, కట్టడాలు దర్శనమిస్తున్నాయి. అమరావతి చైత్య ప్రాధాన్యతను తెలుసుకున్న ప్రస్తుత బౌద్ధులు అమరావతికి గత వైభవాన్ని తెచ్చేవిధంగా బౌద్ధ సమ్మేళన (కాలచక్ర) సభలను ఏర్పాటుచేశారు. వారి మత గురువు దలైలామా సభలకు హాజరవడంతో దేశంలోని పలు రాష్ట్రాల నుంచి, ఇతర దేశాల నుంచి లక్షల సంఖ్యలో బౌద్ధులు అమరావతి సభలకు హాజరయ్యారు. కాలచక్ర జరిగిన 15 రోజులు అమరావతి క్షేత్రం బౌద్ధక్షేత్రంగా గత వైభవాన్ని చోటుచేసుకుంది. పురావస్తు ప్రదర్శన శాల వద్దనున్న మహాచైత్యం పూర్వం దీపాల దిన్నెగా పేరుగాంచింది. అదేవిధంగా మహాసభలకు హాజరైన బౌద్ధులు మహాచైత్యం వద్ద ప్రతి రోజు సాయంత్రం వెలిగించిన దీపాల మహాచైత్య ప్రాంగణం దీపాల దిన్నెగా మరలా


అమరావతి మహాచైత్యం నమూనా

వెలుగులను ప్రసరించింది. గతంలో జరిగిన కాలచక్ర మహాసభలకన్నా అమరావతిలో జరిగిన సభలకు రాష్ట్ర ప్రభుత్వం,జిల్లా అధికారులు, స్థానిక ప్రజలు అందించిన సహకారం బౌద్ధులను మంత్రముగ్ధులను చేసింది. కాలచక్ర ముగింపు తరువాత అమరావతి విడిచి వెళ్లేవారి ముఖాలలో వున్న విషాదచాయలు అమరావతి ప్రజల అనుబంధాన్ని తెంచుకోలేకపోతున్నాయన్న భావన వ్యక్తమవుతోంది.

కాలచక్ర మహాసభలలో బౌద్ధులకు విశేషంగా ఆకర్షించిన ధ్యానబుద్ధ ప్రాజెక్టు పనులు పూర్తిచేసుకోకపోవడంతో మరలా వచ్చినా ధ్యానబుద్ధుని పూర్తి ప్రతిమను తిలకించాలనే కోరికతోనే వారు అమరావతి వదిలివెళ్లారు. లక్షలాది మంది బౌద్ధులు అమరావతిలో సుమారు 20 రోజులపాటు బస చేశారు. వారి వల్ల ఆదాయాన్ని, ఆనందాన్ని చవిచూసిన ప్రజలకు కాలచక్రకలగానే మిగిలిపోయింది.

కాలచక్ర ప్రభావంతోగాని, బౌద్ధ ఆరామంగా గత చరిత్ర ఆధారంగాగాని రాష్ట్ర ప్రభుత్వం పర్యాటక శాఖ ఆధ్వర్యంలో నిర్మించిన బుద్దిస్ట్ ఇంట్రప్షన్ సెంటర్, ధాన్యకటక రెస్టారెంట్, పంచాయతీ రాజ్, రెవిన్యూ శాఖల వసతి గృహాలు, ధ్యానబుద్ధ ప్రాజెక్టు, అమరేశ్వరాలయం, కృష్ణానదీతీరం, ప్రైవేటు వసతి గృహాలు అమరావతి సందర్శకులకు ఆహ్లాదం కానున్నాయి.


నాగార్జున కొండ పై నిర్మించిన బౌద్ధ మ్యూజియం

## బౌద్ధ నాగరికతకు..
# సజీవ సాక్ష్యం
### నాగార్జునకొండ మ్యూజియం

(ఆన్‌లైన్- మాచర్ల, విజయపురిసౌత్)

ప్రపంచంలోనే రెండవ ఐలండ్ మ్యూజియంగా ఖ్యాతినార్జించిన నాగార్జున కొండ మ్యూజియం బౌద్ధ నాగరికతకు సజీవ సాక్ష్యంగా నిలుస్తోంది. నిత్య నూతన సోయగాలను విరజిమ్మే కృష్ణమ్మ ఒడిలో పొదిగిన (మిగతా 52లో..)


మ్యూజియంలో అమర్చిన బుద్ధ భగవానుని దివ్య రూపం

# బౌద్ధ నాగరికతకు సజీవ సాక్ష్యం

(51వ పేజీ తరువాయి)

ఓ చిన్న పర్వతం పై ఈ మ్యూజియం నెలకొని వుంది. విజయ పురిసౌత్‌కు 14 కిలోమీటర్ల దూరంలో వున్న ఈ మ్యూజియాన్ని దర్శించాలంటే లాంచిలో నదీజలాల మధ్య పయనించాల్సి వుంది. సుమారు 45 నిమిషాల పాటు సాగే ఈ పయనంలో ప్రకృతి అందాలను ఆస్వాదిస్తూ పులకరింతకు గురికా వచ్చు.

చిన్న చిన్న అలలు, పర్వతాలు, ఎగిసిపడే మత్స్యాల మధ్య ప్రయాణం ప్రతి పర్యాటకుడికి మర పురాని మధురానుభూతిగా మిగిలి పోతుందనడం అతిశయోక్తి కాదు. భారత ప్రభుత్వం కృష్ణానదికి అడ్డుగా ఆనకట్ట నిర్మించడానికి సన్నాహాలు చేస్తున్న నేపథ్యంలో ఈ లోయలోని ప్రాచీన అవశేషాలను ముంపు నుండి రక్షించేందుకు పురావస్తు శాఖ ప్రత్యేక త్రవ్వకాలను ప్రారంభించింది. 1921-31, 1954-60ల మధ్యకా లంలో విస్తారంగా జరిగిన త్రవ్వ కాల్లో వైదికమత నిర్మాణాలు, నివాస గృహాలు, అనేక అవశేషాలతో పాటు ప్రాచీన కాలం నాటి మనుష్యులు వాడే లోహపు పాత్రలు, మట్టిపాత్రలు బయల్పడ్డాయి.

ఈ ప్రాంతమంతా నవశిలాయు గపు సంస్కృతితో నిండి వున్నట్లు త్రవ్వకాలు వెల్లడించాయి. తొలి, మధ్య, మలి శిలా యుగపు స్మృతులు క్రమానుగతంగా ఇక్కడా వర్ధిల్లినట్లు రుజువైంది. ఇక్కడ లభ్యమైన శాస నాలు, నాణెలను అనుసరించి మఠరి పుత్ర వీర పురుషదత్తుడు, వాశిష్ట పుత్ర వేహువుల చాందమూలుడు, వాశిష్ట పుత్ర రుద్రపురుషదత్తుడు ఇక్ష్వాకుల వంశమున ఖ్యాతినార్జించి నట్లు వెల్లడైంది. కృష్ణానది లోయలో ఇక్ష్వాక వంశీకుల పరిపాలన వంద సంవత్సరాలకు పైగా సాగినట్లు తెలు స్తోంది.

ఆనాటి చారిత్రక ఆధారాలనె న్నింటినో ఈ మ్యూజియంలో భద్రప రిచారు. ప్రపంచంలో బౌద్ధ మతానికి జీవం పోసి, మహాయాన సిద్ధాంత ప్రవక్తగా కీర్తిగడించిన ఆచార్య నాగా ర్జునుడి పేరుతో వున్న ఈ మ్యూజి యంను 1966, ఏప్రిల్ 23న అప్పటి భారత ప్రభుత్వ విద్యాశాఖ మంత్రి ఎం.జి.బగ్లా ప్రారంభించారు. ఈ బౌద్ధ మ్యూజియంలో ప్రదర్శించే వస్తువులను నాలుగు భాగాలుగా విభజించారు.

మొదటి భాగంలో విశిష్ట వస్తు వులు అంటే బంగారు ఆభరణాలు, నాణెలు, గాజులు, కరకండికలు, బుద్ధ దేవుని విగ్రహం, రాతి యుగంలో వాడిన సాధనాలు, మొగ లాయి కాలం నాటి సమాధులు వుంటాయి. రెండవ భాగంలో పూర్వం స్థూపాలంకరణలో వినియో గించిన బుద్ధుని జీవిత సన్నివేశాలు, జాతక కథలు, చలువరాతి శిలా ఫల కాలు, మృణ్మయ శిల్పాలు, పాత్రలు, రాతప్రతులను వుంచారు.

మూడవ భాగంలో జలాంతర మైన లోయ, కుడ్యపేటికలతో సూక్ష్మంగా తయారుచేసిన ప్రతిరూ పాలు వున్నాయి. నాలుగవ భాగంలో స్థూప, వాస్తు ఫలకాలు, అర్ధ గోత్ర ఫలకాలు, ఇక్ష్వాకుల కాలం నాటి స్తంభాలు, మధ్య యుగం నాటి శిల్పాలు వున్నాయి.

సుమారు 23 చదరపు కిలోమీ టర్ల వైశాల్యం వున్న కొండ పై నిర్మిం చిన ఈ మ్యూజియాన్ని బౌద్ధమతా నికి చెందిన బూటాన్, చైనా, జపాన్ తదితర విదేశీ యాత్రికులు తరచూ సందర్శిస్తుంటారు. బూటాన్ రాజు జక్మి హాంగ్ ఛూర్ ఈ మ్యూజియాన్ని దర్శించి మరో జన్మంటూ వుంటే ఈ గడ్డ పైనే పుట్టించమని వేడుకున్నా రట.

ఆర్కియాలజి చదివే విద్యార్థు లకు ఈ మ్యూజియం, మ్యూజియం లోని వస్తు సంపద, వివరాలు బాగా తోడ్పడతాయి.

## నాడు వ్యవసాయం.. నేడు వ్యాపారం

# మారిన రెంటచింతల రూపం

(ఆన్‌లైన్, రెంటచింతల)

వ్యవసాయ ఖిల్లాగా పేరొం దిన గుంటూరు జిల్లా వాణిజ్య పంటలైన మిర్చి, పత్తి పంటలను పండించటంలో రాష్ట్రంలోనే ప్రథమ స్థానంగా చెప్పుకోవచ్చు. జిల్లాలో మండల కేంద్రమైన రెంట చింతల ఓ ప్రత్యేక స్థానం వుంది. మండుటెండలకు, వాణిజ్య పంట లకు ప్రసిద్ధి చెందిన రెంటచింతల వ్యవసాయ రంగంలో ఒకప్పుడు జిల్లా స్థాయిలోనే అగ్రగామిగా వుండేది. ఇది 35 ఏళ్ళ నాటి మాట. వ్యవసాయ రంగానికి పేరుగాం చిన రెంటచింతల కాలక్రమంలో రైతులే వ్యాపారులుగా మారడంతో నేడు రెంటచింతల ప్రముఖ విత్తన వ్యాపార కేంద్రంగా పేరు గడిం చింది. రైతాంగానికి వ్యవసాయ రంగం కలిసిరాకపోవడం, వ్యవ సాయం జూదంగా మారడం, పండిన పంటలకు గిట్టుబాటు ధరలు లేకపోవడం వంటి ఇత్యాది కారణాల ఫలితంగా క్రమేపి వ్యవ సాయం తగ్గుముఖం పడుతున్న దంటే అతిశయోక్తి కాదు. మూడు దశాబ్దాల క్రితం అంటే 1970వ దశ కంలో రెంటచింతలకు చెందిన రైతులు మిర్చి పంటను విపరీ తంగా (మిగతా 54లో..)



కల్లాల్లో విస్తారంగా వున్న మిర్చి

# రైతులకు గిట్టుబాటు ధర కల్పించడమే మార్కెటింగ్ శాఖ లక్ష్యం


డా॥ వై.ఎస్. రాజశేఖరరెడ్డి
రాష్ట్ర ముఖ్యమంత్రి


శ్రీ కన్నా లక్ష్మీనారాయణ
రాష్ట్ర సహకార, రవాణాశాఖామాత్యులు


శ్రీ ధర్మాన ప్రసాదరావు
జిల్లా ఇన్‌ఛార్జిమంత్రి


శ్రీ బొత్సా సత్యనారాయణ
రాష్ట్ర మార్కెటింగ్ శాఖమంత్రి


శ్రీమతి జి. జయలక్ష్మి I.A.S.
గుంటూరుజిల్లా కలెక్టర్

## మార్కెట్ యార్డుల ద్వారా రైతులకు కల్పిస్తున్న సౌకర్యాలు

★ రైతుమిత్ర (విత్తనములు, ఎరువులు, పురుగుమందుల అమ్మకములు) ★ రైతుల ఇన్స్యూరెన్స్ ★ సబ్సిడీపై వ్యవసాయ పనిముట్లు ★ కోల్డ్‌స్టోరేజీల నిర్మాణము ★ రైతు ఆరోగ్యత మరియు పశు ఆరోగ్య ఆరోగ్య వైద్య సేవలు ★ ధరల సమాచారము ★ మార్కెట్ ఇంటర్‌వెన్షన్ స్కీమ్ ★ భూసార పరీక్షా కేంద్రాలు ★ రైతుల సంక్షేమము కొరకు ఇతర శాఖలకు ఆర్థిక సహాయము ★ కనీస మద్దతు ధరలు ★ రైతు బజార్లు ★ రైతు శిక్షణ ★ కాటన్ టెక్నాలజీ మిషన్ ★ జూట్ టెక్నాలజీ మిషన్ ★ కంప్యూటీకరణ ★ కాంట్రాక్ట్ వ్యవసాయం ★ ప్రైవేటు మార్కెట్లు ★ ప్రత్యేక మార్కెట్లు ★ జాతీయ సమగ్ర ఉత్పత్తుల మార్కెట్లు.

### రైతుల ఆత్మబంధు 'రైతు బంధు' పథకం - ఈ పథకం ద్వారా రైతులకు కలిగే లాభాలు

★ మార్కెట్లో ధర తక్కువగా వున్నప్పుడు పంటలు అమ్ముకొని నష్టపోకుండా కొంత కాలం నిల్వవుంచి, ఆశించిన ధర వచ్చినపుడు అమ్ముకొని లాభం పొందవచ్చు.

★ మార్కెట్ కమిటీ గోదాములో పంటలను నిల్వవుంచి వాటి విలువలో 75శాతం మొత్తాన్ని, 50,000 రూపాయల గరిష్ట పరిమితికి లోబడి రుణం పొందవచ్చు.


రాజశేఖర్, డిప్యూటి డైరెక్టర్

★ రైతులు నిల్వవుంచిన పంటలకు పూర్తి భద్రతతోపాటు భీమా సౌకర్యం కూడా కల్పిస్తారు. పంటలను 90 రోజుల దాకా నిల్వవుంచుకోవచ్చు. అప్పటికీ సరైన ధర రాకపోతే రైతుల అభ్యర్ధన మేరకు మరో 90 రోజుల దాకా నిల్వవుంచుకొనే సదుపాయం వుంది.

★ ఈ పథకం ద్వారా తీసుకొనే రుణాలకు మొదటి 90 రోజుల వరకు వడ్డీలేదు. ఆ తర్వాత రోజులకు నామమాత్రపు వడ్డీ వసూలు చేస్తారు.

★ మార్కెట్ కమిటీల్లో ఈ పథకం ద్వారా ఇచ్చే రుణాలకు బడ్జెట్ ఆంక్షలు లేవు. ఇప్పటికే ఈ పథకం ద్వారా వేలాది మంది రైతులు లాభం పొందారు.

**ఇక ఆలస్యం దేనికి? మీ సమీపంలోని వ్యవసాయ మార్కెట్ కమిటీని సంప్రదించి, మీరు కూడా రైతు బంధు పథకం ద్వారా వెంటనే లాభం పొందండి.**


జి.బి.రాజేంద్రప్రసాద్
అసిస్టెంట్ డైరెక్టర్, మార్కెటింగ్ శాఖ

Space Donated by :


శ్రీ పొలడుగు ప్రసాద్
ఛైర్మన్, మార్కెటింగ్ యార్డు
తెనాలి


శ్రీ సయ్యద్ జిలాని
ఛైర్మన్, మార్కెటింగ్ యార్డు
నరసరావుపేట


శ్రీ కట్టా సాంబయ్య
ఛైర్మన్, మార్కెటింగ్ యార్డు
సత్తెనపల్లి


శ్రీ చింతా సుబ్బారెడ్డి
ఛైర్మన్, మార్కెటింగ్ యార్డు
పిడుగురాళ్ళ


శ్రీ వడ్రాణం మార్కండేయ బాబు
ఛైర్మన్, మార్కెటింగ్ యార్డు
పొన్నూరు


శ్రీ పాటిబండ్ల కృష్ణప్రసాద్
ఛైర్మన్, మార్కెటింగ్ యార్డు
దుగ్గిరాల


శ్రీ సిహెచ్. వెంకిరెడ్డి
ఛైర్మన్, మార్కెటింగ్ యార్డు
వినుకొండ


శ్రీ కొమ్మినేని రామచంద్రరావు
ఛైర్మన్, మార్కెటింగ్ యార్డు
తాడికొండ


శ్రీ బెల్లంకొండ రామగోపాలరావు
ఛైర్మన్, మార్కెటింగ్ యార్డు
క్రోసూరు


శ్రీ మారం వెంకటేశ్వరరావు
ఛైర్మన్, మార్కెటింగ్ యార్డు
మాచర్ల


శ్రీ జి. వెంకట హనుమయ్య
ఛైర్మన్, మార్కెటింగ్ యార్డు
ఈపూరు


శ్రీ ఉట్ల బుడ్డయ్య చౌదరి
ఛైర్మన్, మార్కెటింగ్ యార్డు
బాపట్ల

## నాడు వ్యవసాయం.. నేడు వ్యాపారం...

# మారిన రెంటచింతల రూపం

పత్తి బోరాలు

(52వ పేజీ తరువాయి)

సాగు చేసేవారు. అప్పట్లో వ్యవసాయ రంగంలో 'పత్తి' రంగప్రవేశం చేయలేదు. ఇక్కడ 90 శాతం మంది రైతాంగం అత్యధికంగా మిర్చి పంటను సాగు చేసేవారు. మిర్చి సాగు విస్తీర్ణం అధికంగా వుండడంతో రెంటచింతలలో ఎటువైపు చూసినా కాని మిర్చి కల్లాల్లో మిరపకాయలు పెద్ద ఎత్తున రాసులు రాసులుగా కనిపించేవి. నాటి రోజుల్లో పంటల పై చీడపీడలు, తెగులు అంతగా వుండక పోయేది. పురుగుమందుల వాడకం కూడా అతి తక్కువ మాత్రమే వుండేది.

దీంతో ఎకరానికి సుమారు 35 క్వింటాళ్ళ పైనే ఇబ్బడిముబ్బడిగా దిగుబడులు వచ్చేవి. ఇక్కడి మిర్చి నాణ్యత కూడా వుండడంతో అధిక ధరలు లభించేవి. ఫలితంగా రెంటచింతల రైతాంగం ఆర్థికాభివృద్ధిని గణనీయంగా సాధించారు. కాలక్రమంలో వ్యవసాయ రంగంలో చోటు చేసుకున్న మార్పుల కారణంగా పత్తి పంట రంగప్రవేశం చేసింది. దీంతో క్రమేపి మిర్చి సాగు విస్తీర్ణం తగ్గుతూ వచ్చింది.

పలు ఆరుతడి పంటలు విస్తీర్ణం కూడా పెరిగింది. రాను రాను వ్యవసాయం రైతులను తీవ్ర నష్టాల్లోకి నెడుతుండడంతో వ్యవసాయం పట్ల రైతుల్లో ఆసక్తి సన్నగిల్లుతూ వచ్చింది. వ్యవసాయ మార్కెట్‌లో నకిలీలు రంగప్రవేశం చేయడంతో రైతుల నష్టాలు మరింత పెరిగాయని చెప్పవచ్చు.

నకిలీల బెడద, రకరకాల హైటెక్ తెగుళ్ళు, సక్రమంగా అందని సాగునీటి వ్యవస్థ, తగ్గుతున్న దిగుబడులు, లభించని గిట్టుబాటు ధరలు, వ్యవసాయ ఉత్పత్తుల వ్యాపారస్తులు నష్టాల పాలై ఐపిలు పెట్టి రైతుల నెత్తిన టోపీలు పెట్టడం వంటి సంఘటనలతో వ్యవసాయం రైతులకు పెనుభారంగా మారింది. వీటికితోడు పంట కోతల కాలంలో వ్యవసాయ కూలీలు దొరక్క పడుతున్న ఇబ్బందులుఅన్నీ ఇన్నీ కావు. ఒకవేళ కూలీలు అందుబాటులో వున్నప్పటికీ వారికిఅయ్యే ఖర్చు తడిసి మోపెడంత కావడం రైతులు ఆర్థికంగా భరించలేని స్థితికి చేరుకున్నారు. ఈ నేపథ్యంలోనే కొంతమంది రైతులు వ్యవసాయ రంగానికి స్వస్తి చెప్పి వ్యాపార రంగంలోకి అడుగుపెట్టారు. స్థానిక రైతులు కొంతమంది తమ పొలాలకు కౌలుకు ఇచ్చుకొని హైదరాబాద్, గుంటూరు తదితర నగరాలకు వలస వెళ్ళి పలు వ్యాపారాలు చేసుకుంటూ స్థిరపడ్డారు.

రెంటచింతలకు చెందిన పలు రైతు కుటుంబాలకు చెందినవారు ఉన్నత విద్యలు కూడా అభ్యసించి ఇతర దేశాలలో స్థిరపడి వున్నారు. రాష్ట్రంలోని వివిధ ప్రాంతాల నుండి రెంటచింతలకు వలస వచ్చిన కొంత మంది రైతులు స్థానికంగా పొలాలను కౌలుకు తీసుకొని వ్యవసాయం చేస్తుండడం ఇక్కడ వచ్చిన మార్పులకు నిదర్శనంగా చెప్పవచ్చు.

ఒకనాడు వ్యవసాయానికి అగ్రగామిగా వున్న రెంటచింతల ఇలా క్రమంగా నేడు వ్యాపార కేంద్రంగా రూపుదిద్దుకుంది. పలువురు రైతులు సైతం విత్తనాల వ్యాపారం పట్ల దృష్టిసారించి వ్యవసాయంలో కన్నా వ్యాపారం ద్వారానే ఇబ్బడిముబ్బడిగా లాభాలను ఆర్జిస్తున్నారు.

దశాబ్దం క్రితం రెంటచింతలలో కేవలం కొద్ది షాపులకే పరిమితమై నేడు 35 షాపులకు పెరగడం విశేషం. జిల్లాలో ఏ మండల కేంద్రంలోనూ లేనన్ని విత్తన, పురుగుమందుల షాపులు రెంటచింతలలో వెలిశాయంటే ఇక్కడ విత్తన వ్యాపారం ఎంతగా విస్తరించిందో ఊహించుకోవచ్చు.

పత్తిని లారీలకు ఎత్తుతున్న కూలీలు

## దీపావళి, రంజాన్ శుభాకాంక్షలతో...


స్వర్గీయ ఇందిరాగాంధి గారు


స్వర్గీయ రాజీవ్ గాంధి గారు
మాజీ ప్రధాన మంత్రి


శ్రీమతి సోనియాగాంధి గారు
కాంగ్రెస్ పార్టీ అధ్యక్షురాలు


శ్రీ మన్‌మోహన్ సింగ్ గారు
ప్రధానమంత్రి


శ్రీ కె.కేశవరావు గారు
రాష్ట్ర కాంగ్రెస్ పార్టీ అధ్యక్షులు


శ్రీ కె. రోశయ్య గారు
రాష్ట్ర ఆర్థిక శాఖా మంత్రి


శ్రీ కన్నా లక్ష్మీనారాయణ గారు
రాష్ట్ర సహకార శాఖా మంత్రి


శ్రీ ధర్మాన ప్రసాదరావు గారు
జిల్లా ఇన్‌చార్జ్ మంత్రి


శ్రీ జె.సి.దివాకరరెడ్డి గారు
రాష్ట్ర పంచాయతీరాజ్ శాఖామాత్యులు


శ్రీ ముప్పలనేని శేషగిరిరావు
అధ్యక్షులు, గుంటూరు జిల్లా కాంగ్రెస్

# రైతు సంక్షేమం కోరే వై.యస్. నాయకత్వమును బలపర్చాలి

రాష్ట్రంలో వై.యస్. రాజశేఖరరెడ్డి నాయకత్వంలో కాంగ్రెస్ ప్రభుత్వము పేద ప్రజలు, రైతుల సంక్షేమునకు కృషిచేస్తుంది. ఉచిత విద్యుత్తు, ఆత్మహత్యలు చేసుకొన్న కుటుంబములకు పునరావాసము, పావలా వడ్డీలకే డ్వాక్రా సంఘములకు ఋణములు, రాజీవ్ నగరబాట, రాజీవ్ పల్లెబాట, ప్రజాపదం, పట్టణంలో పేదలకు రూ॥ 1200/-కు బాలలు, రాజీవ్‌గృహ కల్ప, ఇందిరమ్మ ఆదర్శ గ్రామాల అభివృద్ధి వంటి పథకములలో ప్రజలకు ఎన్నో సేవా కార్యక్రమములను చేపట్టింది. వై.యస్. పాలనను మెచ్చుకొన్న ప్రజలు ఇటీవల మున్సిపాలిటీలు స్థానిక ఎన్నికలలో అద్భుతమైన తీర్పు ఇచ్చారు. రాష్ట్ర ప్రభుత్వం చేపట్టుతున్న అన్ని పథకాలకు ప్రజలు అండగా ఉండాలని కోరుతున్నాము.


**కూచిపూడి సాంబశివరావు**
రాష్ట్ర గ్రంథాలయ సంస్థ చైర్మన్


**కూచిపూడి విజయమ్మ**
చైర్ పర్సన్, జిల్లా పరిషత్, గుంటూరు


**శ్రీ వై.యస్.రాజశేఖరరెడ్డి గారు**
రాష్ట్ర ముఖ్యమంత్రి వర్యులు

# వి'భజన' కూడదు

## నరుడు నారాయణుడు ఒక్కడే

### ప్రేమ్ సిద్ధార్థ స్వామీజీ సందేశం



దుఃఖం నుంచి విముక్తి పొందటానికి ప్రతి వ్యక్తి నిరంతరం తపిస్తుంటాడు. ఈ కోరికకే మోక్షేచ్ఛ అంటారు. ఈ మోక్షేచ్ఛ ము ముక్షుత్వంగా మారితేనే ఆత్యంతిక దుఃఖం నివృత్తి కలుగుతుంది. జీవితంలో ఎన్నో ఒడిదుడుకులను ఎదుర్కొని, అలసి సొలసినప్పుడు కలిగేది మోక్షేచ్ఛ. ముముక్షుత్వం అలా కాదు. ఇది పరిణితిలోంచి వస్తుందని భగవాన్ శ్రీశ్రీశ్రీ ప్రేమ్ సిద్ధార్థ స్వామీజీ పేర్కొన్నారు. షిర్డిసాయిబాబా ఆరాధనోత్సవాల సందర్భంగా వినుకొండ వచ్చిన స్వామీజీ 'ఆంధ్రజ్యోతి ప్రత్యేక సంచికకు ఈ వ్యాసం ద్వారా భక్తులకు తన సందేశాన్నిచ్చారు. ప్రతి హృదయంలో దైవాత్వాన్ని చూడటమే వ్యాసం యొక్క ప్రదానాంశమని ఆయన ఉద్బోధించారు.

**ఏకో విష్ణు:-** నారాయణుడు అనంతుడు. స్వామీ నారాయణుడే- దాసుడూ నారాయణుడే. ఇదంతా నారాయణుడి లీలా వినోదమే- ఒక వైపు దేవుడిగా, మరోవైపు జీవుడిగా! మీరు, నేను వాస్తవానికి లేము. ఉన్నదంతా నారాయణుడే. సర్వం నారాయణుడే. కాబట్టి మనమంతా నారాయణ స్వరూపులమే.

'నేను నారాయణ స్వరూపుడిని' అని చక్కగా తెలుసుకోవడమే జీవన్ముక్తి. అలాగని గుడిలోకి వెళ్ళి నారాయణుడి స్థానంలో మీరు కూర్చుంటే చూడటానికి బాగుండదు. వ్యవహారంలో మనం భక్తులం, నారాయణుడు భగవానుడు. శ్రీరాముడు ఒక సారి ఆంజనేయుడిని 'నీవు ఎవరివి?' అని అడిగాడు. దానికి ఆంజనేయులవారు, 'స్వామీ! దేహభావంతో నేను తమరి దాసుడను. జీవభావంతో తమరి అంశను. తమరొక మహా సముద్రమైతే, నేనొక నీటి బిందువును. తత్త్వ పరంగా అత్మభావంతో చూస్తే 'త్వమేవాహం' మీరే నేను, నేనే మీరు! ఎందుకంటే, మీరు కాని వస్తువంటూ ఏదైనా ఉందా? ఈ జగత్తే మీ స్వరూపం! జగదీశ్వరులూ మీరే, జగత్స్వరూపులూ మీరే! నియమించేది మీరే, నియమించబడుతున్నట్లుగా నాటకామాడుతున్నదీ మీరే. సర్వం రామమయం!' అని ఎంతో వినయంగా జవాబిచ్చాడు. నిజమైన వైష్ణవమంటే ఇదే. సర్వత్రా విష్ణువునే దర్శించడం వైష్ణవం. సర్వత్రా శివుడినే దర్శించడం శైవం. 'సర్వం పరమాత్మమయం'. అని తెలియడమే గోవింద భజన.

ఈ విషయం తెలియక మనమెన్నో గొడవలు పెట్టుకుంటున్నాం. భజన పేరుతో విభజనలు చేస్తున్నాం. గోవింద భజన అంటే మీలో ఉన్న గోవిందుడు మీకు తెలియడమే. 'నేను'గా ప్రకటింపబడుతున్న గోవిందుడిని అనుభూతం చేసుకోవడమే! సాధన, భక్తి- ఏదైనా కానివ్వండి, వాటి గమ్యం మాత్రం ఇదే. దీన్ని పొందకుండా మనం పై పై విషయాలతో కాలక్షేపం చేస్తున్నాం. ఇది సరికాదు.

మనమంతా భక్తి, జ్ఞానం కావాలనే సత్సంగాలకు, భజన- కీర్తనలకు వెళ్తున్నాం. అంతేకాని ఒకరితో స్పర్ధలు పెట్టుకోవడానికి కానే కాదు. అయితే సత్సంగాదులకు వెళ్ళడంలో ఎక్కడో మన హ్యాండిల్ చిన్నగా టర్న్ అవుతోందంతే. దాంతో ఆరు నెలల్లోనే విభజనలు, గొడవలు మనకు తెలియకుండానే ప్రారంభం అవుతున్నాయి.

అసలు విషయాన్ని వదిలేసి, అనవసర విషయాల్లో తీవ్రమైన ఆసక్తిని పెంచుకోవడం, కనబర్చడంలో మనకు మనమే సాటి. ఏ విషయంలో జ్ఞానం పెంచుకోవాలో దాన్ని పక్కన పెట్టాం. అనవసర విషయాల్లో చెప్పలేనంత జ్ఞానాన్ని సంపాదించాం. 'నీవెవరివో తెలుసుకో' అంటే అస్సలు పట్టించుకోం గాని, పక్కవారి విషయాల్లో మాత్రం ఎంతో ఎంక్వయిరీ చేస్తాం. ఒక సిఐడి ఆఫీసర్ కూడా అంత ఎంక్వయిరీ చేయలేడేమో! ఈ ఎంక్వయిరీ చేసేవాడిని ఎంక్వయిరీ చేయ్యాలనే ప్రయత్నం మాత్రం చేయం!

శివుడు వేరు, కేశవుడు వేరు- ఇదోరకం అతి, ఎందుకంటే అలా చేప్పేవాడికి శివుడూ తెలియదు. కేశవుడూ తెలియదు. తెలియనిదాన్ని గురించి అంత అతిగా మాట్లాడటం అవివేకమే! మన ఉన్నతికై భజన, కీర్తన, విచారణ... చేసుకోక అన్నీ తెలిసినవాడిలా ప్రవర్తిస్తూ గొడవలు పెట్టుకోవడం నిజంగా మూఢత్వమే! ఇటువంటి మూఢభావాలు ఆధ్యాత్మిక అనిపించుకోవు. మన ఉన్నతికి పనికిరావు. ఏ విషయంలోనూ అతిగా ప్రవర్తించకుండా, వచ్చిన పని చూసుకొని, చడీచప్పుడు చెయ్యకుండా వెళ్ళిపోవడమే విజ్ఞుల లక్షణం.

'మాయ' అంటే ఏమిటని ఒకరు శ్రీరమణ మహర్షిని అడిగారు. రమణులు ఏమీ మాట్లాడలేదు. ఒక గంట అయ్యింది. మహర్షి మౌనంగా కూర్చున్నా, ఏదో విధంగా జవాబు దొరుకుతుందని అతడు ఎక్కడో చదివాడు. అందుకే ఎటూ వెళ్ళకుండా, అక్కడే కూర్చున్నాడు. ఇంతలో శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణ పండితుడు ఆశ్రమానికి వచ్చాడు. అప్పటిదాకా మహర్షి చుట్టూ కూర్చున్న వాళ్ళంతా రాధాకృష్ణన్ గారొచ్చారని వారి వద్దకు పరుగెత్తిన వారిలో ఇతడు కూడా ఉన్నాడు. రాధాకృష్ణన్‌గారు మహర్షి దర్శనం చేసుకొని వెళ్ళిపోయారు. 'ఇంతకు ముందు దేన్ని గురించి అడిగావు?' అని ఇతడిని అడిగారు మహర్షి. అతడికేమి అర్థం కాలేదు. అప్పుడు మహర్షి 'నీవు ఆశ్రమానికి వచ్చింది ఎవర్ని చూడ్డానికి- రమణ మహర్షినా? రాధాకృష్ణన్నా? (మిగతా 57లో)

# ఆశయం ఆవిరైంది-భవిష్యత్తు బావురుమంటోంది

ఆన్‌లైన్, దుర్గి)

దుర్గి మండలం అడిగొప్పులలో ప్రారంభించిన మినీ లెదర్ పార్క్ కొద్ది నెలలకే అటకెక్కింది. ఆరు వేల మందికి ఉపాధి లక్ష్యంతో నెలకొల్పిన ఈ పార్క్ కనీసం ఆరుగురికి కూడా పని కల్పించలేకపోయింది. టిడిపి ప్రభుత్వంలో భారీ అంచనాతో దీనికి శంకుస్థాపన చేయగా, కాంగ్రెస్ హయాంలో తూతూమంత్రంగా ప్రారంభించి గాలికి వదిలేశారు. దీంతో ప్రస్తుతం ఈ లెదర్ పార్క్ నిర్మాణం కోసం వెచ్చించిన నిధులు బూడిదలో పోసిన పన్నీరయ్యాయి.

పల్నాడు ప్రాంతంలోని బడుగు, బలహీన వర్గాలకు చెందిన యువత ఉపాధి అవకాశాలు లేక నక్సలిజం వైపు మొగ్గుచూపుతున్నారని గ్రహించిన ప్రభుత్వం వీరిని చక్కదిద్ది దారిలో పెట్టాలని గ్రహించింది. ఇందుకోసం మినీ లెదర్ పార్క్ సరైన మార్గమని భావించిన జిల్లా అధికారులు అడిగొప్పులలో ఏర్పాటు చేయటానికి నిర్ణయించారు. ఈ లెదర్ పార్క్‌ద్వారా 6 వేల మంది నిరుద్యోగ యువకులకు ఉపాధి కల్పించడానికి అంచనాలు రూపొందించారు. లెదర్ పార్క్‌లో ఎంపిక చేసిన నిరుద్యోగులకు చెప్పుల తయారీలో శిక్షణ ఇచ్చి అనంతరం అక్కడే వారు సొంతగా పాదరక్షలను తయారుచేసుకొని క్రయ విక్రయాలు జరుపుకోవాలనేది ప్రభుత్వ ఉద్దేశం. శిక్షణ పొందిన చర్మకారులకు ఎస్‌సి కార్పొరేషన్ ద్వారా రుణాలు అందించడం ద్వారా సంబంధిత పరికరాలను కొనిపెట్టి ఉపాధి కల్పించడమే లెదర్ పార్కు ముఖ్యోద్దేశం. ఇందుకోసం 2003లో అడిగొప్పుల హార్టికల్చర్ ఫామ్‌కు చెందిన 30 ఎకరాల స్థలంలో లిడ్ క్యాప్ ఆధ్వర్యాన కోటి రూపాయల అంచనాతో మినీ లెదర్ పార్క్ మలుపు శిక్షణా కేంద్రం ఏర్పాటుచేసి అప్పటి వైద్య, ఆరోగ్య శాఖామంత్రి కోడెల శివప్రసాదరావుతో శంకుస్థాపన చేయించారు. 2004లో 20 లక్షల రూపాయల వ్యయంతో ఒక భవనం నిర్మించి అధునాతన యంత్రాలను ఏర్పాటు చేసినా ఉపాధి అవకాశాలు కల్పించడంలో ప్రభుత్వం విఫలమైంది.


నిరుపయోగంగా వున్న అడిగొప్పల మినీ లెదర్ పార్క్

# వి'భజన' కూడదు

(56వ పేజీ తరువాయి)

అని అడిగారు. తమరినే అని జవాబిచ్చాడు అతడు. 'వచ్చిన పనిని మరచి వ్యవహరించడమే మాయ' అని నవ్వుతూ అన్నారు మహర్షి.

అసలు పనిని మరచి మరెన్ని చేసినా లాభముండదు. విషయాన్ని అర్థం చేసుకోకుండా, శాస్త్రాలను చదివినా ఏమంత గొప్ప ప్రయోజనం కనిపించదు. అటువంటి శాస్త్రజ్ఞానం చివరకు మనల్ని ఇబ్బందుల పాలు చేస్తుంది. 'శబ్దజాలం మహరణ్యం చిత్త భ్రమణ కారణం'- శబ్దజాలం ఎక్కువైతే అదో మహరణ్యం అవుతుంది. అరణ్యంలో చిక్కుకున్నా ఏదోలా బయటకు రావచ్చు కానీ పదాల అరణ్యంలో చిక్కుకున్నామా, ఇక ఈ జన్మలో బయట పడలేం.

'వైదుష్యం విదుషాం భుక్తయే న తు ముక్తయే'- పదాలతో పండితుడైన వాడి పాండిత్యం కడుపు నింపగలుగుతుందే కానీ ముక్తిని ఇవ్వజాలదన్నారు శ్రీ శంకరులు. ముక్తికి ముముక్షుత్వం కావాలే కాని ఈ ' అతి' వ్యవహారం ఎంత మాత్రమూ కాదు.

## యోగాని చక్కగా వినియోగించుకోవాలి

ప్రాణాయామం వల్ల మీ జబ్బులు తగ్గి ఉండవచ్చు. ప్రాణయామానికి అటువంటి శక్తి ఉంది. అంతమాత్రంచేత ప్రాణాయామం రోగాలను తగ్గించడానికే అని అనుకోవడం ఎంతమాత్రమూ సమంజసం కాదు.

కొందరు యోగచార్యులు కూడా 'యోగం' రోగం నివారణకే అని చెప్తున్నారు. యోగ శాస్త్రం దేనికి నిర్దేశించబడిందో, దాన్ని అర్థమయ్యేలా చెప్పాలే తప్ప కేవలం రోగాల కొరకే యోగం, ప్రాణాయమం అని చెప్పడం సరికాదు. యోగసాధన చేయడం వల్ల రోగాలు తగ్గుతాయి. కాని దాని కొరకే యోగం అనకోకూడదు.

చెరుకు రసం తీస్తున్నప్పుడు, రసం తీసిన తరువాత చెరుకు పిప్పి వస్తుంది. ఆ పిప్పిని పశువులకు వేస్తారు. రసం తీస్తున్నప్పుడు పిప్పి వస్తే పరవాలేదు కాని, పిప్పి కోసం రసాన్ని తీయడం వివేకం అనిపించుకోదు. రసం కొరకు కష్టపడితే రసము, పిప్పి రెండూ దొరకుతాయి. అదే విధంగా యోగం, ప్రాణాయామం వల్ల ఆరోగ్యం లభిస్తుంది. అయితే కేవలం ఆరోగ్యం కొరకే యోగం కాదు.

ఏది దేనికొరకు నిర్దేశించబడిందో, తదనుగుణంగా దాన్ని వాడడం పద్ధతి అనిపించుకుంటుంది. శరీర బుద్ధి ఉన్నవాడు అసురుడు. యోగమెప్పుడైతే శరీరం పట్లే కేంద్రీకృతమౌతుందో అది అసుర ప్రవృత్తిగా మారుతుంది. కాబట్టి యోగాన్ని చక్కగా ఉపయోగించుకోవాలి. అలా చేయకుండా శరీర సంబంధమైన అంశాలతో యోగాన్ని ముడివేసి ఇదే యోగశాస్త్రమని అనుకోవడం చాలా పొరపాటు. ఈ పొరపాటే 'యోగం రోగాలకే' అనే దురభిప్రాయాన్ని ఏర్పరుస్తుంది.

ధ్యానానికి రండి అని నేనొకరిని పిలిస్తే 'నాకేమి జబ్బులు లేవు. నాకెందుకు ధ్యానం?' అని అన్నాడతను. ధ్యానం వల్ల రోగాలు పోతాయి, గొప్ప గొప్ప శక్తులు కలుగుతాయి. గ్రహాంతర యాత్రలు చేయవచ్చు... అని కూడా కొందరు ప్రచారం చేస్తున్నారు. ఈ అభిప్రాయం, ప్రచారం ఏ మాత్రం సరైనది కాదు. ధ్యానం ఒక మెట్టు. ప్రాణాయామం ఒక మెట్టు. మెట్లే ఇల్లు కాదు కదా!

## మనస్సు నియంత్రణకు ప్రాణాయామం దోహదం

ఇది జిజ్ఞాసువులకేంతో సహాయకారి. ఎందుకంటే ఉన్నట్టుండి వేదాంతమంటే ఎవరికి అర్థం కాదు. కారణం మన మనస్సు అతి చంచలంగా ఉండటమే, కాబట్టి ప్రాణాయామం చేత మన మనస్సు నియమింపబడుతుంది.

ఇప్పుడున్న స్థితిలో, ప్రాణాయామం మన పరిధిలో ఉంది. కాని పరబ్రహ్మ మన పరిధిలో ఉన్నాడా? బ్రహ్మాన్ని గురించి తెలుసుకునే దిశలో మన మనస్సు కొంత నియమించబడాల్సిన అవసరం ఉంది. ఇందుకు ప్రాణాయామం ఒక సులువైన పద్ధతి. ప్రాణాయామం కంటే ఉత్తమమైనది ప్రాణవీక్షణం, శంకరులవారు 'ప్రాణాయామం' అన్నప్పుడు ప్రాణవీక్షణం కూడా దానిలో ఉన్నట్లే .

ప్రాణాయామం, ప్రాణ గత్యాగత్యప్రత్యభివేక్షణం వల్ల మనస్సు నిదానం అవుతుంది. ఒకలాంటి శాంతి మనలో అవిర్భవిస్తుంది. ఇందులో ఎలాంటి సందేహం లేదు. ఏమీ చేయకుండా కూర్చుని కేవలం శాస్వను గమనిస్తే కూడాచాలా హాయిగా అనిపిస్తుంది. అయితే శ్వాస మీద ధ్యాస ఎంత వరకు? కొంతవరకు మాత్రమే మనో నిగ్రహానికి మార్గమైన ప్రాణాయామాన్ని ధ్యానాన్ని 'గమ్యం' అనుకోవడం, అనడంతోనే అసలు సమస్యంతా ప్రారంభమౌతుంది. ప్రాణాయామాదులు గమ్యం కాదు, ఒక మెట్టు మాత్రమే.వాటిని ఉపయోగించుకొని ముందుకు వెళ్ళాలే కాని వాటినే పట్టుకుని కూర్చుంటే ఉన్నతి లభించదు.

ప్రాణాయామంతో పాటు ప్రత్యాహారం కావాలి. ప్రత్యాహారం అంటే మనస్సును అనవసరమైన విషయాల నుండి వెనక్కి తెచ్చుకోవడం. మనస్సు పనికి రాని విషయాలలో పరిభ్రమిస్తుంటే ఆందోళన అధికమౌతుంది. ఉదయం లేచి పేపరు చదవడం మొదలుకొని ఎన్నో అనవసరమైన విషయాలలో మనసు విహరిస్తుంది. వాటన్నింటితో ధ్యానానికని కూర్చున్నా. ఎలాంటి లాభం ఉండదు. అందుకే అనవసరమైన వాటిని మనస్సులో నుండి తీసివేయాలి.

ఏ విషయం గురించి ఎంత అలోచించినా మనమేమీ చేయలేమో, దాన్ని గురించి ఎక్కువగా ఆలోచించకూడదు. ఏదైనా చేయవచ్చు అనుకున్న విషయంలో మన ఆలోచనకు అర్థం ఉంటుంది. ఈ విషయాన్ని గమనించండి-

ఏమీ తెలియని పల్లెటూరివాడు ఎంతో ప్రశాంతంగా ఉండటానికి, అన్నీ తెలిసిన మనం అశాంతితో ఉండటానికి గల కారణమేమిటి? ఆ పల్లె వానికి ప్రపంచంలో ఎక్కువ పరిచయం లేదు. ఊరు, ఇల్లు, గొడ్లు, పిల్లాజెల్లా... ఇదే అతడి ప్రపంచం. అందుకే అతడి మనస్సు ఎంత పరుగెత్తినా ఈ విషయాల్లోనే! అందుకే అతడికి అంత శాంతి.

మనకు అనవసరమైన విషయాలు లెక్కలేనన్ని తెలుసు. అమెరికా నుండి ఆఫ్రికా వరకు మనస్సు పరుగెడుతూనే ఉంటుంది. అనేక విషయాల వెనక పరుగెత్తడం వలన మనకు ప్రశాంతత లోపిస్తోంది. అనవసరమైన ప్రతి విషయం మన సంస్కారాన్ని దృఢ పరుస్తుంది. అనవసరమైన విషయాల్లోంచి మనస్సును వెనక్కు తేవాలి. ప్రాణాయామం ఎంత చేస్తున్నా, ప్రత్యాహారం దానికి చేరనంతవరకు ఎలాంటి ఉపయోగం ఉండదు. టికెట్టు కొనుకున్నాం, కానీ బస్సెక్కలేదు. ఇక యాత్ర ఎలా జరుగుతుంది?

## 'అహం బ్రహ్మాస్మి' అని అనుకుంటే ఏమీ జరగదు

ప్రాణాయామప్రత్యాహారాల వల్ల ముక్తి లభిస్తుంది. ఎందుకంటే ప్రాణాయామప్రత్యాహారాలు మన సమర్థతను పెంచడానికి పనికి వస్తాయి. ప్రాణాయామప్రత్యాహారాలతో పాటు నిత్యానిత్యవివేకవిచారం కావాలి. ఇదే మన బస్సును గమ్యానికి చేరుస్తుంది. మన బంధనానికి అవివేకమే కారణం. కాబట్టి వివేకంతో మాత్రమే బంధ విముక్తులవ్వగలం. వివేక విచారణలతో బంధం విముక్తికై ప్రయత్నించకుండా 'అహం బ్రహ్మాస్మి' అని అనుకున్నా ఏమీ ఒరగదు.

నిత్యానిత్య వివేకవిచారణ చేయడానికి మనస్సు ప్రశాంతంగా, సమర్థవంతంగా ఉండాల్సిన అవసరం ఎంతో ఉంది కాబట్టి అందుకై యోగశాస్త్ర ప్రతిపాదితమైన స్వీకరించి, ఆచరించి అర్హతను పెంచుకోవాలి. అంతేగానీ ఆ అంశాలతోనే 'మోక్షం' అనుకోకూడదు. అలా అనుకున్నామా, ఇక దాంట్లోంచి బయటకు రావడం చాలా కష్టతరమౌతుంది. అందుకే ప్రాణాయామప్రత్యాహారాలతో పాటు నిత్యానిత్య వస్తువివేకం కూడా ఎంతో అవసరం అని అంటున్నారు ఆచార్యులు.

వేదాంతం 'అనిచారకృతో బంధః, విచారేణ విముక్తిః' అని చెప్పింది. కాబట్టి వివేకవిచారణకు ఎంతో ప్రాముఖ్యం ఉంది.

## జాప్య సమేత సమాధి విధానం

సమాధి విధానం అంటే యోగ విధానం అని అర్థం. యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణ, ధ్యాన, సమాధి- ఇదే పతంజలి అందించిన అష్టాంగ యోగం.

-ఆన్‌లైన్, వినుకొండ

# మావోయిస్టుల'కు అడ్డా అడిగొప్పుల

(ఆన్‌లైన్, దుర్గి)

అడిగొప్పుల... ఈ పేరు వింటే ఎవరికైనా గుర్తుకువచ్చేది మావోయిస్టులే... కళ్ళెదుట ప్రత్యక్షమయ్యేది ఎన్‌కౌంటర్లు, ఇన్‌ఫార్మర్ల హత్యలు, ఎక్స్ఛేంజ్‌ల పేల్చి వేత, మందుపాతర్లు, బస్సు దగ్ధం దృశ్యాలే. దుర్గి మండల పరిధిలోని అడిగొప్పుల గ్రామం నక్సలైట్లకు పెట్టని కోట. ఈ గ్రామంతో నక్సలైట్లకు వున్న అవినాభావ సంబంధాన్ని విడదీయటం ఎవరితరం కావటం లేదు. పల్నాడులో నక్సలైట్ల ప్రభావిత గ్రామాలు ఎన్నో వున్నా అడిగొప్పులే వారికి జీవ నాడి. పీపుల్స్‌వార్ ప్రారంభించిన దేవాలయ భూముల పంపిణీ ఉద్యమానికి ఈ గ్రామమే ఊపిరి. పోలీసులకు, నక్సలైట్లకు మధ్య నిరంతరం జరిగే సంఘర్షణలో ఈ గ్రామం రక్తంతో తడిసి ముద్ద వుతోంది.


'వార్' ఉద్యమానికి కేంద్ర బిందువైన హార్టికల్చర్ ఫారం భూములు

ఈ ఇరువర్గాలకు జరుగుతున్న సంకుల సం'గ్రామం'లో వార్ గొప్పలే బహిర్గతం అవుతున్నాయి. ఒకనాడు ఫ్యాక్షన్ వలయంలో మగ్గిన అడిగొప్పుల నేడు మావోయిస్టుల యాక్షన్‌కు నిలయంగా ఎందుకు మారింది? ఈ గ్రామం పై మావోయిస్టుల పట్టు ఇంతలా బిగుసుకుపోవడానికి కారణాలు ఏమిటి అనే సందేహాలు నివృత్తి చేసుకోవాలంటే అడిగొప్పుల 'ఫ్లాష్ బ్యాక్'లోకి తొంగిచూడక తప్పదు.

## దుర్మార్గాలకు భయపడి ఫిర్యాదులకు దూరం

సుమారు 8 వేల జనాభా గల అడిగొప్పుల పది సంవత్సరాల క్రితం ఒక ఫ్యాక్షన్ గ్రామం. ఇక్కడ ఒకవైపు ముఠా గొడవలు, హత్యలు జరుగుతుండగా, మరోవైపు బలహీనవర్గాల పై అత్యాచారాలు, దౌర్జన్యాలు కొనసాగేవి. అగ్రవర్ణాలు కుల వివక్ష, అసమానతలు, అంటరానితనం లాంటి దురాచారాలు పాటిస్తూ బలహీనుల పై దౌర్జన్యాలు చేస్తుండేవారు. హోటల్స్‌లో రెండు గ్లాసుల పద్ధతి నిర్బంధంగా అమలు చేస్తుంటారు. హోటల్స్‌లో టీ తాగడానికి వచ్చిన అగ్రవర్ణాలకు, దళిత వర్గాలకు గ్లాసులు వేరువేరుగా వుంచేవారు. అగ్రవర్ణాల వ్యక్తులు బెంచీల పై కూర్చొని టిఫిన్ చేస్తుంటే దళితులు కింద కూర్చోవలసి వచ్చేది. గ్రామం పెత్తందార్లు కొందరు కీచకులై బలహీనవర్గాల మహిళలపై బలవంతంగా అత్యాచారాలు జరపడం నిత్యకృత్యంగా సాగేవి. పొరుగు గ్రామాల నుంచి వివిధ రకాల సరుకులు అమ్ముకోవటానికి వచ్చిన మహిళలు సైతం వీరి కామాగ్నికి సమిధలు అయ్యేవారు. అబలలను బలవంతంగా లొంగ తీసుకోవడం, కాదంటే కాటేసి కాటికి పంపడం చేసే వారు. ఎన్నో రకాల దుర్మార్గాలకు గురైన బాధిత ప్రజలు వీరికి భయపడి పోలీసులకు ఫిర్యాదు చేసేవారు కాదు.

## పీపుల్స్‌వార్ ఆరంగేట్రం

అడిగొప్పులలో నిలువెల్ల ఆకృతి దాల్చిన అత్యాచారాల సంస్కృతి, వెర్రి తలలు వేస్తున్న అంటరానితనం పేదలను పీల్చి పిప్పి చేస్తున్న వడ్డీ వ్యాపారుల దౌష్ట్యాల పై 'వార్' దృష్టి పడింది. గ్రామంలోని సామాజిక, ఆర్థిక పరిస్థితులను తమకు అనుకూలంగా మలచుకోవడానికి 'వార్' నక్సల్స్ అడిగొప్పులను తమకు అనువైన ప్రదేశంగా ఎంపిక చేసుకున్నారు. ఈ గ్రామానికి ఐదు కిలోమీటర్ల దూరంలో ఎత్తైన కొండలు, దట్టమైన అడవి, అక్కడ నీటి వసతి కలిగిన బ్రహ్మదేవుని గుడి ప్రాంతాన్ని తమ స్థావరంగా చేసుకొని నక్సలైట్లు అడిగొప్పులలో తమ కార్యకలాపాలకు శ్రీకారం చుట్టారు. 1995 సెప్టెంబరులో గ్రామంలోని బలహీన వర్గాలు రుణ బాధ నుంచి విముక్తి పొందడానికి 'వార్'ను ఆశ్రయించారు. 'వార్' ఆశీస్సులతో అగ్రవర్ణానికి చెందిన ఒక వ్యక్తి స్థానిక వ్యాపారిని కిడ్నాప్ చేయటం జరిగింది. లక్ష రూపాయల అప్పులను మాఫీ చేసి అదనంగా మరో లక్ష విరాళంగా ఇచ్చే షరతుతో 'వార్' ఆ వ్యాపారిని విడిచిపెట్టింది. ఈ సంఘటనలో వ్యాపారి కిడ్నాప్‌కు కీలకపాత్ర వహించిన వ్యక్తి బలహీనవర్గాల వారికి నాయకుడిగా మారాడు. అతని నాయకత్వంలో గ్రామానికి చెందిన బలహీన వర్గాల ప్రజలు రైతు కూలి సంఘంగా ఏర్పడ్డారు. ఈ సంఘ నాయకులు గ్రామంలోని భూస్వాములు వ్యాపార వర్గాల నుండి పెద్ద మొత్తంలో సొమ్ము వసూలుకు ఉపక్రమించారు. ఇదే సమయంలో రైతు కూలి సంఘం ఆధ్వర్యంలో గ్రామంలోని దేవాలయ భూములను, ప్రభుత్వ హార్టికల్చర్ భూముల ఆక్రమణ, పంపిణీకి రంగం సిద్ధం చేసింది. 1997 ఏప్రిల్‌లో రైతు కూలి సంఘం (మిగతా 59లో)

# మావో'యిస్టుల'కు అడ్డా అడిగొప్పుల

(58వ పేజి తరువాయి)

గ్రామంలోని 200 ఎకరాల దేవుని మాన్యాలను ఆక్రమించి ఎర్ర జెండాలను పాతింది. మే నెలలో 300 ఎకరాల హార్టికల్చర్ ఫారం భూములను కూడా ఆక్రమించగా పోలీసులు జెండాలను తొలగించి 600 మంది రైతు కూలీల పై కేసులు పెట్టారు. దీంతో 'వార్' భూస్వాముల పై ఆగ్రహం వ్యక్తం చేస్తూ భూ పంపిణీకి అడ్డు తగులుతున్న వారిని శిక్షిస్తామని హిట్‌లిస్ట్‌ను ప్రకటించింది. ఆ హిట్‌లిస్ట్‌లో హార్టికల్చర్ ఫామ్ వాచ్‌మెన్ గాడిపర్తి నరసయ్య, యాగంటి వెంకటేశ్వర్లు, ఆరికట్ల మంగయ్య, లింగా సైదయ్యలు వున్నారు. ఆ పరిస్థితులలో గ్రామ భూస్వాములంతా రైతు సంఘంగా ఏర్పడి రైతు కూలీలను పనులకు పిలవకుండా సమ్మె కట్టారు.

## హత్యలకు శ్రీకారం చుట్టిన వార్

1997 అక్టోబరు 5న పీపుల్స్‌వార్ చంద్రవంక దళం గాడిపర్తి నరసయ్యను తీవ్రంగా కొట్టడంతో మృతిచెందాడు. నరసయ్య హత్య కేసులో 11 మంది పై పోలీసులు కేసులు పెట్టి మరో వంద మంది 'వార్' సానుభూతిపరులను అరెస్టు చేశారు. దీంతో గ్రామంలో 'వార్' ప్రాబల్యానికి కొంతకాలం బ్రేక్ పడింది. 1998 ఫిబ్రవరి నెలలో దళితుల పై భూస్వాములు జరిపిన దాడుల్లో రోశయ్య అనే వ్యక్తి తీవ్రంగా గాయపడ్డాడు. ఆగస్టులో 'వార్' నక్సల్స్ కర్లపూడి పిచ్చయ్యను అడిగొప్పులలో కిడ్నాప్ చేసి 75 వేల రూపాయలను డిమాండ్ చేయగా ఒప్పుకున్న సొమ్మును అందించడంలో జాప్యం జరిగింది. ఈ నేపథ్యంలో అక్టోబరు 19 దీపావళి రోజున బలహీనవర్గానికి చెందిన పులి మట్టయ్య పై హత్యాయత్నం జరిగింది. 1999లో యేల్చూరి నారాయణ అనే 'వార్' సానుభూతిపరుని అగ్రవర్ణాల ప్రోద్బలంతో అతని వర్గీయులే రెండు రోజుల పాటు స్తంభానికి కట్టివేసి హింసించారు. ఒక మహిళతో అక్రమ సంబంధం కొనసాగిస్తున్నాడనే నేరం మోపుతూ నారాయణను ఈ హింసకు గురిచేయగా, నారాయణ అక్రమ సంబంధానికి గృహ వసతి కల్పించి సహాయ పడుతుందన్న సాకుతో మరో వృద్ధ మహిళను కూడా కొట్టడం జరిగింది. 2002, ఏప్రిల్ 30న 'వార్' నక్సల్స్ తమ హిట్‌లిస్ట్‌లో వున్న ఆరికట్ల మంగయ్య పై దాడి చేసి తీవ్రంగా కొట్టి వెళ్ళారు. మంగయ్యను కొట్టి అడవుల్లోకి వెళ్ళిన నక్సల్స్ కోసం గ్రేహౌండ్స్ పోలీసులు కూంబింగ్ నిర్వహిస్తుండగా 2002, జూలై 23న క్లైమోర్‌మైన్స్ పేల్చి నలుగురు గ్రేహౌండ్స్ పోలీసులను నక్సలైట్లు హతమార్చారు.

అనంతరం నక్సల్స్, పోలీసులకు మధ్య ఎన్నో హత్యా, విధ్వంసక సంఘటనలు చోటు చేసుకున్నాయి. కాంగ్రెస్ ప్రభుత్వం అధికారంలోకి రాగానే గ్రామంలో కొన్ని నెలల పాటు ప్రశాంత వాతావరణ పరిస్థితులు నెలకొన్నాయి. ఇందిరాప్రభ పథకం కింద హార్టికల్చర్ భూములలో 163 ఎకరాలను ఇటీవల ఆ గ్రామానికి చెందిన పేదలకు పంపిణీ కూడా చేయటం జరిగింది. అదే విధంగా గ్రామంలోని దేవాలయ భూములను కూడా అంతకుముందే నిరుపేదలకు పంపిణీ చేశారు. అయితే కాంగ్రెస్ ప్రభుత్వం పై కూడా క్రమంగా కసి పెంచుకొని మావోయిస్టులు కయ్యానికి దిగుతున్న నేపథ్యంలో అడిగొప్పుల నుంచి మావోయిస్టులు దుర్గి పోలీస్ స్టేషన్ పై దాడికి పథక రచన చేసి అమలు చేశారు. గ్రామంలోని అన్ని వర్గాల నుండి సానుభూతిపరులను కలిగి తమ ఉనికిని ప్రదర్శించే మావోయిస్టులు గత కొన్ని నెలల నుండి గ్రామంలో కార్యకలాపాలకు స్వస్తి చెప్పారు.

కాంగ్రెస్ ప్రభుత్వం మావోయిస్టులపై ఉక్కుపాదం మోపిన నేపథ్యంలో రాష్ట్రవ్యాప్తంగా ఎంతోమంది మావోయిస్టు అగ్రనేతలను ఎన్‌కౌంటర్‌లో మృతిచెందారు. ఎక్కడ మావోయిస్టులకు నష్టం జరిగినా అడిగొప్పులలో రియాక్షన్‌కు పాల్పడే మావోయిస్టులు గత కొన్ని నెలల నుండి ఇందుకు భిన్నంగా వ్యవహరిస్తున్నారు.

ఈ గ్రామానికి చెందిన కొమ్ముల యల్లమంద అలియాస్ భాస్కర్ అనే మావోయిస్టు డిప్యూటీ కమాండర్ 2006, ఫిబ్రవరి 7న కారంపూడి వద్ద జరిగిన ఎన్‌కౌంటర్‌లో మృతిచెందాడు. అప్పటి నుండి అడిగొప్పులలో మావోయిస్టుల ఉనికి కనిపించడం లేదు. నిత్యం వార్తలకెక్కే అడిగొప్పుల ప్రస్తుతం నివురుగప్పిన నిప్పులా వుంది.

## 'వారి' చరిత్రలో ప్రధాన ఘటనలు

1. 5-10-1997 : 'వార్' చేతిలో గాడిపర్తి నరసయ్య హతం
2. 30-4-2002 : ఆరికట్ల మంగయ్య పై దాడి, దేహశుద్ధి
3. 23-7-2002 : క్లైమోర్‌మైన్స్ పేల్చి నలుగురు గ్రేహౌండ్స్ పోలీసుల హత్య
4. 14-10-2002 : మాజీ సర్పంచ్ యాగంటి వెంకటేశ్వర్లు కాల్చి వేత
5. 11-12-2002 : గ్రామ కమిటీ సభ్యుడు బరిసె కోటయ్య అరెస్టు
6. 13-12-2002 : కోటయ్య అరెస్టుకు నిరసనగా కంచరగుంట వద్ద ఆర్‌టిసి బస్సు దగ్ధం.
7. 14-12-2002 : కోటయ్య విడుదలలో జరిగిన జాప్యానికి నిరసనగా అడిగొప్పుల టెలికం ఎక్స్ఛేంజ్ దగ్ధం.
8. 7-1-2003 : గ్రామంలోని హైస్కూల్ వద్ద ఆర్టీసి బస్సు దగ్ధం
9. 10-1-2003 : గ్రామ సమీపంలో మాచవరపు వెంకటేశ్వర్లు ఎన్‌కౌంటర్
10. 3-2-2003 : రాయపాటి అన్నమ్మ, ముత్తయ్యలకు దేహశుద్ధి
11. 15-2-2003 : అడిగొప్పులకు చెందిన బత్తుల రామారావు, మామిడి కోటయ్యలు అనే వార్ మిలిటెంట్లు దావ

పల్లి ఎన్‌కౌంటర్‌లో మృతి

12. 15-4-2003 : పమిడిపాడు ఎన్‌కౌంటర్‌కు నిరసనగా గ్రామ సమీపంలో ఆర్టీసి బస్సు దగ్ధం
13. 11-5-2003 : బ్రహ్మదేవుని గుడి వద్ద 14 మందుపాతర్లను స్వాధీనం చేసుకున్న పోలీసులు
14. 25-5-2003 : 'వార్'చే నలబోతుల రామాంజనేయులు కాల్చివేత
15. 27-5-2003 : వార్ మిలిటెంట్ యల్లమంద గృహ దగ్ధం
16. 13-6-2003 : గ్రామ సమీపంలో వార్ మిలిటెంట్ గంటెనపల్లి గురవయ్య ఎన్‌కౌంటర్
17. 4-7-2003 : అడిగొప్పులలో భారీ ఎత్తున క్లైమోర్ మైన్స్, మందుపాతర్లు స్వాధీనం చేసుకున్న పోలీసులు.
18. 22-7-2003 : రాయపాటి అన్నమ్మ వార్‌చే కాల్చివేత
19. 10-5-2005 : దుర్గి పోలీస్‌స్టేషన్ పై మావోయిస్టుల దాడికి అడిగొప్పుల నుంచే పథక రచన
20. 23-8-2005 : గుట్టపల్లి సత్యంను కాల్చి చంపిన మావోయిస్టులు
21. 16-11-2005 : మావోయిస్టుల చేతిలో వేమూరి అంజి హతం
22. 7-2-2006 : కారంపూడి ఎన్‌కౌంటర్‌లో మావోయిస్టు డిప్యూటీ కమాండర్ యల్లమంద మృతి


గంటెల మరియమ్మ

# వృద్ధుల పాలిట ఆశాజ్యోతి మరి'అమ్మ'


తుమ్మలచెరువులోని వృద్ధుల అనాథాశ్రమం

(ఆన్‌లైన్-పిడుగురాళ్ళ)

పేరు గంటెల మరియమ్మ. వయస్సు 48 సంవత్సరాలు. ఊరు గుంటూరు జిల్లా పిడుగురాళ్ళ మండలం తుమ్మలచెరువు. మధ్య తరగతి కుటుంబ నేపథ్యం. ఆమెకు బొత్తిగా అక్షరం ముక్క రాదు. నాలుగు వినసొంపైన మాటలతో ఎదుటి వారిని అట్టే ఆకట్టుకునే తెలివితేటలూ లేవు. కానీ పుట్టుకతోనే అలవడిన సేవా సద్గుణం ఆమెను ఎందరో దిక్కులేనోళ్ళకు అమ్మను చేసింది. తాము కని, పెంచి, పెద్ద చేసిన బిడ్డల ప్రేమ, మమకారాలు నోచుకోని వృద్ధుల పాలిట ఆశాజ్యోతిని చేసింది. ఒకరు కాదు ఇద్దరు కాదు. మొత్తం 60 మంది అనాధ వృద్ధులకు ఆమె మరి'అమ్మ'. ఓ మారుమూల గ్రామంలో విజయవంతంగా నడపబడుతున్న అనాథ వృద్ధాశ్రమ విశేషాలు ఆమె మాటల్లోనే...

## పొట్టకోస్తే అక్షరం ముక్క రానిదానివన్నారు...

మాది చాలా పేదకుటుంబం. అందువల్లే అమ్మానాన్న నన్ను చదివించలేదు. రైల్వేలో నాలుగో తరగతి ఉద్యోగికిచ్చి పెళ్ళి చేశారు. పిల్లలు పుట్టిన కొన్నేళ్ళకు కొంతమంది మహిళలతో కలసి మహిళామండలి స్థాపించాను. దానికి ఋణాలు పొందేందుకై తరచూ ప్రభుత్వ కార్యాలయాల చుట్టూ తిరగవలసి వచ్చేది. ఎక్కువ సార్లు పట్టణానికి వెళ్ళవలసి వచ్చేది. అలా వెళుతున్నపుడు ఏదిక్కూ లేకుండా రైళ్ళలో, బస్టాండుల్లో అడుక్కునే ముసలివాళ్ళను చూస్తే ప్రాణం తరుక్కుపోయేది. వాళ్ళకు ఆపరిస్థితి ఎందుకు ఏర్పడిందని అడిగి తెలుసుకునేదాన్ని. ఎక్కువ మంది కన్న బిడ్డలున్నా వాళ్ళు చూడనందువల్లే ఇలా భిక్షమెత్తాల్సి వస్తుందని చెప్పి కళ్ళ నీళ్ళు పెట్టుకునేవాళ్ళు. ఇటువంటి వృద్ధులకు అంతో ఇంతో సాయపడటంలోనే నిజమైన సేవ దాగుందని నాలో నేను అనుకునేదాన్ని. అదే తడవుగా గుంటూరులో ఉన్న మహిళా శిశు సంక్షేమ శాఖ అధికారిని కలసి వృద్ధాశ్రమం నడుపుతాను అని చెప్పాను. నామాటలువిన్న ఆఅధికారి నవ్వారు. పొట్టకోస్తే అక్షరం ముక్క రాని దానివి వృద్ధాశ్రమం నడపటం నీవల్ల ఏమవుతుందని ప్రశ్నించారు. ఎట్టకేలకు దరఖాస్తు ఫలానా చోట దొరుకుతుందని హైదరాబాదులో ఓ అడ్రసు రాసిచ్చారు.

## ప్రధాన మంత్రి వద్దకు వెళ్ళా..

హైదరాబాదులో అప్పటి ఎంపి కాసు వెంకట కృష్ణారెడ్డిని వెంటపెట్టుకెళ్ళి దరఖాస్తు తీసుకుని పూర్తి చేయించుకొని ఢిల్లీ వెళ్ళాను. మూణ్ణెల్ల పాటు వృద్ధాశ్రమం మంజూరు చేయించుకునేందుకు అక్కడే ఉండాల్సి వచ్చింది. ఆకాగితం లేదు... ఈకాగితం లేదని హిందీలో మాట్లాడే అధికారులు నన్ను ఉరుకులు పరుగులు పెట్టించేవారు. అయినా కూడా అవసరమైన అన్ని సర్టిఫికెట్లను తీసుకెళ్ళి ఇచ్చేదాన్ని. తీరా మంజూరు చేయబోయే సమయంలో ఇంకేమైనా కాగితాలు కావాలా అని నేనే వాళ్ళను అడిగాను. ఆ... కావాలి...ప్రధాన మంత్రి సంతకం కావాలని హేళనగా మాట్లాడారు. వెంటనే దరఖాస్తు తీసుకుని (మిగతా 61లో)


ఆశ్రయం పొందుతున్న వృద్ధులు


ఆశ్రయమే కాదు..కడుపు నిండా భోజనం కూడా

# వృద్ధుల పాలిట ఆశాజ్యోతి మరి'అమ్మ'

(60వ పేజి తరువాయి)

ప్రధాన మంత్రి పి.వి. నరసింహారావు దగ్గరకు వెళ్ళాను. ఆయన నన్నుచూసి ఏంకావాలమ్మా అని అడిగారు. ఆంధ్రాలోని గుంటూరు జిల్లానుండి వచ్చానని చెప్పాను. చూడబోతే చదువుకున్న దానిలాగా లేవు. నీకు హిందీకూడా వచ్చినట్టు లేదు. అంతదూరం నుండి నాదగ్గరకు ఎందుకొచ్చావని అడిగారు. అనాథ వృద్ధాశ్రమం నడుపుతాను అంటే మూడు నెలలనుండి మంజూరు చేయకుండా కార్యాలయం చుట్టూ తిప్పుతున్నారని చెప్పాను.

అంతదూరం నుండి ఇంతదూరం వచ్చినందుకైనా నీకు ఈ అనాథాశ్రమాన్ని తప్పనిసరిగా మంజూరు చేయిస్తానని చెప్పిన ప్రధాన మంత్రి నాముందే అధికారులకు ఫోన్ చేసి ఆమె ఖచ్చితంగా దానిని నడపగలుగుతుంది... ఆశ్రమాన్ని మంజూరు చేయమని ఆదేశించారు.

## 25 మందితో ఆశ్రమం ప్రారంభం

1993లో నేనుండే ఇంటిలో 25మంది అనాథ వృద్ధులతో ఆశ్రమాన్ని ప్రారంభించాను. 1994కి ఆశ్రమంలో ఉండే వృద్ధుల సంఖ్య 50కి చేరింది. అప్పటి నుండి కేంద్ర ప్రభుత్వం 25మందికి గ్రాంటునివ్వటం ప్రారంభించింది. అప్పటి నుండి ఆశ్రమాన్ని గ్రామంలో ఓ ఇల్లు అద్దెకు తీసుకుని నడపటం ప్రారంభించాను. ఆతరువాత మా అమ్మానాన్న నాకు పసుపు కుంకుమ కింద ఇచ్చిన రెండెకరాల 50సెంట్ల పొలాన్ని అమ్మి ప్రత్యేకంగా ఆశ్రమాన్ని నిర్మించాము. ప్రతిరోజూ 50 కంటే ఎక్కువ మంది వృద్ధులే ఇక్కడ భోజనం చేస్తారు.

ఎంత మంది చేసినా ప్రభుత్వం డబ్బులిచ్చేది మాత్రం ఆ పాతిక మందికే. అయినా ఏంచేస్తాం... ఎంతో మంది ఇక్కడకు వచ్చి చేర్చుకోక పోతే రైలు కింద పడి ఆత్మహత్య చేసుకుంటామని కళ్ళనీళ్ళు పెట్టుకుంటారు. రైల్వే స్టేషన్లో పండుకుంటే పోలీసులు కొడుతున్నారని బాధపడతారు.

పోనీలేమ్మా అని చేర్చుకుంటే చనిపోయిన తరువాత శవాన్ని తీసుకెళ్ళేందుకు కూడా సొంతవాళ్ళు రారు. అలా రాకపోవటం వల్ల 25 మంది వృద్ధులను నేనే దహనం చేయవలసి వచ్చింది.

## గ్రాంటు రాక ఎన్నో ఇబ్బందులు

ప్రభుత్వం నాదగ్గర ఉండే కొద్ది మంది వృద్ధుల కోసం విడుదల చేసే గ్రాంటు సక్రమంగా రాదు. కొన్ని సార్లు వృద్ధులకు కూడు పెట్టాలంటే బయట వడ్డీకి తీసుకురావాల్సి వస్తుంది. నాభర్తకు వచ్చే 4 వేల రూపాయల జీతం కూడా ఈ ఆశ్రమానికే ఖర్చు పెడుతున్నాం. పిడుగురాళ్ళలో ఉన్న 'సూర్యా సెమ్' యాజమాన్యం అప్పుడప్పుడు ఆదుకుంటుంది. మరికొంతమంది అలా ముందుకు వచ్చి చేయూతనివ్వ గలిగితే మరెంతో మంది అనాథ వృద్ధులకు ఇక్కడ ఆశ్రయం కల్పించేందుకు నేను సిద్ధంగా ఉన్నాను. ఇప్పటికే గుంటూరు, ప్రకాశం, కృష్ణా, నల్గొండ, శ్రీకాకుళం జిల్లాలకు చెందిన వృద్ధులు ఈ ఆశ్రమంలో తల దాచుకుంటున్నారు. వారిని, అటువంటి మరికొందరిని ఆదుకునేందుకు దాతలు సహకరించాలని విజ్ఞప్తి చేస్తున్నాను. అడ్రస్ : కేంద్ర సాంఘీక, సంక్షేమ శాఖ అనాథ వృద్ధాశ్రమం, కేరాఫ్ గంటెల మరియమ్మ, తుమ్మల చెరువు పోస్టు, పిడుగురాళ్ళ మండలం, గుంటూరు జిల్లా, ఫోన్:08649-270233, 270057.

# వెండితెర వేల్పులకు..

# నడకలు నేర్పిన గుంటూరు

గుమ్మడి, సావిత్రి

జగ్గయ్య, కృష్ణ

పోసాని కృష్ణమురళి

శారద

బ్రహ్మానందం

ఎవిఎస్

(ఆన్‌లైన్ - గుంటూరు)

సినిమా రంగానికి, గుంటూరు జిల్లాకు అవినాభావ సంబంధం వుంది. ఎందరో మహానటులు, సినీ రచయితలకు, దర్శకులకు జన్మభూమి గుంటూరు జిల్లా. అందులో ఎక్కువమంది కళలకు కాణాచిగా పేరొందిన తెనాలి పరిసర ప్రాంతాల నుంచి వచ్చిన వారే. ఈ దేశంలో రాముడు, కృష్ణుడు వంటి పురాణ పురుషులు ప్రజల మనసుల్లో వున్నంతకాలం మహానటుడు ఎన్‌టి రామారావు ప్రజల హృదయాల్లో చిరస్థాయిగా నిలుస్తారు. సినీ రంగాన్ని శాసించి, సినీ జగత్తులో తిరుగులేని, ఎదురులేని మహానటుడు ఎన్‌టి రామారావు విద్యాభ్యాసం అంతా గుంటూరు జిల్లాలోనే సాగింది. ఆయన గుంటూరు ఆంధ్ర క్రైస్తవ కళాశాలలోనే చదివారు. పైగా గుంటూరు సబ్ రిజిస్ట్రార్ కార్యాలయంలో పనిచేశారు. ఇక్కడి నుంచి ఆయన నేరుగా మద్రాసు వెళ్లి సినిమాలలో వేషం వేశారు. ఇక నాటికీ, నేటికీ సినిమా రంగంలో హీరోగా వెలుగొందుతున్న నటశేఖరుడు హీరో ఘట్టమనేని శివరామకృష్ణ(కృష్ణ) తెనాలికి సమీపంలోని బుర్రిపాలెం వాస్తవ్యుడు. ఇక ఈయన సోదరులు జి.హనుమంత రావు, జి. ఆదిశేషగిరిరావులు ఇరువురు నిర్మాతలుగా వున్నారు. ఇక మహానటి సావిత్రి గుంటూరు జిల్లా తాడేపల్లి మండలం చిర్రావూరు గ్రామానికి చెందినది. అప్పటికీ, ఇప్పటికీ సినీరంగంలో తనకంటూ ప్రత్యేక స్థానాన్ని ఏర్పరచుకున్న ఊర్వశి శారద తెనాలి వాస్తవ్యురాలే. 1998 పార్లమెంటు ఎన్నికల్లో మాత్రం పరాజయం పాలయ్యారు. గుమ్మడి వెంకటేశ్వరరావు, ధూళిపాళ్ల, జగ్గయ్య, ముక్కామల వంటి నటుల జన్మస్థలం కూడా గుంటూరు జిల్లాయే.

ఇక ప్రస్తుతం సినీరంగంలో హాస్యానికి పెట్టింది పేరు బ్రహ్మానందం, ఎవియస్‌లు కూడా గుంటూరు జిల్లా వారే. బ్రహ్మానందం సత్తెనపల్లి వాస్తవ్యులు కాగా, ఎవియస్ తెనాలికి చెందినవాడు. ఇక శుభాకాంక్షలు, సుస్వాగతం, సుప్రభాతం, సూర్యవంశం, శుభమస్తు వంటి హిట్ చిత్రాలను ఆంధ్ర సినీ ప్రేక్షకులకు అందించిన యువ దర్శకుడు భీమినేని శ్రీనివాసరావు చిలకలూరిపేట ప్రాంతానికి చెందినవారు.

మాటలను తూటాలుగా మలచి మాటలు రాస్తే ఆ సినిమా విజయవంతమయ్యే పోసాని కృష్ణమురళి గుంటూరు జిల్లా పెదకాకానికి చెందినవాడే. వర్ధమాన నటుడు శివాజీ ఎన్నో చిత్రాలలో వేస్తున్నాడు. శివాజీది చిలకలూరిపేట. మరెందరో వర్ధమాన నటులకు, మహానటులకు గుంటూరు జిల్లా జన్మనిచ్చింది. అందుకే సినిమా పరిశ్రమ జిల్లాలో పెనవేసుకుపోయింది. ఇక రాష్ట్ర సినిమా వ్యాపారం కోస్తా ప్రాంతం 60 శాతం వాటా వుండే పాత గుంటూరు జిల్లాగా పిలువబడే గుంటూరు, ప్రకాశం జిల్లాలో కొంతభాగం 20 శాతం వాటాకు ప్రాతినిధ్యం వహిస్తుంది.

## కాణిపాకంను తలపిస్తున్న

# వినుకొండ క్షేత్రం

**ఆన్‌లైన్ - వినుకొండ**

లంబోదరుడు, దేవగణాధీశుడు, శుభకరుడు, సిద్ధి, బుద్ధిప్రధాత, గజానను పలు రూపాల్లో భక్తుల పూజలందుకొంటుండగా వినుకొండలో స్వయంభువుగా వెలసి భక్తులు పిలిస్తే పలికే ప్రత్యక్ష దైవంగా వరసిద్ధి వినాయకుడుగా విశేష పూజలందుకుంటున్నాడు. భక్తుల ఇలవేల్పుగా పూజింపబడుతోన్న వరసిద్ధి వినాయకుడు శ్రీరామచంద్రునిచే పూజలందుకొన్నట్లు చరిత్రకారులు చెబుతున్నారు. చిత్తూరు జిల్లా కాణిపాకం వినాయకుడు మాదిరిగా వినుకొండ వరసిద్ధి వినాయకుడిని ప్రత్యక్ష దైవంగా కొలుస్తారు. భారతదేశంలోనే అరుదుగా కన్పించే వినాయకుని విగ్రహాలలో ఒకటిదిగా ఆరడుగుల శయనాకార శిలపై స్వామి స్వయంభువుగా భక్తులకు దర్శనమిస్తున్నారు. స్వామివారు ప్రకృతి సిద్ధంగా కొండగుహ వద్ద త్రిశక్తి రూపంలో వెలసివున్నారు. సహజసిద్ధంగా ఈశాన్యంగా వున్న పుష్కరిణి ఒడ్డున దక్షిణాభిముఖంగా స్వామి కొలువుదీరి ఉన్నాడు. గౌరీదేవి స్వరూపంగా కొలిచే (మిగతా 64లో..)



కొండమెట్ల వద్ద వెలసిన శ్రీ వరసిద్ధి వినాయకస్వామి

# కాణిపాకంను తలపిస్తున్న వినుకొండ క్షేత్రం

(63వ పేజీ తరువాయి)

వేపచెట్టు ఒకవైపు, లక్ష్మీస్వరూపంగా ఆరాధించే రావిచెట్టు మరోవైపు, విష్ణు రూపంగా పూజించే మర్రి చెట్టు ఇంకోవైపు, ఈ మూడు వృక్షరాజాల మధ్య స్వామి వాయుతత్వంతో వెలయడంతో ఈయనను వృక్ష గణపతిగా పూజిస్తారు. పడమరవైపున ఏనుగు తొండం ఆకారంలో శిలారూపం మధ్యలో సహజసిద్ధంగా ఏర్పడిన దీపం చిమ్మె స్వామివారికి హారతినిస్తున్నట్లు కన్పిస్తుంది. భక్తులు ప్రత్యక్షంగా కొలిచే నాగుపాము స్వామివారి చుట్టూ రోజూ ఏదో ఒక సమయంలో ప్రదక్షిణం చేయడం వల్ల హేరంభగణపతిగా కూడా ఆరాధిస్తున్నారు. నాగాభరణాలు ధరించి ఉండటం మూలంగా ఈక్షేత్రం కుండలినీ యోగ సాధకులకు యోగ్యమైనదంటారు. అయితే ఇన్ని విశేషాలున్న స్వామి కొన్ని దశాబ్దాలుగా ముళ్ళ చెట్ల పొదల్లో అజ్ఞాతంలో వున్నారు. కొందరు భక్తుల సత్సంకల్పంతో పూర్వ వైభవం లభించింది. రామలింగేశ్వరస్వామి కొండమెట్ల వద్ద స్వయంభువై వెలసిన వరసిద్ధి వినాయకుడు భక్తుల పాలిట ప్రత్యక్ష దైవంగా నిదర్శనాలు చూపుతూ రోజురోజుకు స్వామివారిని దర్శించే భక్తుల సంఖ్య పెరిగింది. మహారాష్ట్రలోని షిర్డీ సమీపంలోని శింగనాపూర్ తరహాలో 24 గంటల పాటు సర్వవేళలా స్వామివారిని భక్తులు దర్శించవచ్చు. స్వామిని దర్శించేందుకు టిక్కెట్ లేదు. దేవస్థానం ప్రాంగణంలో హుండీ లేదు. అర్చనలకు దక్షిణలు లేకపోవడం విశేషంగా చెప్పవచ్చు. నిత్య ధూపదీప నైవేద్యాలతో పూజలందుకుంటున్న స్వామివారికి అత్యంత ప్రీతిపాత్రమైన తెల్ల జిల్లేడుచెట్టుకు పసుపు కుంకుమలతో పూజ జరుగుతుంది. ప్రతిరోజు అభిషేకంతో పూజాది కార్యక్రమాలు ప్రారంభమవుతాయి. బుధవారం క్షీరాభిషేకం జరుగుతుంది. స్వామివారి దేవస్థానంలో హోమాలు, వినాయక వ్రతాలు, సంక్లిష్ట గణపతి వ్రతాలు, గోత్రి రాత్రి పూజలు నిర్వహిస్తారు. గణపతి నవరాత్రి ఉత్సవాలతో పాటు దసరా, కార్తీక మాసాలలో విశేష పూజలు జరుగుతాయి. పలు ప్రత్యేక విశిష్టతలున్న ఈ క్షేత్రాన్ని దర్శించిన పలువురు దైవోపాసకులు, సిద్ధాంతులు వినుకొండ మరో కాణిపాకంగా వృద్ధి చెందుతుందని పేర్కొన్నారు. ప్రపంచ వ్యాప్తంగా పలుదేశాల్లో యజ్ఞ, యాగాదులు నిర్వహించిన వారణాశికి చెందిన విశ్వనాథ శాస్త్రి స్వామివారి సన్నిధిలో గణపతి హోమం నిర్వహించారు. అలాగే రాష్ట్ర బ్రాహ్మణ యజ్ఞ సేవా సంఘం అధ్యక్షుడు కోట శ్రీరామచంద్రమూర్తి స్వయంగా గణపతి హోమం, వరుణ హోమం చేసిన రెండు గంటల వ్యవధిలో కుండపోతగా భారీ వర్షం కురవడమే స్వామివారి మహిమకు నిదర్శనంగా పేర్కొంటారు. ఆగమశాస్త్ర ప్రకారం స్వామివారికి ఆలయం నిర్మించాలన్నదే తన ధ్యేయమని ఆలయ అభివృద్ధి కమిటీ కన్వీనర్ పువ్వాడ వెంకటరత్నం తెలిపారు. ఇన్ని విశేషాలున్న ఈ వరసిద్ధి వినాయక క్షేత్రం కూడ మరో 'కాణిపాకం' కాగలదని ఉపాసకుల విశ్వాసం.

స్వామి వారి విశేషాలు

* త్రేతాయుగంలో రావణ సంహారానంతరం, శ్రీరామ చంద్రుడు వినుకొండ వద్దనున్న కొండపైన రామలింగేశ్వరస్వామిని, కొండ దిగువ నున్న వినాయక స్వామిని ప్రతిష్ఠించి సేవించినట్లు పురాణాన్ని బట్టి తెలుస్తోంది. * శ్రీరాముడు జటాయువు వల్ల సీత జాడ 'విన్నకొండ' కనుక ఇది వినుకొండ అయిందని చెబుతారు. * దక్షిణాభిముఖంగా భూమ్యాకాశాలను పరికిస్తున్నట్లుగా మలచబడ్డ ఈ సిద్ధి వినాయక స్వామిని భక్తులు త్రిశక్తి స్వరూపంగా భావిస్తారు.

*త్రిశక్తి స్వరూపాలైన వేప, రావి, మర్రిచెట్ల మధ్యలో వెలసిన ఈ గణేశుని వృక్ష గణపతిగా కూడా వ్యవహరిస్తారు. కొందరు స్వర్ణగణపతి అనీ, హేరంబ గణపతీ అని అంటారు.

* గణేశుని విగ్రహం దక్షిణాభిముఖంగా వుంటే, ఆయన వాహనమైన మూషికం మాత్రం తూర్పు దిశకు తిరిగి వుండటం విశేషం.

* ఈ గణేశునికి సర్పములే ఆభరణాలుగా వుండటంతో, ఇది కుండలినీ యోగ సాధకులకు వరప్రసాద మన దగ్గ విగ్రహమని, ఇటు వంటివి చాలా అరుదుగా వుంటాయని యోగులు సెలవిస్తున్నారు. దీని విశిష్టత తెలియాలంటే కుండలిని, సహస్రారం యోగశాస్త్ర పరిచయం అవసరం. * ఇక్కడ మరో విశేషం కూడా వుంది. ఆరుబయలు ప్రదేశం. ఇక్కడ వానరాలు కూడా అధికం. అయినా అవి పూజా ద్రవ్యాలను గాని, స్వామివారి నైవేద్యాలను ఎత్తుకు పోవడం గాని జరగదు.

* చరిత్రకారుల అభిప్రాయం ప్రకారం ఎంతో సుందర మైన ఏకశిలలో చెక్కిన అతిపురాతన విగ్రహం ఇది. స్వామివారి చెంత ఆయనకు అత్యంత ప్రియమైన తెల్ల జిల్లేడు చెట్టు కూడ చూడగలం.

* కుజదోషం వుండి వివాహంకాని కన్యలకు, ఈ స్వామిని దర్శిస్తే వివాహం జరుగుతుందని, ప్రదక్షిణ ప్రియుడు గణేశుడు కనుక బుధవారం మొదలు 9 రోజులు స్వామికి ప్రదక్షిణలు చేసి మోదకప్రియుడు గనుక కుడుములు, లడ్లు నైవేద్యం చేసి భక్తితో అర్చిస్తే సంతాన ప్రాప్తి తథ్యమని నిదర్శనాలున్నాయి.

* విదేశీయానం కోసం ప్రయత్నించే వారు స్వామి వారిని కొలిస్తే వీసాలు త్వరగా వస్తాయని క్షేత్రాన్ని సందర్శించిన ప్రముఖ జ్యోతిష్య సిద్ధాంతి హైదరాబాద్‌కు చెందిన గుంటుపల్లి వెంకట సత్య సాయిరాం వెల్లడించారు.

* వ్యాపార లావాదేవీల్లో నష్టాల పాలై ఆస్తులు పోగొట్టుకున్నవారు స్వామిని దర్శించి పూజిస్తే తిరిగి వారి ఆస్తులు చేకూరుతాయని సాయిరాం పేర్కొన్నారు.

* స్వామివారిని అభిషేకించిన విత్తనాలను పొలాల్లో చల్లితే పంటలు బాగా పండుతాయనే నానుడి వుంది.

* వినాయక నవరాత్రి ఉత్సవాలను పురస్కరించుకుని చివరి రోజు ఆలయ ప్రాంగణంలో గణపతి హోమం నిర్వహించిన అనంతరం నిమజ్జనానికి బయలుదేరే ముందు గ్రామ శుద్ధి కోసం ప్రతి ఏటా కుండపోతగా వర్షం కురియడం స్వామివారి మహిమలకు నిదర్శనం.

* విజయవాడ శ్రీశైలం రహదారిలో గుంటూరు–కర్నూలు రహదారి వినుకొండలో వున్న ఈ దివ్య క్షేత్రం జిల్లా కేంద్రానికి 90 కి.మీ దూరంలో వుంది.



## అంతర్జాతీయ ఖ్యాతి గడించిన..

# కెసిపి సిమెంట్స్

(ఆన్‌లైన్, మాచర్ల)

నాణ్యత, ఆధునికతల మేళవింపుతో అంతర్జాతీయంగా ప్రశంసలు పొందుతోంది మాచర్ల కెసిపి సిమెంట్స్. పల్నాటి యుద్ధం ద్వారా చరిత్ర పుటలకెక్కిన మాచర్ల కెసిపి సిమెంట్స్ కర్మాగారం పుణ్యమా అని ప్రపంచవ్యాప్త గుర్తింపుకు నోచుకుంది. ఓ చిన్న కుగ్రామంలో పుట్టిన ఓ మహనీయుడు స్థాపించిన పరిశ్రమలు నేడు వేలాది మందికి భృతిని కల్పిస్తున్నాయి. 1896, మార్చి 4న రేపల్లె మండలంలోని బెల్లంవానిపాలెంలో జన్మించిన వెలగపూడి రామకృష్ణ కెసిపి స్థాపకులు. 1955లో ఐఎఎస్ అధికారిగా పనిచేస్తున్న ఆయన స్వచ్ఛంధ పదవీ విరమణ చేసి మాచర్లలో కెసిపి సిమెంట్ కర్మాగారాన్ని స్థాపించారు. ఏడాదికి లక్ష టన్నుల ఉత్పత్తి సామర్థ్యంతో 1958లో దీని నిర్మాణం పూర్తయింది. రామకృష్ణ అకుంఠిత దీక్ష, ధృడ విశ్వాసంతో కెసిపిని అంచలంచెలుగా అభివృద్ధి పరిచారు. దీని నాణ్యతను గుర్తించే నాగార్జునసాగర్, శ్రీశైలం భారీ ప్రాజెక్టుల నిర్మాణంలో 13,42,302.8 టన్నుల సిమెంట్‌ను వినియోగించారు. నేడు ఇది 5 లక్షల టన్నుల ఉత్పత్తి సామర్థ్యం కలిగి వందలాది కార్మికులకు, అధికారులకు ఉపాధిని కల్పిస్తోంది. ప్రపంచ బ్యాంక్ నిధుల సహకారంతో ఐదు అంచెల ప్రీ కాల్సినర్ డ్రై ప్రాసెస్ ప్లాంట్‌ను 420 మిలియన్ల పెట్టుబడితో స్థాపించారు. దీనితో హై స్ట్రెంత్ పోర్ట్‌లాండ్ సిమెంట్, సల్ఫేట్ రెసిస్టెన్స్ సిమెంట్, రైల్వే స్లీపర్‌లకు, చమురు బావులకు పనికివచ్చే సిమెంట్ తయారీ సాధ్యమైంది. 1994లో ఎల్ఆర్‌క్యూఎ(బ్రిటన్) ద్వారా ఐఎస్ఓ–9002 సర్టిఫికెట్‌ను కెసిపి పొందగలిగింది. ఆర్డినరి పోర్ట్‌లాండ్ సిమెంట్ తయారీలో కెసిపి సిమెంట్స్ దేశంలోనే మొదటిస్థానాన్ని ఆక్రమించింది. పుల్లర్ కెసిపిగా ప్రసిద్ధికెక్కిన ఈ సంస్థలో తయారయ్యే సిమెంట్ (మిగతా 65లో..)

(64వ పేజీ తరువాయి)

బర్మా, శ్రీలంక, సింగపూర్ తదితర దేశాలకు సైతం ఎగుమతి చేయబడుతుంది. సిమెంట్ పరిశ్రమలలో ర్యూమాటిక్ కన్వేయింగ్ సిస్టమ్‌ను ప్రవేశపెట్టి కెసిపి తన ఉత్పత్తిని గణనీయంగా పెంచుకుంది. కెసిపి యాజమాన్యం కేవలం వ్యాపార రంగానికే పరిమితం కాకుండా పట్టణ ప్రజల అవసరాలను తీరుస్తూ ప్రశంసలు పొందుతోంది. ఈ సంస్థ ఇక్కడ ఎన్నో సేవా కార్యక్రమాలను చేపట్టింది.

జన్మభూమి పథకం కింద వివిధ వార్డుల్లో చేపట్టిన సిసి రోడ్ల నిర్మాణానికి ప్రజా విరాళంగా రూ.11 లక్షల విలువైన సిమెంట్‌ను అందజేసింది. పల్నాడులో నెలకొన్న కరువు పరిస్థితుల నుండి పేదలను ఒడ్డుకు చేర్చేందుకు రూ. 2 లక్షల విలువైన బియ్యాన్ని సరఫరా చేసింది. వెల్దుర్తి మండలం మండాది గ్రామాన్ని

# అంతర్జాతీయ ఖ్యాతి గడించిన కెసిపి సిమెంట్స్

దత్తత తీసుకున్న కెసిపి సంస్థ అక్కడ రామాలయం, కళ్యాణ మండపం నిర్మాణానికి పూనుకొని రూ. 10 లక్షలు వెచ్చిస్తోంది. విద్యా వ్యాప్తికి కృషి చేసే సెయింట్ ఆన్స్ సంస్థ పాఠశాల భవనానికి రూ. 15 లక్షలు విలువైన నాలుగు ఎకరాల విస్తీర్ణం గల స్థలాన్ని విరాళంగా ఇచ్చింది.

ప్రముఖ పర్యాటక కేంద్రమైన నాగార్జునసాగర్‌లో పర్యాటకులను అలరించేందుకు రూ. 1 లక్ష వ్యయ పరచి పార్కులను అభివృద్ధి పరచింది. గతంలో క్వారీగా ఉపయోగపడిన 35 ఎకరాల ప్రదేశాన్ని పట్టణ ప్రజల దాహార్తిని తీర్చేందుకు పురపాలక సంఘానికి ఉచితంగా అందజేసింది. ఇండో అమెరికన్ క్యాన్సర్ ఇన్‌స్టిట్యూట్ అండ్ రీసెర్చ్ సెంటర్, రోటరీ క్లబ్‌ల సహకారంతో ఉచిత క్యాన్సర్ శిబిరాన్ని ఏర్పాటుచేసి పరీక్షలను నిర్వహించింది.

కార్మిక కుటుంబాలలో మహిళలకు అక్షరదీప్తి, కుట్లు, అల్లికలు వంటి పనులను నేర్పి మహిళాభ్యుదయం కోసం కృషి చేస్తోంది. ప్రస్తుత మేనేజింగ్ డైరెక్టర్ వి.ఎల్.దత్తు, ఆయన సతీమణి ఇందిరాదత్తుల ఆధ్వర్యంలో చీఫ్ ఎగ్జిక్యూటివ్ దొడ్డపనేని ఎస్.ఎన్.వి.ప్రసాద్ పర్యవేక్షణలో కెసిపి పురోగమిస్తోంది.



అత్యధిక సామర్థ్యం గల ఫైబర్ గ్లాస్ బ్యాగ్ హౌస్


గోపినాథస్వామి దేవాలయంపై పెరిగిన చెట్లు


రూపురేఖలు కోల్పోయిన నంది విగ్రహం


కొండపైన రాజాంతఃపురం

# నాడు ఘనం.. నేడు దయనీయం

## శిథిలావస్థకు చేరుకున్న కొండవీడు

(ఆన్‌లైన్ - యడ్లపాడు)

ఒకప్పుడు సంగీత, సాహిత్య రంగాలలోను, అద్భుత శిల్ప కళా నైపుణ్యంతో కూడిన కట్టడాలతో పేరొందిన కొండవీడు... నేడు శిథిలావస్థకు చేరుకున్న కట్టడాలు అసాంఘిక శక్తులకు నిలయంగా మారి చూపరులకు కడు భయంగా కనిపిస్తుంది. వివరాల్లోకి వెళితే యడ్లపాడు మండల పరిధిలోని కోట చిన్నగ్రామం కాని పూర్వంలో కొండవీడు సామ్రాజ్యంనకు కేంద్రంగా వెలుగొందింది. కానీ నేటి పాలకులకు పురాతన ప్రదేశాలపై శ్రద్ధ లేకపోవటంతో అసాంఘిక శక్తులకు నిలయంగా మారింది. దక్షిణ భారత దేశంలో ఎక్కడా లేని ఏకశిలా రాతితో కూడిన నంది విగ్రహం ఇక్కడ పొలాల్లో పడి వుంది. గుప్త నిధుల వేటలో నందిని పగల గొట్టారు. గోపినాధ స్వామి దేవాలయం నేడు పూర్తిగా శిథిలమై చెట్లు పెరిగి కూలే దశకు వచ్చింది. ఈ దేవాలయంలోనే కత్తుల బావి కూడా వుంది. కుతంత్రం పన్నారు అన్న నెపంతో 70 మంది సామంత రాజులను విందుకు పిలిచి కత్తుల బావిలో పడేటట్లు చేసి చంపినట్టు చరిత్ర ఆధారం. ఈ దేవాలయం కూడా గుప్త నిధుల వేటలో కుంటలుగా మారింది. మొత్తం కొండవీడు రాజ్యంను 18 పేటలుగా విభజించి కొండవీడు రెడ్డిరాజులు పరిపాలించారు. అంతేకాక ఈ కొండవీడు రాజులు తమ సామ్రాజ్యంను శత్రు దుర్భేద్యమైన కోటగా మార్చారు. ఆరు కిలోమీటర్ల పైగా నిర్మాణం చేసి అందులో మొసళ్ళు పెంచేవారు. అంతేకాక కొండపైన ఇతరుల రాకపోకలను గమనించటానికి సైనిక బురుజులను ఏర్పాటు చేశారు. కొండపైన మంచినీటి ఎద్దడి నిర్మూలన కోసం పది మంచినీటి చెరువుల నిర్మాణం చేశారు. ఇంత అభివృద్ధికి నోచుకొని తెలుగువాడి కీర్తిని భారతదేశం అంతా చాటిన కొండవీడు సామ్రాజ్యం నేడు కడుదయనీయంగా మారింది. గుప్త నిధుల కోసం యథేచ్ఛగా పురాతన కట్టడాలను సైతం దుండగులు కూల్చివేస్తుండటం కడు బాధాకరం. కొద్ది సంవత్సరాలు గడిస్తే కొండవీడు కొండలు కనిపించటం మినహా అక్కడేమి పురాతన కట్టడాలు ఏమి కనిపించవు.


పురాతన చంద్రశాల




# దీపావళి, రంజాన్ శుభాకాంక్షలు




స్వాతంత్రోద్యమంలో కీలక పాత్ర పోషించిన గుంటూరు జిల్లా తెలుగు సీమ కీర్తి కిరీటంలో కలికితురాయిగా బాసిల్లుతున్నదని, చరిత్ర ప్రాధాన్యంతో పాటు దేశ, రాష్ట్ర రాజకీయ,సామాజిక,ఆర్థిక, సాంస్కృతిక, సాహిత్య, వ్యాపార తదితర రంగాల్లో జిల్లా రాష్ట్రంలో తనదైన ముద్ర వేసింది. గణనీయమైన వ్యవసాయ ఉత్పత్తులతో జిల్లా వాసికెక్కింది. పొగాకు, పత్తి, మిరప పంటల సాగుకు, కేంద్రంగా నిలిచింది. నాగార్జున సాగర్ ప్రాజెక్టు నిర్మాణంలో జిల్లా వ్యవసాయ రంగం దశ తిరిగింది. లక్షల ఎకరాల్లో జొన్న, సజ్జ పంటల స్థానంలో వరిసాగు చేస్తున్నారు. రాష్ట్ర ఆర్థికాభివృద్ధిలో జిల్లాదే ప్రథమస్థానం. విద్యా, వైద్య, వ్యవసాయం, సాగు నీరు రంగాల్లో విశేషమైన ప్రగతి సాధించింది. మరెంతగానో అభివృద్ధి పథంలో పయనించాలని ఆకాంక్షిస్తున్నాము. జిల్లా ప్రజలకు దీపావళి శుభాకాంక్షలు తెలియజేస్తూ..... ఈ దీపావళి పర్వదినం అందరి లోగిళ్ళలో సుఖసంతోషాలు నింపాలని ఆకాంక్షిస్తున్నాను.

**పెద్ది సుబ్బారావు**
అధ్యక్షులు

## ఆఫీస్ - బేరర్స్ 2005 - 2007

| | | |
|---|---|---|
| ప్రెసిడెంట్<br>శ్రీ పెద్ది సుబ్బారావు | వైస్-ప్రెసిడెంట్<br>శ్రీ ఎం. సూర్యప్రకాశరావు | సెక్రటరి అడ్మినిస్ట్రేషన్<br>శ్రీ ఎం. చంద్రమౌళి |
| సెక్రటరీ ఫైనాన్స్<br>శ్రీ ఎస్.ఎస్.ఆర్. ఆంజనేయులు | ఎగ్జిక్యూటివ్ కమిటీ<br>శ్రీ ఆర్. వెంకట్రావు<br>శ్రీ సిహెచ్. శ్రీనివాసరావు<br>శ్రీ కె. అంజిరెడ్డి<br>శ్రీ ఎ. సుబ్రమణ్యం | రెస్ట్ రూమ్స్ & షటిల్<br>శ్రీ ఎం. బ్రహ్మేశ్వరరావు |
| సూపర్ బజార్ & బార్<br>శ్రీ ఎల్. శరత్‌బాబు | బిలియర్డ్స్<br>శ్రీ ఎం. రామానాయుడు | బఫెట్<br>శ్రీ టి. హోనాజి రావు |
| టెన్నిస్<br>డా॥ జి. అచ్యుతరామయ్య | ఇండోర్ గేమ్స్<br>శ్రీ పి. హరినాధ్ బాబు | రీడింగ్ రూమ్ & లైబ్రరి<br>శ్రీ కె. శోమయ్య |
| కల్చరల్ యాక్టివిటీస్<br>శ్రీ సిహెచ్. శివకోటేశ్వరరావు | స్పెషల్ కమిటీ<br>శ్రీ వడ్లమూడి కృష్ణమూర్తి | ఎక్స్-అఫిషియో మెంబరు<br>శ్రీ ఎల్. సత్యరాధాకృష్ణమూర్తి |

**మొవ్వా చంద్రమౌళి**
కార్యదర్శి (పరిపాలన)




## LVR & సన్స్ క్లబ్ & రీడింగ్ రూమ్

కొరిటపాడు, గుంటూరు - 522 007. ఫోన్ : 2241090 PBX - 2354832, 33, 34

---

## ప్రగతి పథంలో ఆరుంబాక పంచాయితీ



సర్పంచ్:
**మిద్దె వెంకాయమ్మ**
ఆరుంబాక

వైస్ ప్రెసిడెంట్:
**గాదె బేబి శ్రీదేవి**, 12వ వార్డు మెంబరు

కార్యదర్శి:
**బి. విజయానంద్** మరియు **సిబ్బంది**

వార్డు సభ్యులు

| | | |
|---|---|---|
| యేమినేని విజయలక్ష్మి<br>1వ వార్డు | దాసరి శివ శంకరరావు<br>2వ వార్డు | తాతా వెంక రవి<br>3వ వార్డు |
| పాట్లూరి శ్రీనివాసరావు<br>4వ వార్డు | కొమరగిరి రమణమ్మ<br>5వ వార్డు | బొక్కం సత్యనారాయణ<br>6వ వార్డు |
| వేము రమేష్<br>7వ వార్డు | వేము జ్యోతి<br>8వ వార్డు | కర్రా ఎలిజిబెత్<br>9వ వార్డు |
| పీటా బసవయ్య<br>10వ వార్డు | అద్దంకి విమలమ్మ<br>11వ వార్డు | |

అభివృద్ధి చేసే పనులు:-

✤ గ్రామ పంచాయితీ పరిధిలో మంచి నీటి సౌకర్యం కల్పిస్తాం. ✤ వృద్ధులకు ప్రభుత్వం ఇచ్చే వృద్ధాప్యం పెంక్షన్‌లు కాక అదనంగా మరికొంత మందికి సొంత ఖర్చులతో వృద్ధాప్య పెంక్షన్లు ఇస్తాం. ✤ అన్ని గ్రామాల్లో సిమెంటు రోడ్ల నిర్మాణం. ✤ ప్రభుత్వ పధకాలను అన్ని గ్రామాల్లో అవగాహన కల్పించి అర్హులైన వారికి అందేలా చూడటం. ✤ సంపూర్ణ అక్షరాస్యత కోసం తమ వంతు కృషి చేయడం.

# చేయూతనిస్తే.. మరింత కీర్తి తెస్తా



సాధించిన పతకాలతో శ్రీనునాయక్



కుటుంబసభ్యులతో నాయక్

(ఆన్‌లైన్ - బొల్లాపల్లి)

నిరుపేద వర్గానికి చెందిన గిరి జన కుటుంబంలో ఓ ఆణిముత్యం వెలుగులోకి వచ్చింది. బొల్లాపల్లి మండలంలోని చక్రాయిపాలెం తండా నుండి వలసవచ్చి వెంకటరెడ్డిపురం తండాలో నివసిస్తున్న ఇస్లావతు శ్రీను నాయక్ శరీరసౌష్టవ అథ్లెటిక్స్ పోటీల్లో జిల్లా స్థాయి నుండి రాష్ట్ర, జాతీయస్థాయిలో అనేక బహుమతులు సాధించాడు. ప్రస్తుతం నర్సరావుపేట ఎన్‌బిటి ఎన్‌విసి కళాశాలలో విద్యనభ్యసిస్తున్న శ్రీనునాయక్ కుటుంబం తీవ్ర ఆర్థిక ఇబ్బందులతో జీవనం గడుపుతున్నారు. ప్రాథమిక విద్య నుండి క్రీడల పట్ల మక్కువ చూపిన నాయక్ బాడీ బిల్డర్ పోటీల్లో జిల్లాస్థాయిలో ప్రథమ స్థానం సాధించి మిస్టర్ గుంటూరుగా నిలిచాడు. రాష్ట్రస్థాయిలో మూడవస్థానాన్ని, జాతీయ స్థాయిలో 10వస్థానాన్ని సాధించడం విశేషం. నాయక్ ఇంకా ఉన్నతస్థాయిలో తగిన గుర్తింపు పొందేందుకు సరైన ఆర్థిక ప్రోత్సాహం లేకపోవడంతో అతని ప్రతిభ వెలుగులోకి రావడం లేదు. ఆరుగురు సంతానం ఉన్న తన కుటుంబనేపథ్యం ఎదుర్కొంటున్న ఆర్థిక ఇబ్బందులు క్రీడానైపుణ్యం వెలుగులోకి రాకుండా చేస్తుందని అభిప్రాయపడ్డాడు. ఆర్థిక స్థోమత లేనందునే అంతర్జాతీయస్థాయిలో గుర్తింపు పొందాలన్న కోరిక నెరవేరడం శ్రీనునాయక్ 'ఆన్‌లైన్' వద్ద ఆవేదన వ్యక్తం చేశాడు. స్వచ్ఛంధ సంస్థలు చేయూతనందిస్తే బాడీబిల్డింగ్ పోటీల్లో మనదేశానికి గుర్తింపు వచ్చేలా కృషిచేస్తానని శ్రీనునాయక్ అభిలాష వ్యక్తం చేశాడు. జిల్లాలోనే వెనుకబడిన నియోజకవర్గంగా గుర్తింపు పొందిన వినుకొండ ప్రాంతంలోని బొల్లాపల్లి మండల గిరిజన యువకుడు బాడీ బిల్డింగ్ పోటీల్లో ఉత్తమ ప్రతిభను చూపడం ఈప్రాంత వాసులు గర్వకారణంగా భావిస్తున్నా, ఇతనికి ప్రభుత్వ పరంగా ఎటువంటి ప్రోత్సాహం లభించకపోవడం భాధాకరం. బాడీ బిల్డింగ్‌లో జాతీయ స్థాయి గుర్తింపు కోరకు అహర్నిశలు కృషి చేస్తున్నట్లు శ్రీనునాయక్ తెలిపారు. తనకు స్వసంచ్ఛ సేవా సంస్థలు చేయుత నిస్తే తన ప్రతిభను మెరుగు పరచుకుని మరిన్ని పోటీల్లో పాల్గొని రాష్టానికి, దేశానికి కీర్తి ప్రతిష్టలు తీసుకువస్తానని అత్మవిశ్వాసంతో ఎదురు చూస్తున్నాడు. ఎదురుచూస్తున్నాడు.

# మూడు దశాబ్దాల కల సాకారం



(ఆన్‌లైన్, రెంటచింతల)

రెంటచింతల మండలం సత్రశాల వద్ద నిర్మితమవుతున్న టెయిల్ పాండ్ డ్యామ్ పంపు స్టోరేజి ఆనకట్ట పనులు అత్యంత వేగంగా కొనసాగుతున్నాయి. ఈ విద్యుత్ ఉత్పత్తి ఆనకట్టను 2008 నాటి కల్లా పూర్తి చేయాల్సి వుండడంతో ఎపి జెన్‌కో డైరెక్టరు అజయ్ జైన్ పర్యవేక్షణలో ఇంజనీరు అధికారులు అహర్నిశలు శ్రమిస్తున్నారని డ్యామ్ ఎస్‌ఇ రమేష్ తెలిపారు. టెయిల్ పాండ్ డ్యామ్ రిజర్వాయరు నీటి సామర్థ్యం 8 టిఎంసిలుగా వుంది. ఈ ఆనకట్ట నిర్మాణం జరిగితే సేద్యపు భూములు గాని, జనావాసాలు గాని పెద్దగా ముంపుకు గురయ్యే ప్రమాదం లేదని, అయితే మల్లవరం ప్రాంతంలో కేవలం కొన్ని ఎకరాలకు మాత్రమే ముంపు వాటిల్లగలదని అధికారులు భావిస్తున్నారు.

## 1976లోనే కేంద్రం అనుమతి

నాగార్జునసాగర్‌కు దిగువ కృష్ణానది వద్ద 21 కిలోమీటర్ల దూరంలో సత్రశాల వద్ద టెయిల్ పాండ్ విద్యుత్ ప్రాజెక్టును నిర్మించాలని తలపెట్టడంతో 1976లోనే అప్పటి కేంద్ర ప్రభుత్వం నుండి అనుమతి లభించింది. అయితే ఏళ్ళు గడిచినా ప్రాజెక్టు కార్యరూపం దాల్చలేదు. ఫలితంగా ఇప్పటివరకు సాగర్ నుండి విడుదలైన కోట్లాది క్యూసెక్కుల నీరు సముద్రం పాలైంది.

## 1984లో పర్యావరణ అనుమతి

టెయిల్ పాండ్‌కు 1976లోనే ప్రభుత్వాల నుండి అనుమతి లభించినప్పటికీ 1984లో పర్యావరణ అనుమతి లభించింది. అనంతరం 2001లోను లభించింది.

## ప్రభుత్వానికి 119 కోట్లు నష్టం

30 ఏళ్ళ నాడే టెయిల్ పాండ్ విద్యుత్ ఉత్పాదన ప్రాజెక్టును నిర్మించాలనుకున్నారు. దీనికి అన్ని అనుమతులు లభించే నాటికి ఎన్నో ఏళ్ళు పట్టింది. ఈ ప్రాజెక్టు నిర్మాణానికి 1994లోనే రూ.351 కోట్లకు ఎస్టిమేషన్ శాంక్షన్ లభించింది. అప్పట్లోనే ప్రాజెక్టు పనులు వేగంగా పూర్తి చేసినట్లయితే ప్రభుత్వానికి రూ.119 కోట్లు మిగిలి వుండేవి. అయితే ప్రభుత్వాల నిర్లక్ష్యం కారణంగా ప్రాజెక్టు అంచనాల వ్యయం ప్రస్తుతం సుమారు రూ.470 కోట్లకు

(మిగతా 70వ పేజీలో)

# ప్రగతి పథంలో తెనాలి పురపాలక సంఘం



డా॥ వై.ఎస్.రాజశేఖరరెడ్డి
ముఖ్యమంత్రివర్యులు

శ్రీ వల్లభనేని బాలశౌరి గారు
పార్లమెంట్ సభ్యులు, తెనాలి

శ్రీ నాదెండ్ల మనోహర్ గారు
మున్సిపల్ చైర్‌పర్సన్, తెనాలి

శ్రీమతి డాక్టర్ తాడిబోయిన మస్తానమ్మ గారు
చైర్ పర్సన్, తెనాలి

**తెనాలి పురపాలక సంఘం అభివృద్ధికి కృషి చేస్తున్న పార్లమెంటు సభ్యులు శ్రీ వల్లభనేని బాలశౌరి గారికి, శాసన సభ్యులు శ్రీ నాదెండ్ల మనోహర్ గారికి మరియు అధికార ఘనానికి పట్టణ ప్రజలకు, పురపాలక సంఘం దీపావళి, రంజాన్ శుభాకాంక్షలు తెలుపుతూ...**

**అభివృద్ధి పనులు :**

- ✦ జనరల్ ఫండ్స్ క్రింద 3 కోట్ల పనులకు అనుమతి లభించింది.
- ✦ రూ.30 లక్షల విలువతో పార్కులు మరియు ఆటస్థలముల అభివృద్ధి కొరకు పనులు చేపట్టుట జరుగుచున్నవి.
- ✦ రూ.70 లక్షలతో పురపాలక సంఘ భవనం ఆధునీకరణ, నూతన కౌన్సిల్ హాలు (భవనం) నిర్మాణం జరుగుచున్నది.
- ✦ NSDP ఫండ్స్ ద్వారా రూ.56,63,400/-లు, ఎం.పి. ఫండ్స్ ద్వారా రూ.10,80,000/-ల పనులకు టెండర్లు అయి, పనులు జరుగుచున్నవి.
- ✦ రూ.3.20 కోట్లతో మున్సిపల్ మార్కెట్ ఆధునీకరణ చేపట్టనున్నాము.
- ✦ ఇందిరమ్మ ఆదర్శ పథకం క్రింద షుమారు 4 వేల మందికి నెలకు రూ.200/-ల చొప్పున ఫించను చెల్లించుట జరుగుతున్నది.
- ✦ ఎ.పి.యు.ఎస్.పి. పథకం ద్వారా అండర్ గ్రౌండ్ డ్రైనేజి, సాఫ్ట్ వాటర్‌స్కీంకు సుమారు రూ.50 కోట్ల నిధులు ప్రతిపాదన జరిగింది. దానిలో భాగంగా రూ.43 లక్షలతో సర్వే జరుగుతున్నది.
- ✦ కేంద్ర ప్రభుత్వ నిధుల ద్వారా సుమారు రూ.40 కోట్లతో తాగునీటి ప్రతిపాదనలు జరుగుచున్నవి.
- ✦ సెల్ఫ్ హెల్ప్ గ్రూప్స్ ద్వారా 151 గ్రూప్స్‌కు బ్యాంక్ ద్వారా రూ.56 లక్షలు రుణాలు ఇప్పించడం జరిగింది.
- ✦ జనరల్ ఫండ్స్ ద్వారా బరియల్ గ్రౌండ్స్‌ను అభివృద్ధి పరుచుటకు ప్రణాళిక సిద్ధం అయింది.

**శ్రీ పి.విశ్వనాథం**
**కమీషనర్, తెనాలి పురపాలక సంఘం**

ఈదర వెంకట శివసుబ్రహ్మణ్యప్రసాద్ 1వ వార్డు కౌన్సిలరు | మంపుగోళ్ల సాల్మన్‌రాజు 2వ వార్డు కౌన్సిలరు | షేక్ కాలీషావలి 3వ వార్డు కౌన్సిలరు | ఉప్పలపాటి జానకిరామచంద్రరావు 4వ వార్డు కౌన్సిలరు | చెరుకుమల్లి సింగారావు 5వ వార్డు కౌన్సిలరు | దేవినేని రమాదేవి 6వ వార్డు కౌన్సిలరు | బవ్వాది వెంకట సుబ్రహ్మణ్యం 7వ వార్డు కౌన్సిలరు | తాడిబోయిన రాధిక 8వ వార్డు కౌన్సిలరు | పసుపులేటి సుజాత 9వ వార్డు కౌన్సిలరు | మోపిదేవి ఫణీంద్రదేవ్ 10వ వార్డు కౌన్సిలరు

హరిదాసు గౌరీశంకర్ 11వ వార్డు కౌన్సిలరు | రమావత్ ఫిరంగి 12వ వార్డు కౌన్సిలరు | సూర్యదేవర సాంబశివరావు 13వ వార్డు కౌన్సిలరు | మన్నవ స్వర్ణలత 14వ వార్డు కౌన్సిలరు | పాటిబండ్ల రామకృష్ణ 15వ వార్డు కౌన్సిలరు | బిస్సా సుబ్బారావు 16వ వార్డు కౌన్సిలరు | అన్నం పిన్నారావు 17వ వార్డు కౌన్సిలరు | మహమ్మద్ ఖుద్దూస్ 18వ వార్డు కౌన్సిలరు | పసుపులేటి బాలచంద్రుడు 19వ వార్డు కౌన్సిలరు | దావర్తి విజయరాణి 20వ వార్డు కౌన్సిలరు

మామిళ్లపల్లి నాగమల్లేశ్వర శశిధరరావు 21వ వార్డు కౌన్సిలరు | షేక్ జాకీర్ హుస్సేన్ 22వ వార్డు కౌన్సిలరు | నల్లగొర్ల పద్మావతి 23వ వార్డు కౌన్సిలరు | కరేటి వీరయ్య 24వ వార్డు కౌన్సిలరు | యలవర్తి గీతారాణి 26వ వార్డు కౌన్సిలరు | కోగంటి పద్మజ 27వ వార్డు కౌన్సిలరు | అప్పసాని బోసుబాబు 28వ వార్డు కౌన్సిలరు | రమావత్ ధనలక్ష్మి 29వ వార్డు కౌన్సిలరు | వేజెండ్ల శ్రీలక్ష్మి 30వ వార్డు కౌన్సిలరు | తంగెళ్ల అనురాధ 31వ వార్డు కౌన్సిలరు

అక్కిదాసు కిరణ్‌కుమార్ 32వ వార్డు కౌన్సిలరు | అంధ్యాల సుబ్బరాజారయదవ 33వ వార్డు కౌన్సిలరు | ఆదికొండ నాగేశ్వరమ్మ 34వ వార్డు కౌన్సిలరు | గడవర్తి శ్రీదేవి 35వ వార్డు కౌన్సిలరు | బట్టు సోమేశ్వరరావు 36వ వార్డు కౌన్సిలరు | దొడ్డక సీతామహాలక్ష్మి 37వ వార్డు కౌన్సిలరు | మునిపల్లి ప్రసాదరావు 38వ వార్డు కౌన్సిలరు | గద్దేటి మరియకుమారి 39వ వార్డు కౌన్సిలరు | మేకల బిట్టిబాబు 40వ వార్డు కౌన్సిలరు



# మూడు దశాబ్దాల కల సాకారం



టెయిల్ పాండ్ ప్రాజెక్టు నిర్మాణం జరుగుతున్న ప్రదేశం ఇదే

(68వ పేజీ తరువాయి)

చేరుకుంది. ఫలితంగా రూ.119 కోట్లు ప్రభుత్వంపై భారం పడింది.

## వేల క్యూసెక్కుల నీరు ఆదా

సత్రశాల టెయిల్ పాండ్ విద్యుత్ ప్రాజెక్టు వల్ల కొన్ని వేల క్యూసెక్కుల నీరు దిగువకు వెళ్ళే అవసరం లేకుండా ఆదా చేస్తూ విద్యుత్ ఉత్పత్తిని తయారు చేసుకోవచ్చు. నాగార్జునసాగర్‌లోని నీటిని పీక్‌లోడ్ సమయంలో విద్యుత్ ఉత్పత్తికి వాడుకొని, అక్కడ నిల్వ చేసి మిగతా సమయాల్లో జనరేటర్లను పంపులుగా వాడి టెయిల్ పాండ్ రిజర్వాయరు నుండి సాగర్ రిజర్వాయరుకు నీటిని పంపడం వలన వేల క్యూసెక్కుల నీరు ఆదా అవుతుంది.

## తెలంగాణ, రాయలసీమ రైతులకు మేలు

ఇలా ఆదా అయిన నీటి నిల్వ రిజర్వాయరుకు, గోదావరి నీటిని ఇచ్చంపల్లి నుండి మళ్ళించి గ్రావిటి ద్వారా కలపవచ్చు. ఈ విధంగా చేయటం వలన దుర్భిక్ష పరిస్థితులను అధిగమించే అవకాశం వుంది. అంతేగాకుండా సాగర్‌లో 700 మె.వా. పంపులు సిద్ధంగా వున్నాయి. పంపుల కోసం వేరే ఖర్చు పెట్టాల్సిన అవసరం లేదు. సాగర్, శ్రీశైలం కలిసి 465 శ.కో.ఘ.అ. నీటిని నిలువ చేయగలవు. కనుక సాగర్ దిగువ ప్రాంతాలు కృష్ణా డెల్టాకే కాక తెలంగాణ, రాయలసీమ రైతులకు కూడా మేలు జరిగే అవకాశం వుంది. టెయిల్ పాండ్ ఆనకట్ట పూర్తయితే సాగర్, శ్రీశైలంలో తగినంత నీరు నిల్వ వుంచుకొని క్రమబద్ధీకరిస్తే అన్ని ప్రాంతాల ప్రజలకు మేలు చేకూరుతుంది. దీంతో పులిచింతల గురించి చింతపడాల్సిన అవసరం వుండదని నిపుణులు భావిస్తున్నారు. 2008 నాటికి పూర్తయ్యే టెయిల్ పాండ్ ప్రాజెక్టు కారణంగా 30 ఏళ్ళ నాటి రైతుల స్వప్నాలు సాకారం కానున్నాయి.

## వరదలతో డ్యామ్ పనులకు ఆటంకం

ఆగస్టు మొదటి వారంలో కృష్ణానదికి భారీగా వరద రావడంతో సాగర్ రిజర్వాయరు నుండి నీటిని పెద్ద ఎత్తున విడుదల చేశారు. దీంతో సత్రశాల వద్ద నిర్మాణంలో వున్న డ్యామ్ పనులకు అంతరాయం ఏర్పడింది.

ఈ కారణంగా సుమారు మూడు నెలల పాటు పనులు నిలిచిపోయాయి. వరదలో ప్రాజెక్టు కాఫర్ డ్యామ్ చిక్కుకోవడంతో కాంట్రాక్టర్‌కు చెందిన కొన్ని యంత్రాలు, ఇతర సామాగ్రి నీట మునిగాయి. సుమారు రూ.4 లక్షల వరకు నష్టం వాటిల్లింది.

సెప్టెంబరు 26న కూడా సాగర్ రిజర్వాయరుకు భారీ నీటి మట్టం పెరగడంతో తిరిగి టెయిల్‌పాండ్ ప్రాజెక్టు పనులకు అంతరాయం ఏర్పడే సూచనలున్నాయి. డ్యామ్ 21 క్రస్ట్‌గేట్లకు, పవర్‌హౌస్‌కు సంబంధించి సెప్టెంబరులో వంద కోట్ల రూపాయలతో టెండర్లు పిలవడం జరిగిందని, రెండు మూడు నెలల్లో ఈ పనులు కూడా ప్రారంభమవుతాయని ఎస్ఇ రమేష్ 'ఆన్‌లైన్'కు తెలిపారు. ఈ ప్రాజెక్టును 2008,అక్టోబరు నాటికి పూర్తి చేయాల్సి వుండడంతో నిర్మాణ పనులు వేగంగా జరుగుతున్నట్లు తెలిపారు.

# నాపరాయి ఖిల్లా రెంటచింతల




(ఆన్‌లైన్, రెంటచింతల)

గుంటూరు జిల్లా రెంటచింతల మండలం నాపరాయి గనులకు పెట్టింది పేరు. మండలంలోని గోలి, జెట్టిపాలెం, పశర్లపాడు, తుమృకోట గ్రామాల పంచాయతీల పరిధిలో వేలాది ఎకరాల్లో విస్తరించి వున్న గనులలో లభించే నాపరాయి ఎంతో నాణ్యమైనది. నాపరాయి క్వారీల ద్వారా తీసే ఇక్కడి రాయి రాష్ట్ర స్థాయిలోనే గాక ఇతర రాష్ట్రాలకు సైతం ఎగుమతి చేస్తుంటారు. రెంటచింతల మండలంలో ముఖ్యంగా గోలి గ్రామంలోని క్వారీలలో లభించే నాపరాయికి అత్యంత గిరాకి వుంటుంది. మండలంలో రోజుకు దాదాపు 60 నుండి 70 లారీల నాపరాయి రవాణా అవుతుంది. మండలంలో విస్తరించి వున్న నాపరాయి క్వారీల ద్వారా సీనరేజి రూపంలో పంచాయతీలకు లక్షలాది రూపాయల ఆదాయం లభిస్తుంది. ఆదాయం వస్తున్నప్పటికీ కొన్ని పంచాయతీలు ఇప్పటికి మౌలిక సదుపాయాలు లేక అల్లాడుతుండడం దురదృష్టకరం. పలు గ్రామాలలో నిక్షిప్తమై వున్న నాపరాయి క్వారీలు మండలంలో వందలాది మందికి ఉపాధి కల్పిస్తున్నాయి. ఒక్క గోలి గ్రామంలోనే ఉన్న జనాభాలో 90 శాతం కుటుంబాలు ఈ క్వారీలలోనే పనిచేసుకుంటూ కుటుంబాలను పోషించుకుంటున్నారు. అయితే నాపరాయి వ్యాపారం చేసే వ్యాపారులు మాత్రం ఆర్థికంగా ఎదిగిపోతున్నారు గాని కార్మికుల బ్రతుకులు మాత్రం ఎక్కడ వేసిన గొంగలి అక్కడే అన్న చందంగా వున్నాయి.

క్వారీల మీద మైనింగ్ శాఖకు ఏటా లక్షలాది రూపాయలు ఆదాయం వస్తుంది. అయితే సంబంధిత మైనింగ్, చెక్ పోస్టులు, రెవెన్యూ శాఖల అధికారుల అవినీతి కారణంగా కొన్ని వాహనాలు 'వే' బిల్లులు లేకుండా రవాణా చేస్తూ ప్రభుత్వ ఆదాయానికి గండి కొడుతున్నారన్న విమర్శలు వినిపిస్తున్నాయి. కొంత మంది నాపరాయి వ్యాపారులులీజు భూములలోనే కాకుండా మరికొంత భూమిని ఆక్రమించుకొని అక్రమ త్రవ్వకాలు జరుపుతూ వ్యాపారం చేస్తున్నారన్న ఆరోపణలు సైతం వినిపిస్తున్నాయి. ఈ తంతును రెవెన్యూ, మైనింగ్ శాఖలకు చెందిన అధికారులు ఏమాత్రం పట్టించుకోవడం లేదన్న ఆరోపణలు వున్నాయి. నాపరాయి క్వారీలలో పనిచేసే వందలాది కార్మికులు పలు ప్రమాదాలకు గురవుతూ ప్రాణాల మీదకు తెచ్చుకుంటున్న సందర్భాలు అనేకం. క్వారీలలో రాళ్ళు తొలిచే సమయంలో, మలచిన రాయిని లారీలకు లోడు చేసేటప్పుడు ప్రమాదాలకు గురై సరైన వైద్యం చేయించుకునే ఆర్థిక స్తోమత లేక శాశ్వత అంగవైకల్యం పొందిన కార్మికులూ వున్నారు. నాపరాయి క్వారీల్లో పనిచేసే కార్మికులకే సంఘటితంగా ఏర్పాటు చేసి వారికే క్వారీ భూములను లీజుకు ఇచ్చి వారిని ఆదుకోవాలని ప్రజా సంఘాలు ఆందోళన కార్యక్రమాలు సైతం చేపట్టడం జరుగుతున్నాయి. క్వారీలలో పనిచేసే నాపరాయి కార్మికులకు తరచూ ప్రమాదాలు సంభవించే అవకాశాలు వున్న దృష్ట్యా వారికి భీమా సౌకర్యం కల్పించాల్సిన అవసరం ఎంతైనా వుంది. వందలాది కుటుంబాలు క్వారీల పై ఆధారపడి జీవిస్తున్నాయి. ప్రమాదం సంభవించిన సమయంలో గాయపడిన వారిని చికిత్స కోసం 11 కిలోమీటర్ల దూరంలో వున్న రెంటచింతలకు తీసుకురావాల్సి వస్తున్నది. క్వారీల సమీపంలోనే వైద్య సదుపాయాలు అందే విధంగా వ్యాపారులు, ప్రభుత్వం తగిన చర్యలు తీసుకోవాల్సిన అవసరం వుంది. వర్షాకాలంలో కురిసే వర్షాలకు క్వారి గుంతల్లో నీరు చేరి కార్మికుల ఉపాధికి తీవ్ర అవరోధం ఏర్పడుతున్నది. కాబట్టి వర్షాకాలంలో కార్మికులు ప్రత్యామ్నాయ ఉపాధి కల్పనకు ప్రభుత్వం తగిన చర్యలు తీసుకోవాలని కార్మికులు కోరుతున్నారు.







1968 2006

# ఎయంజి ఇండియా ఇంటర్నేషనల్

## H.O. చిలకలూరిపేట, గుంటూరు జిల్లా

డా॥ ఎస్. జాన్‌డేవిడ్ అయ్యగారు
వ్యవస్థాపకులు
ఎయం.జి. ఇండియా ఇంటర్నేషనల్

డా॥ అరుణ్ కుమార్ కె. మొహంతి
డైరెక్టర్
ఎయంజి ఇండియా ఇంటర్నేషనల్

ఎ.ఎం.జి ఇండియా ఇంటర్నేషనల్ స్వదేశీ క్రైస్తవ స్వచ్ఛంద సేవా సంస్థ. డా॥ ఎస్. జాన్‌డేవిడ్ ఈ సంస్థ వ్యవస్థాపకులు. డా॥ అరుణ్ కుమార్ కె. మహంతి ఈ సంస్థ ప్రెసిడెంట్ & డైరెక్టర్. ఈ సంస్థ చేసే సేవలన్నీ ఉచితం, కుల మత, జాతి విచక్షణ లేకుండా శారీరకంగా, మానసికంగా మరియు ఆధ్యాత్మికంగా వెనుకబడిన వారిని, వారి బిడ్డలను మరియు దిక్కులేని, సంరక్షణ లేని పిల్లలను అన్ని విధాల పెంచి, పోషించి అభివృద్ధి పథంలో ముందుకు నడిపించి చేయూత నిచ్చుటయే ఎ.ఎం.జి. సంస్థ ముఖ్యోద్దేశ్యం. తిండి, బట్ట, విద్య వైద్య మరియు ఆధ్యాత్మికంగా చేయు సేవలన్నీ ఉచితం. ఆంధ్రప్రదేశ్‌లోని 7 కోస్తా జిల్లాలైన, నెల్లూరు, ప్రకాశం, గుంటూరు, కృష్ణా, తూర్పుగోదావరి, విశాఖపట్నం, విజయనగరం మరియు ఒరిస్సా రాష్ట్రంలోని టిట్లాగర్, బలంగీర్ మరియు జగత్‌సింగపూర్, తమిళనాడు రాష్ట్రంలోని చెన్నైనందు ఈ సంస్థ యొక్క సేవలు అమలు జరుగుచున్నవి.

### ఎయంజి ప్రాజెక్టుల వివరాలు

చిలకలూరిపేట ఎయంజి హైస్కూల్, ఎయండి జూనియర్ కాలేజ, ఎయంజి డిగ్రీ కాలేజ, ఎయంజి డైకిమెన్ ఐటిసి, ఎయంజి బిఇడి కాలేజ, ఎయంజి బైబిల్ కాలేజ, డే కేర్ సెంటర్స్, మిల్క్ ప్రాజెక్ట్, ఫ్రీ క్లినిక్స్ / హాస్పిటల్స్, ఓల్డ్ ఏజ్ హోమ్స్ అడల్ట్ ఎడ్యుకేషన్ సెంటర్స్, టిబి, కుష్టు వ్యాధి గ్రస్తులకు రేషన్ పంపిణీ, గణపవరం టిబి, చెస్ట్ డిసీజెస్ హాస్పిటల్, విశాఖపట్నం ఎయంజి ఇంగ్లీష్ మీడియం స్కూలు (భీమిలి), బిఇడి కాలేజ (భీమిలి), కుట్టుశిక్షణ కేంద్రం (అనకాపల్లి), వృద్ధులకు సహాయం మిల్క్ ప్రాజెక్టులు, కుష్టు వ్యాధి గ్రస్తులకు పునరావాసం(విజయనగరం, సింహాచలం), లిటరేచర్ మినిస్ట్రీ, కాకినాడ ఎయంజి కుట్టు శిక్షణ కేంద్రాలు, డే కేర్ సెంటర్స్ ఎయంజి ఇంగ్లీష్ మీడియం స్కూల్, మిల్క్ ప్రాజెక్ట్, అడల్ట్ ఎడ్యుకేషన్, ఫ్రీ క్లినిక్, ఓల్డ్ ఏజ్ హోమ్, ఏలేశ్వరం ఎయంజి ఇంగ్లీష్ మీడియం స్కూల్, ఒకేషనల ట్రైనింగ్ సెంటర్, ఫ్రీ హెల్త్ క్లినిక్, అడల్ట్ ఎడ్యుకేషన్ ప్రోగామ్, గ్రామాలలో వైద్య క్యాంపులు, చీరాల / ఓడరేవు ఎయంజి స్టేట్ చిల్డ్రన్ హోమ్, డే కేర్ సెంటర్, ఎయంజి ఇంగ్లీష్ మీడియం స్కూల్, ఫ్రీ క్లినిక్, అడల్ట్ ఎడ్యుకేషన్ సెంటర్, నర్సింగ్ స్కూల్, కమ్యూనిటి డెవలప్‌మెంట్స్, విజయవాడ ఎయంజి స్టేట్ చిల్డ్రన్ హోమ్, మిల్క్‌ప్రాజెక్ట్, డే కేర్ సెంటర్, ఫ్రీ క్లినిక్, రాజవోలు ఎయంజి హైస్కూల్ ఎయంజి కంటి ఆసుపత్రి కడియం ఎయంజి కంటి ఆసుపత్రి, బొమ్మూరు ఎయంజి హైస్కూల్, ఎయంజి జూనియర్ కాలేజ, రాజమండ్రి ఎయంజి డే కేర్ సెంటర్, ఫ్రీ క్లినిక్, కుట్టు శిక్షణ కేంద్రాలు, అడల్ట్ ఎడ్యుకేషన్ సెంటర్స్, స్టేట్ చిల్డ్రన్ హోమ్, హోమ్ ఆఫ్ హోప్ సెంటర్, కుష్టు వ్యాధిగ్రస్తులకు రేషన్ పంపిణీ, పెద్దాపురం ఎయంజి ఓల్డ్ ఏజ్ హోమ్, ఎయంజి కుట్టుశిక్షణ కేంద్రం, సామర్లకోట ఎయంజి హోమ్ ఆఫ్ హోప్ సెంటర్, స్టేట్ చిల్డ్రన్ హోమ్, టిట్లాగర్ లెప్రసీ ప్రాజెక్ట్, టిబి ప్రాజెక్ట్, చిల్డ్రన్ హోమ్

### ఎయంజి ప్రాజెక్టుల ద్వారా సహాయం పొందుతున్న లబ్ధిదారుల వివరాలు

| వివరాలు | లబ్ధిదారుల సంఖ్య (సుమారు) |
|---|---|
| 1. పిల్లల సంరక్షణ, విద్యా | 14,400 |
| 2. మిల్క్ ప్రాజెక్ట్స్ | 3,300 |
| 3. డే కేర్ సెంటర్స్ | 7,000 |
| 4. హెల్త్ ప్రాజెక్ట్స్ | 21,000 |
| 5. వయోజన విద్య | 13,100 |
| 6. సాంకేతిక విద్య | 1,600 |
| 7. ఓల్డ్ ఏజ్ హోమ్స్ | 6,700 |
| 8. పునరావాస కార్యక్రమాలు | 6,100 |
| 9. కుష్టువ్యాధిగ్రస్తుల పునరావాసం | 3,100 |
| 10. కమ్యూనిటీ వర్కర్లు | 1,600 |
| 11. జీవిత ఖైదీల పిల్లలు | 200 |
| 12. ఆత్మహత్యలు చేసుకున్న రైతుల పిల్లలు | 1,000 |
| 13. హెచ్ఐవి / ఎయిడ్స్ బాధితులు | 1,000 |
| 14. హెచ్ఐవి / ఎయిడ్స్ బాధితుల పిల్లలు | 1,000 |
| మొత్తం లబ్ధిదారులు | 81,100 |

### ప్రభుత్వ అభివృద్ధి పథకాలకు ఎయంజి భూరి విరాళాలు

| | రూ. |
|---|---|
| చిలకలూరిపేటలో మంచినీటి పథకానికి | - 4.5 కోట్లు |
| చిలకలూరిపేట మురికివాడలలో మంచినీటి పైపులైన్లకు | - 50 లక్షలు |
| మురికివాడల అభివృద్ధి పథకానికి | - 2 కోట్లు |
| మదర్ థెరిస్సా కాలనీ ఎలక్ట్రిసిటీ కొరకు | - 6 లక్షలు |
| పారిశుద్ధ్య సిబ్బంది గృహ సముదాయంకు | - 11,52 లక్షలు |
| 4వ వార్డులో డ్రైనేజికి | - 1 లక్ష |
| పట్టణ అభివృద్ధి పథకాలు | - 3 లక్షలు |
| గుంటూరులో వయోజన విద్య నభ్యసిస్తున్న పేద మహిళలకు ఉచిత కంటి అద్దాలకు | - 7 లక్షలు |
| నరసరావుపేటలో చంద్రబాబునాయుడు గృహ సముదాయంకు | - 21 లక్షలు |
| కాకినాడలో జనరల్ హాస్పిటల్‌లో సి.టి. స్కాన్‌కు | - 50 లక్షలు |
| కాకినాడ లో మంచినీటి పథకంకు | - 30 లక్షలు |
| ఏలేశ్వరం రోడ్లు మరియు డ్రైనేజికి | - 2.5 లక్షలు |
| అమలాపురం మహిళల అభివృద్ధి కొరకు ప్రాజెక్టుకు | - 10 లక్షలు |
| మరియు ఒరిస్సాలో జగత్ సింగ్‌పూర్ స్కూల్ బిల్డింగ్‌కు | - 4 లక్షలు |
| గుంటూరులో జిల్లా టి.బి. హాస్పిటల్ అభివృద్ధి కొరకు | - 10 లక్షలు |
| నరసరావుపేటలో మురికివాడల అభివృద్ధి పథకం | - 1 కోటి |
| నాగార్జున యూనివర్సిటి ఆడిటోరియం నిర్మాణం కొరకు | - 1 కోటి |



ఆత్మహత్య రైతుల పిల్లల సంరక్షణ



హెచ్ఐవి / ఎయిడ్స్ బాధితులకు సహాయం



సునామి బాధితులకు సహాయం



వరద బాధితులకు సహాయం




(అన్‌లైన్, వినుకొండ)

వ్యక్తిగత జాతక ఫలితాలపై , వాస్తుశాస్త్రం మీద జ్యోతిష్య పరిశోధకులకు, సామాన్య జనానికి ఉన్న ఆసక్తి ముహూర్త శాస్త్రం మీద లేదనడం ఎంత మాత్రమూ అతిశయోక్తికాదు. వ్యక్తిగత జాతక ఫలితాల విషయానికి వస్తే కొంతమటుకు ఎలా జరగాలనేది విధి చేతిలో నిర్ణయమై ఉంటుంది. దానిని జప పూజ ధ్యానాది క్రతువులతో మార్చలేము. అనుభవించడం తప్ప మార్గాంతరం లేదు. దానినే ధృడ కర్మ అంటారు. ఇది శుభలేదా అశుభ ఫలితాలను ఇవ్వడంలో ఎంత మాత్రమూ వెనుకంజ వేయదు.

ఇక వాస్తు విషయానికి వస్తే శుభాశుభ అంశాలను నిర్ణయిస్తుందే తప్ప అవి జరిగే కాలాన్ని నిర్ధారించలేదు. ముహూర్తాన్ని ఆధారం చేసుకొంటే దృఢకర్మ పరిధిలో లేని అంశాలను ఆందించడంలో ముహూర్తము విశేషంగా ఉపకరిస్తుంది. అది మంచి ముహూర్తము అయినప్పుడేపై ఫలితాలను అందిస్తుందని గ్రహించాలి.

వాస్తు జ్యోతిష్య సిద్ధాంతి ఒకరే అయి వారికి పై రెండు శాస్త్రాల్లో సునిశత అవగాహన ఉంటే ఫర్వాలేదు. కానీ, చాలా సందర్భాల్లో ఈ పొంతన కుదరడం లేదనే చెప్పాలి. జ్యోతిషం పట్ల సదభిప్రాయం లేని ఒక వాస్తు సిద్ధాంతిని ఒక సారి నేను కలవడం జరిగింది. ఆయన జ్యోతిషం తప్పని కొట్టి పారేశారు. వాదనలో భాగంగా నేను ఆయనను ఒక ప్రశ్న అడిగాను వాస్తు ప్రకారం మీరు ఎంపిక చేసుకొన్న మంచి గృహంలోకి నేను నిర్ణయించిన చెడు ముహూర్తంలో ప్రవేశించి మీరు సుఖంగా ఉండగలరా? అని నేను ప్రశ్నించాను. దురదృష్ట వశాత్తు వారి నుంచి సుముఖతను వ్యక్తం చేస్తూ సమాధానం రాలేదు. వాస్తు ప్రకారం చెడు వీధిపోటు ఉన్న ఇళ్ళలో నివసించిన వారి చరిత్రను అంటే పదిహేను, ఇరవై సంవత్సరాలలో ఆ ఇంటిలో నివసించిన వారి వివరాలను సేకరిస్తే దుష్ఫలితాలను ఎదుర్కొన్న సమయాలకు సారూప్యత ఎందుకు లేదని అడిగాను. దానికే జవాబు రాలేదు. దానికి నా సమాధానం ఏమిటంటే వారు ఆ ఇంటిలో ప్రవేశించిన సమయాల్లో తేడా ఉండటమే ఇంటిలో ప్రవేశించడాన్ని 'గృహప్రవేశము' అంటాము. గృహప్రవేశ సమయాన్ని ముహూర్తము అంటాము. ' సంకల్పిత కార్యక్రమాన్ని' నిర్దిష్ట సమయంలో నిర్వహించడాన్ని ముహూర్తము అని చెప్పుకోవచ్చు.


జివి. సాయిరామ్

పై వివరణ తప్పనిసరి పరిస్థితుల్లో వాస్తు బాగాలేవి గృహాలలో ప్రవేశించే వారికి ఊరటను ఇస్తుంది. ఎందుకంటే మంచి ముహూర్తంలో ఆ ఇంటిలోకి ప్రవేశించడం ద్వారా చెడుని ఇచ్చే ఆ ఇంటి వాస్తు ఫలితాన్ని దీర్ఘకాలం వాయిదా వేయవచ్చు. నిష్ణాతుడైన జ్యోతిష శాస్త్రవేత్త సహకారంతో చెడు జరగడానికి సంభావ్యత ఉన్న కాలానికి చాలా ముందుగానే ఖాళీ చేయడం ద్వారా అశుభఫలితాలు రాకుండా ముందు జాగ్రత్త తీసుకోవచ్చు. శుభ వాస్తు ఉన్న గృహంలో అశుభ ముహూర్తంలో ప్రవేశించినట్లైతే అశుభకాలం ముగిసే దాకా ముప్పుతిప్పలు పెట్టి తదుపరి ఆ ఇల్లు శుభఫలితాలను అందిస్తుంది.

వ్యక్తిగత జాతకంలో దృఢ దుష్కర్మలు ఉన్నవారికి ఏదైనా పని నిమిత్తం మంచి ముహూర్తాన్ని నిర్ణయిస్తే నిర్ణీత సమయంలో ఆకార్యక్రమాన్ని జరపలేరనేది (నాకు) అనుభవపూర్వక సత్యం. దృడకర్మ పరిధిలో ఉన్న అంశాలను జోస్యం, వాస్తు, ఆఖరికి ముహూర్తము కూడా మార్చలేవు. ముహూర్త సమయాలను తప్పించే విషయంలో విధి చాకచక్యం ప్రదర్శించి తన శాస్త్రం యొక్క గొప్పతనానికి ఇబ్బంది రాకుండా చూసుకొంటుంది.

ఒక దఫా ఏలూరు పట్టణానికి సమీపంలో ఉన్న ఒక గ్రామవాసి ఏలూరులో గృహనిర్మాణ నిమిత్తం స్థల సేకరణ, వాస్తు విషయాల కోసం నన్ను పిలచుకుని వెళ్లడం జరిగింది. స్థలం కొన్నాక ఆయన అభ్యర్థన మేరకు ఒక ముహూర్తాన్ని నిర్ణయిస్తూ, ఇంత మంచి ముహూర్తంలో మీరు గృహ నిర్మాణాన్ని ప్రారంభించగలరా? అని నేను ఎదురు ప్రశ్నించాను. ఆయన ఒకింత ఆశ్చర్యాన్ని, అసహనాన్ని వ్యక్తం చేస్తూ ఇల్లు కట్టడానికి కావల్సిన డబ్బు ఉన్నప్పుడు ఎందుకు ఆగుతుందని బదులు ఇచ్చాడు. నేను బాధతో ఆయనకు ఒక విషయం చెప్పాను. 'మీ చెల్లెలు చనిపోయి ఈ కార్యక్రమం ఆగిపోతుందని చెప్పాను'. దురదృష్టం ఏమిటంటే ఆయనకు ఒక పిచ్చి చెల్లెలు ఉంది. జాలి, పాపభీతి మెండుగా ఉన్న ఈ వ్యక్తి తన తల్లిదండ్రుల మరణానంతరం కూడా చెల్లెలి సంరక్షణను నిరాకరించకుండా సంరక్షిస్తున్నాడు. కానీ, అంత మంచి ముహూర్తంలో గృహారంభం చేసే యోగ్యత ఈ మనిషికి లేవు. ఆయన వ్యక్తిగత జాతకాన్ని క్షుణ్ణంగా పరిశీలించిన నేను ఆయనకు మంచి ముహూర్తంలో శంకుస్థాపన చేసే అర్హత లేదనే విషయాన్ని ఆకళింపు చేసుకున్నాను. నేను చెప్పినట్లుగానే కొద్దిరోజుల వ్యవధిలో ఆయన చెల్లెలు ఆకస్మికంగా మరణించింది. ముహూర్తం యోగ్యత లేనివారిని ఎలా నిలువరిస్తుందో చెప్పడానికే ఈ ఉదాహరణను ఇచ్చాను. కనుక సకారాత్మక ముహూర్తాలూ కొన్ని సందర్భాల్లో అనర్థాలను అడ్డగిస్తాయి.

శ్రీరామ పట్టాభిషేక ముహూర్తంలో ఉన్న దోషమే ఆయనను సతీసమేతంగా అడవులకు పంపింది. జ్యోతిష్యశాస్త్రం ప్రకారం ఉన్న ఇరవై ఏడు నక్షత్రాలను నవగ్రహాలైన రవి, చంద్ర, బుధ, శుక్ర, గురు, శని, రాహు కేతువులకు పంచడం జరిగింది. 27ని తొమ్మిది చేత భాగిస్తే ఒక్కొక్క గ్రహానికి మూడు నక్షత్రాలు వాటాగా లభిస్తాయి. కేతువుని నీరసగ్రహంగా, మోక్షకారక గ్రహంలుగా జ్యోతిష్యశాస్త్రం పేర్కొన్నది. కేతు గ్రహ నక్షత్రాలైన అశ్విని, మాఖ, మూలలలో వివాహం జరిగితే భార్యభర్తల మధ్య ఉండాల్సిన అనురాగం నశిస్తుంది. వినోద, విహార, శృంగార యాత్రలకు బదులుగా వీరు ఆధ్యాత్మిక యాత్రలతో తమ జీవితాన్ని పరిమితం చేసుకుంటారు. ఆధ్యాత్మిక కార్యక్రమాలకు తప్ప ఇతర కార్యక్రమాలకు కేతు గ్రహ నక్షత్రాలను ఎంచుకోరాదు.

శుక్ర గ్రహ నక్షత్రాలైన భరణి, పుబ్బ, పుర్వాషాఢలను శాస్త్రం అగ్ని నక్షత్రాలుగా పేర్కొనందువల్ల ఈ గ్రహ నక్షత్రాలలో ముహూర్త నిర్ణయం ఎట్టి పరిస్థితుల్లోనూ జరగరాదు. విడాకులు పుచ్చుకున్నవారు, రక్తం వచ్చేటట్లు కొట్టుకునే భార్యభర్తలు, ప్రమాదాలలో గాయపడేవారు, అగ్నిప్రమాదాలు కుజుడి నక్షత్రాలైన మృగశిర, చిత్త, దనిష్ఠల్లో శుభకార్యాలు చేసుకొన్న వారేనని తేట తెల్లమౌతుంది. కుజుడు రక్తాన్ని పాలించే గ్రహం కనుక ప్రమాదాలు జరిగి రక్తం కనపడుతుంది. ఇక మాజీ ముఖ్యమంత్రి నందమూరి తారక రామారావు స్వాతి నక్షత్రంలో జన్మించారనేది వాస్తవమే అయినా రాహు నక్షత్రాలైన స్వాతి, శతభిషం చెరుపు చేయడంలో మొహమాట పడటం లేదు. గొప్ప వ్యక్తి జన్మనక్షత్రాన్ని ముహూర్త నక్షత్రంగా నిర్ణయించడం సరికాదనే విషయాన్ని చెప్పడానికే ఈ ఉదాహరణను ఎంచుకున్నాను. రాహువును గర్భ విచ్ఛిత్తికి, విష ప్రయోగాలకు వితంతువులకు కారకుడిగా జ్యోతిష్యం పేర్కొంటున్నది. రాహు నక్షత్రాలలో శుభకార్యాలను నిర్వహించుకునే వారికి గర్భస్రావాలు కావడం, పురుగుమందులు తాగి చనిపోవడం, బంధువర్గంలో వితంతువులు మరణించడం వంటివి జరుగుతాయి. శని నక్షత్రాలైన పుష్యమి, అనురాధ, ఉత్తరాబాధ్రల్లో శుభకార్యం జరిగితే బంధువర్గంలో ఎవరైనా వృద్ధులు మరణించే అవకాశం వుంది. ఎందుకంటే శనిని జ్యోతిష్యం వృద్ధగ్రహంగా, ఆయుష్కారకుడిగా పేర్కొంటున్నది. అట్లాగే శనిని నరాలకు కారకుడిగా పేర్కొన్నందు వల్ల పక్షవాతానికి గురవుతారు. 2003లో కుజుడి నక్షత్రంలో వివాహం చేసుకున్న సినీనటి సౌందర్య అగ్నిప్రమాదంలో దుర్మరణం పాలయ్యారు(2004)లో. కుజుడి నక్షత్రంలో జరుగుతున్న బంధువుల ఇంట్లో పెళ్లికి హాజరైన కొంగర జగ్గయ్య కొద్దికాలంలో శస్త్రచికిత్స సందర్భంగా మరణించారు. కనుక చెడు నక్షత్రాలలో జరిగే కార్యక్రమాలకు వెళ్ళడం మంచిదికాదనే అభిప్రాయానికి ఈ సంఘటన ఊతం ఇస్తున్నది. ఒక ముహూర్తం యొక్క దుష్ప్రభావం దగ్గరి దాయాదులందరికీ వరిస్తుంది. మంచి ముహూర్త ప్రభావం కర్తలకు మాత్రమే వర్తిస్తుంది. సిరి అంటదుగాని చీదర అంటుకొంటుందనే సామెత ఇక్కడ సరిగ్గా సరిపోతుంది. బంధువుల ఇళ్లల్లో శుభకార్యాలకు వెళ్లి ప్రమాదాలకు గురైన వారి గురించి, చనిపోయిన వారి గురించి మనం వింటూనే ఉంటాము. రాశి చక్రంలో మంచి నక్షత్రాలైన రోహిణి, పునర్వసు, ఉత్తేరఫల్గునిణి, హస్త, ఉత్తరాషాఢ, శ్రవణం, రేవతిలను శుభకార్యాలకు ప్రశస్తంగా వినియోగించవచ్చు. ఈ ఏడు నక్షత్రాలను శుభ దృగ్యుతులు ఉన్న లగ్నాలకు ఉపయోగిస్తే మీ జీవితంగా నందనవనంగా భాసిస్తుంది. కేతు నక్షత్రాలను దైవ కార్యాలకు, అగ్ని నక్షత్రాలను పేలుళ్లకు, (నిర్మాణాత్మక పనులకు మాత్రమే సుమండీ) కుజుడి నక్షత్రాలను శస్త్ర చికిత్సలకు, సైనిక ఆపరేషన్ల సంబంధ పనులకు, రాహు నక్షత్రాలను గర్భస్రావాలకు, గనుల్లో తవ్వకాలకు, శని నక్షత్రాలను సేవా కార్యక్రమాలకు ఉపయోగించుకోవచ్చు. సంకల్ప సిద్ధి కోసం ముహూర్తశాస్త్ర సంపూర్ణ మెళకువలు తెలిసిన వ్యక్తిని సంప్రదించడం ఉత్తమంగా చెప్ప తగినది. ఇట్లా కాక పోతే ప్రమాద హెచ్చరికలు అనివార్యం. తస్మాత్ జాగ్రత్త

గుంటుపల్లి వేంకట సత్యసాయి రామ్
అస్ట్రాలజర్
నర్సరావుపేట
9848505847

# సంస్కరణల అమలులో ఆయనకు ఆయనే సాటి



బయోమెట్రిక్స్ యంత్రం

**(ఆన్‌లైన్ - గుంటూరు సిటీ)**

నగరపాలకసంస్థ ఏర్పడిన తరువాత ఏ కమిషనర్ చేపట్టని పరిపాలన సంస్కరణలను ప్రస్తుత కమిషనర్ దువ్వారపు రామారావు చేపట్టారు. ఆయా సంస్కరణలను విజయవంతంగా అమలు చేయడం ద్వారా నగర ప్రజలకు కార్పొరేషన్ ద్వారా మెరుగైన సేవలు వేగవంతంగా లభించేలా చేసి ప్రశంసలు పొందుతున్నారు. అంతేకాకుండా అధికార యంత్రాంగం పరంగా కొనసాగుతూ వస్తున్న లోపాలను సరిదిద్దే అవకాశం ఏర్పడింది. దీని వలన కార్పొరేషన్ ఖజానాకు పడుతున్న చిల్లును నిరోధించినట్లు అయింది. కొన్ని సంస్కరణలు అయితే రాష్ట్ర వ్యాప్తంగా పేరు ప్రఖ్యాతలు సాధించి కమిషనర్ రామారావుకు మంచి గుర్తింపును ఇచ్చాయి. వీటిని ఆదర్శంగా తీసుకొని రాష్ట్రంలోని ఇతర కార్పొరేషన్లలో కూడా పరిపాలన సంస్కరణలు చేపట్టేందుకు మునిసిపల్ అధికారులు ఉత్సాహం ప్రదర్శిస్తుండటం విశేషం.

## ఇంటిగ్రేటెడ్ వైర్‌లెస్ టెక్నాలజీ

గతంలో ఆస్తి, మంచినీరు, డ్రైనేజీ పన్నులను వేర్వేరుగా బిల్ కలెక్టర్లు గృహ యజమానుల వద్ద వసూలు చేస్తుండేవారు. ఇంటిగ్రేటెడ్ ట్యాక్స్ సిస్టం ద్వారా మూడు పన్నులు ఒకే డిమాండ్ నోటీసు పైకి తీసుకొచ్చి పన్ను వసూళ్ళ శాతంను పెంచారు. అంతేకాకుండా బ్యాంకులు, ఇ-సేవా కేంద్రాల ద్వారా 'ఆన్‌లైన్'లో ప్రజలు పన్ను చెల్లించే సౌకర్యం కల్పించారు. ఆన్‌లైన్ సిస్టంలో ఇటీవలే వైర్‌లెస్ టెక్నాలజీని ప్రవేశపెట్టడం ద్వారా ప్రజలు ఎలాంటి ఇబ్బందులు లేకుండా పన్ను చెల్లించే వెసులుబాటు కలిగింది.

## స్పాట్ బిల్లింగ్ వాటర్‌మీటర్ సిస్టం

నగరంలోని వాణిజ్య కుళాయిల మీటర్‌ను నమోదు చేసి యజమానులకు అందజేసేందుకు స్పాట్ బిల్లింగ్ వాటర్‌మీటర్ సిస్టంను అందుబాటులోకి తీసుకొచ్చారు. మీటర్‌రీడర్లు బిల్లింగ్ యంత్రాలను తీసుకొని కుళాయిల వద్దకు వెళ్లి మీటర్ రీడింగ్ ప్రకారం బిల్లింగ్ యంత్రంలో నమోదు చేసి బిల్లులు ఇస్తున్నారు. దీని వలన మీటర్‌రీడింగ్‌లో జరుగుతున్న అవకతవకలు పూర్తిగా అరికట్టబడ్డాయి.

## కియోస్క్‌తో వేగవంతమైన సమాచారం

కార్పొరేషన్ ఆవరణలో ఏర్పాటు చేసిన కియోస్క్ యంత్రంతో వేగవంతంగా తమకు అవసరమైన సమాచారం తెలుసుకొనేందుకు పన్ను చెల్లింపుదారులకు వెసులుబాటు కలిగింది. పన్ను చెల్లింపుదారులు కియోస్క్ యంత్రంపై అవలీలగా తమ బకాయిలను తెలుసుకోవచ్చు. అంతేకాకుండా కార్పొరేషన్‌కు సంబంధించిన సమాచారం కూడా వెంటనే సేకరించుకొనే సౌకర్యం ఉంది.

## కార్పొరేషన్ వెబ్‌సైట్

రీరీరీ.జ్ఞుటుఛిౌటఇౌట్నజీ్సౌ.ఛిౌఝ అడ్రస్‌తో కార్పొరేషన్ తన వెబ్‌సైట్ సేవలను ప్రారంభించింది. నగరపాలకసంస్థకు సంబంధించి పూర్తి సమాచారాన్ని ఇందులో పొందుపరుస్తున్నారు. అంతేకాకుండా ఎప్పటికప్పుడు అప్‌డేట్ కూడా చేస్తున్నారు. ఇప్పటివరకూ 3.43 లక్షల మంది ఇంటర్నెట్ వినియోగదారులు కార్పొరేషన్ వెబ్‌సైట్‌కు యాక్టివేట్ అయ్యారు.

## కొరియర్ సర్వీసు

నగర ప్రజల సౌకర్యార్థం ఏడాది క్రితం నుంచి కొరియర్ సర్వీసును కార్పొరేషన్ అమలు చేస్తుంది. జనన, మరణ సర్టిఫికెట్లు మొదలుకొని అన్నీ సేవలను ప్రజల చెంతకే కొరియర్ సర్వీసు ద్వారా అందజేస్తున్నారు. ఇది ప్రజలకు ఎంతగానో ఉపయోగపడుతుంది.

## ఫిర్యాదుల సత్వర పరిష్కారం

నగరంలో ప్రజలకు సంబంధించి ఫిర్యాదులను సత్వరమే పరిష్కరించేందుకు ప్రత్యేకంగా ఫిర్యాదుల విభాగాన్ని కార్పొరేషన్ ఏర్పాటు చేసింది. 103, 1913 ఫోన్ నెంబర్లు ద్వారా వచ్చే సమస్యలన్నింటికి వెంటనే పరిష్కారం చూపుతుంది. ఈ నెంబర్లకు ఉచితంగా ఫోన్ చేస్తే ప్రజలకు ఎలాంటి బిల్లు పడదు.



దువ్వారపు రామారావు, కమిషనర్ నగరపాలకసంస్థ

## టెండర్లలో ఇ-ప్రొక్యూర్‌మెంటు

రాష్ట్రంలోనే ప్రప్రథమంగా ఇ-ప్రొక్యూర్‌మెంటు పద్ధతిలో టెండర్లు నిర్వహించే విధానానికి కార్పొరేషన్ ఏడాదిన్నర క్రితం శ్రీకారం చుట్టింది. దీని వలన టెండర్లలో కాంట్రాక్టర్లు పోటీ పడుతుండటంతో అంచనా విలువ కంటే తక్కువకే పనులు చేయించే అవకాశం లభించింది.

## గాంధీపార్కు, మానససరోవరం గేట్ కలెక్షన్ల కంప్యూటరీకరణ

గతంలో గాంధీపార్కు, మానససరోవరంలలో గేట్ కలెక్షన్ల ద్వారా అవకతవకలు జరుగుతుండేవి. అయితే కమిషనర్ రామారావు దీనిపై దృష్టి సారించి గేట్లను కంప్యూటరీకరించడంతో టికెట్ లేకుండా ఎవరూ లోపలికి ప్రవేశించే అవకాశం లేకుండా చేశారు. దీని వలన కార్పొరేషన్‌కు ఆదాయం బాగా పెరిగింది.

## హెడ్‌వాటర్‌వర్క్సు కంప్యూటరైజేషన్

గాడి తప్పిన మంచినీటి సరఫరా వ్యవస్థను సక్రమంగా నిర్వహించేందుకు గాను వాటర్‌వర్క్సులను కంప్యూటరీకరణ చేశారు. హెచ్‌ఎల్ఆర్, ఎల్ఎల్ఆర్ రిజర్వాయర్లను కంప్యూటరైజేషన్ చేయడం వలన ట్యాంకర్ ట్రిప్పులలో జరుగుతున్న అక్రమాలకు ఫుల్‌స్టాప్ పెట్టినట్లు అయింది. ఫలితంగా ప్రజలకు పుష్కలంగా నీరు సరఫరా అవుతున్నది.




కార్పొరేషన్ వెబ్‌సైట్

# మూడు ప్రాకారాల త్రినేత్రుని ధామం...

# అమరేశ్వర ఆలయం


అమరేశ్వర ఆలయం ఏరియల్ వ్యూ

(ఆన్‌లైన్ - అమరావతి)

పవిత్ర పావని కృష్ణవేణి తరంగ సుశోభితమై అమరావతి క్షేత్రగిరిపై మూడు ప్రాకారాలతో దివ్య క్షేత్రంగా విరాజిల్లుతున్న అమరేశ్వర ఆలయం భక్తులకు కొంగు భంగారంగా ఆతిధ్యం పలుకుతోంది. దేవ గురువు బృహస్పతి ఆదేశానుసారం దేవేంద్రునిచే ప్రతిష్ఠించబడిన అమరేశ్వరుడు, ఆది శంకరాచార్యులచే ప్రతిష్ఠించబడిన బాలచాముండికా, జ్వాలాముఖి దేవతామూర్తులు కొలువై వున్న ఈ క్షేత్రం దక్షిణ కాశిగా ప్రసిద్ధి చెందిన అమరావతి.

ఈ ఆలయ పూర్వ చరిత్ర అష్టాదశ పురాణాలలో ఒకటైన స్కాంద పురాణం నందు వివరించి వుంది. తారకాసురుని కంఠం నందలి ప్రాణ విషం కుమారస్వామిచే చేధించబడి ఐదు ముక్కలై ఐదు ప్రదేశాలలో పడి పంచారామాలుగా విరాజిల్లుతున్నాయి. వాటిలో తొలి ఆరామం అమరారామం (అమరావతి). అమరావతిలో పడిన శివలింగంను ఇంద్రుడు ప్రతిష్ఠించుట వలన అమరావతి అని వాసిరెడ్డి వెంకటాద్రినాయుడు జమిందారు పేరు మార్చినట్టు ఆధారాలు కలవు.

తారకాసురుని కంఠం నందలి ప్రాణ విషం కుమారస్వామిచే చేధించబడి ఐదు ముక్కలై ఐదు ప్రదేశాలలో పడి పంచారామాలుగా విరాజిల్లుతున్నాయి. వాటిలో తొలి ఆరామం అమరారామం (అమరావతి). మండప ప్రాకారంలోకి వెళ్ళి దక్షిణం వైపు తిరిగితే ఆగ్నేయదిశలో శ్రీకాళ హస్తీశ్వరుడు, నైరుతి దిక్కులో శ్రీశైలం మల్లికార్జునుడు, వాయువ్య దిశలో కాశీ విశ్వేశ్వరుడు ఆలయాలు కలవు. అదే దిక్కులో ఆయా క్షేత్రాలు వున్నాయి.

భగవంతుడు త్రిగుణములకు అతీతుడు అను భావనను తెలియజేస్తూ మూడు ప్రాకారాలు భక్తులకు ఎన్నో గాధలు వివరించును. మొదటి ప్రాకారంలోకి గాలి గోపురం నుంచి ప్రదక్షిణ దిశగా బయలుదేరితే ప్రణవేశ్వరుడు, శంకరాచార్యులు, కాశీ విశ్వేశ్వరుడు, ఉమామహేశ్వరుడు, పార్థివేశ్వరుడు, సోమేశ్వరుడు, నాగేశ్వరుడు, మహిషాసురమర్థని, కోసలేశ్వరుడు, వీరభద్రుడు అను దేవతామూర్తుల ఆలయాలు గలవు. రెండవ ప్రాకారంలో తూర్పు గాలి గోపురం నుంచి ఎడమ వైపుకు బయలుదేరితే విఘ్నేశ్వరుడు, కాలభైరవుని ఆలయం, శ్రీ కృష్ణదేవరాయలు, వెంకటాద్రి నాయుని కాలమందు తులాబారాలు తూగిన మండపములు, అభిషేక మండపం, కుమార స్వామి, ఆంజనేయస్వామి, నవగ్రహాలయాలు కలవు.

మండప ప్రాకారం లోకి వెళ్ళి దక్షిణం వైపు తిరిగితే ఆగ్నేయదిశలో శ్రీకాళ హస్తీశ్వరుడు, నైరుతి దిక్కులో శ్రీశైలం మల్లికార్జునుడు, వాయువ్య దిశలో కాశీ విశ్వేశ్వరుడు ఆలయాలు కలవు. అదే దిక్కులో ఆయా క్షేత్రాలు వున్నాయి. ఈ క్షేత్రంనకు కాలభైరవుడు క్షేత్రపాలకుడు. వేణుగోపాలస్వామి కూడా కొలువై వుండుటం శివకేశవాభేదమునకు నిదర్శనం.

స్వామి వారి మూలవిరాట్ సుమారు పది అడుగుల ఎత్తు కలిగి వుండుట వలన పక్కన గల అంతస్తు నుంచి అర్చక స్వాములు స్వామి వారికి అభిషేకాలు నిర్వహిస్తారు. పుణ్యక్షేత్రంగానే కాక బౌద్ధారామంగా అమరావతి చరిత్రకెక్కింది. ఇక్కడ పురావస్తు ప్రదర్శనశాలలో కన్నులు మిరుమిట్లు గొలిపేలా శిల్పాలు పర్యాటకులను విశేషంగా ఆకర్షిస్తున్నాయి. గుంటూరు నుంచి ఉత్తర దిశగా 35 కిలో మీటర్ల దూరంలో వుంది. దేశంలోని అన్ని రాష్ట్రాల రాజధానుల నుంచి గుంటూరుకు రైలు సౌకర్యం వుంది. విజయవాడ, సత్తెనపల్లి, క్రోసూరు పట్టణాల నుంచి బస్సు సౌకర్యం కలదు. అమరావతి వచ్చిన యాత్రికులకు ప్రభుత్వ, ప్రైవేటు వసతి గృహాలు వున్నాయి.

అమరేశ్వర ఆలయంతోపాటు షిర్డిసాయి బాబా ఆలయం, కన్యకాపరమేశ్వరి ఆలయం, కోదండరామాలయం, గీతామందిరం వంటి క్షేత్రాలు, ధ్యానాంజనేయ, ధ్యానబుద్ధవంటి కట్టడాలు భక్తులకు, యాత్రికులకు ఆనందాన్ని కలిగించనున్నాయి.


అమరేశ్వరస్వామి మూలవిరాట్



నిరుద్యోగ యువతులకు ఉచిత శిక్షణ ఇస్తున్న హరిత బయోటెక్స్

# గ్రామీణ నిరుద్యోగ యువతీ యువకులకు
# హరిత బయోటెక్ సహకారం అభినందనీయం



వర్మీ కంపోస్ట్ ఎరువుతో ఎనిమిది అడుగులు పెరిగిన పొట్లకాయ

(ఆన్‌లైన్, వేమూరు)

గ్రామీణ ప్రాంతాలలోని నిరుద్యోగ యువతీ, యువకులకు స్వయం ఉపాధి కల్పనకు హరిత బయోటెక్ ఫారం అందిస్తున్న సహకారం అభినందనీయం. 12 ఏళ్ల క్రితం వ్యవసాయ శాఖ అసిస్టెంట్ డైరెక్టర్‌గా పనిచేసిన నన్నపనేని భాస్కరరావు తన కుమారుడు రామకృష్ణ చేత వేమూరులో హరిత బయోటెక్ ఫారం ఏర్పాటు చేశారు. తక్కువ ఖర్చుతో అధిక ఫలసాయాన్ని ఇచ్చే వర్మీకం పోస్టు ఎరువు తయారు చేయడంతోపాటు ఈ సంస్థ ద్వారా ఉచిత శిక్షణ తరగతులు ఏర్పాటు చేయడం వీరి ప్రత్యేకత. ఇప్పటికే 500 మంది నిరుద్యోగ యువతీ, యువకులకు శిక్షణ ఇచ్చి 50 శాతం రాయితీతో వర్మీ కల్చర్ సరఫరా చేసి 100 యూనిట్లను ఏర్పాటు చేయించారు. నిత్యం 25 నుంచి 50 మంది వరకు పేదలకు ఉపాధి కూడా కల్పిస్తున్నట్లు డైరెక్టర్ రామకృష్ణ తెలిపారు. "యూ డ్రిలస్ యూజనీ" అనే ఆఫ్రికన్ వెరైటీ వాన పాముల ద్వారా కేవలం 25 రోజులలోగానే వర్మీ కంపోస్టు ఎరువు తయారు చేయడం వీరి ప్రత్యేకత. అధిక దిగుబడులతో కూడిన లాభాలను రైతులకు అందించడానికి ఈ కంపోస్టు ఎరువు ఎంతో దోహదపడుతుందని ప్రయోగాత్మకంగా తెలియజేయడంతోపాటు ఇతర రాష్ట్రాలతోపాటు ఆస్ట్రేలియా శాస్త్రవేత్తల అభినందనలు కూడా ఈ ఉపాధి సంస్థకు లభించాయి. ఇక్కడ తయారయ్యే ఎరువును ప్రత్యేకమైన సంచులలో ప్యాక్ చేసి కర్ణాటక, తమిళనాడు, మహారాష్ట్ర రాష్ట్రాలతోపాటు మన రాష్ట్రంలోని ఉభయ గోదావరి, నెల్లూరు, కృష్ణా, ప్రకాశం జిల్లాలకు అధికంగా సరఫరా చేస్తున్నట్లు రామకృష్ణ తెలిపారు.

తమకు వచ్చిన లాభంలో 75 శాతాన్ని నిరుద్యోగ యువతీ, యువకుల ఉపాధి కల్పనకు పలు సేవా కార్యక్రమాలకు ఖర్చు చేస్తున్నట్లు ఆయన తెలిపారు.

ప్రత్యేక ప్రణాళిక ద్వారా ఏడాదికి 1000 మందికి ఉచిత శిక్షణ ఇవ్వాలనే ఆలోచనతో వ్యవసాయశాఖ అధికారుల ద్వారా చర్యలు చేపడుతున్నట్లు రామకృష్ణ తెలిపారు.



వర్మీ కంపోస్ట్ ఎరువుతో విరబూసిన మామిడి చెట్టు

# ప్రాచీన ఆలయాలకు ఆలవాలం చేబ్రోలు

(ఆన్‌లైన్ - చేబ్రోలు)

మండల కేంద్రమైన చేబ్రోలులోని దేవాలయాలు అత్యంత చారిత్రాత్మకమైన చరిత్ర గలవిగా వాసికెక్కాయి. పల్లవులు, చాళుక్యులు, ఇక్ష్వాకులు, శాతవాహనులు, చోళులు, కాకతీయ రాజుల కాలంలో నిర్మితమైన ఈ దేవాలయాలు ఘనమైన చరిత్రను పుణికిపుచ్చుకుని చేబ్రోలుకు వన్నె తెచ్చాయి. ఆయా రాజుల కాలాల్లో ఇవి నిర్మితం కావడం వలన వారి కట్టడాల శైలిని, నాగరికతలను ప్రతిబింబిస్తున్నాయి. ఇక్కడ ఆలయాలు, శాసనాలు,' లభ్యమైన పురావస్తు సామాగ్రి, రాజశాసనాలను పరిశీలిస్తే చేబ్రోలుకు కొన్ని వేల సంవత్సరాల చరిత్ర వున్నట్లు తెలుస్తోంది. చేబ్రోలులో వున్న ఆలయాలు ప్రపంచ ఖ్యాతిని గడించాయి. చేబ్రోలు పల్లవుల కాలంలో తొంబ్రవ, తొంబ్రవపురి అని ఆ తరువాత చాళుక్యుల కాలంలో జయవోలు, జయబాబుగా పిలువబడి కాలక్రమేణ చేబ్రోలుగా మారిందని చరిత్ర చెబుతోంది. ఇక్కడ గతంలో శాతవాహన, రోమన్ చక్రవర్తి కాన్‌స్టైన్, ఇక్ష్వాక నాణాలు లభ్యమయ్యాయి. క్రీస్తు పూర్వం రెండు శతాబ్దాల కిందటే ఆంధ్రులు సముద్రయానంలో ఆరితేరారని నిరూపించగల నాణాలు కూడా ఇక్కడ లభ్యమయ్యాయి. చేబ్రోలు క్షేత్రం మొదట బౌద్ధక్షేత్రంగా అలరారింది.



చేబ్రోలులోని చతుర్ముఖ బ్రహ్మ దేవాలయం

## ఒకనాటి శైవ క్షేత్రమే ఈ చేబ్రోలు

ఇక్కడ లభించిన నాణాలను బట్టిచూస్తే ఈ ప్రాంతం కొంతకాలం శాతవాహనుల పాలనలో వున్నట్టు తెలుస్తోంది. ఆ తరువాత జైనులు కొన్నాళ్లు చేబ్రోలును పాలించారు. విష్ణుకుండినుల కాలంలో బౌద్ధ, జైనుల ధర్మాలపై దాడి జరిగింది. ఒకటవ మాధవవర్మ అమరావతి స్థూపాన్ని ధ్వంసం చేసి శైవమత వ్యాప్తికి కృషి చేశాడు. ఇదే కాలంలో చేబ్రోలులో శైవమతం బాగా వ్యాప్తిచెందింది. తూర్పు చాళుక్య రాజైన యుద్ధమల్లుడు చేబ్రోలును రాజధానిగా చేసుకుని కొన్నేళ్లపాటు రాజ్యం ఏలాడని తెలుస్తోంది. ఈ కాలంలో చేబ్రోలును శ్రీ శైవ క్షేత్రంగా తీర్చిదిద్దాడు. అనేక దేవాలయాలు నిర్మించి పలు జాతరలు చేశారు. మహాసేనుని జాతరలో చేబ్రోలు నుంచి బెజవాడ వరకు ఊరేగింపు జరిగినట్టు యుద్ధమల్లుని బెజవాడ శాసనాన్ని బట్టి తెలుస్తోంది. కొంతకాలం పశ్చిమ చాళుక్య నరేంద్రుడైన ప్రత్యాశయుని విడిది నగరంగా చేబ్రోలు వర్ధిల్లింది. కాకతీయ గణపతి దేవుని సేనాధ్యక్షుడైన జయాపసేనాని చేబ్రోలును ప్రధాన కేంద్రంగా చేసుకున్నాడు. ఆయన తోబుట్టువులైన నారాంబ, పేరాంబలను గణపతి దేవుడు వివాహమాడాడు. వెలమనాటి చోళులకు సైనిక కేంద్రంగా కూడా భాసిల్లింది. క్రీ.శ. 1570లో గోల్కొండ ఇబ్రహీం కులీ కుతుబ్‌షా కొండవీటిని జయించిన పిదప చివరిగా తూర్పు ఇండియా వర్తకసంఘం వారు, ఆంగ్లేయులు చేబ్రోలుపై ఆధిపత్యం చెలాయించారు.

## నూటొక్క దేవాలయాలు... నూటొక్క బావులు

కాశీలో తప్ప ఇక్కడున్నన్ని ఆలయాలు భారతదేశంలో మరెక్కడా లేవు. చేబ్రోలు జిల్లా కేంద్రంమైన గుంటూరుకు 14 కి.మీ. దూరంలో వుంది. గుంటూరు-పొన్నూరు రహదారిలో చేబ్రోలు వుంది. ఇక్కడ నూటొక్క దేవాలయాలు, నూటొక్క బావులు వుండేవని ప్రతీతి. కాలగర్భంలో కొన్ని శిథిలంకాగా, మరికొన్ని దేవాదాయ శాఖ ఆధీనంలో వున్నాయి. ప్రపంచంలో ఎక్కడా లేని విధంగా చతుర్ముఖ బ్రహ్మదేవాలయం చేబ్రోలులో మాత్రమే వుంది.

## ప్రఖ్యాతి చెందిన బ్రహ్మదేవాలయం

చేబ్రోలులో చతుర్ముఖ బ్రహ్మదేవుడిని లింగాకారంలో మలిచి ప్రతిష్ఠించారు. దీనిని 18వ శతాబ్దంలో రాజా వాసిరెడ్డి వెంకటాద్రినాయుడు నిర్మించాడు. నాలుగు వైపులా ముఖాలతో బ్రహ్మదేవుడున్నాడు. కనుక చతుర్ముఖ బ్రహ్మ లింగేశ్వరుడు అని అంటున్నారు. బ్రహ్మదేవునికి శాపం కారణంగా భూలోకంలో పూజలు జరగవు. ఇక్కడ బ్రహ్మదేవునికి అష్టదిక్కులలో శైవ, వైష్ణవ, అమ్మవార్ల ఆలయాలు నిర్మించి దిగ్బంధనం చేశారు. ముందు వెనుక శైవ, ఇరు

(మిగతా 78వ పేజీలో)

# ప్రాచీన ఆలయాలకు ఆలవాలం చేబ్రోలు

(77వ పేజీ తరువాయి)

పక్కల వైష్ణవాలయాలు, నాలుగు మూలల్లో అమ్మవార్ల ఆలయాలు నిర్మించారు. కోనేరు మధ్యలో వున్న ఈ ఆలయం పర్యాటకులను విశేషంగా ఆకట్టుకుంది.



ఏక శిలతో నిర్మితమైన ఎర్రరాతి నంది

## ఎత్తైన గాలిగోపురం...నాగేశ్వరాలయం

క్రీ.శ.14వ శతాబ్దంలో చేబ్రోలుకు గ్రామాధికారులుగా వున్న కంతెన్న, మూర్తన్న అనే ఇరువురు సోదరులు నాగేశ్వరాలయాన్ని నిర్మించారు. ఆలయానికి ముందున్న అతిపెద్ద గాలిగోపురం కన్నులవిందు చేస్తోంది. ఈ ప్రాంతంలో అతి పెద్ద కట్టడంగా చుట్టుపక్కల గ్రామాలకు సైతం కనిపిస్తుంది. మహాశివరాత్రికి స్వామివారి కళ్యాణం అనంతరం రథోత్సవం జరుగుతుంది. చేబ్రోలులో గల రథం జిల్లాలోకెల్లా పెద్దది. నాగేశ్వరాలయం ముందు నవగ్రహాలను ప్రతిష్టించారు. పక్కనే వున్న ఏకశిలా నంది విశేషంగా ఆకట్టుకుంటుంది. పరిసర ప్రాంతాల్లో లేనంత సైజులో ఎర్రరాతితో నందిని మలిచి ప్రతిష్ఠించారు.

చేబ్రోలులో గల ఆలయాల్లో భీమేశ్వరాలయానికి ఒక విశిష్టత వుంది. ఈ ఆలయాన్ని ఎవరు నిర్మించారనే విషయంలో పలు భిన్నాభిప్రాయాలు వున్నాయి. ఒకటవ చాళుక్య భీముడు బౌద్ధ చైత్యంను ధ్వంసం చేసి భీమేశ్వరాలయం నిర్మించాడని, ఆ తరువాత కాకతీయ గణపతిదేవుని సైన్యాధ్యక్షుడు జయాపసేనాని పునర్నిర్మాణం జరిపాడని అంటుంటారు. అయితే ఆ ఆలయం రథాన్ని పోలి రెండు అంతస్తులుగా దర్శనమిస్తుంది. 1957లో జరిగిన తవ్వకాలలో కింది అంతస్తు రహస్య ద్వారాలు, తలుపులు బయటపడ్డాయి. ఆలయం కింద పక్కగా రెండు ద్వారాలు వున్నాయి. లోనికి ప్రవేశిస్తే అంతా చీకటిగా వుంటుంది. ఈ ద్వారం నుంచి కాశీకి మార్గం వుందని విశ్వసిస్తుంటారు. ఈ మధ్య కాలంలోనే ఈ ద్వారాన్ని మూసివేశారు.

1957లో భీమేశ్వరాలయం వద్ద పురావస్తుశాఖ జరిపిన తవ్వకాల్లో దక్షిణాన ఎర్రకోట (జిగురుమట్టి), బొమ్మలు, పూసలు, కూజాలు, త్రిరత్నాలు, శాతవాహనుల సీసపు నాణాలు, సైనికుల బొమ్మలు, ఏనుగులు, కళేబరాలు, గుర్రపు డాంకాలు, శిల్ప కళాఖండాలు, పూర్ణఘటము గల రాతి ఫలకాలు, బంగారు నాణాలు, బౌద్ధ శిల్పశిలా ఖండాలు, రాతి గొడ్డళ్లు లభ్యమయ్యాయి. ప్రస్తుతం ఈ సందప అంతా విజయవాడ మ్యూజియంలో భద్రపరిచారని తెలుస్తోంది.



భీమేశ్వరస్వామి ఆలయం

## అబ్బురపరిచే విమాన గోపురం, ఆదికేశవాలయం

చేబ్రోలులోని ఆలయాల్లో అతి పురాతనమైనది ఆదికేశవ ఆలయం. ఒకే ప్రాంగణంలో ఆదికేశవ, రాజ్యలక్ష్మి, ప్రసన్నాంజనేయస్వామి ఆలయాల నిర్మాణం జరిగింది. వీటిని పల్లవ రాజులు నిర్మించారు. 9వ శతాబ్దంలో ఈ ఆలయాలు నిర్మితమైనట్లు తెలుస్తోంది. ఈ ఆలయాల నిర్మాణానికి , మిగతా ఆలయాలకు వ్యత్యాసం వుంది. ఆదికేశవ ఆలయంపైన నిర్మించిన విమాన గోపురం ఎంతో చూడముచ్చటగా వుంటుంది. ఈ ఆలయం ప్రధాన దారిలో పెద్ద గాలిగోపురం నిర్మాణానికి శ్రీకారం చుట్టి పల్లవులు మధ్యలోనే ఆ నిర్మాణం ఆపేసిన ఆనవాలు వుంది. పెద్ద బండరాళ్లతో అసంపూర్తిగా వున్న గోపురం ద్వారం ఇప్పటికీ వుంది. ముక్కోటి ఏకాదశినాడు ఈ ద్వారాన్ని తెరుస్తారు.

## వైభవంగా దేవీ శరన్నవరాత్రులు

ఈ ఆలయాలలో ప్రతియేటా దసరా సమయంలో శ్రీదేవీ శరన్నవరాత్రులు వైభవంగా జరుగుతాయి. భక్తులు అధిక సంఖ్యలో వచ్చి ఇక్కడ నిర్వహించే వివిధ కార్యక్రమాల్లో పాల్గొని పునీతమవుతారు. దేవాలయాలను రంగులు, విద్యుద్దీపాలతో

(మిగతా 80వ పేజీలో)

# రైతు సేవలో గుంటూరు మార్కెట్ యార్డు



**డా॥ వైఎస్ రాజశేఖరరెడ్డి**
రాష్ట్ర ముఖ్యమంత్రివర్యులు



**శ్రీ కన్నా లక్ష్మీనారాయణ**
రాష్ట్ర సహకార, రవాణాశాఖామంత్రివర్యులు



**శ్రీ ధర్మాన ప్రసాదరావు**
జిల్లా ఇన్‌ఛార్జ్ మంత్రి



**శ్రీ బొత్స సత్యనారాయణ**
రాష్ట్ర మార్కెటింగ్ శాఖా మంత్రి



**శ్రీమతి జయలక్ష్మి I.A.S.**
జిల్లా కలెక్టర్, గుంటూరు.

* ఆసియా ఖండములోనే పేరెన్నికగన్న గుంటూరు మార్కెట్ యార్డ్ రైతుల సంక్షేమానికి పెద్దపీట వేస్తుంది.
* రైతుబంధు పథకం అమలు చేస్తున్నాము.
* రైతులకు 5 నుంచి 10 శాతానికి తమ సరుకుకు రుణాలు ఇస్తున్నాము.
* ఒక్కొక్క రైతుకు కనీసం రూ.75000లోపు ఋణాలు అందచేస్తాము.
* ఆధునిక వ్యవసాయ పద్ధతులు తెలియజేయడం కోసం వ్యవసాయ శాస్త్రవేత్తల ద్వారా రైతులకు శిక్షణా తరగతులు నిర్వహిస్తున్నాము.
* ప్రోగ్రెసివ్ ఫార్మర్స్ ఫెడరేషన్ సంస్థ ఆధ్వర్యంలో పుల్లడిగుంట గ్రామాన్ని దత్తత తీసుకున్నాము.
* కోఆర్డినేటర్ ద్వారా వ్యవసాయ రంగంలో రైతులకు మెళకువలు తెలియజేయుచున్నాము.
* పుల్లడిగుంట గ్రామాన్ని మోడల్‌గా తీసికొని 150 మంది రైతులకు వారికి కావలసిన ఎరువులు, పురుగుమందులను లాభాపేక్షతో కాకుండా సరఫరా చేశాము.
* తరువాత దశలలో ఈ కార్యక్రమాలు అన్ని గ్రామాలకు విస్తరిస్తాతయి.
* ప్రత్తిపాడు, వట్టిచెరుకూరు, గుంటూరు రూరల్, పెదకాకాని మండలాల రైతులకు కావలసిన ఎరువులు, పురుగు మందులను సరఫరా చేస్తాము.
* రైతులు, రైతుబంధు పథకాన్ని ఉపయోగించుకోవడం కోసం అవగాహన కార్యక్రమాన్ని ఏర్పాటు చేస్తున్నాము.
* మార్కెట్ యార్డ్ ఆదాయాన్ని 9.00 నుండి గతంలో సుమారు 13.50 కోట్లు ఉండేది. ఇప్పుడు అది 15 కోట్లకు పెరిగేందుకు చర్యలు తీసుకొనబడుచున్నవి.
* రైతుల వద్ద వసూలు చేసే మార్కెట్ ఛార్జీలను నియంత్రించాము.
* గతంలో టిక్కీకి రూ.15 నుండి రూ.17 వరకు ఉన్న ఛార్జీలను రూ. 7.50 లకు తగ్గించాము.
* దీనిని నియంత్రించడానికి 24 గంటలు నిఘాను ఏర్పాటు చేశాము.
* దీని కోసం ఫిర్యాదు విభాగాన్ని కూడా ఏర్పాటు చేశాము.
* స్పైసెస్ బోర్డు ద్వారా సబ్సిడీపైన రైతులకు టార్పాలిన్ పట్టాలను సరఫరా చేస్తున్నాము.
* రైతుల సంక్షేమం కోసం వైద్య, ఆరోగ్య శిబిరాలను ఏర్పాటు చేస్తున్నాము.
* పశువుల వైద్య శిబిరాలను నిర్వహించి పాడి పరిశ్రమను పెంపొందించడానికి రైతులకు కావలసిన సహాయ సహకారాలను అందచేస్తున్నాము.
* కాటాలలో జరిగే మోసాలను నివారించడం కోసం ఈ సంవత్సరం యార్డు మొత్తంలో ఎలక్ట్రానిక్ కాటాలను ఏర్పాటు చేశాము.
* యార్డ్‌కు తెచ్చిన సరుకునకు ఉద్యోగులు, వ్యాపారుల సమక్షంలోనే రైతుల అంగీకారంతో ధరను నిర్ణయిస్తున్నాము.
* దిగుమతులు, ఎగుమతుల వివరాలను రైతులు తెలుసుకోవడం కోసం యార్డును కంప్యూటరైజేషన్ చేయబోవుచున్నాము.
* రైతుల సమక్షంలోనే కాటాలు వేస్తున్నాము.
* రైతు బంధు పథకాన్ని అమలు చేయడానికి నిధుల కొరత లేదు. రాబోయే సీజన్‌లో ఎక్కువ కోల్డ్ స్టోరేజీలు అద్దెకు తీసుకుని రైతుల సరుకులు నిల్వచేసుకొనే అవకాశాన్ని కల్పిస్తున్నాము.
* ఉద్యానవన శాఖ ద్వారా చిల్లీ డ్రైయర్స్‌ను అందిస్తున్నాము.
* రైతులు మిర్చిని ఆరబెట్టుకోవటం కోసం ప్లాట్‌ఫారాలు నిర్మించుకోవడానికి సబ్సిడీలు అందచేస్తున్నాము.
* రైతులు పండించే మిర్చి ఎగుమతులకు తగిన విధంగా వుండటానికి సెమినార్లు నిర్వహిస్తున్నాము.
* మిర్చి అమ్మకాలలో ఏదైనా ఇబ్బందులు వస్తే 24 గంటలలో సమస్యను పరిష్కరిస్తున్నాము.
* యార్డ్ ఆవరణలో సిబ్బంది ఎవరైనా అవకతవకలకు పాల్పడినా, రైతులకు ఏ సమస్యలు వచ్చినా అధికారుల దృష్టికి తెస్తే వెంటనే పరిష్కరిస్తాము.
* గుంటూరు మార్కెట్ యార్డ్‌లో మీకు ఏ సమాచారం కావాలన్నా 0863-2233699, 2232847 అనే ఫోన్ నంబర్లకు ఫోన్ చేసి సలహాలను పొందవచ్చును.
* యార్డులో 2005-06లో 438 మంది రైతులకు ఒక కోటి 69 లక్షల, 53 వేల రూపాయలు రైతు బంధు పథకం క్రింద తక్కువ వడ్డీకి రైతులుకు రుణాలు ఇచ్చాం.
* రైతులకు ఈ సంవత్సరం తక్కువ రేటులో యార్డు ద్వారా యూరియా అందజేశాం.
* ఈ సంవత్సరం ఫిబ్రవరి నుండి యార్డులో 20 లక్షల టిక్కీలు అమ్మకం చేశాం.



**యం.శివరామయ్య**
సెక్రటరీ
గుంటూరు మార్కెట్ యార్డు

# ప్రాచీన ఆలయాలకు ఆలవాలం చేబ్రోలు




1. అరిష్టాల నుంచి కాపాడే కాలభైరవుడి విగ్రహం
2. ఎత్తయిన గాలిగోపురం

(78వ పేజీ తరువాయి)

సర్వాంగ సుందరంగా తీర్చిదిద్ది భక్తిరసమైన కల్చరల్ కార్యక్రమాలు అధికారులు నిర్వహిస్తుంటారు. ప్రస్తుతం ఈ దేవాలయాలు పూర్వవైభవాన్ని సంతరించుకొనిభక్తులను విశేషంగా ఆకర్షిస్తున్నాయి.

## గ్రామదేవత రావులమ్మ

రాష్ట్రంలో ఒక్కో గ్రామానికి ఒక్కో గ్రామదేవత ఆలయం వున్నట్టే చేబ్రోలులో రావులమ్మ అనే గ్రామదేవత ఆలయంవుంది. ప్రజలు రాములమ్మను గ్రామదేవతగా కొలుస్తారు. గ్రామంలో ఎన్ని ఆలయాలు వున్నప్పటికీ ప్రజలు ఎక్కువగా రావులమ్మ గుడిలో పూజలు నిర్వహిస్తుంటారు. ప్రతియేటా శ్రావణ మాసంలో రైతులందరూ పొలాల్లో నాట్లు వేసిన అనంతరం జాతర నిర్వహిస్తారు. ప్రతి ఆదివారం రావులమ్మ విశేష పూజలందుకుంటుంది. ఇవిగాక వీరభద్రాలయం, వేణుగోపాలస్వామి, రంగనాథస్వామి, చంద్రమౌళేశ్వర స్వామి ఆలయాలు ప్రముఖమైనవి. సహస్ర లింగేశ్వరస్వామి ఆలయం, నరసింహస్వామి ఆలయం, మూడు ఆంజనేయస్వామి ఆలయాలు వున్నాయి. అయితే ఇక్కడ కాలభైరవుడి విగ్రహాన్ని గురించి పలు కథలు చెబుతుంటారు. ఎత్తైన దిబ్బపై ఒక దిమ్మె ఏర్పాటుచేసి ఆపైన విగ్రహాన్ని ప్రతిష్టించారు. ఈ ఎత్తైన దిబ్బలో బంగారపు ధాన్యపు గింజలు వుండేవని పూర్వీకులు చెబుతారు. దిగంబరంగా వుండే భైరవుడు గ్రామానికి ఎలాంటి అరిష్టం కలగకుండా చూస్తాడని ఇక్కడివారి విశ్వాసం. ఇవిగాక చేబ్రోలులో వున్న అన్నపూర్ణ సత్రం నిత్యం బాటసారులకు భోజన వసతి కల్పిస్తుంది. 1890లో దేచిరాజు గోపాలకృష్ణ మరికొందరు కలిసి దీనిని నిర్మించి అప్పట్లో ఉచితంగా బాటసారులకు భోజనం పెట్టేందుకు స్థాపించారు. ఈ పద్ధతి ఇప్పటికీ కొనసాగుతోంది. ఎన్నోవేల సంవత్సరాల చరిత్ర కలిగిన చేబ్రోలు దేవాలయాల గురించి ఎక్కువ మందికి తెలియదు. రాజ్యాలు కాలగర్భంలో కలిసిపోయినా అప్పటికట్టడాలు ఇప్పటికీ మనల్ని ఆకట్టుకుంటున్నాయి. ఆ కోవకే చెందిన చేబ్రోలు దేవాలయాలపై పురావస్తు శాఖ వారు ప్రత్యేక దృష్టిపెట్టి పర్యాటక కేంద్రంగా చేబ్రోలును తీర్చిదిద్దాల్సిన అవసరం వుంది. దీనివలన భావితరాల వారికి ప్రాచీన సంస్కృతి, సంప్రదాయాలను తెలియజేయగలుగుతావునడంతో సందేహంలేదు.

# సాహితీవేత్తలకు పుట్టినిల్లు ప్రత్తిపాడు

(ఆన్‌లైన్ - ప్రత్తిపాడు)

గుంటూరు జిల్లా ప్రత్తిపాడు మండలం కొండవీడుకు అతి చేరువలో వుండడమే కాకుండా చందవోలు, మోటుపల్లి రాజ్యాల నుంచి పలనాటి సీమకు వెళ్లే రహదారికి కీలకమైన స్థానంలో వుంది. 13వ శతాబ్దపు పలనాటి చరిత్రకు పూర్వమే వజ్రాల దిన్నెగా పేరుపొందిన శాతవాహన సామ్రాజ్యపు రాజధాని అమరావతికి వెళ్లే అనేక రహదారులకు ముఖద్వారంగా ఒకనాడు విలసిల్లిన ప్రత్తిపాడు ఎంతో చారిత్రక ప్రాధాన్యం కలిగి వుంది. అందుకు గ్రామంలోని ప్రాచీన దేవాలయాలే సాక్ష్యం. తూర్పు, దక్షిణ రాజ్యాలైన చందవోలు, మోటుపల్లి, ఇనగల్లు మొదలైన ప్రాంతాల నుంచి శాతవాహన రాజధానికి పలనాటి సీమకు ప్రయాణించే ముఖద్వారమే ప్రత్తిపాడు.

ప్రస్తుతం మేజర్ పంచాయతీగా, నియోజకవర్గ కేంద్రంగా వున్న ప్రత్తిపాడు కేవలం రాజకీయ ప్రాధాన్యతనేగాక సాహిత్య సౌరభాలను వెదజల్లిన ఉద్యానవనంగా పేరుపొందింది. కవులు, కళాకారులు, పండితులకు ఎందరికో ఆశ్రయమిచ్చి చారిత్రాత్మక కేంద్రంగా నిలిచింది. కొండవీడు కుమారగిరి రాయప ప్రేయసి లకుమాదేవి కాలి గజ్జెలు రవళించిన వేణుగోపాల స్వామి ఆలయంలోని కళ్యాణమండపం నేటికీ ఒక మధుర చిహ్నంగా నిలిచి వుంది. మోటుపల్లి ఓడరేవు వివాదంలో చెర బడ్డ చినవేముని విముక్తి కోసం రాయబారిగా వెళ్లిన కొండవీటి విద్యాధికారి శ్రీనాథ కవిసార్వభౌముడు ప్రత్తిపాడు మీదుగా ప్రయాణించిన వైనం విన్నప్పుడు ఎవరికైనా వళ్లు పులకరించక మానదు. శాతవాహన రాజైన శాతకర్ణిని మలయవతి చేసిన పరిహాసానికి సమాధానంగా ఆరు నెలల్లో చక్రవర్తికి సంస్కృతం నేర్పించిన విష్ణుశర్మ ఈ ప్రాంతంవాడే. తెలుగు భాషకు మణిహారంగా ప్రసిద్ధి చెందిన మాలపల్లి నవలను ఈ ప్రాంతానికి చెందిన ఉన్నవ లక్ష్మీనారాయణపంతులు(ఉన్నవ గ్రామం) రచించి చిరస్మరణీయులయ్యారు.

వాగ్గేయకారుడు సాక్షాత్తూ త్యాగరాజువారి శిష్యుడు అయిన రాజనాల వెంకటప్పయ్య ఈ గ్రామ నివాసి. ఆయన చేసిన కృతులు సంగీత ప్రపంచంలో ప్రాతఃస్మరణీయం. ప్రత్తిపాడులో జన్మించిన కాసా సుబ్బారావు పత్రికారంగంలో ఎంత ఉన్నతులో జగమెరిగిన సత్యం. ఆయన దశాబ్దంకు పైగా శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానాల ఆస్థాన పత్రిక సప్తగిరికి సంపాదకులుగా కూడా పనిచేశారు. శ్రీ ఆలూరి బైరాగి చౌదరి పేరు విననివారు తెలుగులో ఎవరూ వుండరు. చందమామకు సాటి వచ్చే ఆహ్లాద వినోద పత్రికలు ప్రపంచంలోనే అరుదు అంటే అతిశయోక్తి కాదు. అలాంటి పత్రికను హిందీ భాషలోకి పరిచయం చేసి, నాగిరెడ్డి, చక్రపాణిలతో కలిసి ఎంతో సాహిత్య కృషి సల్పిన అయిదవ దశాబ్దపు అఖండ మేధావి అయిన బైరాగి చౌదరి ప్రత్తిపాడు చారిత్రకంగా ధరించిన మణిపూసల్లో ఒకరు. ప్రత్తిపాడు మండలం వంగిపురం అగ్రహారంలో ఉద్దండ పండితులు ఎందరో వుండేవారు. కొప్పర్రు గ్రామం నుంచి గుంటూరు సంస్కృత కళాశాలకు నిత్యం నడిచివెళ్లి (24కి.మీ.)వస్తూ జంధ్యాల పాపయ్య శాస్త్రి రచించిన కరుణశ్రీ ఉదయశ్రీ వంటి కావ్యాలు తెలుగు భాషలో వెలలేని, తులలేని ముత్యాల హారాలు. మండలంలోని యనమదల గ్రామ పరిసర ప్రాంతాల నివాసులైన పండితులు పాత్తూరి వెంకటేశ్వరరావులాంటి పత్రికా సంపాదకులు తెలుగుభాషకు ఎనలేని సేవలందించారు. గతంలో 'ఆంధ్రజ్యోతి' దినపత్రిక సంపాదకుడుగా 'ఉలుకు-పలుకు' శీర్షికతో వారం వారం రాజకీయరంగాన్ని ఓ కుదుపు కుదుపుతూ రాజకీయ సాహిత్య రసస్రవంతిని ధారావాహికంగా వెలువరించిన ఇనగంటి వెంకట్రావు ప్రత్తిపాడు శివారు నిమ్మగడ్డవారిపాలెంలో జన్మించారు. 1956లో ఐవిఆర్ స్కూలు ఫైనల్ పూర్తిచేశారు. ప్రెస్ అకాడమీ ఛైర్మన్‌గా సేవలందించారు.

నిమ్మగడ్డవారిపాలెంలో ఉదయించిన మరో కవి పండిత మేధావి లల్లాదేవి. శ్రీమాన్ పరుచూరి నారాయణాచార్యులు ఆంజనేయస్వామి కోవెలలో అర్చకస్వామిగా వుంటూ లల్లాదేవి కలం పేరుతో తెలుగు నవలా సాహిత్యరంగాన్ని ఓ కుదుపు కుదిపారు. నూరుకు పైగా నవలలు, వివిధ పత్రికల్లో 30 పైగా ధారావాహికలు, అనేక చారిత్రక కథలు, రేడియో నాటికలు, సినిమా కథలతో చరిత్ర సృష్టించారు. తెలుగులోనే గా అనువాద కన్నడ సాహిత్యంలో కూడా లల్లాదేవి పేరు సుప్రతిష్టమైంది. లకుమాదేవి, శ్వేతనాగు, గలగలా గోదారి, రుద్రవీణ, మల్లమ్మ ఉసురు లాంటి నవలల గురించి తెలియనివారు లేరు. లల్లాదేవిని టిటిడి ధర్మప్రచార పరిషత్‌వారు ప్రస్తుతం పురాణపండితులుగా నియమించి, గౌరవించడం విశేషం. ప్రత్తిపాడు మండలం పెదగొట్టిపాడు గ్రామస్తుడైన వెలివెల్లి సైదులు గతంలో రాష్ట్ర ప్రభుత్వ అధికార పత్రిక తెలుగు సమాచారానికి సంపాదకులుగా పనిచేశారు. ప్రత్తిపాడులో పరిమళించిన ఎన్నో సాహిత్య కుసుమాలు తెలుగు నందనవనాన్ని మరింత గుభాళింపజేశాయి.

# చరిత్ర సిగలో జాజిమల్లి సత్తెనపల్లి

**ప్రాచీన కాలం నుంచీ సత్తెనపల్లి పాడిపంటలతో సుక్షేత్రంగా విరాజిల్లుతోంది. అమరావతి, కొండ వీడు రాజుల పాలనలో తరించింది. ప్రత్యేకించి కోటలేమీ లేకపోయినా, చుట్టూ ఉన్న దేవాలయాలే సత్తెనపల్లికి పెట్టని కోటలుగా నిలిచాయి. అంతేగాక ఎందరో యోధానుయోధులకు నెలవైంది. ఏది ఏమైనప్పటికీ ఆంధ్రదేశ చరిత్ర సిగలో జాజిమల్లెగా సత్తెపల్లిని చెప్పుకోవచ్చు.**

క్రీస్తుశకం 1326 సంవత్సరంలో పాత సత్తెనపల్లి అనగా వడ్డవల్లిలో పోలయ్య వేమారెడ్డి కాలానికి చెందిన మూలగురవమ్మ గుడి అత్యంత శిల్ప నైపుణ్యంతో నిర్మించబడి నట్టు తెలుస్తున్నది. కానీ, ప్రస్తుతం అది సత్తె నపల్లిలో కానరాదు. ఒక మట్టిమిద్దెయందు గురవమ్మ, గువరయ్యల పేర్లు గల చావిడి కనిపిస్తుంది. వడ్డెరలు ఎక్కువగా ఉన్నందున ఆ కాలంలో వారిపేరు మీదుగా ఆ ప్రాంతానికి వడ్డవల్లి అని పేరు వచ్చింది. ఈ వడ్డెర్లలో సత్తెన్న అనే అతడు బలవంతుడు. దళ నాయకుడైనందున వడ్డవల్లి ఉత్తరంగా ఏర్పాటుచేయబడిన పల్లెకు సత్తెనపల్లి అని పేరువచ్చింది. ఇది క్రీస్తుశకం 1779 ప్రాంతంలో ఏర్పడిన పల్లె. ఇతనికి ఈ ప్రాంత రక్షణ బాధ్యతలు, కప్పం వసూలు అప్పచెప్పిన వారు చిలకలూరిపేట జమిందారు రాజా మానూరి వెంకన్న. ఆయన సత్తెన పల్లిలో శ్రీ వేణుగోపాలస్వామి గుడిగోడను నిర్మించారు. స్వామివారి భూమి మాన్యాన్ని దానంచేసి, వంశపారంపర్య ధర్మకర్తలుగా ఉన్నారు. సత్తెనపల్లి ఏర్పడ్డాక వడ్డవల్లి ప్రాచీ నమైంది.

భృగుబండ గ్రామంలో రాతియుగానికి చెందిన సమాధుల ఆనవాళ్ళు ఇప్పటికీ దర్శ నమిస్తున్నాయి. క్రీస్తుపూర్వం 2,3 శతాబ్దాల నుంచే ఇక్కడ జనావాసం కనిపిస్తుంది. పురా ణపరంగా గమనిస్తే గర్వచక్షువును కోల్పో యిన భృగుమహర్షి శ్రీ మహావిష్ణువును శర ణుగోరి ఆపై భూలోకమునకు చేరి ఒక కొం డపై తపస్సు చేశాడు. అతడు తపమాచరిం చిన బండయే భృగుబండగా స్థిరపడిందని గ్రామీణుల నమ్మకం. ఒరిస్సా రాష్ట్రం పూరి లో తప్ప మరెక్కడ కానరాని సుభద్ర, బలరా మకృష్ణ జగన్నాథస్వామివారి ఆలయం నిత్య కళ్యాణ శోభతో ఏటేటా ఉత్సవాలతో అలలా రుట ఇచ్చట గమనించవచ్చు.

క్రీస్తుశకం 1183లో అమరావతి పాల కుడు కోటకేతరాజు తులసంక్రాంతి పర్వది నాన శ్రీ స్వామివారి నిత్య దూపదీప నైవేద్య ములకు సమర్పించిన దానములలో మేడి కొండూరు, డోగిపర్రు గ్రామాలు కలవు. క్రీస్తు శకం 11వ శతాబ్దమున వీరశైవం, వీర వైష్ణవ ం తీవ్రంగా ఉన్నాయి. గుడిపూడిలో చెన్నకే శవ ఆలయం దూపదీప నైవేద్యాలతో అలరా రుచుండెడిది. శైవమత వలించుతులైన జంగమ దేవర్లకు అలవాలమైన గుడిపూడిలో చంద్ర ప్రతిష్టమైన సోమేశ్వర ఆలయం ఉన్న ప్పటికీ రాజాదరణ లేక ప్రభలేనిదాయెను. జంగమదేవర్లు ఉదయం దేశ యాటనకు వెళ్ళి లభ్యమైన భత్యంతో సంతృప్తిచెంది సాయం సమయానికి సోమేశ్వరుని చెంతకు చేరి గుంపులుగుంపులుగా కూర్చొని, ఆలయ పునరుద్ధరణ గురించి, మండపం, ప్రాకా రాలు, గాలిగోపురాల గురించి ప్రతిపాదిం చుట, మరొకరు తిరస్కరించుట వంటి చర్చలతో ఎన్నో రాత్రులు, సంవత్సరాలు గడిచాయేని కార్యరూపందాల్చలేదు. కారణం వారి పేదరికమే. అందుకే కాని వ్యవహారాలపై చర్చిస్తే మన పెద్దలు 'గుడిపూడి జంగాల్లా'గా అనే సామెత వాడుతుంటారు.


శ్రీ వేణుగోపాలస్వామి ఆలయ గోపురం

క్రీస్తుశకం 1300 సంవత్సరంలో కాకతీయ ప్రతాపరు ద్రుడు అమరావతి పోతూ మార్గం మధ్యలో ప్రసిద్ధిగాంచిన సోమేశ్వరునికి ఆలయం కట్టించి భూమిదానం చేసినట్టు తెలు స్తున్నది. క్రీస్తుశకం 1650 ప్రాంతంలో ఆంధ్రదేశం వెలసిన శ్రీశ్రీశ్రీ అచ్చమ్మ పేరంటాలు ఉత్సవాలు గుడిపూడిలో ఏటా నిర్వహించబడుతున్నాయి. క్రీస్తు శకం 1796లో రాజావాసిరెడ్డి వెంకటా ద్రినాయుడు గుడిపూడి చెన్నకేశవ ఆలయ జీర్ణోద్ధరణ గావించారు. నంది గామ వివిధ రాజవంశములతో మమేక మైంది. క్రీ.శ. 1138లో గణపతి మహా దేవ రాజువద్ద మంత్రిగా ఉన్న గోప రాజు రామన్న నందిగామను హక్కు భుక్తంగా వ్రాయించుకున్నారు. క్రీ.శ.1415లో నందిగామ పోలయ వేమారెడ్డి, అనుపోతరెడ్డి, అనువేమా రెడ్డి, అతని కుమారుడు కుమార గిరి రెడ్డి పాలనలో ఉన్నట్టు తెలుస్తున్నది. క్రీ.శ. 1773 నుంచి మొగలాయి

(మిగతా 83వ పేజీలో)

# చరిత్ర సిగలో జాజిమల్లి సత్తెనపల్లి

(82వ పేజీ తరువాయి)

పాదుషాలు క్రీ.శ. 1687లో కొండవీటి జమిందారుల ప్రాపకంలో, క్రీ.శ.1712లో ముజారీస్‌ఖాన్ కొండవీటిని మూడు వంతులుగా విభజించి, అందులో చిలకలూరిపేటను మానూరి వెంకన్నగారి వారసులైన మానూరి నరసన్నకు, సత్తెనపల్లిని వెంకటేశ్వర్లుకు అప్పగించారు. ఇది క్రీ.శ. 1779లో జరిగింది.

నందిగామలో సోమేశ్వరుని ఆలయాన్ని మునగోటి బసవభక్తుడను విశ్వబ్రాహ్మణుడు కట్టించాడు. గొర్రెల మందలచే నింపబడుట వలన మామందల మాదలగా మార్పుచెందింది. క్రీ.శ.1212లో గణపతిదేవుని కుమార్తె గణపాంగ మాదలలోని సకలేశ్వరస్వామిని సేవించింది. క్రీ.శ. 1125లో మాదల సోమేశ్వరాలయంలో దుర్జయ్య వంశీయుడగు పిన్నమనాయుడు క్రీ.శ. 1982లో దేవనాయుని కుమారులను, క్రీ.శ.1256లో బేతరాజులు, క్రీ.శ.1261లో గణపాంగ పేర మన్నబోయడు సకలేశ్వర స్వామివారిని దర్శించినట్టు శాసనం ద్వారా తెలుస్తున్నది. పణిదెం గ్రామం క్రీ.శ.1193లో గణపతి దేవుని వద్ద నుంచి గోపరాజు రామన్నపంతులు దీనిని కూడా దానం పట్టినట్టు, క్రీ.శ.1375లో అనవేమారెడ్డి సోమేశ్వరాలయాన్ని కట్టించినట్టు తెలుస్తున్నది. దీంతోపాటు శ్రీ కళ్యాణ వేణుగోపాలస్వామి ఆలయాన్ని కూడా కట్టించారు. క్రీ.శ.1500 సంవత్సరంలో రాజ్యం కర్ణాటక ప్రభువుల వశమైనప్పుడు ఆలయ మర్యాదలను వారు కూడా పాటించారు.

క్రీ.శ.1517లో శ్రీకృష్ణదేవరాయలు దండయాత్రలు చేస్తూ పణిదెం గ్రామం చేరుకున్నారు. పణిదెంలో వేణుగోపాలస్వామివారి గాలిగోపురాన్ని నిర్మించినట్టు తెలుస్తున్నది. ఆ కాలలో రాయలవారి భటులు మకాంవేసిన ప్రాంతం భటులూరుగా, అదే కాలక్రమంలో భట్లూరుగా మార్పు చెందింది. క్రీ.శ.1670లో ఏర్పడిన క్షామానికి పణిదెం పతనమైంది. ఇందలి ఆలయాలు సిథిలమయ్యాయి. పిచ్చిదుబ్బులు పెరిగి 50 సంవత్సరాలపాటు అడవిగా మారింది. ఆ తర్వాత 1700లో నరసరావుపేట జమిందారుపై కోపమున్న కొన్ని కుటుంబాలవారు చాగలమర్రి నుంచి పణిదెంకు వలసవచ్చారు. ఆవు గిట్టల నుంచి బయల్పడిన వేణుగోపాలుని ప్రతిష్ఠించి మరలా పణిదెంను ఏర్పాటుచేశారు. క్రీ.శ.1791లో రాజా వాసిరెడ్డి వెంకటాద్రి నాయుడు కళ్యాణ వేణుగోపాల స్వామివారి ఆలయాన్ని పునఃప్రతిష్ఠించారు.

అబ్బూరులో ని ఉగ్రనరసింహాలయం ప్రహ్లాదుని కాలం నాటిది. భూగర్భాలయం సగం నీటిలో సగం పొడిగా ఉండి, దేవతలు, మానవుల చేత పూజింపబడుతూ ప్రఖ్యాతి గాంచింది. చింతలపూడిగా క్రీ.శ.1407నాటికే ప్రసిద్ధిగాంచింది పెదమక్కెన గ్రామం. పెదకోమటి వేమారెడ్డి వద్ద పనిచేస్తున్న శ్రీ కృష్ణపాటి లింగన్న దీనిని వడిసినట్టు శాసనాలు కలవు. క్రీ.శ.1750 నాటికి రాజా వాసిరెడ్డివారి ఆధీనంలో ఉన్నట్టు తెలియవచ్చింది. క్రీ.శ.1565లో ఇబ్రహీం షాదుషా గోల్కొండ నవాబుగా ఉండి, ముర్తుజా భామన క్రీ.శ.1570లో కొండవీటి నుంచి బెల్లంకొండ వరకు, బెల్లంకొండ నుంచి కొండవీటి వరకు వచ్చిపోయే మార్గంలో నమాజు సమయమగు ప్రాంతమున మసీదు కట్టించెను. దీనిని కొమెరిఖాన్ అను నతనికి అప్పగించి కొమెరపూడి అను గ్రామం ఏర్పాటుచేసినట్టు తెలుస్తోంది. నాటి మసీదు నేటికీ కలదు. లక్కరాజుగార్లపాడు ప్రాచీన చరిత్రకు సాక్షీభూతం. క్రీ.శ. 10వ శతాబ్దం నాటి వీరశైవ, వీరవైష్ణవ, బౌద్ధ, జైన మతాల విద్వేషాలకు గురైన గ్రామం. ఇక్కడ ప్రాచీన దేవాలయాలు ధ్వంసమై మూల విగ్రహాలు, బావులలో, చెరువులలో దర్శనమిస్తాయి.

గార్లపాటి లక్కరాజు పేర లక్కరాజుగార్లపాడు ఊరు ప్రసిద్ధమైంది. గార్లపాటి రామలింగయ్య తెనాలిలోని మేనమామ చెంత చేర తెనాలి రామకృష్ణునిగా మారాడు. రాజా వాసిరెడ్డి వెంకటాద్రి నాయుడుకు ఇష్టులైన రాజోద్యోగులు గార్లపాడులో ఉండుటవలన పెళ్ళిళ్ళకు, పండుగ పబ్బాలకు వచ్చేవారట. తెలుగువారి సాంస్కృతిక చిహ్నాలు, కట్టుబొట్టు వ్యవహారాలతో పల్నాటి ముఖద్వారంగా ఉన్న సత్తెనపల్లి పల్నాటివారి పౌరుషంతోపాటు గుంటూరు సీమ సౌకుమార్యాన్ని పుణికిపుచ్చుకుంది. కష్టించి పనిచేసేతత్వంతో పాటు స్వాతంత్ర్య సమరాన దూకిన యోధానుయోధులు జన్మించిన నేల సత్తెనపల్లి.



పొన్నూరు పురపాలక సంఘ కార్యాలయం

## వివిధ రంగాల్లో విశిష్టత సంతరించుకున్న

# పొన్నూరు పురపాలన

(ఆన్‌లైన్-పొన్నూరు)

పూర్వకాలంలో స్వర్ణపురిగా పేరొంది, కాలక్రమంలో పొన్నూరుగా రూపాంతరం చెందిన పొన్నూరుపట్టణం జాతీయ స్థాయిలో పేరు ప్రఖ్యాతలు నొందిన నాయకులకు పుట్టినిల్లుగా...రాజకీయ చైతన్యానికి వేదికగా..వ్యాపార,వాణిజ్య రంగాలకు నిలయంగా...ప్రజల ఉద్యమాలకు పురిటిగడ్డగా, ఆధ్యాత్మిక కేంద్రంగా పేరెన్నికగన్నది. పొన్నూరు-నిడుబ్రోలు గ్రామ పంచాయతీల కలయికతో 1967లో ద్వితీయశ్రేణి పురపాలక సంఘంగా ఏర్పడిన ఈ పట్టణం 30 చదరపు కిలోమీటర్ల విస్తీర్ణంలో విస్తరించి ఉంది. పురపాలకసంఘం ఆవిర్భావం సమయంలో జనాభాసంఖ్య 20 వేలుకాగా, ప్రస్తుత జనాభా సంఖ్య 58 వేలు, ఓటర్ల సంఖ్య 39,500గా వుంది.

పట్టణ, గ్రామీణ వాతావరణానికి నెలవుగా వున్న పొన్నూరు పట్టణం తమలపాకు తోటల సాగులో జాతీయ, అపరాల సాగులో రాష్ట్రస్థాయిల్లో పేరెన్నిక గన్నది. పట్టణ పరిసరాలు వరి పంట పొలాలు, తమలపాకుతోటలు, వాణిజ్య పంటల పచ్చదనంతో నిండి వుంటుంది. దేవాలయాల పట్టణంగా పేరొందిన పొన్నూరు ఆధ్యాత్మిక కేంద్రంగా... భక్తులకు కొంగు బంగారంగా విరాజిల్లుతోంది. పురాణ ప్రసిద్ధిగాంచిన సాక్షిశ్రీ భావన్నారాయణ స్వామి, దక్షిణ కాశీగా పేరొందిన సహస్రలింగేశ్వరస్వామి, వీరాంజనేయ స్వామి, గరుత్మంతస్వామిల దేవాలయాలకు నిత్యం భక్తులు వందలాది సంఖ్యలో విచ్చేస్తుంటారు. విద్యారంగంలో పేరొందిన పట్టణం, వైద్య రంగానికి నిలయంగా వుంది.

సుదీర్ఘకాలం పార్లమెంటు సభ్యునిగా కొనసాగి గిన్నీస్ బుక్ రికార్డుల్లోకెక్కిన ఆచార్య ఎన్‌జి.రంగా, చేనేత ఉద్యమకారునిగా దేశవ్యాప్తంగా పేరు ప్రఖ్యాతలు నొందిన ప్రగడ కోటయ్య పొన్నూరు పట్టణ వాసులే! ప్రజా ఉద్యమకారునిగా, కవిగా, రచయితగా పేరొందిన కత్తిపద్మారావు పొన్నూరు కేంద్రంగా నిర్వహించిన కారంచేడు, చుండూరు ఉద్యమాల జాతీయస్థాయిలో మార్మోగాయి. సినీరంగంలో విలక్షణ నటునిగా పేరొందిన సిఎస్ఆర్ ఆంజనేయులు పొన్నూరు వాసే! పట్టణానికి చెందిన పాములపాటి అంకినీడు ప్రసాదరావు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల్లో మంత్రి పదవులను అధిష్టించారు. గోగినేని నాగేశ్వరరావు, ధూళిపాళ్ళ వీరయ్యచౌదరిలు రాష్ట్ర మంత్రులుగా పని చేశారు. 40 యేళ్ళ క్రితం మున్సిపాలిటీగా ఏర్పడిన పొన్నూరు పట్టణం పారిశ్రామికరంగంలో వెనుకబడిందని చెప్పవచ్చు! పదిమందికి ఉపాధిని చూపించే పరిశ్రమ ఒక్కటి కూడా పట్టణంలో ఏర్పాటు కాకపోవడం గమనార్హం. ఆదాయ వనరులు అంతంత మాత్రంగా వున్న పొన్నూరు పురపాలక సంఘం ప్రధాన సమస్యల పరిష్కారంలో తీవ్రమైన ఆర్థిక ఇబ్బందులను ఎదుర్కొంటుంది.

కాగా, పట్టణాన్ని శరవేగంగా అభివృద్ధి పర్చేందుకు బృహత్తర ప్రణాళికను రూపొందిస్తున్నట్టు నూతన చైర్‌పర్సన్ డాక్టర్ ఎన్ రూత్‌రాణి



ఐలాండ్ సెంటరు

(మిగతా 85వ పేజీలో)

# వివిధ రంగాల్లో విశిష్టత సంతరించుకున్న పొన్నూరు పురపాలన

దాసరి అనురాధ మున్సిపల్ కాంప్లెక్స్

(84వ పేజీ తరువాయి)

పేర్కొనడం విశేషం. పొన్నూరు పురపాలక సంఘు ఆవిర్భావం తరువాత మున్సిపల్ ఛైర్మన్లుగా పదవీ బాధ్యతలను నిర్వహించిన వారి వివరాలు ఇలా వున్నాయి.

ప్రథమ మున్సిపల్ ఛైర్మన్ కొప్పాక వెంకయ్య (09-10-67 నుంచి 10-10-69) వరకు పదవిలో కొనసాగారు. నన్నపనేని శ్రీనివాసరావు (10-10-69 నుంచి 10-10-72) వరకు ఛైర్మన్లుగా పనిచేశారు. పాలపర్తి నాయుడమ్మ 1981 నుంచి 84 వరకు, పొట్లూరి శ్రీహరిరావు 1984 నుంచి 86 వరకు, డాక్టర్ టి.వెంకయ్య 1987 నుంచి 89 వరకు, గోగినేని రాధికరాణి 1989 నుంచి 92 వరకు, దాసరి అనురాధ 1995 నుంచి 98 వరకు, కొల్లా కుసుమకుమారి 1998 నుంచి 2000 వరకు, మేనపాటి శాలిని 2000 నుంచి 2005 వరకు మున్సిపల్ ఛైర్మన్లుగా కొనసాగారు. 2005వ సంవత్సరంలో జరిగిన మున్సిపల్ ఎన్నికల్లో డాక్టర్ ఎన్.రూత్‌రాణి ఛైర్‌పర్సన్‌గా ఎన్నికై పదవిలో కొనసాగుతున్నారు.

కాగా, పురపాలక సంఘం ఆవిర్భావం తర్వాత జరిగిన మున్సిపల్ ఎన్నికల్లో ఛైర్మన్లుగా ఎన్నికైనవారిలో మేనపాటి శాలిని మినహా మిగిలిన వారెవ్వరూ పూర్తికాలం ఛైర్మన్ పదవిలో కొనసాగలేదు. తొలి ఛైర్మన్ కొప్పాక వెంకయ్య పదవీకాలం పూర్తికాకుండానే తప్పుకోగా, ఆయన స్థానంలో నన్నపనేని శ్రీనివాసరావు పదవిని అధిష్టించారు. అలాగే పాలపర్తి నాయుడమ్మ - పొట్లూరి శ్రీహరిరావు అయిదేళ్ళకాలం, డాక్టర్ టి.వెంకయ్య-గోగినేని రాధికారాణి, దాసరి అనూరాధ - ఆకుల శివయ్య వివిధ కారణాలు, రాజకీయ సమీకరణల నేపథ్యంలో సగకాలం చొప్పున ఛైర్మన్ పదవిలో కొనసాగారు.

ప్రస్తుత ఛైర్‌పర్సన్
ఎన్ రూత్‌రాణి

## భక్తుల పాలిట పెన్నిధి
# వైకుంఠపుర వాసుని సన్నిధి

(ఆన్‌లైన్, తెనాలి)

శ్రీ వైకుంఠపురేశాయ
వేంకటేశాయ మంగళమ్

కళలకు కాణాచిగా, విద్యలకు విన్నాణంగా, ధర్మ దాతృత్వాలకు పెన్నిధిగా, ఆంధ్రా ప్యారిస్‌గా ఖ్యాతి నార్జించిన తెనాలి పట్టణంలో అంతర్భాగమ్మై, రేపల్లె రైల్వే బ్రిడ్జి సమీపంలో వైకుంఠపురంలో నిర్మితమైన శ్రీ లక్ష్మీ పద్మావతీ సమేత శ్రీ వేంకటేశ్వర స్వామి దేవస్థానం దేశంలోని దివ్య క్షేత్రాలలో ఒకటిగా ప్రసిద్ధికెక్కింది. శాంతికి, ప్రశాంతికి నిలయమ్మైన వాతావరణంలో నిర్మించబడిన ఈ దేవాలయం కమనీయంగా, కన్నుల పండువగా, కామితార్థదాయకంగా విలసిల్లుతోంది. నిత్యకళ్యాణం పచ్చ తోరణంగా విలసిల్లే శ్రీ వేంకటేశ్వరుడు భక్తాభీష్ట వరదుడై లక్ష్మీ పద్మావతీ సమేతంగా పరమ ప్రసన్న శోభలు చిందిస్తూ బహుముఖ వైభవోపేతుడై విరాజిల్లుతున్నాడు.


తెనాలి వైకుంఠపురంలో స్వామివారి తెప్పోత్సవ దృశ్యం

రాష్ట్రంలోని వేలాది భక్తులకు ఈ క్షేత్రం పవిత్ర యాత్రా స్థలమ్మై వేనోళ్ళ కొనియాడబడుతున్నది. అపర తిరుపతిగా పిలువబడే వైకుంఠపురం దేవస్థానంలో స్వస్తిశ్రీ పరీధావీ నామ సంవత్సరం నిజ వైశాఖ బహుళ పంచమి శుక్రవారం స్వామివారి విగ్రహ ప్రతిష్ఠ జరిగింది. అంతకు ముందు ఈ క్షేత్రానికి సంబంధించిన ప్రాశస్త్యం ఇలా ఉంది.

దేవస్థానం సంస్థాపకులైన తుళ్ళూరు బాల నరశింహారావు గౌడ్‌కు శ్రీ వేంకటేశ్వర స్వామి నాగేంద్రుని రూపంలో స్వప్నంలో సాక్షాత్కరించి వైకుంఠపుర స్థలం పరమ పవిత్రమ్మైందని, ఇక్కడ తనకో దేవాలయాన్ని నిర్మించవలసిందిగా ఆజ్ఞాపించి అంతర్థానమయ్యారు. ఈ స్వప్న ఫలితంగా బాల నరశింహారావు గౌడ్ సంఘసేవ పరాయణులతో కలిసి దేవాలయ నిర్మాణానికి సంకల్పించారు. లక్ష్మీ పద్మావతీ సమేతంగా స్వామివారి విగ్రహాలను తయారు చేయించి ఒక శుభ ముహూర్తాన ప్రతిష్ఠించారు. అప్పటి నుండి ఈ క్షేత్ర మహత్యం దిన దిన ప్రవర్ధమానమ్మై లక్షలాది మంది భక్తులు ఇక్కడకు వచ్చి స్వామి వారిని దర్శించి తరిస్తున్నారు. దేవస్థాన సంస్థాపకులు బాల నరశింహారావు గౌడ్ స్వామి వారిని సందర్శించడానికి వచ్చే భక్తుల రాకపోకలకు వీలుగా దేవస్థానం స్థలం పక్కనే ప్రవహిస్తున్న తూర్పు కాల్వపై కాలి వంతెన నిర్మించారు. కాలక్రమంలో భక్తుల రద్దీ పెరగడంతో కాలి వంతెనకు ఎగువన పెద్ద వంతెన నిర్మించారు. దేవస్థానం అనతి కాలంలోనే గణనీయమ్మైన అభివృద్ధి సాధించింది. ప్రతి సంవత్సరం ఇక్కడ దాదాపు రెండు వేల వివాహాలు స్వామి వారి సన్నిధిలో జరుగుతుంటాయి. దూర ప్రాంతాల నుండి వచ్చే భక్తుల కోసం, వివాహాలు, అన్నప్రాసనలు జరుపుకునే భక్తుల కోసం శ్రీనివాస సదన్, పద్మావతీ సదన్‌ల పేరుతో గదులు నిర్మించారు. దేవస్థానం ఆవరణలో విశాలమ్మైన

(మిగతా 87వ పేజీలో)

( 86వ పేజీ తరువాయి)

పొంగలి షెడ్డు, కళ్యాణ మండపాలు ఉన్నాయి. దేవాలయంలో భక్తులు పొంగలి తయారు చేసుకునేందుకు గ్యాస్ పొయ్యిలు ఏర్పాటు చేశారు. భక్తులు మొక్కుబడులు చెల్లించేందుకు ఎల్లప్పుడూ నీటి వసతి గల ప్రత్యేక కేశ ఖండన శాల ఉంది. భక్తులు అతి తక్కువ ఖర్చుతో వివాహాలు జరుపుకునేందుకు కళ్యాణ మండపాలు, విశాల ప్రాంగణం ఉన్నాయి. క్రేన్ సంస్థల అధినేత గ్రంధి సుబ్బారావు 18 లక్షల రూపాయిల విరాళంతో స్వామివారికి రాజ గోపురాన్ని నిర్మించారు.

## నిత్యాన్నదానం

శ్రీనివాసుని దర్శించ వచ్చే భక్తజనులకు తిరుమలలో మాదిరిగా శాశ్వత నిత్యాన్నదాన పథకాన్ని వైకుంఠపురం దేవస్థానంలో అమలు చేస్తున్నారు. ఈ పథకం ప్రారంభమైనప్పటి నుండి అపూర్వ ఆదరణ లభిస్తోంది. ఎంతో మంది దాతలు ఈ పథకానికి విరాళాలు అందిస్తున్నారు. శాశ్వత నిత్యాన్నదాన పథకం కింద బ్యాంకులలో ఫిక్స్‌డ్ డిపాజిట్ చేసి తద్వారా వచ్చే వడ్డీతో నిత్యాన్నదాన కార్యక్రమం నిర్వహిస్తున్నారు.

సాధారణ భక్తులు కూడా ఈ పథకంలో పాలుపంచుకుని వారి సహాయాన్ని అందించాలనే ఉద్దేశ్యంతో దేవస్థానం వారు విరాళాల పరిధిని గణనీయంగా విస్తరించారు. భక్తులు వెయ్యిన్నూట పదహారు నుండి రెట్టింపు సంఖ్యలో ఎంత మొత్తాన్నైనా అన్నదాన పథకానికి ఇవ్వవచ్చు. ప్రతి ఏటా శ్రీ వేంకటేశ్వర స్వామి బ్రహ్మోత్సవాలు వైశాఖ మాసంలో, ఏకాదశి సందర్భంగా ముక్కోటి ఉత్సవాలను, సంక్రాంతి పర్వదిన సందర్భంగా స్వామివారి తెప్పోత్సవాన్ని వైభవోపేతంగా నిర్వహిస్తున్నారు.

గత ఎనిమిది సంవత్సరాలుగా కార్తీక మాసంలో సామూహిక సత్యన్నారాయణ స్వామి వ్రతాలను దేవస్థానం ఆధ్వర్యంలో నిర్వహిస్తున్నారు. ఈ వ్రతాలకు భక్త జనుల నుండి విశేష ఆదరణ లభిస్తోంది. కార్తీక మాసంలో ఏటా 500 మంది దంపతులు ఈ వ్రతాలలో పాల్గొంటున్నారు.



స్వామి, అమ్మవార్ల ఉత్సవ మూర్తులు



తెనాలి వైకుంఠపురం దేవస్థానం


దుర్గి శిల్ప కళాకారుల
అద్భుత సృష్టి ఈ శిల్పాలు

# శిల్ప కళకు కాణాచి 'దుర్గి'

(ఆన్‌లైన్, దుర్గి)

దుర్గి పేరు వినగానే మదిలో శిల్ప కళ తళుక్కున మెరుస్తుంది. ఇక్కడ అనాదిగా ఈ కళ నిత్య నూతనంగా వికసించి పరిమళిస్తూ పర్యాటకులను విశేషంగా ఆకర్షిస్తోంది. దుర్గిలో ప్రభవిస్తున్న శిల్ప కళా ఖండాలు ఖండాంతర ఖ్యాతిని ఆర్జిస్తున్నాయి. ప్రతి ఏటా ఎందరో దేశ విదేశీయ పర్యాటకులు ఇక్కడి శిల్ప సోయగాలను తిలకించి పులకరించిపోతుంటారు.

దుర్గిలో ప్రభుత్వ ఆధ్వర్యంలో నడుస్తున్న నాగార్జున శిల్పకళ శిక్షణా కేంద్రంతో పాటు శ్రీ వెంకటేశ్వర శిల్ప కళాశాల, శ్రీ వేణుగోపాలస్వామి శిల్ప కళాశాల, దుర్గాదేవి శిల్ప కళాశాలలు వున్నాయి. ఈ శిల్పశాలల నుంచి నిరంతరం శిల్ప వృష్టి కురుస్తూ విశ్వ వ్యాప్తంగా ఎగుమతై స్వదేశ శిల్పకళకు గొప్ప ప్రాచుర్యాన్ని సంపాదించిపెడుతున్నాయి. అంగుళం నుంచి ఆరు అడుగుల ఎత్తు కలిగిన సైజుతో పలు భంగిమలలో శిల్పాలను చెక్కటంలో దుర్గి శిల్పులు సిద్ధహస్తులు. దుర్గి శిల్ప కళాశాలల్లో ప్రాణం పోసుకుంటున్న రాతి విగ్రహాలలో దేవతామూర్తులే కాక పల్లె పడుచు, శిశువుకు పాలు ఇస్తున్న మాతృమూర్తి, దర్పణ సుందరి, వయ్యారాలు ఒలికించే సుందరాంగుల విగ్రహాలు ప్రధానంగా వుంటాయి.

వన్నె తగ్గిన శిల్ప కళలో కొత్త కాంతిని ప్రవహింపజేయటానికి ఇక్కడ శిల్పులు కృషిసల్పుతూ రాళ్ళలో అపురూప కళాఖండాల అన్వేషణకు కారు చీకట్లో కాంతిపుంజాల్లా దూసుకుపోతున్నారు.

## దుర్గి శిల్ప కళా చరిత్ర బహు ప్రాచీనం

క్రీస్తుశకం 12వ శతాబ్దంలోనే దుర్గిలో శిల్పకళకు బీజం పడింది. తొలుత కొంతమంది శిల్పులు పెందోట నుంచి ద్వారకాపురి పట్టణానికి వలస వచ్చి ఇక్కడే స్థిరపడి జీవనం సాగిస్తుండేవారు. మహాయాన బౌద్ధమతాన్ని రూపొందించిన ఆచార్య నాగార్జునుడు పెందోట నివాసి అని కొందరి భావన. 12వ శతాబ్దంలోనే ప్రకృతి వైపరీత్యమో లేక శత్రురాజుల దాడుల ఫలితమో ద్వారకాపురి పట్టణం పూర్తిగా విధ్వంసం అయింది. ఆ సంఘటనలో ప్రాణాలతో మిగిలిన ద్వారకాపురి ప్రజలు కొందరు దారి వేముల అనే ప్రాంతానికి తరలివచ్చి ఆ గ్రామాన్ని నిర్మించుకున్నారు.

ద్వారకాపురికి చెందిన మరి కొందరు బతికి బయటపడ్డ కొద్దిమంది శిల్పులతో నేటి దుర్గి ప్రాంతానికి వచ్చి స్థిర పడ్డారు. వారు ఈ ప్రాంతానికి వచ్చిన వెంటనే శత్రుక్షయం కోరుతూ దుర్గాదేవి విగ్రహాన్ని ప్రతిష్ఠాపన చేసి తాము నివశిస్తున్న ప్రదేశానికి దుర్గాదేవి పేరిట 'దుర్గి' అను నామకరణం చేసుకున్నారు. ఇదంతా యదార్థం అని చెప్పటానికి నిదర్శనంగా దుర్గిలో నేటికీ ప్రాచీన దుర్గాదేవి ఆలయం వుండడం గమనార్హం.

దుర్గిలో 15వ శతాబ్దం నాటికి శిల్ప కుటుంబాల సంఖ్య 300కు చేరినట్లు కొందరి అభిప్రాయం. ఇక్కడ కాకతీయుల (మిగతా 89వ పేజీలో)


శంఖు, చక్రధారి
శ్రీ వెంకటేశ్వరస్వామి

# శిల్ప కళకు కాణాచి 'దుర్గి

(88 వ పేజీ తరువాయి)

కాలంలో క్రీ.శ.1127లో నాగేశ్వర, ఓంకారేశ్వర ఆలయాలు, క్రీ.శ.1160లో వేణుగోపాలస్వామి ఆలయం, క్రీ.శ.1140లో వీరభద్ర ఆలయం, స్థానిక శిల్పులచే నిర్మించినట్లు ఆయా శిలాశాసనాలు స్పష్టం చేస్తున్నాయి. మాచర్లలోని ప్రాచీన చెన్నకేశవ, వీర భద్రాలయాలు, అమరావతి, నాగార్జునకొండలో నిర్మించిన బౌద్ధ స్తూపాల నిర్మాణం వెనుక దుర్గి శిల్పుల పాత్ర వున్నట్లు కూడా పలువురు విశ్వసిస్తున్నారు.

కాలక్రమంలో శిల్ప కళాపోషకులు కరువై అన్నిచోట్ల క్షీణదశకు చేరింది. రాజులు, రాజ్యాలు అంతరించడంతో శిల్ప కళకు ఈ దుస్థితి దాపురించింది. దీంతో కమనీయ శిల్పాలను మలిచే శిల్పుల బతుకుల్లో చిమ్మ చీకట్లు కమ్ముకున్నాయి.

అహర్నిశలు బండల మాటున గుండెలు మోగించి మనోజ్ఞ శిల్ప కళాఖండాలను సృజించినా పూట గడవడం కష్టంగా మారింది. ఈ నేపథ్యంలో ఎందరో శిల్ప కళాకారులు శిల్ప వృత్తికి స్వస్తి చెప్పి ఇతర వృత్తులను ఆశ్రయించారు. మిగిలిన కొద్దిమంది శిల్పులు మాత్రం వంశపారంపర్యంగా పుణికిపుచ్చుకున్న శిల్ప కళను త్యజించలేక శిలలకు ప్రాణం పోసి జీవనయాత్ర సాగిస్తున్నారు. దుర్గి శిల్పులు కూడా ఇదే బాటలో ప్రయాణిస్తూ శిల్ప కళాసేవకే తమ జీవితాలను అంకితం చేస్తున్నారు.

## శిల్ప కళాభివృద్ధికి ప్రభుత్వ తోడ్పాటు

గాలిలో దీపంలో కొట్టుమిట్టాడుతూ ఆరిపోయే దశకు చేరుతున్న శిల్ప కళను రక్షించి శిల్పులలో దాగివున్న సృజనాత్మక శక్తిని వెలికితీసే సంకల్పంతో రాష్ట్ర ప్రభుత్వం 1962లో దుర్గిలో శిల్ప కళా శిక్షణా కేంద్రాన్ని నెలకొల్పింది.

పరిశ్రమల శాఖ ఆధ్వర్యంలో ఏర్పాటైన ఈ శిక్షణా కేంద్రంలో మొదటి రెండేళ్లలో ఆరుగురు మాత్రమే శిల్పకళలో శిక్షణ పొందారు. ఆ తరువాత వందల సంఖ్యలో ఈ శిక్షణా కేంద్రంలో శిక్షణ పొంది నైపుణ్యం సాధించారు. వీరిలో ఎంతో మంది ఇతర జిల్లాల్లో శిల్ప కళా క్షేత్రా


మృదుమధురం ఈ బుద్ధుని రూపం

లను నెలకొల్పి శిల్ప కళాభివృద్ధికి తోడ్పడుతున్నారు.

శిల్పుల మేథస్సుకు మరింత పదును పెట్టి, శిల్ప తయారీలో అవసరమైన సూచనలు, సలహాలు ఇవ్వడానికి నాగార్జున స్టోన్ కార్వింగ్ వర్కర్స్ కో-ఆపరేటివ్ ఇండస్ట్రియల్ సొసైటీ ఆవిర్భవించి కృషి సల్పుతోంది. 1963లో రాష్ట్ర హస్తకళల అభివృద్ధి సంస్థ ఇక్కడ శిల్ప కళాకారుల సాముదాయక సదుపాయ కేంద్రాన్ని నిర్మించి శిల్పులకు బాసటగా నిలిచింది. శిల్ప కళాశిక్షణా కేంద్రంలో శిక్షణ పొందుతున్న విద్యార్థులకు ఇచ్చే 30 రూపాయల స్టైఫండ్‌ను 100 రూపాయలకు పెంచి శిల్ప కళ అభ్యాసకులను ప్రోత్సహించింది. గత సంవత్సరం జూలై 27


కళా నైపుణ్యానికి నిదర్శనం ఈ శిల్పం

నుంచి ఆగస్టు 15 వరకు ఇక్కడి శిల్పులకు వృత్తి నైపుణ్యత సాధించడానికి రీజనల్ డిజైన్ అండ్ టెక్నికల్ డెవలప్‌మెంట్ సెంటర్(బెంగుళూరు) ఆధ్వర్యాన వర్క్‌షాప్ నిర్వహించారు. ప్రస్తుతం సంప్రదాయ పద్ధతిలో తయారుచేసే శిల్ప వస్తువులకు గిరాకీ లేదని, అందువల్ల శిల్పులకు నూతన డిజైన్‌లు నేర్పించడానికి ప్రభుత్వం ఈ వర్క్‌షాప్‌ను ఏర్పాటుచేసి 15 మంది శిల్పులకు శిక్షణా కార్యక్రమం నిర్వహించింది.

## దుర్గి శిల్పులకు సముచిత సత్కారం

మురిపాలు జాలువారే దుర్గి శిల్పాలు సందర్శకులను ఇట్టే ఆకట్టుకుంటాయి. అందుకే కళాభిమానులు ఇక్కడ శిల్ప కేంద్రాలను ఒక్కసారైనా తనివితీరా చూడాలని ఉవ్విళ్లూరుతుంటారు. 1994లో హైదరాబాద్‌లో వినాయక చవితి ఉత్సవాల సందర్భంగా నిర్వహించిన 'విఘ్నేశ్వర విగ్రహప్రదర్శన'లో దుర్గి విగ్రహాల అందచందాలను తిలకించిన ఆనాటి రాష్ట్ర ముఖ్యమంత్రి ఎన్‌టి రామారావు మంత్రముగ్ధులై దుర్గి శిల్పుల శిల్ప కళా నైపుణ్యాన్ని ప్రశంసిస్తూ ఘనంగా సన్మానించారు. అంతటితో ఆగక ఆ తరువాత కొద్దికాలానికే ఆయన తన సతీమణి లక్ష్మీపార్వతితో వచ్చి దుర్గి శిల్ప కళాకేంద్రాలను స్వయంగా సందర్శించి ఆనందించారు.

మాజీ ముఖ్యమంత్రి టి.అంజయ్య కూడా దుర్గి శిల్పుల శిల్ప కళాసేవకు గుర్తుగా శిల్ప కళాకేంద్రం ప్రధానాచార్యులు ఈశ్వర భిక్షమాచారిని సముచిత రీతిన సన్మానించి సత్కరించారు. 1996లో 'స్టోనా 96' పేరిట బెంగుళూరులో నిర్వహించిన ప్రపంచ శిల్ప విగ్రహ ప్రదర్శనలో పాల్గొనే నిమిత్తం కేంద్ర ప్రభుత్వం దుర్గి శిల్ప కళా కేంద్రానికి ఆహ్వానం పంపడం ఈ శిల్ప కళా కేంద్రం గొప్పతనానికి నిదర్శనం.

## ప్రభుత్వం చేయూతనిస్తే శిల్ప కళకు పునరుజ్జీవం

కఠిన శిలల పై శిల్పాలు చెక్కి సృష్టికి అందాలు తెచ్చినా తమకు మాత్రం మోడుబారిన జీవితమే మిగులుతుందని దుర్గి కళాకారులు ఆవేదన వ్యక్తం (మిగతా 90వ పేజీలో)

# శిల్ప కళకు కాణాచి 'దుర్గి'

(89 వ పేజీ తరువాయి)

చేస్తున్నారు. ఆరు అడుగుల శిల్పం చెక్కాలంటే ఇరువురు శిల్పులు నెల రోజుల పాటు శ్రమించాలని, శిల్పంలో ఏ ఒక్క భాగం దెబ్బతిన్నా తమ శ్రమ అంతా వృధా అవుతుందన్నారు. తపో దీక్షను మించిన పట్టుదలతో మలచిన శిల్పాలను గిరాకీ వున్న ప్రాంతాలకు తరలించి విక్రయించే స్థోమత తమకు లేదని ప్రభుత్వమే తమ శిల్పాలను కొనుగోలు చేసి ఆదుకోవాలని వీరు కోరుతున్నారు.


వయ్యారాలొలకబోస్తున్న సుందరి


రాసలీలలో రాధాకృష్ణులు

శిల్పాలు చెక్కడానికి, చెక్కిన శిల్పాలను భద్రపరచడానికి వసతి లేక అద్దె భవనాలలో శిల్ప శాలలను నిర్వహిస్తున్నామని వారు పేర్కొన్నారు. ప్రభుత్వం ఆర్థిక రుణసాయం చేస్తే శిల్ప కళాకేంద్రం నిర్మించుకొని శిల్ప కళారాధనకే అంకితమవుతామని స్థానిక శ్రీ వెంకటేశ్వర శిల్ప కళాశాల శిల్పులు అభిప్రాయపడుతున్నారు. శిలలను తేలిగ్గా తొలచటానికి యంత్ర పరికరాలు అందుబాటులో వున్నా వాటిని కొనే స్థోమత లేక ఉలి, సుత్తి వంటి సాంప్రదాయ పనిముట్లతోనే కాలం వెళ్ళబుచ్చుతున్నామన్నారు.

శిల్ప కళాభివృద్ధికి ప్రభుత్వం హైస్కూల్ స్థాయిలో ప్రతి క్లాస్‌కు వారానికి ఒక పిరియడ్ చొప్పున కేటాయించి శిల్పాచార్యులచే శిల్పకళపై విద్యార్థులకు శిక్షణ ఇప్పించాలని శిల్పి ఎర్రోజు నరసింహాచారి ప్రభుత్వానికి సూచించారు.

దుర్గిలో లభ్యమవుతున్న శిల్ప తయారీకి ఉపయోగపడే ముడి సరుకు క్వారీలను స్థానిక శిల్పులకు ఉచితంగా కేటాయించాలని దుర్గి శిల్ప కళాకారుల సంఘం అధ్యక్షులు చెన్నుపాటి సీతా రామయ్య ప్రభుత్వానికి విజ్ఞప్తి చేస్తున్నారు. ఇక్కడి ముడి రాయి అక్రమంగా ఇతర రాష్ట్రాలకు తరలిస్తున్న చోరుల ఆట కట్టించాలని కోరుతున్నారు.

శిల్ప కళకు కాణాచి అయిన దుర్గిలో ఆ కళ మున్ముందు కూడా ఇలాగే పల్లవించాలంటే ప్రభుత్వ ప్రోత్సాహం తప్పనిసరి. దేశంలో అంతిమ దశకు చేరి కళావిహీనమైన శిల్ప కళకు సజీవ చైతన్యం కల్పిస్తున్న శిల్పులను ఆదుకొనే ఆవశ్యకతను గుర్తించాలి. ప్రభుత్వ ఉద్యోగాల కోసం వెంపర్లాడక శిల్ప కళనే జీవనోపాధిగా మలచుకొని అనల్ప శిల్ప కళాచాతుర్య శక్తితో అపురూప కళాఖండాలను వెలయిస్తున్న దుర్గి శిల్పుల కృషి అభినందనీయం.


శిల్పానికి తుదిమెరుగులు దిద్దుతున్న శిల్పి మంగళగిరి ఆంజనేయులు


శిలపై నల్లనయ్య రూపు

# పుల్లరి పోరాట యోధుడు 'కన్నెగంటి'


కన్నెగంటి హనుమంతు

పరాయి కసాయి ప్రభుత్వ పాలకుల కబంధహస్తాల చిక్కిన భరత మాతకు విముక్తి కలిగించాలని ఎందరో దేశభక్తులు అహర్నిశలు పోరాటం జరిపారు. తరతరాల పరపీడనకు చరమ గీతం పాడి చిరకాల సుమధుర స్వప్నం 'స్వాతంత్ర్యం' సాకారం చేసుకోవాలని మరెందరో వీరకిశోరాలు కత్తులతో కోలాటాలు ఆడారు. ఉరికొయ్యలను ఉయ్యాలలుగా, తెల్లదొరల తుపాకీ గుండ్లను పూల చెండ్లుగా ఆహ్వానించారు. వీరంతా స్వేచ్ఛావాయువుల కోసం దీక్షా కంకణులై రగిలిన సమర జ్వాలాగ్నికి సమిధలయ్యారు. ఈ కోవకు చెందిన వీరులలో 'పల్నాటి బెబ్బులి' కన్నెగంటి హనుమంతు ఒకరు.

హనుమంతు పేరు వింటేనే బ్రిటిష్ అధికారులకు వెన్నులో చలి పుట్టేది. నాటి బ్రిటిష్ ప్రభుత్వానికి సింహస్వప్నమైన హనుమంతు శ్వేత జాతి ప్రభుత్వానికి వ్యతిరేకంగా పుల్లరి ఉద్యమం నడిపి వారి తుపాకీ గుండ్లకు బలయ్యారు. స్వాతంత్ర్య పోరాట చరిత్రలో హనుమంతు వీరగాథ ఒక ఉజ్వలఘట్టంగా రూపొందింది. 1870లో దుర్గి మండలం మించాల పాడు గ్రామంలో వెంకటప్పయ్య, అచ్చమ్మ అనే దంపతులకు జన్మించారు.

వ్యవసాయ కుటుంబంలో పుట్టిన కన్నెగంటి హనుమంతు 1920లో కాంగ్రెస్ పార్టీ ఇచ్చిన సహాయ నిరాకరణ పిలుపునకు ఆకర్షితుడయ్యాడు. ఆ పిలుపే ఆయన్ను స్వాతంత్ర్య పోరాటం వైపునకు నడిపింది. సహాయ నిరాకరణ ఉద్యమం నాటికి పల్నాడు ప్రాంతంలో 91 గ్రామాలున్నాయి. మూడు తాలూకాల స్థాయిలో విస్తీర్ణం కలిగి 1,92,039 జనాభా వుంది. పాలరాయి, సిమెంట్‌రాయి, ఇనుప గనులు విస్తారంగా వుండడంతో పాటు విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేయగల ఎత్తిపోతల జలపాతం అందుబాటులో వుంది. వేలాది ఎకరాల సారవంతమైన భూములు వున్నా ప్రజలు కూటికి, గుడ్డకి అల్లాడిపోవాల్సిన దుస్థితి నెలకొనివుంది.

పల్నాడుకు ఎలాంటి నీటి వనరులు లేవు. పూర్తిగా వర్షాధారం పైనే జీవనాధారం. సకాలంలో వర్షాలు లేక, పండలు పండక ఏటా కరువు కాటకాలు సంభవించడం పరిపాటైంది. పొలాలు పండినా, ఎండినా శిస్తులు మాత్రం చెల్లించక తప్పేదికాదు. మరో వైపు గ్రామాధికారులు ప్రజలను రాబందుల్లా పీక్కుతినేవారు. ఫారెస్ట్ గార్డుల ఆగడాలు శృతిమించాయి. పశువుకు రెండు రూపాయల చొప్పున అడవి పుల్లరి (సెస్స్) చెల్లిస్తేనే పశువులను మేత కోసం అడవిలో అనుమతిస్తున్నారు.

బ్రిటిష్ పాలకుల దురాగతాలను ఎండగట్టే లక్ష్యంతో హనుమంతు ప్రజలను శిస్తులు చెల్లించవద్దని పిలుపునిచ్చాడు. పల్నాడులో శిస్తు చెల్లింపుల నిరాకరణను ప్రోత్సహించిన హనుమంతుపై ప్రభుత్వం కక్షగట్టింది. మరో వైపు హనుమంతు ప్రజలను సమైక్యపరుస్తూ అధికారులకు అన్ని సహాయ సహకారాలను నిలిపివేయాలని ఆదేశించాడు. బానిస సంకెళ్ళ నుంచి ప్రజలను విముక్తుల్ని చేయాలనే కర్తవ్య దీక్షతో ప్రజలను విప్లవశక్తిగా మార్చాడు. కన్నెగంటి పిలుపుతో ప్రజలు శిస్తులు కట్టడం మానేశారు. అధికారులకు మంచినీళ్ళు కూడా పుట్టటం లేదు. బట్టలు ఉతకడం, క్షవరం చేయడం వంటి పనులు స్తంభించిపోయాయి. దీంతో ప్రభుత్వం పల్నాటి ఉద్యమాన్ని అణచివేయటానికి మన్యం తిరుగుబాటును నిరంకుశంగా అణచిన రూథర్‌ఫర్డ్‌ను జిల్లా కలెక్టర్‌గా ఇక్కడ నియమించింది.

పల్నాడులో సమర్ధవంతంగా జరుగుతున్న సహాయ నిరాకరణ ఉద్యమాన్ని నీరుగార్చటానికి ప్రభుత్వం పోలీస్, మిలటరీ దాడులకు పాల్పడింది. మొదట రామాపురం, జెట్టిపాలెం, జంగమహేశ్వరపురం తదితర గ్రామాలపై పోలీస్, మిలటరీ దాడులు జరిగాయి. ఈ సందర్భంగా పోలీసులు ఇళ్ళలో జొరబడి యథేచ్ఛగా దోచుకున్నారు. స్త్రీలపై అమానుషంగా అత్యాచారాలను జరిపారు. అనేకమందికి కాళ్ళు, చేతులు విరిచారు. దాడికి గురైన గ్రామాలు తప్ప మిగిలిన గ్రామాలు బ్రిటిష్ పాలకులకు లొంగలేదు. శిస్తు చెల్లింపు నిరాకరణను ప్రజలు యథాతథంగా పాటిస్తూనే వున్నారు.

హనుమంతు అనుక్షణం ప్రజలను సమైక్యపరచి ఉత్తేజితుల్ని చేయడంతో ఉద్యమం తీవ్రరూపం దాల్చింది. మించాలపాడు గ్రామ ప్రజలంతా హనుమంతుకు అండగా నిలిచారు. ఈ నేపథ్యంలో రూథర్‌ఫర్డ్ కన్నెగంటికి ధనాశ చూపి ఉద్యమం నుంచి వైదొలిగించడానికి వ్యూహరచన చేశాడు. తమ లక్ష్యసాధన కోసం బ్రిటిష్ పాలకులు కోలగుట్ల కరణం సదాశివయ్యను హనుమంతు వద్దకు రాయబారిగా పంపారు. హనుమంతును కలిసిన శివయ్య 'ఉద్యమాన్ని ఆపి ప్రభుత్వానికి అనుకూలంగా మసలుకో... నిన్ను జమిందార్ని చేయిస్తా... పేస్కేల్ నీ ఇష్టం వచ్చినంత ఇవ్వచ్చు...' అన్ని దుర్బోధ చేశారు. సదాశివయ్య మోసపూరిత మాటలు హనుమంతులో పట్టరాని ఆగ్రహాన్ని తెచ్చాయి. 'ఉద్యమం నా ఊపిరి... ప్రజలే నా సర్వస్వం... ఉద్యమాన్ని విరమించుకుని (మిగతా 92వ పేజీలో)

# పుల్లరి పోరాట యోధుడు ..

(91వ పేజీ తరువాయి)
ప్రజలకు ద్రోహం చేయం...' అని హనుమంతు గర్జించారు.

మించాలపాడు కేవలం 125 కుటుంబాలు కలిగిన ఓ కుగ్రామం. గ్రామానికి మూడు వైపులా కొండలు,


రూథర్‌ఫర్డ్ నిర్మించిన కన్నెగంటి పాత సమాధి

ఉత్తరం దిక్కున దట్టమైన అడవి కలిగి వుంది. 1922 ఫిబ్రవరి 22న మహా శివ రాత్రి పర్వదినం వేడుకల్లో గ్రామ ప్రజలు ఆనందోత్సవాలతో నిమగ్నమై వున్న సమయాన తెల్లదొరలు వంద మంది మిలటరీ దళంతో మించాల పాడుకు బయలుదేరారు. కోలగుట్ల కరణం సదాశివయ్య, దుర్గి సబ్ ఇన్‌స్పెక్టర్ రాఘవయ్య మిలటరీ దళాన్ని అనుసరిస్తున్నారు.

అదే సమయంలో ఊరికి దక్షిణ భాగంలో కొండ లోయవద్ద వున్న బావికి మంచినీళ్ళ కోసం వచ్చిన మించాలపాడు పశువుల్ని మిలటరీ దళం ముట్టడించింది. అనంతరం వాటిని ముటుకూరు బందెల దొడ్డికి తోలుకువెళ్తున్న మిలటరీ దళానికి హనుమంతు అల్లుడు పసుపులేటి చిన్నయ్య అడ్డు తగిలి తమ పశువుల్ని వదలమని కోరగా పోలీసులు అతనిని తుపాకీ మడమతో కొట్టి తీవ్రంగా హింసించారు. దీంతో ఆగ్రహించిన పశువుల కాపలాకు వచ్చిన రైతులు పోలీసులపై రాళ్ళు రువ్వారు. ఇందుకు ఆగ్రహించిన మిలటరీ దళం లాఠీచార్జ్ జరిపి రైతులను చెదరగొట్టారు. విషయం తెలుసుకున్న హనుమంతు నిరాయుధుడుగానే పోలీసులతో పోరు సల్పేందుకు బయలుదేరాడు. ఆయనను గ్రామ ప్రజలు కూడా అనుసరించారు. ఆరు అడుగుల ఎత్తు... విశాలమైన ఛాతీ... దట్టమైన కోర మీసం... బలిష్టమైన బాహువులు కలిగి తలపాగా ధరించి వస్తున్న కన్నెగంటిని చూడగానే పోలీసులు, మిలటరీ దళం వెన్నులో వణుకుపుట్టింది. భయంతో కంపించిపోతున్న కరణం సదా శివయ్య 'కన్నెగంటి హనుమంతు మన దగ్గరకు వస్తే బతకనివ్వడు... కాల్చండి..' అంటూ హెచ్చరించడంతో పోలీసులు హనుమంతుపై తుపాకులు ఎక్కుపెట్టి గుళ్ళవర్షం కురిపించారు. హనుమంతు కుడి డొక్కను చీల్చుకొని రక్తం కాలువలయ్యింది.

ఈ సంఘటనలో హనుమంతు పాలేరు ఎల్లంపల్లి శేషు అక్కడికక్కడే నేలకొరిగాడు. మరో 28 మంది క్షతగాత్రులయ్యారు. రక్తపు మడుగులో పడివున్న హనుమంతు కొన ఊపిరితో దాహం.. దాహం అని కలవరిస్తున్నప్పటికీ బ్రిటిష్ అధికారులు కర్కశులై మంచినీళ్ళు ఇవ్వకుండానే తుపాకీ మడమతో హనుమంతు గొంతుపై నొక్కి తీవ్రంగా గాయపరిచారు. ఆ రోజు రాత్రి ఏడున్నర వరకు ప్రాణాలతోవున్న హనుమంతు తుదిశ్వాస విడిచారు. పోలీసులు హనుమంతు భౌతిక కాయాన్ని రాత్రంతా అక్కడే వాగులో వుంచి కాపలాకాశారు. హనుమంతు శవాన్ని ఆయన బంధువులకు కూడా ఇవ్వటానికి తెల్లదొరలు నిరాకరించారు. మరుసటి రోజు హనుమంతు మృతదేహాన్ని కోలగుట్ల సమీపంలో వున్న దంతెవాగు వద్దకు తరలించి శవ పరీక్షల అనంతరం ఖననం చేశారు.

హనుమంతు మరణానంతరం మరుసటి రోజు మరో 50 మంది మిలటరీ సిబ్బంది ఊళ్ళోకి ప్రవేశించారు. అప్పటికే గ్రామ ప్రజలంతా కొండల్లో తలదాచుకొని వుండగా నడవలేని వృద్ధులు, పిల్లలు మాత్రమే గ్రామంలో మిగిలిపోయారు. ఇదే అదునుగా భావించిన పోలీసులు, మిలటరీ సిబ్బంది ఇళ్ళల్లో జొరబడి నగలు,డబ్బు కొల్లగొట్టారు. మేకలను, కోళ్ళను అందిన మేరకు కోసుకు తిన్నారు. హనుమంతును కాల్చి చంపిన వార్త పల్నాడు తాలూకా అంతటా దావానలంలా వ్యాపించింది. దీంతో సహాయ నిరాకరణ ఉద్యమం నిర్వహిస్తున్న ప్రజల నడుం విరిగినట్లై నైతిక శక్తి క్షీణించింది. గత్యంతరం లేక ప్రజలు శిస్తులు చెల్లించడం ప్రారంభించారు. నాలుగో నాడు కొండల్లో దాగి వున్న ప్రజలు గ్రామంలోకి అడుగు పెట్టారు. కొంపలన్నీ మిలటరీ, పోలీసు సిబ్బందిచే దోచుకోబడి ఊరంతా బీభత్స స్థితిలో దర్శనమివ్వడంతో ప్రజలు కన్నీటి పర్యంతమయ్యారు. పోలీసులు గ్రామానికి చెందిన 40 మంది ముఖ్యులను అరెస్టు చేశారు. ఒక్కొక్కరికి 150 రూపాయల జరిమానాతో పాటు ఆరు మాసాల కఠిన కారాగార శిక్ష పడింది. నలబోతుల వెంకయ్యకు మాత్రం 200 రూపాయల


నిర్మాణంలో ఉన్న కన్నెగంటి హనుమంతు నూతన ఘాట్

జరిమానాతో పాటు 9 నెలల శిక్ష విధించారు. హనుమంతును నిర్దాక్షిణ్యంగా కాల్చి చంపించినప్పటికీ నాటి జిల్లా కలెక్టర్ రూథర్‌ఫర్డ్‌కు హనుమంతుపై కసి తీరలేదు. దంతెవాగులో వుంచిన హనుమంతు శవాన్ని ప్రజలు ఫొటో తీసుకుంటామని కోరినప్పటికీ రూథర్‌ఫర్డ్ ఏమాత్రం అంగీకరించలేదు. హనుమంతును సమాధి చేసిన పిదప గోరి కట్టించి, శిలాఫలకం వేయించాడు. అయితే కొద్దిరోజులకు రూథర్‌ఫర్డ్ ఆ శిలాఫలకాన్ని పెకిలించి హనుమంతు భార్యకు కానుకగా పంపి అపహాస్యం చేశాడు.

ఇంకా కసి తీరని రూథర్‌ఫర్డ్ మరో నెల రోజుల తరువాత రూథర్‌ఫర్డ్ మించాలపాడు వెళ్ళి హనుమంతు పేర వేసిన శిలాఫలకాన్ని బయటకు తెప్పించాడు. దానిని ముక్కలు ముక్కలుగా పగులగొట్టించి బావిలో పడేసి తన కసినంతా ప్రదర్శించాడు. హనుమంతు సమాధి నిర్మించిన దంతెవాగు మించాలపాడు కొండల్లో పుట్టి కోలగుట్ల పక్క నుంచి ఆత్మకూరు చెరువుగుండా మాచర్ల మీదుగా చంద్రవంకై ప్రవహిస్తూ ఎత్తిపోతల వద్ద 66 అడుగుల ఎత్తు నుంచి కిందకు జాలువారుతోంది. నాటి నుంచి నేటి వరకు హనుమంతు వాగు ప్రవహిస్తూనే వుంది... ఎత్తిపోతల ఘోషిస్తూనే వుంది... ఎత్తిపోతల ఘోష పలనాటి స్వాతంత్ర్య ఘోష... అది స్వాతంత్ర్యాన్ని సిద్ధింపచేసిన హనుమంతు ఆత్మఘోష...

మాతృదేశం కోసం అసువులు బాసిన హనుమంతు సమాధికి ఇటీవల దాకా ఎటువంటి భద్రత లేదు. 1946లో ఆచార్య రంగా హనుమంతు సమాధిని సందర్శించి సమాధి మరమ్మతులకు కొంతమేర ధన సహాయం చేశారు. కాలక్రమంలో హనుమంతు సమాధికి రక్షణ కరువై ముళ్ళపొదల మధ్యలో చిక్కి శిథిలావస్థకు చేరి దీన స్థితికి అద్దంపట్టింది. ఈ నేపథ్యంలో తెలుగుదేశం పార్టీ ఆధ్వర్యంలో పల్నాటి వీరుల విగ్రహ ప్రతిష్ఠా కమిటి ఏర్పాటై హనుమంతు సమాధి పునర్నిర్మాణానికి నడుం బిగించింది. రాష్ట్ర ఎక్సైజ్ రిటైర్డ్ జాయింట్ కమిషనర్ మిరియాల అనంతరామయ్య ఆధ్వర్యంలో 2004, ఫిబ్రవరి 23న మాచర్ల పట్టణం నడిబొడ్డున హనుమంతు కాంస్య విగ్రహాన్ని ఆవిష్కరించారు. అప్పటి రాష్ట్ర వైద్య ఆరోగ్య శాఖా మంత్రి డాక్టర్ కోడెల శివప్రసాదరావు చేతులమీదుగా కన్నెగంటి హనుమంతు కాంస్య విగ్రహం ప్రతిష్ఠకు నోచుకుంది. విగ్రహ ప్రతిష్ఠతో ఆగక రెండు లక్షల రూపాయల వ్యయంతో కోలగుట్లలోని హనుమంతు సమాధి పునర్నిర్మాణపు పనులకు కూడా శ్రీకారం చుట్టారు.

# వినుకొండ వన్నెలెన్నెన్నో


వినుకొండ వ్యూ

(ఆన్‌లైన్- వినుకొండ)

కవి సార్వభౌముడు శ్రీనాధుడు శ్లాఘించిన వినుకొండ పట్టణానికి గత వైభవ చరిత్ర మెండుగా ఉంది. విస్తృత ప్రాశస్త్యం గల వినుకొండ చరిత్రకు, సంస్కృతికి సంబంధించి పురాణ, చారిత్రాత్మక కథలు, శాసనాలు ఎన్నో వ్యాప్తిలో వున్నాయి. పురాణాల నుంచి వినుకొండ ఉనికిని తెలిపే చారిత్రాత్మక ఆధారాలు వున్నాయి. దీనికి నిదర్శనంగా పురాతన దేవాలయాలు, కట్టడాలు ఎన్నో పలుచోట్ల దర్శనమిస్తాయి. వినుకొండకు కమఠపురి, శృతగిరి అనే పేర్లున్నట్టు చరిత్రకారుల ఉవాచ. కమఠుడనే భక్తుడు శివుని గురించి ఘోర తపస్సు చేయగా అతని భక్తికి మెచ్చి శివుడు ప్రత్యక్షమై వరం కోరుకోమన్నాడు. దాంతో కమఠుడు సర్వదా తన కనుల ఎదుట నిలిచి సాయుజ్యమివ్వమని వేడుకోగా పరమేశ్వరుడు అనుగ్రహించాడు. అనంతరం కమఠుడు పర్వతాకారుడు కాగా శివుడాతని ఎదుట నిలిచినట్లు పురాణ గాధలో వుంది. దీనికి నిదర్శనంగా కమఠేశ్వరాలయం పేరుతో వినుకొండలో పురాతన శివాలయం వుంది.

ఈ శివాలయంలోని అరుదైన వీర భద్రుడు, కాళికాదేవి విగ్రహాలు జీవంతో వున్నట్లు భక్తులకు దర్శనమిస్తాయి. త్రేతాయుగంలో సీతాపహరణం గురించి కమఠపురాజయిన జటాయువుద్వారా శ్రీరామ చంద్రుడు విన్నందున శృతగిరి అనే సంస్కృత పదానికి పర్యాయ పదమే విన్నకొండ యని కూడా పౌరాణిక విశిష్టత వుంది. కొండపై జటాయువు రెక్కలు, సీతా కుండం, రామకుండం అనే నీటి కొలనులు చరిత్రకు ఆధారాలుగా నిలిచాయి. రావణ సంహారానంతరం కొండపై శ్రీరామ చంద్రుడు శివలింగ ప్రతిష్ఠ చేసినట్లు ప్రతీతి.

విష్ణుకుండిన రాజులు వినుకొండ కేంద్రంగా పరిపాలన సాగించడంతో విష్ణుకుండిన పురిగా కూడా పేరుంది. విశ్వంభర దేవుడనే గజపతిరాజు కొండ పైన క్రీ.శ.1145లో కోటను నిర్మించగా, 1480లో సాగిగా నమ్మునాయుడనే సామంతుడు కొండ కింద కోట నిర్మించినట్లు చరిత్ర పుస్తకాలలో వుంది. గుంటి ఆంజనేయస్వామి దేవాలయం సమీపంలో కోట ఆనవాళ్ళు నిదర్శనంగా నిలిచాయి. కొండ కింద చోళుల, కాకతీయుల, విజయనగర రాజుల శిల్ప సంస్కృతిని ప్రతిబింబిస్తూ తురుష్కులచే ధ్వంసం చేయబడిన చారిత్రాత్మక కట్టడం శిధిలరూపంలో ఇప్పటికీ దర్శనమిస్తోంది.

పట్టణానికి నాలుగు దిక్కుల్లో దిక్పాలకుల లాగా హనుమంతుని దేవాలయాలు వుండటం విశేషం. రాజుల దండయాత్రల అనంతరం విజయ సూచకంగా ప్రతిష్ఠించిన స్తంభాలు ఆనవాళ్ళుగా వున్నాయి. పట్టణానికి పడమర దిక్కున మైలున్నర దూరంలో 15వ శతాబ్దంలో రాయన భాస్కర మంత్రి నిర్మించిన రంగనాయకస్వామి, వెంకటేశ్వరస్వామి, శ్రీదేవి, భూదేవుల దేవాలయాలు శిధిలావస్థలో చరిత్రకు సాక్షీభూతాలుగా వున్నాయి. పట్టణంలో ప్రాశస్త్యం గల గుంటి ఆంజనేయస్వామి విశ్రమించిన గజరూపంలో వున్న శిలపై స్వామి స్వయంభువుగా వెలిసివున్నాడు. పన్నెండు అడుగుల ప్రమాణంలో స్వామి ఉత్తర అభిముఖంగా వుండటం విశేషం. తపాలా సౌకర్యం లేని రోజుల్లో స్వామి విగ్రహానికి ఇరువైపులా ప్రకృతి సిద్ధంగా (మిగతా 94వ పేజీలో)

# వినుకొండ వన్నెలెన్నెన్నో

(93వ పేజీ తరువాయి)

ఏర్పడిన బాక్సుల ద్వారా ఆనాటి పాలకులు ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపే వారని అందుకే స్వామికి టపాంజ నేయుడు అనే నామం కూడా వుందని ప్రతీతి. అలాగే కొండమెట్ల వద్ద కొందరు భక్తుల సంకల్పంతో వెలుగు లోకి వచ్చిన భారీ విగ్రహరూపంలో స్వయంభువుగా వెలిసిన వరసిద్ధి వినాయకుడు భారతదేశంలో అరుదుగా వుండే వినాయక విగ్రహాలలో ఒకటని చెబుతున్నారు.


చార్మినార్‌ను పోలిన మసీదు

స్వామి దక్షిణానికి అభిముఖంగా దర్శనమిస్తారు. ఇక్కడ నాగుపాము రోజూ స్వామి వారి చుట్టూ ప్రదక్షిణ చేయటంతో ప్రాధాన్యతను సంతరించుకొని హేరంభగణపతిగా పూజలు అందుకుంటున్నాడు. దసరా ఉత్సవాల సందర్భంగా మూలా నక్షత్రం రోజైన శనివారం ఆలయ ప్రాంగణంలో శ్రీ సుక్తపారాయణం జరుగుతుండగా నాగుపాము భక్తులకు దర్శనమివ్వటం విశేషం.

## చార్మినార్‌ను పోలిన కట్టడం

చార్మినార్‌ను పోలిన 400 ఏళ్ళ నాటి చారిత్రక కట్టడం వినుకొండలో వుంది. కులీకుతుబ్‌షాల కాలంలో రాష్ట్రంలో నిర్మించిన అరుదైన కట్టడాలలో వినుకొండ మసీదు ఒకటని చెబుతారు. టిప్పు సుల్తాన్ రెండవ దళవాయివైన ఆల్లీ రాజాఖాన్ రాజా ప్రతినిధి అబ్దుల్ కుతుబ్‌షా అనుమతితో నిర్మించినట్టు చెబుతారు. దీనినే జామియా మసీదు, పెద్దమసీదు అంటారు. మసీదు లోపల పారశీ బాషలో శాసనం వుంది. ఢిల్లీలో జుమ్మా మసీదును పోలినట్టు వుందని కూడా పుస్తకంలో రాసివుంది.

## నిమ్మలబావి

వినుకొండ పేరు చెబితేనే నిమ్మల బావిని గుర్తుకు తెస్తుంది. ఈ బావి నీరు తొలుత తాగిన వారికి నిమ్మరుచి భావన స్పురిస్తుంది. నిమ్మసాని అనే ఆమె ఈ బావి తవ్వించిందని చెబుతారు. ఈ బావికి కూడా కొంత చరిత్ర వుంది. 16వ శతాబ్దంలో నిమ్మసాని, దొండసాని, కొప్పసాని, సింగిసాని అనే నలుగురు (మిగతా 95వ పేజీలో)

# వినుకొండ వన్నెలెన్నెన్నో

(94వ పేజీ తరువాయి)

అక్కచెల్లెళ్ళు. వారికి సముద్రుడనే సోదరుడు వుండేవాడట. నిమ్మసాని నిమ్మలబావి, దొండసాని, సింగిసాని సింగరచెరువును, సముద్రుడు అన్న సముద్రం చెరువును తవ్వించి ప్రజా హిత కార్యక్రమాల్లో పాలుపంచుకొన్నట్టు ప్రతీతి.

కాగా నిమ్మసాని బావి లోతుగా తవ్వించినా నీరు పడకపోవటంతో కలలో గంగాదేవి నరబలి కోరిందని, తమ యావదాస్తిని నిమ్మలబావికి రాసి ఒక రాత్రి వేళ బావిలో దూకి ఆత్మార్పణ చేసుకొన్నట్లు చెబుతారు. తెల్లవారేసరికి బావి నీటితో పొంగిపోయిందని నిమ్మసాని శవం బావి గట్టున పడి వున్నట్లు కథలుగా చెప్పుకుంటారు. అయితే కాలక్రమంలో బావి నీరు ప్రాబల్యాన్ని కోల్పోయి చరిత్రకు గుర్తుగా నిలిచింది.

చారిత్రాత్మక ప్రాధాన్యతతోపాటు సాహిత్య సాంస్కృతిక వారసత్వానికి కూడా వినుకొండ పేరెన్నికగా వుంది. మహాభారతాన్ని తెలుగులోకి అనువదించిన ఆది కవి నన్నయ్య, ఆంధ్ర దేశాన తొలినాటక కర్త వల్లభరాయుడు, రాయన భాస్కరమంత్రి, విజయరాఘవాచార్యులు, శంభకవి, కృష్ణగంధర్వుడు అనే కవులు వినుకొండ వాసులుగా ప్రతీతి.

ఆధునిక కవులలో నవయుగ కవి చక్రవర్తి గుర్రం జాషువా, బీర్నెడు ప్రసన్నకవి, కొప్పుకొండ వెంకటరత్నం కవి, ఫరీదులు పేరెన్నిక గన్నవారు.

'పలనాడు వెలలేని మాగాణిరా' గేయ రచయిత పులుపుల వెంకట శివయ్య, 'ఎర్రజెండాలు' రచయిత గంగినేని వెంకటేశ్వరరావులు వినుకొండ వాసులే. అపర చిత్ర బ్రహ్మ పోట్లూరి హనుమంతరావు, అంతర్జాతీయ హరికథకులు వీరగంధం భాగవతారులు ఇక్కడి వారే. చారిత్రక సాహితీ సంస్కృతులతో పాటు రాజకీయ పరంగా వినుకొండ ప్రాముఖ్యత సంతరించుకుంది. కమ్యూనిస్టు ఉద్యమనేత పులుపుల శివయ్య వినుకొండకు చెందిన వారు. వాణిజ్య పరంగా కంది పప్పు ఉత్పత్తిలో ఈ ప్రాంత మిల్లర్లు ప్రధాన పాత్ర వహిస్తున్నారు. రోజువారీ అపరాల, పప్పుల ధరల నిర్ణయంలో వినుకొండను కూడా పరిగణనలోకి తీసుకొంటారు. సాగర్ జలాల విడుదల తర్వాత వరి ప్రధాన పంటగా మారింది. వాణిజ్య పంటలైన పొగాకు, పత్తి, మిర్చి పంటలతో పాటు మెట్టకు సంబంధించి కంది, పెసర పంటలు ప్రధానంగా పండిస్తారు. పశుపోషణ రైతుల జీవనాధారమైంది. పాల ఉత్పత్తి గణనీయంగా పెరిగి సంగం డెయిరీతో పాటు పలు ప్రైవేటు పాల శీతలీకరణ కేంద్రాలను ఈ ప్రాంతంలో ఏర్పాటు చేశారు. రాయలసీమకు ముఖ ద్వారంగా వినుకొండ నుంచి కర్ణాటక, శ్రీశైలం, త్రిపురాంతకం పుణ్యక్షేత్రాలకు కోస్తా జిల్లాల నుంచి వెళ్ళటానికి ఇదే ప్రధానంగా రహదారి.



ఇసుకపల్లిలోని అమరవీరుల స్థూపం

# అమరవీరుల త్యాగాలు అజరామరం

(ఆన్‌లైన్ - రేపల్లె)

భారతదేశానికి స్వాతంత్రం సిద్ధించిన రోజులవి. అప్పటి పరిస్థితులు భూస్వాములకు, స్వదేశీ, విదేశీ పెట్టుబడిదారులకు అనుకూలంగా వున్నాయి. పల్లెసీమల్లోని ప్రజలు ఫీడల్ సంకెళ్ళతో బంధించబడి కట్టు బానిసలుగా జీవించాల్సిన పరిస్థితులు ఆనాడు వుండేవి. పేదవర్గాల హక్కులను కాలరాచే కొన్ని శక్తులకు వ్యతిరేకంగా భారతదేశమంతటా కమ్యూనిస్టు పార్టీ నాయకత్వంలో విముక్తి పోరాటాలు సాగుతున్నాయి. ప్రభుత్వం భూస్వాములకు వత్తాసు పలుకుతూ ఆందోళనకారులపై ఉక్కుపాదం మోపుతున్న సమయంలో ఆ దమన కాండకు వ్యతిరేకంగా జరిపిన పోరాటంలో వేలాదిమంది వీరులు అమరులయ్యారు. వారిని రక్షించుకునే ప్రయత్నంలో మరెంతోమంది నేలకొరిగారు.

అందులో భాగంగానే రేపల్లె ప్రాంతానికి చెందిన ఎందరో వీరులు తెలంగాణ సాయుధ పోరాటంలో కొరియర్లుగా, కార్యకర్తలుగా పనిచేస్తూ యూనియన్ సైన్యాలు, తుపాకీ గుండ్లకు బలయ్యారు. ఆ వీరుల స్ఫూర్తిని భావితరాలకు అందించి వారి ఆశయాలు ఫలించే విధంగా నేటి తరాన్ని మేలుకొల్పేందుకు 1990 నుంచి సిపిఎం పెద్ద ఎత్తున అమర వీరుల సంస్మరణ సభలను నిర్వహిస్తున్నది. పేద ప్రజలకోసం తమ ప్రాణాలను పణంగా పెట్టిన ఆ వీరుల త్యాగాలను స్మరించుకోవాల్సిన అవసరం ఎంతైనా వుంది.

దాసరి వెంకట సుబ్బయ్య : రేపల్లె పట్టణంలోని (మిగతా 96వ పేజీలో)



దాసరి సుబ్బయ్య

# అమరవీరుల త్యాగాలు అజరామరం

(95వ పేజీ తరువాయి)

ఇసుకపల్లికి చెందిన దాసరి సుబ్బయ్య యువరైతుగా కార్మిక సంఘాలను స్థాపించి భూస్వాములకు సింహస్వప్నంగా నిలిచారు. పరిసర ప్రాంతాలలోని అన్ని గ్రామాల కార్మికులను సంఘటితం చేసి పెద్ద ఎత్తున పోరాటాలు నిర్వహించారు. ఆయన మనోధైర్యానికి, తట్టుకోలేని భూస్వాములు పోలీసులతో కుమ్మక్కై, సుబ్బయ్యను హత్య చేసేందుకు ఎన్నో కుట్రలు పన్నారు.

గొరిదపూడి గ్రామంలో సుబ్బయ్యను పోలీసులు బంధించి ఇసుకపల్లిలోని ఒక ఇంటికి తీసుకువచ్చి చిత్రహింసలకు గురిచేసి గొంతునులిమి అతిదారుణంగా హత్య చేశారు. అనంతరం ఆయన భౌతికకాయాన్ని తుపాకులతో కాల్చి, పారిపోతుండగా కాల్పులు జరిపామని ప్రకటించారు.

కంఠంనేని వెంకటరత్నం: అతి పిన్న వయస్సులోనే సిపిఎం పార్టీలో నాయకత్వం వహించి పలు వ్యవసాయ కార్మిక ఉద్యమాలు నిర్వహించిన వెంకటరత్నం భట్టిప్రోలు మండలం పల్లెకోన సర్పంచ్‌గా పని చేశారు. అప్పట్లో వెంకట రత్నం తెనాలి ప్రాంతీయ కమిటీకి చెందిన ఒక



కంఠంనేని వెంకటరత్నం

రహస్య కేంద్రాన్ని నడుపుతున్న మోటూరు వెంకటరత్నం కుటుంబంతో కలసి గడిపారు. ఆ ఇంటిలోనే మోటూరు వెంకటరత్నం భార్య, కుమార్తె కూడా వుండేవారు. ఒకనాటి రాత్రి పోలీసులు వారు వుండే ఇంటిని చుట్టుముట్టారు. పోలీసులతో పోరాడి తాను వెంటనే వస్తానని ఈలోగా తప్పించుకుని సురక్షిత ప్రాంతాలకు చేరుకోవాలని కంఠంనేని వెంకటరత్నం మోటూరు కుటుంబానికి నచ్చ జెప్పారు.

అయినా వారు అందుక నిరాకరించి చావో, బతుకో తేల్చుకోవాలని పోరాటానికి దిగారు. ఒక పోలీస్ అధికారిని నేలకూల్చారు. వారి సాహసానికి భయభ్రాంతులైన పోలీసులు వారు వుండే ఇంటికి నిప్పుపెట్టారు. అనూహ్య పరిస్థితుల్లో గత్యంతరం లేక బయటకు వచ్చిన కంఠంనేని వెంకటరత్నంను, మోటూరు వెంకట రత్నం, ఆయన భార్య, మూడు సంవత్సరాల బిడ్డను అతిదారుణంగా కాల్చి చంపారు.

కస్తూరి కుటుంబరావు: ఉపాధ్యాయ వృత్తిని కొనసాగిస్తున్న కస్తూరి కుటుంబరావు ఆ రోజుల్లోనే చేనేత కార్మికుల సమస్యలపై ఉద్యమాన్ని నడిపారు. అదేవిధంగా రేపల్లె మండలం గడికాయలంక గ్రామానికి చెందిన గుమ్మడి సీతారామయ్య, ఇతర నాయకులందరూ ఈ ప్రాంతంలో కమ్యూనిస్టు పార్టీకి జీవం పోశారు. ఇలాంటి అమరవీరుల విప్లవ వారసత్వాన్ని పుణికిపుచ్చుకున్న సిపిఎం పీడిత తాడిత వర్గాల విముక్తికి అనేక పోరాటాలు నిర్వహిస్తుంది. అదేవిధమైన విప్లవ ఆశయాలు కొనసాగిస్తూ ఆనాటి అమర వీరులు చూపిన వెలుగుబాటలో పయనించటం మనందరి కర్తవ్యం.

ముత్తిరెడ్డి వెంకటాచలం: రేపల్లె



మోటూరు వెంకటరత్నం

తాలూకాకు చెందిన ముత్తిరెడ్డి వెంకటాచలం ఓ సామాన్యరైతు కుటుంబంలో జన్మించాడు. స్వాతంత్ర పోరాటం తీవ్రంగా సాగుతున్న రోజుల్లోనే ఆయన కమ్యూనిస్టు ఉద్యమం వైపు ఆకర్షితుడయ్యాడు.

స్వాతంత్ర్యానంతరం 1948, 1949లో కాంగ్రెస్ ప్రభుత్వం కమ్యూనిస్టు పార్టీపై నిర్బంధాన్ని విధించింది. ఆ సమయంలో కృష్ణానది దాటి అవతలివైపు వున్న గెరిల్లా దళాన్ని కలుసుకుని వారిని సురక్షితంగా తెలంగాణకు చేర్చే బాధ్యత వెంకటాచలానికి అప్పచెప్పారు. ఆయనకు సహాయపడేందుకు (మిగతా 97వ పేజీలో)

# అమరవీరుల త్యాగాలు అజరామరం

(96 వ పేజీ తరువాయి)

ఈ దళంలో నిపుణులైన మరో ఇద్దరు యువకులను కూడా నియమించారు. దురదృష్టవశాత్తు వారు నదిని దాటాల్సిన రోజున తుపాను రావటంతో ఆ ప్రాంతం వరదల మయం అయింది.

ఇలాంటి విపత్కర పరిస్థితుల్లో కర్తవ్యాన్ని విస్మరించకుండా వెంకటాచలం నదిలో దూకారు. మిగిలిన ఇద్దరు కూడా దుంగలు చేతపట్టుకుని వెంకటచలం మార్గాన్ని అనుసరించారు.

వరద తాకిడికి కొద్ది సమయంలోనే ఇరువురు యువకులు ఒడ్డుకు కొట్టుకువచ్చి స్పృహ కోల్పోయారు. ఎంత వెదికినా వెంకటాచలం జాడ కన్పించలేదు. ఆయన మృతి చెందినట్లు ధృవీకరించుకుని ఆ విషాద సమాచారాన్ని సహచరులకు చెప్పేందుకు ఆ యువకులు తిరిగి వచ్చేశారు. ఇది జరిగిన వారం రోజుల తర్వాత గెరిల్లా దళాన్ని వెంటబెట్టుకుని వెంకటాచలం పార్టీ సభ్యుల వద్దకు చేరుకున్నారు.

పార్టీ నిర్ణయం పట్ల ఆయనకున్న నిబద్ధత ఆయన ప్రదర్శించిన అసమాన ధైర్యసాహసాలకు తార్కాణంగా చెప్పవచ్చు.

అనంతరం జరిగిన ఎన్నికల్లో వెంకటాచలం కమ్యూనిస్టు పార్టీ తరుపున ప్రచారం చేస్తుండగా పోలీసులు ఆకస్మికంగా సభావేదికను చుట్టుముట్టి విచక్షణా రహితంగా కాల్పులు జరిపారు. తుది శ్వాస విడిచేవరకు ఆయన నమ్మిన సిద్ధాంతానికి కట్టుబడి పని చేశారు. ఇటువంటి అమరవీరుల ధైర్య సాహసాలను స్మరించుకుని నేటి తరానికి తెలియజెప్పేందుకు ఉద్దేశించి సిపిఎం ఇక్కడ స్థూపాన్ని నిర్మించి ఏటా సంస్మరణ సభలు నిర్వహిస్తోంది.



# అల్లుకుపోతున్న స్పిన్నింగ్ మిల్లులు

(ఆన్‌లైన్ - యడ్లపాడు)

ప్రభుత్వం ఇస్తున్న ప్రోత్సాహంతో బడా పారిశ్రామిక వేత్తలు స్పిన్నింగ్ మిల్లుల నిర్మాణం వైపు దృష్టి సారించారు. ప్రధానంగా గుంటూరు - చిలకలూరిపేట మధ్య 20 స్పిన్నింగ్ మిల్లుల నిర్మాణం పూర్తి చేసుకోగా మరో 10 స్పిన్నింగ్ మిల్లులు నిర్మాణదశలో ఉన్నాయి. స్పిన్నింగ్ మిల్లులకు ప్రభుత్వం కల్పిస్తున్న సబ్సిడీలు, విద్యుత్ రాయితీలు, బ్యాంకులలోనే సౌకర్యాలలో పారిశ్రామిక వేత్తల చూపు స్పిన్నింగ్ మిల్లుల నిర్మాణం వైపు పడింది. బోయపాలెం గ్రామం ఈ మిల్లుల నిర్మాణంతో పారిశ్రామికంగా ఎంతో అభివృద్ధి చెందింది. రెండు సంవత్సరాల కాలంలోనే ఎనిమిది స్పిన్నింగ్ మిల్లులు నిర్మాణానికి నోచుకున్నాయి. అంతేగాక యడ్లపాడు-తిమ్మాపురంల మధ్య టెక్స్‌టైల్స్ పార్కు, కాటన్ జిన్నింగ్ పార్కుల నిర్మాణం నేపథ్యంలో స్పిన్నింగ్ మిల్లుల నిర్మాణం మరింతగా అభివృద్ధి జరిగే అవకాశం ఉంది.



జాతీయ రహదారి పక్కన నూతనంగా స్పిన్నింగ్ మిల్లు నిర్మాణం

## పలనాటి ప్రజల కొంగు బంగారం


మాచర్లలోని చెన్నకేశవస్వామి ఆలయం

# మాచర్ల చెన్నకేశవుడు

(ఆన్‌లైన్, మాచర్ల)

పౌరుషం ఎగసిపడే పల్నాటి ప్రాంతంలో ప్రజలకు ఆధ్యాత్మిక చింతనను కలిగిస్తూ ప్రజల మనోభిష్టాన్ని నెరవేరుస్తూ పల్నాటి ప్రజల పాలిట మణిహారంగా వెలసిన శ్రీ లక్ష్మీ చెన్నకేశవస్వామి ఆలయం చారిత్రకంగా ఎంతో ప్రసిద్ధికెక్కింది. త్రేతాయుగంలో ఈ ప్రాంతమంతా దండకారణ్యం. పూర్వకాలంలో కార్తవీర్యార్జుని వంశీకులు నిర్మించిన చెన్నకేశవ ఆలయాన్ని పల్నాటి బ్రహ్మనాయుడు 13వ శతాబ్దంలో పునర్నిర్మించినట్లు చారిత్రక గ్రంథాలు చెబుతున్నాయి.

క్రీస్తుశకం 1397 వరకు మాచర్లను మహాదేవిచర్లగా పిలిచేవారని, నాటి ఆ పేరే మాచర్లగా మారిందని, రెండవ ప్రతాపరుద్ర మహాదేవ రాజు సామంతరాజైన మాచాయనాయుడు పేరు మాచాయ శబ్దం కాలక్రమేణా మాచర్లగా మారి వుండవచ్చునని శాస్త్రాలు చెబుతున్నాయి. ఈ శాసనం తరువాత లభించిన అనేక ఆధారాల్లో మాచర్ల అని రాయబడి వుంది. అంతే కాక బ్రహ్మనాయుడు మజిలీ చేసిన తావు మాచర్ల అయిందని, తన స్వస్థలమైన మాచవురానికి బదులుగా బ్రహ్మనాయుడు మాచర్లను నిర్మించాడని పద్మనాయ చరిత్ర చెబుతోంది. మాచర్లకు విష్ణుపురి అనే మరొక పేరు వుంది. చంద్రవంక నది తీరంలో ప్రవాహం తూర్పు-పశ్చిమ దిశల నుండి ఉత్తరం వైపునకు ప్రవహిస్తుంది.

ఉత్తర వాహిని స్థలం పరమ పవిత్రమైనదని భావిస్తూ వుంటారు. అలాంటి పవిత్రమైన ప్రదేశంలో శ్రీ చెన్నకేశవస్వామి వెలిశాడు. సర్వమానవ సమానత్వాన్ని సౌభ్రాతృత్వాన్ని 13వ శతాబ్దంలోనే చాటి చాపకూటి సిద్ధాంతంతో మానవులంతా ఒక్కటేనని నిరూపించిన బ్రహ్మనాయుడి పేరు వింటే ప్రతి ఒక్కరికి స్ఫురించేది ఆయన పునర్నిర్మించిన మాచర్లలోని శ్రీ లక్ష్మీ చెన్నకేశవస్వామి వారి దేవాలయమే పౌరుషాల పురిటిగడ్డగా, పంతాలకు పోతుగడ్డగా ప్రసిద్ధికెక్కిన పల్నాడులో 13వ శతాబ్దంలో మలిదేవరాజు ఆస్థాన మంత్రి బ్రహ్మనాయునిచే పునర్నిర్మించబడిన ఈ దేవాలయం సుప్రసిద్ధమైన పలనాటి పుణ్యక్షేత్రం. ఈ ఆలయంలోని శిల్ప కళా వైభవం నాటి కళాకారుల నైపుణ్యతను తెలియజేస్తాయి.

అందానికి ప్రతిరూపమైన విష్ణువు చెన్నుని రూపంలో ఈ ఆలయంలో వెలిశాడని ప్రతీతి. స్వామి వారి విగ్రహం గర్భగుడిలో మూడు అడుగుల ఎత్తులో వుంది. అందులో భూదేవి, శ్రీదేవి సమేత చెన్నకేశవుడు యాగభేరాలు, తీర్థ, బకిబేరాలు, అళ్వారులు, రామానుజులు, వడయరాజులు, వెన్నముద్దల కృష్ణయ్య, ఉత్సవ మూర్తులు వున్నాయి. గర్భగుడికి ముందు రంగ మండపం వుంది. దీనిని పరిశీలిస్తే నాటి శిల్పకళా చాతుర్యం ఏ విధంగా వుందో విశదమవుతోంది.

ఈ మండపంలోని నాలుగు స్తంభాల పై ఈశాన్య దిశ వైపు వున్న స్తంభం పై భారత ఘట్టాలైన కర్ణార్జునుల యుద్ధం, పాచికలాట, అశ్వమేధ యాగం, గధాయుద్ధం చెక్కబడినవి. ఆగ్నేయ స్తంభం పై రామాయణంలోని మాయలేడిని వేటాడడం, వాలి సుగ్రీవ యుద్ధం, కైలాస గిరిని ఎత్తడం, నైరుతి స్తంభం పై భాగవతంలోని వినాయక, గజాసురుని యుద్ధం, త్రిపుర సంహారం, సాగర మధనం, దేవతాకూటమి, ఏనుగుల అభిషేకం, అమృతం పంచటం వంటివి శిల్పాలలో మలచబడ్డాయి. ఇటువంటి ఎన్నో ఘట్టాలను మనోహరంగా శిల్పులు మలిచారు.

కాలగమనంలో చెన్నకేశావాలయం ఎన్నోసార్లు పునరుద్ధరించినట్లు తెలుస్తోంది. ఈ ప్రాంతాన్ని శైవులు, కాకతీయులు ఏలినట్లు చరిత్ర చెబుతోంది. సూరపురాజువంశీయుల సంతానమైన లక్ష్మీదేవమ్మ చెన్నునిలో ఐక్యమైనందున ఇదే ఆలయంలో లక్ష్మీ దేవికి మరో ఆలయాన్ని నిర్మించారు.

ప్రతి సంవత్సరం చైత్రశుద్ధ పంచమి నాడు స్వామివారి కళ్యాణంతో ప్రారంభమై 16 రోజుల పాటు జరిగే ఉత్సవాలు రథోత్సవంతో ముగుస్తాయి. దుర్గి వాస్తవ్యులు కుంచనపల్లి నారాయణ పంతులు 1980, ఏప్రిల్ 29న స్వామివారి రథాన్ని తయారు చేయించారు. ఆనాడే మొదటి రథోత్సవం జరుపుకుంది.

కులమతాలకు అతీతంగా భక్తులు చెన్నకేశవుని దర్శించి కటాక్షం పొందుతుంటారు. జై చెన్నకేశవా.. జైజై చెన్నకేశవా... అంటూ భక్తులు చేసే నినాదాలతో ఈ ప్రాంతం భక్తి పారవశ్యంతో మారుమోగుతోంది.

### భక్తుల లేమిని తీర్చే చెన్నునికి ఎన్ని కష్టాలో

ఎంతో ఆదాయం కలిగిన శ్రీ లక్ష్మీ చెన్నకేశవ ఆలయ ఆస్తులు అన్యాక్రాంతమై నేడు పోషణే ప్రశ్నార్థకమైంది. ఒకప్పుడు రెండు వేల ఎకరాలకు పైగా వున్న దేవుని మాన్యం హారతి కర్పూరంలా కరిగిపోయింది. ఉన్న కొద్దిపాటి భూముల నుండి కూడా నామమాత్రపు ఆదాయమే వస్తోంది. ఆలయ కమిటీ ఏర్పాటుచేసిన నిత్య కళ్యాణ వేడుకల ద్వారా ఈ స్వామికి కాసింత ప్రసాదం, తీర్థం లభ్యమవుతున్నాయి. భక్తులు ఇచ్చే కానుకల పైనే ఆలయ వేడుకలు ఆధారపడడం శోచనీయం. ఎన్నో విశిష్టతలున్న చెన్నుని దర్శనార్థం వచ్చే దూర ప్రాంతీయులకు బస చేసేందుకు ఏమాత్రం సౌకర్యాలు లేవు. యగ్నయాగాదులు నిర్వహించేందుకు ఏర్పాట్లు లేవు.

ఉత్సవ వేళల్లో స్వామి వారిని ఊరేగించే ప్రత్యేక వాహనాలను భద్రపరచే వాహనశాల కూలిపోయింది. గర్భగుడిలోనే ఆ వాహనాలను వుంచడం వల్ల ఆ ప్రాంగణం ఇరుకైంది. వసతులను మెరుగుపరచాలని భక్తజనం నివేదిస్తున్నా సంబంధిత అధికార యంత్రాంగం మాత్రం స్పందించడం లేదు.


శ్రీ చెన్నకేశవస్వామి

# 100 సంవత్సరముల బ్యాంక్ ఆఫ్ ఇండియాకు శుభాకాంక్షలు





బ్యాంక్ ఖాతాదారుల సమావేశంలో ప్రసంగిస్తున్న జనరల్ మేనేజర్ పి. కళ్యాణరామన్, వేదికపైన చీఫ్ మేనేజర్ BUSR ఆంజనేయులు


బ్యాంక్ శతవార్షికోత్సవాలను ప్రారంభిస్తున్న జడ్‌పి చైర్ పర్సన్ కూచిపూడి విజయమ్మ వేదిక పైన నాగార్జున విపి ప్రొపెసర్ బాలమోహన్‌దాస్ తదితరులు


బ్యాంక్ శతవార్షికోత్సవాల సందర్భంగా అందులతో ఏర్పాటు చేసిన మూజికల్ నైట్


నాగార్జున యూనివర్సిటిలో కౌన్సిలింగ్ సందర్భంగా యంసెట్‌లో ర్యాంక్ వచ్చిన విద్యార్థికి బ్యాంక్ నుంచి రుణం అందజేస్తున్న అధికారులు



పాలిటెక్నిక్ కాలేజిలో ఇంజనీరింగ్ కౌన్సిలింగ్ సందర్భంగా బ్యాంక్ ఆఫ్ ఇండియా ఏర్పాటు చేసిన స్టాల్

## బ్యాంక్ ఆఫ్ ఇండియా మన బ్యాంక్

### బ్యాంక్ ఆఫ్ ఇండియా చరిత్ర

బ్యాంక్ ఆఫ్ ఇండియా 7 సెప్టెంబరు 1906న ముంబాయికి చెందిన ప్రముఖ్య వ్యాపార వేత్తల బృందంతో స్థాపించబడింది. బ్యాంక్ ప్రవేటు యాజమాన్యం క్రింద, నియంత్రణ కింద 1964 జులై వరకు వుంది. తర్వాత 13 ఇతర బ్యాంకులతో పాటు జాతీయం చేయబడింది.

ముంబాయిలో ఒక కార్యలయంలో రూ. 50 లక్షలు చెల్లించిన మూలధనంతో, 50 మంది ఉద్యోగులతో ప్రారంభమైన ఈ బ్యాంకు సంవత్సరాలు అయ్యే కొద్ది శరవేగంతో అభివృద్ధి చెంది పటిష్ఠమైన జాతీయ ఉనికితో, విస్తృతమైన అంతర్జతీయ కార్యకలాపాలతో ఒక శక్తివంతమైన సంస్థగా వికసించింది. వ్యాపార హెచ్చు స్థాయిలో, ఈ బ్యాంక్ మిగిలిన జాతీయ బ్యాంకుల సరసన ప్రధాన స్థానం సంపాదించుకుంటుంది.

బ్యాంకు అన్ని కష్టాలు / కేంద్రపాలిత ప్రాంత్రాలలో విస్తరిస్త భారతదేశమంతటా 2600 శాఖలతో పాటు 113 ప్రత్యేక శాఖలు కలిగి వుంది. ఈ శాఖలు 48 జోనల్ కార్యలయాల ద్వారా నియంత్రించబడుతున్నాయి. విదేశాలలో 22 శాఖలు / కార్యాలయాలు (మూడు ప్రాతినిధ్య కార్యలయాలతో సహా) వున్నాయి.

బ్యాంక్ 1997లో మొట్టమొదటి పబ్లిక్ ఇష్యూ జారీ చేసింది. 30-06-2004 నాటికి వాటాదార్ల మొత్తం సంఖ్య 3,17,890/-

బ్యాంక్ ఆప్ ఇండియా నేడు

తెలివైన విధనాలను స్థిరంగా పాటిస్తూ కడు జాగ్రత్తతో బ్యాంక్ వివిధ వినూత్న సేవలను, పద్ధతులను ప్రవేశపెడుతూ అగ్రగామిగా ముందుకు సాగుతుంది. విజయవంతమైన సంప్రదాయ విలువల మేలు కలయికతో, నైతిక విలువలతో, అత్యధునిక మౌలిక సదుపాయలతో వ్యాపారాన్ని నిర్వహిస్తోంది. పూర్తిగా కంప్యూటరీకరణ చేసిన బ్రాంచ్‌ను స్థాపించి అన్ని జాతీయ బ్యాంకులతో మొట్టమొదటిదిగా నిలిచింది. 1989లో ముంబాయిలో మహాలక్ష్మి బ్రాంచ్‌లో ( ) సదుపాయాన్ని ఏర్పరచిన మొట్టమొదటి బ్యాంకు కూడా ఇదే. భారతదేశంలో స్విఫ్ట్ వ్యవస్థాపక మెంబర్ గా కూడా ఈ బ్యాంక్ వుంది. తన క్రెడిట్ పోర్ట్ ఫోలియోను లెక్కగట్టేందుకు / రేటింగ్ కోసం 1982లో హెల్త్ కోడ్ సిస్టంను ప్రవేశపెట్టి అగ్రగామిగా వుంది.

( )క్లియరింగ్ వశిస్‌ను నిర్వహించుటకు బోంచేస్టాక్ ఎక్స్‌చేంజ్( )తో అది ఒప్పందం కుదుర్చుకున్నపుడే 1921 కి పూర్వమే కేపిటల్ మార్కెట్ తో బ్యాంక్‌నకు సంబందం వుంది. స్టాక్ బ్యాంకింగ్ రంగానికి డిపాజిటరీ సేవలు విస్తరించేందుకు తో ఉమ్మడి సంస్థగా అవతరించిన ఈ అనుబంధమే షేర్ హోమింగ్ లిమిటెడ్ గా పిలువబడేందుకు కారణమైంది. 1946 లో లండన్‌లో శాఖను ప్రారంభించిన మొట్టమొదటి బ్యాంక్ ఆఫ్ ఇండియా. 1974లో యూరప్, ప్యారిస్‌లో శాఖను ప్రారంభిన బ్యాంక్ కూడ మొదటిది ఇదే. లండన్, న్యూయార్క్, ప్యారీస్, టోక్యో, కాంగో, సింగపూర్ వంటి ప్రధాన బ్యాంకింగ్, ఆర్థిక కేంద్రాలతో 21 శాఖలు (మూడు ప్రాతినిధ్య కార్యలయంతో సహా) నెట్‌వర్క్‌తో బ్యాంక్ విదేశంలో తన ఉనికిని చాటుకుంది. అంతర్జతీయ వ్యాపారం సుమారు 20.10%కు చేరుకుంది.

బ్యాంకు ఫైనన్సింగ్ ఫారిన్ ట్రేడ్‌లో పటిష్ఠమైన స్థానం కలిగి ఉంది. 270 శాఖలలో ఎగుమతి రుణం కల్పించబడుతుంది. ఈ రంగంలో నిపుణోత్తమ బ్యాంక్ వజ్రాల ఎగుమతి వంటి కొన్ని రంగాలలో ఎగుమతి రుణం కల్పిస్తూ ప్రముఖ స్థానం సాధించేందుకు వీలుగా వుంది.

బ్యాంక్ భవిష్యత్ అబివృద్ధిలోను ప్రధాన ప్రయోజనం పెంపొందించేందుకు ప్రత్యేక లక్ష్య బృందాలను గుర్తించింది. మార్చి 2004 నాటికి బ్యాంక్ 113 ప్రత్యేక శాఖలు కలిగి ఉంది. అందులో బారీ పరపతి వ్యాపారం నిర్వహించేందుకు కార్పొరేట్ బ్యాంకింగ్ శాఖలు, ప్రధాన భారతీయుల అవశ్యకతలు ప్రత్యేకంగా తీర్చే ఎన్.ఆర్.ఐ. శాఖలు, విదేశ ఎక్స్‌ఛేంజ్ వ్యాపారంలో ప్రత్యేకత కలిగిన ఓవర్‌సిస్ శాఖలు, దరఖాస్తుల సేకరణ, రిఫంట్ అర్డర్ల ప్రక్రియ వంటి కేపిటల్ మార్కెట్‌కు సంబంధించి అన్ని కార్యకలాపాలు నిర్వహించే కేపిటల్ మార్కెట్ శాఖలు, అధిక నికర విలువ గల వినియోగదార్ల అవసరాలు తీర్చే మర్చంట్ బ్యాంకింగ్ మొ॥, కమర్షియల్ & పర్సనల్ బ్యాంకింగ్ శాఖలు ఉన్నాయి. ఇవి కాక, ఈ బ్యాంక్ అస్తి రికవరి చిన్న తరహా పరిశ్రమలు, హై - టెక్ వ్యవసాయ రుణం వీజడ్ ఫైనాన్స్ & ట్రెజరీ కోసం ప్రత్యేకించిన శాఖలు కూడా కలిగిఉన్నాయి.

సదా పెరుగుతున్న సవాళ్ళను, పోటీని సమర్థవంతంగా ఎదుర్కొనేందుకు బ్యాంక్ సాంకేతిక స్థాయి పెంపు తీసుకురావడంలో చక్కటి ప్రగతిని సాధించింది. ఎం.ఐ.ఎన్. మరియు కంట్రొలింగ్ కార్యలయాల కీలక విధులను కంప్యూటరీకరించినది. ప్రస్తుతం సుమారు 1220 శాఖలలో కార్యకలాపాలు పూర్తిగా కంప్యూటరీకరించబడినది. మరో 1057 శాఖలు పాక్షికంగా కంప్యూటరీకణతో నడుస్తున్నాయి.

కొత్త సదుపాయాలు అంటే టెలిబ్యాంకింగ్, ఎ.టి.ఎం. సిగ్నేచర్ రిట్రీవల్ సిస్టంలు పురోగమనరీతిలో ప్రవేశపెట్టబడినవి. కార్పొరేట్ వినియోగ దార్ల కోసం డిమాండ్ సదుపాయంపై ఫ్యాక్స్‌తో టెలి బ్యాంకింగ్ సదుపాయాలు, రిమోట్ యాక్సెస్ టెర్మికల్స్ ఇప్పుడు పలు శాఖల్లో లభిస్తున్నాయి. ఈ బ్యాంక్ ముంబాయిలోనూ, దేశంలోని ఇతర కేంద్రాలలో ఎ.టి.ఎం. లను నెలకొల్పింది. ఆర్.బి.ఐ. యొక్క వి.ఎస్.ఎ.టి నెట్ వర్క్ మెంబర్‌గా ఈ బ్యాంక్ ఉంది. ఇది 39 వి.ఎస్.ఎ.టి. ల లింకింగ్ స్ట్రాటెజిక్ బ్రాంచ్‌లను / కార్యాలయాలను నెలకొల్పింది. ఈ బ్యాంక్ బ్రాంచ్ ఆటోమేషన్ నుంచి బ్యాంక్ అటోమేషన్ వరకు రూపాంతళి మార్పును చేస్తోంది. మల్టి - బ్రాంచ్ భ్యాంకింగ్ ప్రాజెక్టు అమలు ప్రక్రియలో ఉంది. ఇది కంప్యూటరీ కణం చేసిన శాఖల నగర వారీ అనుసంధనత కలుగజేస్తుంది. 2003 సెప్టెంబరు నాటికి, 200 నగరాలు / పట్టణాలలో కనెక్టివిటీ జరిగింది. తన నిర్ణయానిక మద్దతుగల విధానాలను పెంచడంలో బాగంగా, ఇంటర్, కంట్రా - సిటీ కనెక్టివిటీ ఏర్పటు చేయుటకు విస్తృత ఏరియా నెట్ వర్క్ అయిన బయోనెట్ స్థాపన ప్రక్రియలో బ్యాంక్ ఉంది.

బ్యాంక్ యెొక్క తన వ్యకిత్వాన్ని తత్వాన్ని ఎంబ్లంలో పూర్తిగా ప్రతిబింబించింది. ఈ ఎంబ్లం మొనదేలిన అయిదు నక్షత్రాలతో ఉంటుంది. సంప్రదాయం, నిర్వక్త ధర్మాలను సూచిస్తూ శాంతి సామర్థ్యన్ని కలయికకు చిహ్నంగా ఉంటుంది. పైకి పోదవుగా మొనదేలినట్లు కనిపించే స్టార్ ఆరోహణలక్ష్యాలు సాధించేందుకు బ్యాంకు యెొక్కప్రేరణ శక్తిగా గోచరిస్తుంది. ఈ స్టార్ ఒక ధృవతార. దిశనిర్దేశం అవసరమైన వారి కోసం మార్గదర్శకంగా ఉంటుంది.

**హెడ్ ఆఫీసు స్టార్‌హౌస్, జి. బ్లాక్ బంద్రకుర్ల కాంప్లెక్స్,**
**బంద్ర (ఈస్ట్), ముంబాయి - 400 051.**

దేశీయ శాలమొత్తం సర్వో 2600 (4-11-2006నాటికి), విదేశీ శాలమొత్తం సర్వో 23(3ప్రాతినిధ్య కార్యలయలతొహా), ఎక్స్ టెన్షన్ కేంటర్ మొత్తం సర్వో :165, ప్రతేక శాలు : 8, చెల్లించతగు డ్రాఫ్టులు: 2, ఓవర్‌సిస్ : 7, యస్.యన్.ఐ : 32, సర్వీస్ శాలు 26, హైటెక్ అగ్రి-ఫైనాన్స్ : 4, రికవరీశాలు : 11, యన్.యన్.ఐ శాలు 6, కేపిటల్ మార్కెట్ శాలు : 3, లీజ్‌ఫైనాన్స్ : 1, హౌసింగ్ ఫైనాన్స్ : 9, ట్రెజరీశా: 1, యమ్.సి.బీ.బీ : 1, డిపాజిటరీ : 1, ఎంసిఎంస్(హాబ్): 1, జోన్లు : 48, జోనల్ ఆడిట్ కార్యాలయాలు : 9, ట్రెయినింగ్ కాలేజీలు : 5

### వివిధ రకాల సర్వీసులు

డిపాజిటరీ సేవలు-సిడిఎస్ఎల్‌కు అనుబంధంగా? డిపాజిటరీ కార్యాలయాలు ఎన్ఎన్‌డిఎల్‌కు అనుబందంగా డిపాజిటరీ కార్యాలయం ఎటిఎం కార్యాకలాపాలు - ఆన్‌లైన్ ఎటిఎంల సంఖ్య -263 సిఎంఎస్ - 33 ఆపరేటింగ్ బ్రాంచీలు - 14 పూరింగ్ బ్రాంచీలు సిబిఎస్ బ్రాంచీలు 128 సబ్సిడిరీలు - బిఒఐ షేర్‌హౌల్డింగ్ లిమిటేడ్ జాయింట్ వెంచర్లు - ఇండో జాంబియా బ్యాంక్ లిమిటెడ్ అసోసియేట్లు - బిఒఐచే స్పాన్సర్ చేయబడిన ఆర్ఆర్‌బి 16 బిఒఐయొక్క పెట్టుబడి - సెక్యూరిటీస్ ట్రేడింగ్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియాలి. ఐ.డి.ఎల్. యండ్ ఎఫ్ ఎస్ ఇన్వెస్ట్‌మెంట్ మేనేజర్స్‌లి. సెంట్రల్ డిపాజిటరీ సర్వీసెస్(ఐ)లి.

బోర్డులో డైరెక్టర్ల సంఖ్య- షేక్ ప్రా సర్వీసస్, సత్యం ఎస్టేట్, కార్డినల్ గ్రేసియస్‌రోడ్, అంధేరి (ఇ), ముంబై-400 099

మా ధ్యేయం : "అభివృద్ధి బ్యాంకుగా మా పాత్రలో ఇతరులకు తక్కువ ఖర్చు, ప్రతి స్పందన వనరులు కల్పిస్తూనే ప్రపంచ వ్యాప్తంగా ప్రత్యేక మార్కెట్లకు అత్యున్నత మైన సానుకూలమైన బ్యాంకింగ్ సేవలు కల్పించుటకు మరియు ఆ విధంగా చేయుటలో మూ3 స్టేక్ హోల్డర్ యొక్క అవసరాలు తీర్చుట"

మా స్వప్నం : "కార్పొరేట్లు, మధ్యతరహా వ్యాపారాలు మరియు అఫ్ మార్కెట్ చిల్లర ఖాతాదారుల కొరకు మరియు చిన్న వ్యాపారం, సాముహిక మార్కెట్ మరియు గ్రామీణ మార్కెట్లు కొరకు ఏంపిక చేసుకునే బ్యాంకు " గా రూపొందడం".

## ఖర్చు లేకుండానే సరఫరా చేస్తున్న

# నరసరావుపేట రక్షిత మంచినీటి పథకం

(ఆన్‌లైన్, నరసరావుపేట)

నరసరావుపేట పట్టణానికి రక్షిత మంచి నీరు సరఫరా ప్రకృతి వరప్రసాదం. మానవ మేధస్సుకు ఒక మచ్చుతునక. ఈ రక్షిత మంచి నీటి పథకం దేశంలోనే అరుదైనదిగా పేర్కొనవచ్చు. నరసరావుపేట పథకంతో పాటు మరొకటి దేశంలో ఉన్నట్టు సమాచారం. సాంకేతిక పరంగా అద్భుతమైన ఈ మంచి నీటి పథకంలో ప్రజలకు నీటి సరఫరా చేసే దానిలో విద్యుత్ శక్తి, ఎటువంటి యాంత్రిక వినియోగం లేదు. ఖర్చు లేకుండా ప్రజలకు నీటి సరఫరా జరుగుతుందంటే ప్రతి ఒక్కరు ఆశ్చర్యపోక తప్పదు. ఇదేమిటనే ప్రశ్న ప్రతి ఒక్కరికి తలెత్తవచ్చు. కారణం మంచినీటి పథక రచనలో స్టోరేజ్ చెరువులను శాంతినగర్, నకరికల్లుల వద్ద ఏర్పాటు చేశారు. శాంతినగర్ చెరువు పట్టణానికి ఎనిమిది కిలో మీటర్ల దూరంలో ఉండగా, నకరికల్లు చెరువు 18 కిలోమీటర్ల దూరంలో ఉంది. నకరికల్లు వద్ద వున్న నరసరావుపేట రక్షిత మంచి నీటి చెరువు పట్టణం కంటే 125 మీటర్ల ఎత్తులో ఉంది. అలాగే శాంతినగర్ వద్ద ఉన్న చెరువు పట్టణం కంటే 95 మీటర్ల ఎత్తులో ఉంది. దీని కారణంగా పట్టణానికి నీరు ఎటువంటి యంత్రాలు వినియోగించకుండా నేరుగా ఓవర్ హెడ్ ట్యాంక్‌ల్లోకి నీరు చేరుతుంది. నకరికల్లు వద్ద చెరువు నుంచి శాంతినగర్ వద్ద వున్న ఫిల్టరేషన్ ప్లాంట్‌కు నీరు పైపుల ద్వారా చేరుస్తారు. ఫిల్టరేషన్ ప్లాంట్ నకరికల్లు కంటే 30 మీటర్ల దిగువున ఉంది. అక్కడి నుంచి శుద్ధి చేసిన నీరు కూడా పైపుల ద్వారా పట్టణంలోని వివిధ ప్రదేశాల్లో నిర్మించిన ఓవర్ హెడ్ ట్యాంకులకు కూడా ఎటువంటి యాంత్రిక వినియోగం లేకుండా చేరుతుంది. ఫిల్టరేషన్ ప్లాంట్‌కు ఓవర్ హెడ్ ట్యాంకుల మధ్య భూవ్యత్యాసం 32 మీటర్లు ఉంది. ఓవర్ హెడ్ ట్యాంకులు 17 మీటర్ల ఎత్తులో నిర్మించబడి ఉంది. పట్టణంలో కూడా వివిధ ప్రదేశాల్లో భూవ్యత్యాసం పది మీటర్లు ఉన్నందున నీటి సరఫరా కూడా వేగంగా జరుగుతుంటుంది. ఎన్నో ఏళ్ళ క్రితం నిర్మించిన మొదటి దశ రక్షిత మంచి నీటి పథకం ద్వారా ప్రజలకు నీటి సరఫరా సరిపోనందున ప్రస్తుతం రెండో దశ రక్షిత మంచి నీటి పథకం యుద్ధ ప్రాతిపధిక పూర్తి చేశారు. గత రెండేళ్ళు రాష్ట్రంలో తీవ్ర నీటి కరువు నెలకొన్న నరసరావుపేటలో మాత్రం మండు వేసవిలో సైతం రెండు పూటలా నీటి సరఫరా చేశారు. భూ వ్యత్యాసం వలన యంత్రాల వినియోగం లేనందున పురపాలక సంఘంకు మంచి నీటి సరఫరా నిర్వహణ ఖర్చు ఇతర పట్టణాలతో పోల్చుకుంటే ప్రతి ఏటా సుమారు 70 లక్షల వరకు ఆదా అవుతున్నట్టే. డబ్బు ఆదాతో పాటు నిర్వహణలో సాంకేతిక పరమైన నిపుణత లేనందున నిర్వహణ కూడా సులభసాధ్యంగా ఉంది. ప్రకృతి వైపరీత్యాల వలన విద్యుత్ కోత వున్నా పట్టణ మంచి నీటి సరఫరాకు ఎటువంటి ఆటంకం లేకుండా సజావుగా పట్టణానికి నీటి సరఫరా జరుగుతుండడం, ఈ పథకం ద్వారా లభిస్తున్న ఆదాయంతో అభివృద్ధి పనులు చేపట్టడం పట్టణ ప్రజల అదృష్టం.



రక్షిత మంచి నీటి పథకం నీటి శుద్ధి కర్మాగారం









## కుడికాలువ నీటి ద్వారా

# 40 మెగావాట్ల విద్యుత్ ఉత్పాదన

(ఆన్‌లైన్, నరసరావుపేట)

వ్యవసాయ ఉత్పత్తిలో అగ్రగామిగా నిలచిన సాగర్ కుడి కాలువ ప్రాంతం నేడు విద్యుత్ ఉత్పత్తి ఖిల్లాగా నిలిచింది. ప్రతిరోజు 40 మెగావాట్ల విద్యుత్ ఉత్పాదన కుడి కాలువలపై నిర్మించిన పవర్ ప్లాంట్ల ద్వారా జరుగుతుంది. రాష్ట్రంలో విద్యుత్ కొరతతో అనునిత్యం ఇబ్బందులు ఎదుర్కొంటున్న నేపథ్యంలో నాగార్జున సాగర్ కుడి కాలువలపై మినీ హైడల్ విద్యుత్ ప్రాజెక్టులను ప్రైవేటు సంస్థలు నిర్మించాయి. పంటలకు వినియోగించే నాగార్జునసాగర్ కాలువ నీటితో విద్యుత్ ఉత్పత్తి జరుగుతుంది. మొత్తం 24 మినీ హైడల్ విద్యుత్ ప్రాజెక్టులకు కుడి కాలువలపై నిర్మాణం జరిగి ప్రతి రోజూ విద్యుత్ ఉత్పత్తి చేస్తున్నాయి. గుంటూరు, ప్రకాశం జిల్లాల గుండా నాగార్జున సాగర్ కుడి కాలువ 216 కిలో మీటర్లు విస్తరించి ఉంది. కుడి కాలువ నుంచి చీలే గుంటూరు, అద్దంకి, బెల్లంకొండ, జూలకల్లు బ్రాంచ్ కెనాల్స్‌తో పాటు చిలకలూరిపేట మేజర్, పెదనందిపాడు బ్రాంచ్ కెనాల్‌పై విద్యుత్ ప్రాజెక్టుల నిర్మాణం జరిగింది. ఈ బ్రాంచ్ కెనాల్స్‌పై మూడు నుంచి పది అడుగుల ఎత్తులో వున్న డ్రాప్స్ నుంచి జలపాతం వలె కిందకు వేగంగా నీరు పడే ప్రదేశాల్లో మినీ హైడల్ ప్రాజెక్టుల నిర్మాణం జరిగింది. నిర్మాణం పూర్తయి విద్యుత్ ఉత్పత్తి జరుగుతున్న ప్రాజెక్టుల వివరాలు ఇలా ఉన్నాయి. గుంటూరు బ్రాంచ్ కెనాల్‌పై దక్కన్ సిమెంట్ లిమిటెడ్, సాగర్ పవర్, కెసిపి లిమిటెడ్(ఐదు ప్లాంట్లు), రాయలసీమ పవర్ ప్రాజెక్టు, తిరుమల హైడల్ పవర్ ప్రాజెక్టు(మూడు ప్లాంట్లు), చిలకలూరిపేట మేజర్ పై అక్షయ్ ప్రొఫైల్స్ ప్రైవేట్ లిమిటెడ్(రెండు), పెదనందిపాడు బ్రాంచ్ కెనాల్‌పై పిఎంసి పవర్ ప్రాజెక్టు లిమిటెడ్, బెల్లంకొండ బ్రాంచ్ కెనాల్ పై యస్వార్ లిమిటెడ్(రెండు), జూలకల్లు బ్రాంచ్ కెనాల్‌పై శివాని పవర్ స్పిన్నర్, అద్దంకి బ్రాంచ్ కెనాల్‌పై శ్రీ ధనలక్ష్మి కాటన్ (మూడు), ట్రైడెంట్ పవర్ సిస్టమ్ లిమిటెడ్ (రెండు), శ్రీ జయలక్ష్మి పవర్ కార్పోరేషన్ లిమిటెడ్ (రెండు) సంస్థల ఆధ్వర్యంలో మినీ హైడల్ పవర్ ప్లాంట్లు నిర్వహించబడుతున్నాయి.

సాగర్ కాలువలకు నీరు సరఫరా అయ్యే రోజుల్లో మాత్రమే ఈ విద్యుత్ ప్రాజెక్టుల ద్వారా విద్యుత్ సరఫరా అవుతుంది. అతి తక్కువ వ్యయంతో విద్యుత్ ఉత్పాదన జరుగుతుంది. ఉత్పత్తి అయిన విద్యుత్‌ను రాష్ట్ర పవర్ గ్రిడ్‌కు సరఫరా చేస్తారు. జిల్లా చరిత్రలోనే మినీ హైడల్ విద్యుత్ ప్రాజెక్టులను ఒక మైలురాయిగా పేర్కొనవచ్చును. ఈ పవర్ ప్లాంట్ల ద్వారా దాదాపు 500 మందికి ఉపాధి అవకాశాలు లభించాయి.

జిబిసిపై నిర్మించిన పవర్ ప్లాంట్

పవర్ ప్లాంట్‌లో విద్యుత్ ఉత్పాదన చేసే యంత్రాలు

# తోలు బొమ్మల తయారీకి నరసరావుపేటలో శిక్షణ


శ్రీకృష్ణుడు

(ఆన్‌లైన్, నరసరావుపేట)

ప్రాచీన హస్త కళల్లో తోలు బొమ్మలాటకు అత్యంత ప్రాధాన్యత ఉంది. తోలు బొమ్మలాటకు నరసరావుపేట ప్రసిద్ధి. దీనికి కాలానుక్రమంగా ఆదరణ కరువై సంబంధిత కుటుంబాలు జీవనం సాగించలేని పరిస్థితులు నెలకొన్నాయి. ఈ నేపథ్యంలో రాష్ట్ర హస్తకళల విభాగం అంతరించి పోతున్న తోలు బొమ్మల హస్త కళలకు జీవం పోసేందుకు చర్యలు చేపట్టింది. తరతరాలుగా తోలు బొమ్మలు తయారు చేసుకొని ప్రదర్శించే కుటుంబాలకు ప్రత్యామ్నాయ మార్గాలను చూపించడంతో పాటు ఈ సాంస్కృతిక కళను భవిష్యత్ తరాలకు తెలియజేసే విధంగా హస్తకళా విభాగం తోలు బొమ్మల తయారీపై శిక్షణను ఏర్పాటు చేసింది. దీనిలో భాగంగా నరసరావుపేట కోటప్పకొండ రోడ్డులో షిర్డీ సాయి బాబా లెదర్ పపెట్స్ సొసైటీ ఆధ్వర్యంలో 15 కుటుంబాల వారు బొమ్మల తయారీపై శిక్షణ పొందుతున్నారు. భారతం, రామాయణం ఇతి వృత్తాలతో గ్రామాల్లో తోలు బొమ్మలాటలు వేసి జీవనం సాగించేవారు. టివి, సినిమా రంగాల అభివృద్ధితో తోలు బొమ్మలాటకు ప్రజల నుంచి ఆదరణ కరువైంది. కొన్నేళ్ళుగా ఆయా కుటుంబాలు ప్రదర్శనలు లేక ఉపాధి కోల్పోయాయి. శ్రీరామనవమి తదితర పర్వదినాల ఉత్సవాల్లో ఈ ప్రదర్శనలు సాగేవి. ఇవన్నీ కనుమరుగై పోవడంతో ఆయా కుటుంబాలు గృహ అలంకరణకు ఉపయోగించే తోలు బొమ్మల తయారీపై దృష్టి సారించాయి. నరసరావుపేటలో ఇప్పటికే కొందరు హస్త కళా విభాగం వారు ఏర్పాటు చేసిన శిక్షణా కార్యక్రమాల్లో శిక్షణ పొందారు. ఆయా వ్యక్తులు మరి కొందరికి వీటి తయారీపై శిక్షణ ఇస్తున్నారు. వీరు తయారు చేసే గృహాలంకరణ తోలు బొమ్మలకు విశేష ప్రాచుర్యం లభిస్తుంది. వీరి ఉత్పత్తులు దేశవ్యాప్తంగా హస్తకళల విభాగం వారు ఏర్పాటు చేసే ఎగ్జిబిషన్స్‌లలో విక్రయాలు జరుపుకొంటున్నారు. కేంద్ర ప్రభుత్వ హస్త కళా విభాగం వీరికి ప్రత్యేక గుర్తింపు ఇచ్చింది. ఇప్పటికే హైదరాబాద్, ఢిల్లీ, ముంబాయి, చెన్నై, అలహాబాద్ తదితర పట్టణాల్లో ఏర్పాటు చేసిన హస్త కళా ప్రదర్శనలో తోలు బొమ్మలను విక్రయించారు. తోలుతో దేవతల ఆకృతులు, ల్యాంప్ షేడ్స్, సపోర్టింగ్ వాల్స్ తయారు చేస్తున్నారు. వీటిలో ల్యాంప్ షేడ్స్‌కు మంచి ఆదరణ లభిస్తుంది. సంపన్న వర్గాలు తోలుతో తయారైన గృహాలంకరణ వస్తువులను వారి గృహాల్లో అలంకరించేందుకు ఆసక్తి కనబరుస్తున్నారు. దీంతో తోలు బొమ్మల తయారీదారుల ఉత్పత్తులకు ఆదరణ లభిస్తుంది. ప్రాచీన కళా వైభవానికి వీరు తయారు చేసే తోలు వస్తువులు అద్దం పడుతున్నాయి. మేక తోలును వినియోగించిపై అలంకరణ వస్తువులను తయారు చేస్తారు.

తోలుపై రామాయణ, మహాభారత ఘట్టాల్లోని సన్ని వేశాలను ముందుగా వారు స్వయంగా డ్రాయింగ్ వేస్తారు. అనంతరం డ్రాయింగ్‌కు పెయింటింగ్ అందంగా తీర్చి దిద్దుతారు. వాటర్ ప్రూఫ్ రంగులను ఇందుకు వినియోగిస్తారు. ల్యాంప్ షేడ్స్ ఆకారానికి తగిన విధంగా చట్రాన్ని తయారు చేసి దానికి పెయింటింగ్ చేసిన తోలును అమరుస్తారు. దీనికి స్టాండ్‌ను రూపొందించి బల్బును ఏర్పాటు చేస్తారు. తోలుపై అందమైన బొమ్మలతో పెయింటింగ్ చేయడం వలన ఇవి విశేషంగా ఆకర్షిస్తుంటాయి. అలాగే గోడకు తగిలించే విధంగా తోలు పెయింటింగ్‌లు రూపొందిస్తున్నారు. సీతా స్వయంవరం, మహిషాషుర మర్ధని, విఘ్నేశ్వరుడు తదితర దేవతల బొమ్మలకు ప్రాచీన కళ ఉట్టిపడే విధంగా తయారు చేస్తున్నారు. గృహాల్లో చెక్కతో తయారు చేసిన రూం పార్టీషన్స్ వినియోగిస్తుంటారు. ప్రస్తుతం వీటి స్థానంలో ఇక్కడి కళాకారులు తయారు చేస్తున్న తోలుతో తయారు చేస్తున్న పార్టీషన్స్ వినియోగంలోకి వస్తున్నాయి. వీటిని కూడా ప్రత్యేక శైలిలో తయారు చేస్తున్నారు. మొత్తం 30 కుటుంబాల వరకు ఈ వృత్తి పై ఆధారపడి జీవిస్తున్నారు.


శ్రీరాముడు

## భక్తులను విశేషంగా ఆకట్టుకుంటున్న

# చేజర్ల కపోతేశ్వరస్వామి ఆలయం

(ఆన్‌లైన్, నరసరావుపేట)

చేజర్లలోని శ్రీ కపోతేశ్వర స్వామి ఆలయం దక్షిణ కాశీగా భాసిల్లుతున్నది. నరసరావుపేట పట్టణానికి 30 కిలో మీటర్ల దూరంలో నకరికల్లు మండలం, చేజర్లలో శతాబ్దాల క్రితం కపోతేశ్వర స్వామి ఆలయం నిర్మితమైనది. భారతదేశంలోని అత్యంత ప్రఖ్యాతి పొందిన కాశీ, ద్రాక్షారామం, కాళహస్తి లాంటి పుణ్యక్షేత్రాల్లో ఒకటిగా గుర్తింపు పొంది దేశ, విదేశీ భక్త జనులను, చరిత్ర కారులను కపోతేశ్వర స్వామి ఆలయం విశేషంగా ఆకర్షిస్తుంది. చారిత్రక ప్రాధాన్యత మాత్రమే కాక, పౌరాణిక ప్రాశస్త్యం పొందిన ఈ శివ క్షేత్రంలో శివరాత్రి, సంక్రాంతి, దసరా లాంటి పండుగలను వైభవంగా జరుపుతారు. ప్రతి ఏడాది మహాశివరాత్రి మూడవ రోజున స్వామి కళ్యాణోత్సవం జరుగుతుంది.

### కపోతేశ్వర స్వామి చరిత్ర

కాశ్మీర్‌ను పాలించే శిబి చక్రవర్తి సోదరులు మేఘాడంబితుడు, జీమూత వాహనుడు తీర్థ యాత్రలు చేస్తూ 'చేరుంజర్ల' పర్వత ప్రాంతాల్లో తపస్సు చేసుకొని లింగాకృతి పొంది దేహ త్యాగం చేశారు. శిబి చక్రవర్తి తల్లి అనుమతితో ఈ ప్రాంతం వచ్చి 'శత యజ్ఞ దీక్ష' ప్రారంభించారు. ఈ యజ్ఞ ఫలానికి శిబి ఎంత వరకు అర్హుడో పరీక్షించటానికి త్రిమూర్తులు నిర్ణయించుకొన్నారు. స్వర్గలోకం నుంచి దిగి వచ్చిన త్రిమూర్తులు 'రూపెనగుంట్ల' గ్రామం వద్ద రూపు మార్చుకొన్నారు. శివుడు కిరాతకునిగా, విష్ణువు కపోతంగా, బ్రహ్మ బాణంగాను రూపుమార్చుకొన్నారు. శివుడు వదిలిన శరం కపోతాన్ని తాకగా, అది కుంటుతూ కుంకలగుంట ప్రాంతంలో పడింది. అలా కపోతం శిబి యజ్ఞం చేస్తున్న ప్రాంతానికి చేరింది. ఆ కపోతం శిబి చక్రవర్తిని శరణు వేడింది. కిరాతకుడు రూపంలో శివుడు వచ్చి కపోతాన్ని ఇవ్వమని అడుగగా, అందుకు శిబి అంగీకరించక పోవటంతో నీవు కోరిదవేని దాని ఎత్తు మాంసం నా దేహం నుంచి తీసి ఇస్తాను కాని, పక్షినీయనని అన్నాడు. అందుకు ఆ కిరాతకుడు సమ్మతించాడు. అంతట శిబి త్రాసు నందు తన దేహం నందలి మాంసం తీసి తూచటం ప్రారంభించగా, ఎంత వేసినను సరి పోలేదు. శిబి చింతించి ప్రాణములు పోవటానికైనా తెగించి తలలో మెదడు తీసి త్రాసులో పెట్టినా చాలక పోవటంతో రెండో వైపు కూడా తీయబోవుచుండగా, త్రిమూర్తులు మెచ్చి కరుణించి ప్రత్యక్షమై వరము కోరుకోమనగా, ఆ శిబి చక్రవర్తి తనకు శివైక్య సంధానాన్ని తన పరివారానికి లింగాకృతులను దయచేయమని కోరాడు. అంత అతడు శివైక్యమై పాతాళం వరకు నాటుకొని వెలిశాడు. అతని కోటి పరివారాలు కోటి లింగాలై వెలిశాయి. ఈ విధంగా కపోతాన్ని రక్షించిన శిబి లింగాకృతి దాల్చి ధన్యుడగుటచే ఆ లింగమునకు 'కపోతేశ్వర లింగమని' పేరు వచ్చింది. ఈ స్వామి మహత్యం వలన ఆ స్థలం కపోతేశ్వర క్షేత్రంగా ప్రసిద్ధి చెందింది.


కపోతేశ్వర స్వామి ఆలయం

కపోతేశ్వర స్వామి మూల విరాట్

### ఆలయ చరిత్ర

క్రీస్తు పూర్వ 3, 4 శతాబ్దాల కిందట కపోతేశ్వర స్వామి ఆలయం నిర్మాణం జరిగినట్లుగా దాఖలాలు వున్నాయి. సంస్కృత, పాళి బాషలో ఆలయంలో శాసనాలు వున్నాయి. ఆలయం గుడిసె ఆకృతి కలిగి ఇటుక, సున్నంతో నిర్మితమైంది. దేశంలో హస్తి పృష్ట విమానం శాస్త్ర ప్రకారం నిర్మితమైన ఆలయం ఇదొక్కటే. ఈ ఆలయం తొలుత బౌద్ధ చైతన్య గృహమని అనేక సాక్ష్యాదారాలు కన్పిస్తాయి. ఆచార్య నాగార్జునుడు కాలంలో ఈ ఆలయం రూపుదిద్దుకుందని, ఇది ఒక విజ్ఞాన కేంద్రంగా భాసిల్లిందని చరిత్ర చెపుతుంది. ఆలయం ఆకృతి విశేషంగా వుండటం, వాటి మీద పలు బౌద్ధ క్షేత్రాల్లా కన్పించే చిత్రాలు, శిల్పాలు కూడా వుండటం బౌద్ధ చైతన్య గృహం అనటానికి సాక్ష్యాధారాలుగా నిలిచాయి. ఆలయ ఆవరణలో పురావస్తు శాఖ ఆధ్వర్యంలో జరిపిన తవ్వకాల్లో బయలు పడిన అవశేషాలు బౌద్ధారామ జాడలు తెలియజేస్తున్నాయి. దీంతో ఈ ఆలయాన్ని సందర్శించటానికి బౌద్ధ బిక్షువులు కూడా వస్తుంటారు. దేవాదాయశాఖ ఆధ్వర్యంలో ఆలయాన్ని నిర్వహిస్తున్నారు.

ఆలయంలోని పురాతన కట్టడాలను కాపాడేందుకు కేంద్ర పురావస్తు శాఖ దేవస్థానాన్ని తన పరిధిలోకి తీసుకుంది. ఎంతో ప్రాముఖ్యత సంతరించుకొని ప్రాచీన కళా సంపత్తికి అద్దం పట్టే కపోతేశ్వర ఆలయాన్ని అభివృద్ధి చేయాలని భక్తులు కోరుకుంటున్నారు.

# కాసులు కురిపిస్తున్న సాగర్ జలాలు

(ఆన్‌లైన్, నరసరావుపేట)

సాగర్ జలాలు రాష్ట్ర ప్రభుత్వానికి కాసుల పంట పండిస్తున్నాయి. ప్రతి ఏడాది కోట్లాది రూపాయలు రాష్ట్ర ఖజానాకు సమకూరుస్తున్నాయి. ఒక్క టిఎంసి సాగర్ జలాలు వివిధ రూపాలలో సుమారు 17 కోట్ల రూపాయలు ప్రభుత్వానికి సమకూరుస్తుంది. కుడి కాలువల ద్వారా పూర్తి స్థాయిలో నీటి సరఫరా జరిగినట్లయితే ప్రభుత్వానికి ఒక ఏడాదికి రెండు వేల కోట్ల రూపాయలకు పైగా సమకూరినట్లే. శ్రీశైలం వద్ద వినియోగించిన ఒక్క టిఎంసి నీటి వలన సుమారు 5 కోట్ల రూపాయల విలువైన విద్యుత్ ఉత్పత్తి జరుగుతుంది. అదే టిఎంసి నీటిని సాగర్ కుడి కాలువల ద్వారా విడుదల చేస్తారు. డ్యామ్ వద్ద కుడి కాలువపై నిర్మించిన విద్యుత్ ప్లాంట్‌కు నీటిని వినియోగించి సుమారు 5 కోట్ల రూపాయలు విలువైన విద్యుత్‌ను ఉత్పత్తి చేస్తారు. అలాగే ఆ నీటిని పంట పొలాలకు విడుదల చేయడం వలన సుమారుగా 5 వేల ఎకరాల సాగు అవుతుంది. ఈ సాగు వలన సుమారు 5.25 కోట్లు రూపాయల విలువైన పంట ఉత్పత్తి అవుతున్నది. అలాగే కుడి కాలువలపై నిర్మించిన విద్యుత్ ప్లాంట్లు వలన ఇదే టిఎంసి నీటితో సుమారు రెండు కోట్ల రూపాయల విలువైన విద్యుత్ ఉత్పత్తి జరుగుతుంది. ఈ వివరాలు ఒక్క కుడికాలువకు సంబంధించినవి మాత్రమే. అయితే ఎడమ కాలువ, డ్యాం వద్ద పవర్ ప్లాంట్ నుంచి విడుదలయ్యి ప్రకాశం బ్యారేజ్‌కి చేరుతుంది. ఈ నీటి వలన కూడా పై లెక్కలను బట్టి ప్రభుత్వానికి సమకూరే ఆదాయాన్ని లెక్కించవచ్చు. ఒక విధంగా చెప్పాలంటే రాష్ట్ర ఆర్థిక పరిస్థితిని చక్కదిద్దుతుంది 50 శాతం సాగర్ జలాలే. ఒక వైపు సాగర్ జలాలు పంట పొలాలను సస్యశ్యామలం చేస్తూ మరో వైపు ప్రభుత్వ ఖజానాకు ఆర్థిక పరిపుష్టిని కలిగిస్తున్నాయి.


సాగర్ కుడి కాలువ

# అంతరించిపోతున్న టైర్ల బండి పరిశ్రమ



ఖార్ఖానాలో తయారైన టైరుబండి

('ఆన్‌లైన్' - చెరుకుపల్లి)

మండలంలో టైరు బండ్ల తయారీ పరిశ్రమ అంతరించిపోతున్నది. రైతులు పండించే పంట ఎగుమతులు, దిగుమతులకు, వ్యవసాయ పనులకు గ్రామాలలో టైరుబండ్లకు ప్రాముఖ్యత ఎంతో వుండేది. కృష్ణా, నెల్లూరు, ఏలూరు, రాజమండ్రి, ప్రకాశం తదితర జిల్లాల నుంచి వచ్చి చెరుకుపల్లిలో టైరుబండ్లు చేయించుకుని తీసుకుని వెళ్ళేవారు. టైరుబండ్లు తయారు చేసే ఖార్ఖానాలు అంతరించి పోయాయి. రెండు, మూడు చోట్ల తప్పితే, ఎక్కడా టైరుబండ్లు తయారుచేసే ఖార్ఖానాలు కనిపించటం లేదు. ఈ విషయంపై 'ఆన్‌లైన్' వడ్రంగి బండారు చంగళరావును ప్రశ్నించగా వ్యవసాయ పనులు సులువుగా, త్వరగా చేయడానికి ట్రాక్టర్లు వచ్చాయి. అవి వచ్చిన తర్వాత టైరుబండితో వ్యయసాయం చేసే రైతులు తగ్గిపోయారు. ప్రస్తుతం మేము ఆ పరిశ్రమను పక్కకుపెట్టి చిత్రిక మిషన్లు, డ్రిల్లింగ్ మిషన్లతో కాలం గడుపుతున్నాం. కొందరైతే చెక్కపని చేయడం మానివేసి జీవనోపాధి లేక అనేక ఇబ్బందులు పడుతున్నారు. ఇతర రాష్ట్రాలలో ఈ పరిశ్రమకు కొంత చేయూతనిస్తున్నాయి. మన రాష్ట్రంలో కూడా కొంత చేయూతనివ్వాలి. లేకపోతే టైరు బండ్లు చేసేవారు అందరూ వేర్వేరు వ్యాపారాలలోకి మారుతున్నారు. ఇట్లాగే కొద్ది రోజులు జరిగితే ఈ పరిశ్రమలు ఉనికిని కోల్పోతాయి. కాబట్టి ప్రభుత్వం జోక్యం చేసుకుని వీరికి రాయితీలతో కూడిన విధంగా అనేక ప్రభుత్వ పధకాల ద్వారా ఈ పరిశ్రమకు పూర్వ వైభవాన్ని తెప్పిస్తే బాగుంటుందని ఆయన తన అభిప్రాయాన్ని వ్యక్తం చేశారు.



ఖార్ఖానాలో టైరుబండిని తయారుచేస్తున్న చంగళరావు

# తిరుమల పాల ఉత్పత్తులకు విశేష ఆదరణ



తిరుమల ఎండి
బొల్లా బ్రహ్మానాయుడు

(ఆన్‌లైన్, నరసరావుపేట)

తిరుమల మిల్క్ ప్రాడక్ట్స్ ప్రైవేట్ లిమిటెడ్ స్థాపించిన అనతి కాలంలోనే అసాధారణ ప్రగతి సాధించింది. రాష్ట్రంలో క్షీర విప్లవానికి తిరుమల తన వంతు కృషి చేస్తున్నది. ఒక వైపు పాల ఉత్పత్తి దారులకు వెన్నుదన్నుగా నిలుస్తూ, మరో వైపు వేలాది మంది నిరుద్యోగులకు ఉపాధి కల్పిస్తున్నది. రాష్ట్రంలోనే కాక ఇతర రాష్ట్రాలు తమిళనాడు, కర్నాటకలలో కూడా సంస్థ విస్తరించింది. పది వసంతాలు తిరుమల పూర్తి చేసుకున్నది. ఒక పాల శీతలీకరణ కేంద్రంతో ప్రారంభమైన తిరుమల డెయిరీ అది 18 కేంద్రాలను విస్తరించి పాలు, పాల పదార్థాల తయారీ విక్రయాల్లో మార్కెంట్‌లో తన కంటూ ఒక స్థానాన్ని సాధించ గలిగింది. పాలు, పాల పదార్థాల తయారీలో నాణ్యత ప్రమాణాలను పాటిస్తూ, మార్కెట్‌లో మంచి గుర్తింపు పొందింది. అసలైన స్వచ్ఛతకు తిరుమల ఉత్పత్తులు పేరెన్నిక గన్నవి. పాలుతో పాటు పాల పౌడర్, నెయ్యి, ఫ్లావర్డ్ మిల్క్, మజ్జిగ, పెరుగు తిరుమల నుంచి వెలువడుతున్న ఉత్పత్తులకు వినియోగ దారుల నుంచి మంచి ఆదరణ లభిస్తున్నది. పది వేల లీటర్ల సామర్థ్యంతో ప్రారంభమైన తిరుమల సంస్థ నేడు ఆరు లక్షల లీటర్ల పాల సేకరణ ప్రతి రోజు చేస్తూ సుమారు ఐదు లక్షల లీటర్ల పాల విక్రయాలను ఆంధ్ర ప్రదేశ్, తమిళనాడు, కర్నాటక రాష్ట్రాల్లో జరుపుతున్నది. అగ్‌మార్క్ ప్రమాణాలతో పాలు, పాల పదార్థాలను తయారు చేస్తున్నది. తిరుమల ఉత్పత్తులకు ఐఎస్‌వో 9001-2000 గుర్తింపు లభించింది. ప్రైవేటు డెయిరీ రంగంలో ద్వితీయ స్థానాన్ని ఆక్రమించింది. అత్యున్నత సాంకేతిక ప్రమాణాలతో నెల్లూరు జిల్లా, గూడూరులో పాలు, పాల పదార్థాల తయారీ ఫ్యాక్టరీని నిర్మించారు. ఇక్కడి నుంచి నెయ్యి, పాలు, పెరుగు, ఫ్లావర్డ్ మిల్క్, పాల పొడి ఉత్పత్తి అవుతున్నాయి. గూడూరు, పలమనేరు, వెల్లల చెరువులలో పాల ప్యాకెట్ల తయారీ ప్లాంట్లను నెలకొల్పారు. చెన్నై, బెంగుళూరు, హైదరాబాద్ పట్టణాల్లో తిరుమల ఉత్పత్తులకు విశేష ఆదరణ లభిస్తున్నది. తిరుమల తయారీ చేసే పాల పొడికి మార్కెట్‌లో మంచి డిమాండ్ లభించటంతో పాటు బంగ్లాదేశ్, శ్రీలంక దేశాల నుంచి కూడా ఆర్డర్లు లభిస్తున్నాయి. పాల ఉత్పత్తి దారులకు చేయూత నందించటంతో పాటు ఉపాధి అవకాశాలు కల్పించటంలో తిరుమల ప్రత్యేక గుర్తింపు సాధించింది. ఈ సంస్థలో సుమారు ఏడు వేల మంది వివిధ విభాగాలలో ఉపాధి పొందుతున్నారు. పాల ఉత్పత్తిదారులకు కూడా వివిధ రకాల సహాయం చేస్తూ, వారి శ్రేయస్సు కోసం విభిన్న పథకాలు అమలు చేస్తూ వారి ఆదరణను చూరగొన్నది. సంస్థ ఎండి బ్రహ్మానాయుడు మాట్లాడుతూ, పాల ఉత్పిత్తి దారులు, వినియోగదారుల ఆదరణే మాకు స్ఫూర్తి అని పేర్కొన్నారు. నాణ్యతా ప్రమాణాలు పాటించటం వలనే తిరుమల ఉత్పత్తులకు వినియోగ దారుల నుంచి ప్రోత్సాహం లభిస్తున్నదని చెప్పారు.




తిరుమల పాల ప్యాకెట్లు



కరస్పాండెంట్
డాక్టర్ మేదరమెట్ల శివలింగ ప్రసాదరావు

# పిఎన్‌సి కెఆర్ కళాశాలలలో హైటెక్ కోర్సులు

(ఆన్‌లైన్, నరసరావుపేట)

అత్యున్నత విద్యా బోధన అందిస్తున్న విద్యా సంస్థలుగా నరసరావుపేటలోని పిఎన్‌సి కెఆర్ కళాశాలలు ప్రత్యేక గుర్తింపు సాధించాయి. హైటెక్ కోర్సులు నిర్వహిస్తూ పల్నాడు ప్రాంత విద్యాభివృద్ధికి ఈ కళాశాలలు కృషి చేస్తున్నాయి. డిగ్రీ కళాశాలలకు జాతీయ అంచనాలు, గుర్తింపు మండలి(నాక్) నుంచి బి++ గ్రేడ్ లభించింది.

రాష్ట్రంలో మొత్తం 34 కళాశాలలు మాత్రమే నాక్ గుర్తింపు లభించగా, వీటిలో పిఎన్‌సి కెఆర్ కళాశాలవుండటం విశేషం. కొత్త కోర్సులు నిర్వహించటంలో డిగ్రీ, పిజి కళాశాలలు ఆచార్య నాగార్జున యూనివర్శిటీ పరిధిలో ప్రముఖ స్థానంలో నిలిచాయి. శ్రీ వెంకటేశ్వర పాలడుగు నాగయ్య చౌదరి, కొత్త రఘు రామయ్య ఎడ్యుకేషన్ సొసైటీ ఆధ్వర్యంలో ఒకే క్యాంపస్‌లో ఎల్‌కెజి నుంచి పిజి వరకు విద్యా సంస్థలను నిర్వహిస్తున్నారు. అలాగే నర్సింగ్ స్కూల్, కాలేజి కూడా ఇదే క్యాంపస్‌లో నిర్వహిస్తున్నారు. అనతి కాలంలోనే డిగ్రీ, పిజి విద్యా సంస్థలు అసాధారణ ప్రగతిని సాధించాయి. అన్ని హంగులతో భవనాలను, లైబ్రరీ, ల్యాబరేటరీ, ఆడిటోరియంలను ఏర్పాటు చేశారు.

ఎడ్యుకేషన్ సొసైటీ పాలకవర్గ కార్యదర్శి, కరస్పాండెంట్ డాక్టర్ ఎం.శివలింగ ప్రసాదరావు దీక్ష, దక్షలతో ఈ విద్యా సంస్థలు విశేష అభివృద్ధిని సాధిస్తున్నాయి. సొసైటీ ఆధ్వర్యంలో కొత్త రఘు రామయ్య జూనియర్ కళాశాల, పాలడుగు నాగయ్య చౌదరి, కొత్త రఘు రామయ్య డిగ్రీ, పిజి కళాశాలలు, పిఎన్‌సి అండ్ కెఆర్ నర్సింగ్ స్కూల్, నర్సింగ్ కాలేజ్, పాలడుగు నాగయ్య చౌదరి పబ్లిక్ స్కూల్‌లను నిర్వహిస్తున్నారు. జిల్లాలో ప్రప్రథమంగా బయోటెక్నాలజీ కోర్సును ఈ కళాశాలలో ప్రారంభించటం విశేషం.

ఎంఎస్‌సి మైక్రో బయాలజీ, ఎంఎస్‌సి బయోకెమిస్ట్రీ, ఎంఎస్‌సి కంప్యూటర్స్, ఎంఎస్‌సి బోటనీ, ఎంఎస్‌సి బయోటెక్నాలజీ, ఎంసిఎ, పిజి కోర్సులను కళాశాలలో నిర్వహిస్తున్నారు. బికామ్, బిఎలతో పాటు, బిఎస్‌సి కంప్యూటర్ సైన్స్, ఎలక్ట్రానిక్స్, బయోకెమిస్ట్రీ, బయోటెక్నాలజీ తదితర కోర్సులను నిర్వహిస్తున్నారు. కళాశాలలో ఎన్‌సిసి, ఎన్ఎస్ఎస్ విభాగాల ద్వారా సేవా కార్యక్రమాలను అందిస్తున్నారు. ప్రతి ఏటా ప్రపంచ రక్తదాన దినోత్సవం సందర్భంగా విద్యార్థులు స్వచ్ఛంద రక్తదానం చేస్తున్నారు. విద్యార్థుల వ్యాయామం కోసం ప్రత్యేక జిమ్ ఏర్పాటు చేశారు.

క్రీడల అభివృద్ధికి వివిధ కోర్టులను నిర్మించారు. తమ విద్యా సంస్థలను జిల్లాలోనే నెంబర్ వన్‌గా తీర్చిదిద్దాలనే లక్ష్యంతో పని చేస్తున్నట్లు కళాశాల కరస్పాండెంట్ డాక్టర్ మేదరమెట్ల శివలింగ ప్రసాదరావు తెలిపారు. అత్యుత్తమ మార్కులు సాధించిన విద్యార్థులను ప్రోత్సహించేందుకు ప్రతిభా పురస్కారాలు అందిస్తున్నామన్నారు.



పిఎన్‌సి కెఆర్ కళాశాలల భవన సముదాయం

# నవ్యాంధ్ర కవిబ్రహ్మ ఏటుకూరి

(ఆన్‌లైన్ - పెదకూరపాడు)

సాహిత్యం ఒక జాతీయ సంస్కృతికి అక్షరరూపం. ఒకతరం ఆలోచనలో, ఆచరణ విధానాలు సామాజిక విలువలను మరో తరానికి అద్దంలో ప్రతిబింబంలా చూపగలిగేది సాహిత్యం. జాతి సంస్కృతిని బేరీజు వేయడంలో సాహిత్యం పాత్ర మహత్తరమైనది. ఎప్పుడైనా ఎక్కడైనా ఏ భాషలోనైనా తమ కవితా వీధితులతో సాహిత్యాకాశాన్ని జేగీయమానంగా ప్రకాశింపజేయగల మహాకవులు కొద్ది మంది మాత్రమే. అలాంటి వారిలో కవి అన్న పదానికి వన్నె తెచ్చి పెదకూరపాడుకేకాక గుంటూరు జిల్లాకే ఖ్యాతితెచ్చిన కవిబ్రహ్మ ఏటుకూరి వెంకటనర్సయ్య ఒకరు. కొండవీటి సీమలోని సత్తెనపల్లి పరగణా రాణాజాగీరుగాను, పెదకూరపాడు హుజూరు సంస్థగాను వ్యవహరించబడుతూ వుండే నేటి పెదకూరపాడులో వీరి పూర్వీకులు గండికోట పతనానంతరం స్థిర నివాసం ఏర్పరచుకున్నారు. 1911 ఏప్రిల్ ఒకటవ తేదీన వీరు పెదకూరపాడులో జన్మించారు. అక్షరాభ్యాసం నాటి ముహూర్త బలమెటువంటిదోగాని వెంకట నర్సయ్యకి చదువు సంధ్యల మీద ధ్యాస లేకుండా పోయింది. పొలాల వెంట పుంతల వెంట తిరుగుతూ ఉండేవారు. వారి ఇంటి పాలేరు రుద్రపాటి వెంకన్న (హరిజనుడు) పలనాటి సుద్దులు శ్రావ్యంగా పాడి వినిపిస్తుండేవాడు. కాడిగట్టి, మేడిపట్టి కొన్నాళ్ళు సేద్యం చేశారు. చదువు పట్ల వీరి అనాసక్తతను గమనించిన తండ్రి భూషయ్య ప్రత్యేక శ్రద్ధ తీసుకుని ఆంధ్ర మహాభారత ప్రతిని తెప్పించి పురాణ కాలక్షేపం చేయించారు. ఆనాటి మహాభారత శ్రవణ ప్రభావం వెంకటనరసయ్య జీవిత పంథానే మార్చివేసింది. చదువు సంధ్యల పట్ల శ్రద్ధాశక్తులు ఇనుమడింపజేసింది. ఎనమంద్రు మంగయ్య శాస్త్రి వద్ద అమరము, వంద కావ్యాలు చెప్పించారు. సాహిత్య పిపాసతో నరసయ్య కాడికి, మేడికి స్వస్తి చెప్పారు. చిన్నతనంలోనే వారసత్వంగా చందోబద్ధమైన కవితలల్లడం ప్రారంభించారు. రైతు కుటుంబంలో పుట్టటం వల్ల పొలాలతోను, పల్లెలతోను సంబంధం కలిగి వుండటం వల్ల వెంకటనరసయ్య భాషకు కొత్త జిగిబిగి సమకూరాయి.


ఏటుకూరి వెంకటనరసయ్య

గ్రామీణ ప్రజానీకం పాడుకునేందుకు వీలుగా వుండే పాటలెన్నో వారు బాల్యంలోనే రాశారు. అమర్తలూరులోను ముత్తుపల్లి అగ్రహారంలోను, తెనాలి సంస్కృత కళాశాలలోను విద్యాభ్యాసం చేశారు. ఆ సమయంలోనే నరసయ్యకి కవిరాజు, త్రిపురనేని రామస్వామిచౌదరి పరిచయభాగ్యం కలిగింది. కొవ్వూరులోని గిరవాణ విద్యాపీఠంలోను, విజయనగర సంస్కృత కళాశాలలోను చదువుకుంటూ అక్కడి వాతావరణం పడక తిరిగి తెనాలి చేరుకున్నారు నరసయ్య. 1933వ సంవత్సరంలో ఉభయ భాషా ప్రవీణ పూర్తికాగానే నరసయ్య జాగర్లమూడి కుప్పుస్వామి చౌదరి సహకారంతో గుంటూరు జిల్లా బోర్డు స్కూల్‌లో ఉపాధ్యాయులుగా చేశారు. కవి నరసయ్య సంఘ సంస్కర్త కూడా. ఒకే ఒక్క పూలదండ సాక్షిగా ఆదిలక్ష్మమ్మను వివాహం చేసుకున్నారు. ఆ ఆదర్శ వివాహం ఈ ప్రాంత పరిసర గ్రామీణుల డాబు దర్పాలకెంతో సిగ్గు కలిగించింది. 1935వ సంవత్సరం నుంచి వెంకటనర్సయ్య పూర్తిగా కవితా రంగంపై దృష్టిని కేంద్రీకరించారు. 'నీతి మంజరి', క్షేత్రలక్ష్మి, ప్రేమలోకం, మగువమంచాలి, రైతుకథ (హరికథ), సిద్ధాశ్రమం, నాయకురాలు, త్రివేణి, గాదవళి, వీరభారతం, బాలచంద్రుడు, రుద్రమదేవి, ఆలరాజు రాయభారం వీరి ముద్రిత గ్రంథాలు. నరసయ్య బహుముఖ సాహితీ సేవను సకలాంధ్ర దేశం గుర్తించింది. అందుకు నిదర్శనంగా గుంటూరు జిల్లా రైతు సంఘం దివాన్ బహదూర్, కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తి ఆధ్వర్యాన గోవాడలో జరిగిన సభలో నరసయ్యకి కవిబ్రహ్మ బిరుదునొసంగి సువర్ణాక్షరాలతో లిఖించబడిన కవిబ్రహ్మ బిరుదాంకితమైన సువర్ణఫలకం బహూకరించబడినది.

ఆంధ్రదేశం నలుమూలలలో పట్టణాలతోపాటు మారుమూల గ్రామాల్లో నరసయ్యకు సన్మానాలు జరిగాయి. తెలుగు సాహితి క్షేత్రంలో రసవత్కర కేదారాలు పండించిన కవితాభికుడు. వెంకటనరసయ్య కవి, బ్రహ్మాత్వం పొందిన తర్వాత పాములపాటి వెంకట క్రిష్ణయ్యచౌదరి అధ్యక్షుడుగా ఆవుల గోపాలకృష్ణమూర్తి కార్యదర్శిగా తెనాలిలో కవిబ్రహ్మ సన్మాన సంఘం ఏర్పడింది. 142 మంది కవులు రచయితలు తమ తమ పద్య రచనలను నరసయ్య సాహితీ సేవలను పొగుడుతూ సన్మాన సంఘానికి పంపారు. కాని విధి వక్రించి నరసయ్యకు విషజ్వరం తగిలి హఠాత్తుగా 1949వ సంవత్సరం నవంబరు 10వ తేదీన (మిగతా 107లో)


అహల్యకు శాపవిమోచనం కలిగిస్తున్న శ్రీరాముడు
సీతా స్వయంవరం

# చిత్రమవే ఆయన చిత్రం

(ఆన్‌లైన్, తెనాలి)

కళ మనకేమిచ్చింది అనే దానికన్నా కళ కోసం మనమేం చేశామని ఆలోచించే కళాకారులు ఉన్నంతకాలం కళారంగం నిత్య నూతనత్వంగా ప్రకాశిస్తూనే ఉంటుంది. ప్రతి చిన్న పనికీ వ్యాపార దృక్పథంతో ఆలోచించే ఈ రోజుల్లో కళనే నమ్ముకుని దాని కోసం నిస్వార్థంగా పనిచేస్తున్న చిత్ర కళాకారులు పడవల నారాయణరావు పదుగురికి ఆదర్శప్రాయంగా నిలుస్తున్నారు.

జీవనోపాధి కోసం కాకుండా జీవితాన్నే చిత్రకళకు అంకితం చేసిన నారాయణరావు తాను నేర్చిన కళను పది మంది కోసం వినియోగిస్తున్నారు. గత 30 సంవత్సరాలుగా చిత్రకళలో లీనమై నారాయణరావు చిత్రించిన పలు చిత్రాలు సజీవత, భావుకతను ప్రతిబింబించటమే కాక ఎందరో ఔత్సాహిక చిత్రకారులకు మార్గదర్శకంగా ఉంటున్నాయి.


చిత్రకారుడు
పడవల నారాయణరావు

తెలుగు సంస్కృతీ సంప్రదాయాలను చాటిచెప్పే చిత్రాలే కాకుండా ప్రకృతిలోని రమణీయ దృశ్యాలు, పురాణేతి ఇతిహాసాలలోని రమణీయ ఘట్టాలను సజీవంగా రూపొందించిన నారాయణరావు ఆర్ట్ గ్యాలరీలో లెక్కకు మించిన చిత్రాలు చోటు చేసుకున్నాయి.

కళ కళ కోసమే అని కాకుండా కళ పదిమందికి ప్రయోజనం కల్పించాలనే ఆశయం నారాయణరావులో కనిపిస్తుంది. ఈ ఆశయ సాధన కోసం సుమారు మూడు దశాబ్దాలుగా చిత్రకళా వ్యాప్తికి ఆయన తనదైన శైలిలో కృషి చేస్తున్నారు. రేపల్లెకు సమీపంలోని రాజవోలు గ్రామానికి చెందిన నారాయణరావు వృత్తి రీత్యా తెనాలిలో స్థిరపడ్డారు. స్థానిక తాలూకా జూనియర్ కళాశాలలో చిత్రకళా ఉపాధ్యాయులుగా పని చేస్తూ అనేక మందిని చిత్ర కళాకారులుగా తీర్చిదిద్దారు. తెనాలిలో తన ఇంటి వద్దనే చిత్రకళా శిక్షణాలయం స్థాపించారు. ఎవరి నుండి ఎటువంటి ఆర్థిక సహాయ సహకారాలు

(మిగతా 108లో)

# నవ్యాంధ్ర కవిబ్రహ్మ ఏటుకూరి

(106వ పేజి తరువాయి)

నిడుబ్రోలులో కీర్తిశేషులయ్యారు. అప్పటికి ఆయన వయసు 39 సంవత్సరాలలోపు. ఎంతో వైభవంగా చేయాలనుకున్న సన్మానం అనుకోని రీతిలో స్మారకంగా మారిపోయింది. కవిబ్రహ్మ ఏటుకూరి వెంకట నరసయ్య కవిత మూడు శాఖలుగా రైతు సిద్ధాంతం, తదాభివృద్ధి విధానం, క్షేత్రలక్ష్మి, రైతు(హరి) కథ వెల్లడించుచున్నవి. సాంఘిక పరివర్తనం సంసారికతత్వం తెలుపునది రెండోవది. దీనిని ప్రేమలోకం, త్రివేణి, నీతిమంజరి వివరించుచున్నది. దేశాభిమానం చారిత్రక వీరగాధ సంస్కృతిని కలిగించునది మూడోవది. దీనిని పలనాటి వీరగాధలు, రుద్రమదేవి ప్రస్ఫుటీకరించుచున్నది. రైతు జీవనంను కవిత వస్తువుగా స్వీకరించలేదు. ఆధునిక కవులలో కవికోకిల దువ్వూరి రామిరెడ్డి, కృషీవలుడు కవిబ్రహ్మ ఏటూరు వెంకట నరసయ్య క్షేత్రలక్ష్మి రైతు జీవనంకు ఇతివృత్తంగా గల కావ్యాలు. రైతుగా పుట్టి రైతుగా పెరిగినా రైతు కవి ఏటుకూరి వారి క్షేత్రలక్ష్మి, ఆధునిక సాహిత్యములో సౌందరనందంతో సమానమన్నారు ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులు. గూడూరులో విద్యార్థిగా వుంటూనే జాతీయోద్యమంలో కూడా పాల్గొన్నారు. నరసయ్య సంఘ సంస్కర్త కూడా. వివిధ గ్రంథాలే కాకుండా నిరుద్ధసైరికం (సంస్కృత ఖండకావ్యం), అంగదరాయభారం, జయప్రద (నాటకాలు), ప్రతాపసింహ, బుద్ధిజీవులు (నవలలు), జిబిలిక (గేయకావ్యం) చందమామ (గేయకథలు) వీరి ఆముద్రితాలు.

# చిత్తరువే ఆయన చిత్తం



పల్లె పడుచు



శకుంతల

(107వ పేజి తరువాయి)

ఆశించకుండా గత 29 సంవత్సరాలుగా వందలమంది బాల బాలికలకు, ఔత్సాహికులకు చిత్ర లేఖనంలో శిక్షణ ఇస్తున్నారు. నారాయణరావు వద్ద శిక్షణ పొందిన అనేక మంది చిత్ర లేఖ నోపాధ్యాయులుగా, ఆర్ట్ డైరెక్టర్లుగా, పత్రికలలో లే అవుట్ ఆర్టిస్టులుగా, స్క్రీన్ ప్రింటర్స్ అధినేతలుగా, ఇంకా అనేక రంగాలలో స్థిరపడ్డారు. నారాయణరావు అనేక భావ చిత్రాలను ఆయిల్, వాటర్ కలర్స్‌తో చిత్రీకరించారు. జానపద సంప్రదాయ చిత్రాలు ఆయన కుంచె నుంచి జాలువారి చూపరుల మనసును హత్తుకుంటున్నాయి. ముఖ్యంగా ప్రాచీన భారతీయ సంస్కృతికి ప్రతి బింబాలైన పండుగల ప్రాశస్త్యాన్ని తాను గీసిన చిత్రాల ద్వారా ఆబాల గోపాలానికి ఆకర్షణీయంగా ఆవిష్కరింపజేశారు.

సహజ సౌందర్యం ఉట్టిపడే విధంగా చిత్రాలు ఆవిష్కరించటంలో అందె వేసిన చెయ్యిగా గుర్తింపు పొందిన నారాయణరావు చిత్రకళపై ఒక పుస్తకాన్ని కూడా రచించారు. పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వ విద్యాలయం ఆర్థిక సహకారంతో ముద్రణకు నోచుకున్న ఈ పుస్తకంలో నారాయణరావు చిత్రించిన పలు చిత్రాలు చోటు చేసుకున్నాయి. ఏరువాక పౌర్ణమి, శ్రీకృష్ణాష్టమి, బుద్ధ జయంతి, వినాయక చవితి, దసరా, దీపావళి, నాగులచవితి, క్రిస్టమస్, సంక్రాంతి, మహా శివరాత్రి, ఉగాది, శ్రీరామ నవమి వంటి పండుగల విశిష్టతను కళ్ళకు కట్టినట్టుగా చిత్రాల రూపంలో ప్రజల ముందుంచారు. శ్రమైక సౌందర్యాన్ని ప్రతిబింబించే చిత్రాలను హృదయాలకు హత్తుకు పోయే విధంగా రూపొందించారు.

చిత్రకళ పట్ల చిన్నతనం నుంచి ఆసక్తి చూపిన నారాయణరావులోని కళాతృష్ణను గమనించిన మేనమామ బిట్రా శ్రీనివాసరావు గుంటూరులో ఫ్రీ హేండ్ పెయింటింగ్‌లో శిక్షణ ఇప్పించారు. ప్రముఖ సినీ ఆర్ట్ డైరెక్టర్ గొట్టుముక్కల కోటేశ్వరరావు వద్ద పోర్ట్రయిట్స్‌లో అనేక మెళకువలు నేర్చుకున్నారు. ఇప్పటివరకు 450 మందికి పైగా చిత్రలేఖనంలో శిక్షణ ఇచ్చారు. ఆసక్తి ఉండి ఆర్థిక స్తోమత లేని వారికి ఉచితంగా చిత్రకళలో శిక్షణ ఇస్తున్నారు.

చిత్రకళపై నారాయణరావు సేకరించిన పుస్తకాలు వందలమంది విద్యార్థులకు రిఫరెన్స్‌గా ఉపయోగ పడుతున్నాయి. చిత్రకళలో నారాయణరావు ప్రతిభను, చిత్రకళా రంగానికి ఆయన చేస్తున్న సేవలను గుర్తించి 1997లో జిల్లా ఉత్తమ ఉపాధ్యాయునిగా, 1998లో రాష్ట్ర ఉత్తమ ఉపాధ్యాయునిగా అవార్డులను ఇచ్చి ఆయనను ప్రభుత్వం సత్కరించింది. చిత్రకళకు ఒక గౌరవం, గుర్తింపు తీసుకువచ్చి నేటికీ ఆ కళలోనే లీనమై కళపట్ల తనకున్న మక్కువను నారాయణరావు చాటుకుంటు న్నారు.

# నటనలో నవ్యత్వం గోవిందునికే సొంతం

(ఆన్‌లైన్, చిలకలూరిపేట అర్బన్)

తెలుగు నాటక మాగాణంలో సుబ్బారావు కళాజీవితం యోగ్యతా ముద్రను పొంది ఒక విశిష్ట సంప్రదాయాన్ని నిర్మించిందనే గద్యతిక్కన తుమ్మలవారి ప్రశంసలకు పాత్రుడై రంగస్థలంపై, వెండితెరపై పాత్రలకు ప్రాణప్రతిష్ట చేసి విశిష్టనటునిగా రంగస్థలపుటలలో చెరగని స్థానాన్ని పొందిన నటశేఖరుడు గోవిందరాజుల సుబ్బారావు. వృత్తిరీత్యా వైద్యులైనా ప్రవృత్తిరీత్యా నటనను తపనగా భావించి సరికొత్త నిర్వచనం చెప్పారు. విశాలమైన ఫాలభాగం.... వత్తుగా పెరిగిన గుబురు మీసాలు.... విలక్షణమైన నడకతో నటనలో తన కంటూ ఒక్కశైలిని రూపొందించుకొన్న డాక్టర్ సుబ్బారావు ప్రేక్షకుల గుండె గుడిలో చిరకాలం నిలిచిపోయారు. హైస్కూలు విద్యాభ్యాస సమయంలో మర్చెంట్ ఆఫ్‌వెనీసు ఇంగ్లీషు నాటకంలో తొలిసారిగా నటించి ఆ పాత్రకు జీవం పోసి విద్యార్థుల, అధ్యాపకుల ప్రశంసలను పొందారు. ఈ ప్రేరణలో నాటక రంగానికి అంకితమై నటనలో తరించారు.



రంగస్థలి కళాకారుడు గోవిందరాజుల సుబ్బారావు

కృష్ణాజిల్లా మేడూరు గ్రామంలో జన్మించిన గోవిందరాజుల పూర్వీకులు తెనాలిలో స్థిరనివాసం ఏర్పరుచుకున్నారు. తెనాలి తాలూకా హైస్కూలులో విద్యాభ్యాసం చేశారు. ఆ కాలంలోనే మహానటులైన మాధవపెద్దినటించిన నాటకాన్ని చూసి నటన పట్ల ఆసక్తిని పెంచుకున్నారు. తెనాలి శ్రీరామ విలాససభలో పలు నాటకాల్లో పాత్రలను పోషించారు.గయోపాఖానం, బొబ్బిలియుద్ధం, ప్రతాపరుద్రీయం, కన్యాశుల్కం నాటకాలతో పాటు మాలపల్లి, షావుకారు, కన్యాశుల్కం వంటి చిత్రాలలోను ప్రధాన భూమికలను పోషించారు. నాటకాలలో పాటలు, పద్యాలు పాడటంకోసం ఇరవై రాగాలు కఠోర పరిశ్రమతో నేర్చుకున్నారు. ఒక పాత్రను ఎన్నిసార్లు పోషించి భేష్ అనిపించుకున్నా ప్రతి ప్రదర్శననూ ఒక ప్రసవంగానే భావించి స్నేహితుల విమర్శలను స్వీకరించి నటనకు మరింత మెరుగులు పెట్టుకునేవారు.

సుప్రసిద్ధ నటులు హరిప్రసాద రావు, ఈమని లక్ష్మణస్వామి ప్రభావం గోవిందరాజుల జీవితంలో ప్రస్ఫుటంగా కనిపిస్తుంది.

గయోపాఖ్యానం నాటకంలో భీముని పాత్ర ధరించి నటనలో, సంగీతంలో అంతకు ముందులేని నూతన పోకడలను ప్రవేశపెట్టి ప్రేక్షకులను ఆశ్చర్యచకితులను చేశారు.'నిజకరవాల విక్షేపణమాత్ర' అనే డైలాగ్‌ను అనితర సాధ్యంగా చెప్పి ప్రేక్షకుల నుంచి వన్స్‌మోర్ ప్రశంసలను పొందారు. వన్స్‌మోర్ గౌరవాన్ని తొలిగా పొందిన ఘనత తెలుగు నాటకరంగంలో వీరికే దక్కింది. శ్రీరామ విలాస సభవారు బొబ్బిలియుద్ధం నాటకం తయారైన సందర్భంలో గోవిందరాజుల తొలుత హైదర్‌జంగ్ పాత్రకు తయారయ్యారు. కొంతకాలం రిహార్సల్స్ జరిగిన అనంతరం ఆ పాత్రను పెద్దభొట్ల చలపతికి ఇచ్చారు. తోటవల్లూరు నాటక ప్రదర్శనకు బుస్సీ పాత్రధారి గైరు హాజరు కావటంతో అప్పటికప్పుడు గోవిందరాజుల ఆపద్ధర్మంగా ఆ పాత్రను ధరించారు. అప్పటినుండి బుస్సీ పాత్రను, మద్రాసులో వైద్య వృత్తిని అభ్యసించే సమయంలో ప్రతాపరుద్రీయం నాటకంలో గోవిందరాజుల పిచ్చివాని పాత్రను ధరించారు. యుగంధరుని పాత్రధారి ప్రదర్శనకు నటనకు ముగ్ధుడై సన్మానించడమే కాకుండా నాటక ప్రదర్శన హక్కులను గోవిందరాజులకు ఇచ్చారు.

గూడవల్లి రామబ్రహ్మం గోవిందరాజులను మద్రాసుకు ఆహ్వానంచి 'మాలపల్లి' చిత్రంలో ముఖ్యమైన పాత్ర ఇచ్చారు. ఆ చిత్రంలో సనాతన సంప్రదాయశీలుడైన సుందరరామయ్య పాత్రకు మీసాలు అవరోధం కావటంతోమీసాలు తీసివేయడానికి అంగీకరించక సినిమాను తిరస్కరించి గోవిందరాజుల తెనాలికి తిరిగి వచ్చారు.

రామబ్రహ్మం పదే పదే అభ్యర్థించటంతో తల్లి అనుమతిని పొంది మీసాలు లేకుండానే చిత్రంలో నటించారు. తొలి చిత్రంతోనే గోవిందరాజుల పేరు ప్రతిష్ఠలు తారాపథానికి దూసుకువెళ్లాయి. బాలనాగమ్మ చిత్రంలో మాయలఫకీరు పాత్ర గోవిందరాజులకు పేరు కీర్తిప్రతిష్ఠలు తెచ్చిపెట్టింది. ఈ చిత్ర నిర్మాత జెమినీవాసన్ దాదాపు ఒక నిముషం గోవిందరాజుల నడకను ప్రత్యేకంగా చిత్రీకరించారు. ఆ రోజుల్లో పసిపిల్లలు ఏడుపుతో మారాం చేస్తుంటే గోవిందరాజుల మాయలఫకీరును ఉదహరిస్తే భయంతో బిక్కచచ్చిపోయేవారట.

(మిగతా 112లో)

# భక్తుల కొంగు బంగారం కోటయ్యస్వామి









(ఆన్‌లైన్ - నరసరావుపేట)

దక్షిణ భారతదేశంలోనే అత్యంత ప్రసిద్ధి గాంచిన శైవక్షేత్రం కోటప్పకొండ శ్రీత్రికోటేశ్వర స్వామి దేవస్థానం. నరసరావుపేట మండలంలోని కోటప్పకొండ పుణ్యక్షేత్రం గా, పర్యాటక కేంద్రంగా అసాధారణ రీతిలో అభివృద్ధి చెందింది. భక్తుల కొంగు బంగారమైన శ్రీత్రికోటేశ్వర సన్నిధి యాత్రికులకు అత్యంత చేరువైంది. అభివృద్ధి కార్యక్రమాలు పూర్తయి భక్తులకు, పర్యాటకులకు అన్ని సౌకర్యాలు సమకూరాయి. దీంతో పుణ్యక్షేత్రానికి భక్తుల సంఖ్య రోజురోజుకు పెరుగుతోంది. పర్యాటక కేంద్రంగానో... పుణ్యక్షేత్రంగానో ఏదో ఒక రకంగా మాత్రమే రాష్ట్రంలో వివిధ పుణ్యక్షేత్రాలు, పర్యాటక కేంద్రాలు అభివృద్ధి చేశారే తప్ప పుణ్యక్షేత్రం, పర్యాటక కేంద్రంగా రెండు విధాలుగా ఏకకాలంలో అభివృద్ధి చెందింది కోటప్పకొండేనని చెప్పవచ్చు.

### భక్తి,వినోదం మేళవించి కొండపై యాత్రికులకు ఆహ్లాదం కల్పిస్తున్నారు

హరహర! చేదుకో కోటయ్యా! చేదుకోవయ్యా! అని భక్తి సమ్మేళత అర్తితో పిలవగానే కాలకూటం లాంటి పాపాలనెన్నింటినైనా హరించి భక్తులకు ఇహ, పర సౌఖ్యాలను ప్రసాదించే ప్రత్యక్ష దైవం శ్రీ త్రికోటేశ్వరస్వామి అని భక్తుల నమ్మకం. రాష్ట్ర నలుమూలలా ఉన్న భక్తులకు కోటయ్య స్వామి కొంగు బంగారం. ఎందరో మహా యోగులకు, దేవతా మూర్తులకు జ్ఞానోపదేశం చేసిన మహిమాన్విత క్షేత్రమే కోటప్పకొండ. యేటా లక్షలాది భక్తుల నీరాజనాలు అందుకుంటూ శివరాత్రి నాడు ఇక్కడ సాగే తిరునాళ్ళ దేశ ప్రసిద్ధి.

దక్షయజ్ఞాన్ని ధ్వంసం చేసిన తర్వాత శివుడు శాంతించి పన్నెండేళ్ళ బాలుడిగా మారి బ్రహ్మచర్య దీక్షతో కైలాసంలో సమాధి నిష్టలో దక్షిణామూర్తిగా ఉన్నాడు. అప్పుడు బ్రహ్మ తదితర దేవతలు దక్షిణామూర్తి వద్దకు వెళ్ళి మొక్కి తమకు బ్రహ్మోపదేశం చేయాలని కోరారు. అందుకు అంగీకరించి దక్షిణామూర్తి త్రికూటాద్రికి వచ్చి(కోటప్పకొండ) బ్రహ్మోపదేశం చేశాడు. కనుకనే ఇది మహా పుణ్యక్షేత్రంగా విరాజిల్లుతోంది. ఆలయంలో నిత్యం పూజలు జరుగుతున్నాయి. ప్రతి రోజు అభిషేకం, అర్చన, అష్టోత్తరం, హోమాలు కూడా జరుగుతున్నాయి.

### కార్తీకమాస విశేష పూజలు

ఈశ్వరుడు అభిషేకంతో మానవుని యొక్క సకల ఈతిబాధలు తీర్చుతాడని వేదశాస్త్రంలో పేర్కొన్నారు. అందులోనూ కార్తీకమాసంలో శివారాధన చాలా విశిష్టం. శ్రీమేధాదక్షిణామూర్తి స్వరూప

(మిగతా 111లో)

# భక్తుల కొంగు బంగారం కోటయ్య స్వామి





(110వ పేజీ తరువాయి)

శ్రీత్రికోటేశ్వర స్వామి వారికి కార్తీకమాసంలో అభిషేకాలు, అర్చలను చేయటానికి ప్రత్యేక ఏర్పాటు చేశారు. కార్తీక మాసంలో ప్రతి ఆది వారం, పౌర్ణమి, ప్రతి సోమవారం, రెండో ఏకా దశి రోజుల్లో ఉదయం 5.30 నుండి 8.30 గంటల వరకు మూల విరాట్‌కు అభిషేకాలు జరుపనున్నారు.

## పర్యాటక కేంద్రం

ఘాట్‌రోడ్డుకు ఇరు వైపులా దాదాపు 25 ఎకరాల స్థలంలో పర్యాటక కేంద్రాన్ని ఏర్పాటు చేశారు. దీనిలో వివిధ పార్కులు రూపుదిద్దుకున్నాయి. పర్యాటకులను విశే షంగా ఇది ఆకర్షిస్తుంది. పర్యాకట కేంద్రంలో జింకల పార్కును ఏర్పాటు చేశారు. అలాగే విదేశాలకు సంబంధిం చిన పక్షులు పర్యాటకులకు కనువిందు చేస్తున్నాయి. సహ జమైన రీతిలో అందమైన గార్డెన్ నిర్మాణం జరిగింది. సర స్సులో బోట్ షికార్ కల్పించారు. చిన్న పిల్లలు ఆడుకునేం దుకు చిల్డ్రన్స్ పార్కు నిర్మాణం జరిగింది. టాయ్‌ట్రైన్‌ను ఏర్పాటు చేశారు. ఘాట్‌రోడ్ మార్గంలో బ్రహ్మ, శేషశయ నంపై విష్ణుమూర్తి, సరస్వతి, లక్ష్మి,పార్వతి, విఘ్నేశ్వ రుడు, ద్యాన ముద్రలో శివుడు, శివలింగం, భారీ విగ్రహా లను నిర్మించారు.

(109వ పేజి తరువాయి)

కన్యాశుల్కం చిత్రంలో లుబ్ధావధానుల పాత్రను నభూతోనభవిష్యతిగా పోషించారు. షావుకారు, గుణసుందరి కధ, పల్నాటియుద్ధంలోని చంగయ్య, వృద్ధమహారాజు బ్రహ్మనాయుడు పాత్రలు చలన చిత్రసీమలో చిరస్థాయిగా నిలిచిపోయాయి.

చలనచిత్రరంగంలో అఖండమైన పేరుప్రతిష్ఠలను సంపాదించినా వీలుచిక్కినప్పుడు నాటకాలను ప్రదర్శించేవారు. కన్యాశుల్కంలో గిరీశం, కరటక శాస్త్రి, పోలిశెట్టి, పాటిగ్రాపుపంతులు,బంట్రోతు పాత్రలను పోషించారు. చంద్రగుప్తలో చాణక్య పాత్రలను పోషించాలనే చిరకాల కోరిక మాత్రం గోవిందరాజులకు తీరలేదు. రామవిలాస సభలో తోట వెంకటాచలం, దావులూరి శేషాచలం నాయికా నాయకుల పాత్రలను పోషించారు. ఆ మహానటుల వద్ద శహనారాగాన్ని నేర్చుకొని దానికి జీవం పోశారు. చాటువు గారీశం వంటి

# నటనలో నవ్యత్వం గోవిందునికే సొంతం

నాటకాలను రచించారు. వందలాది రేడియో నాటకాలలో పాత్రలను ధరించడమే కాకుండా నాటకకళపై పలుప్రసంగాలు చేశారు.

రంగస్థల నటుడనే వాడు చిన్న పెద్ద తారతమ్యం లేకుండా అన్ని పాత్రలను ధరించాలని, తన పాత్ర రాణింపు కొరకే కాకుండా నాటక రక్తికి సమిష్టి కృషికి ప్రాధాన్యం ఇవ్వాలని ఘంటాపథంగా చెప్పేవారు. కలగూరగంప నాటకాలు నశించాలని, సమాజాభ్యుదయానికి బాటలు వేసే ఉత్తమ నాటకాలు రావాలని విశ్వసించేవారు. కిరాయి నటుల నాటకాలను, నిర్మొగమాటంగా దుయ్యబట్టేవారు. నాటకరంగంపై పలు వ్యాసాలను రచించారు. వందలాది ఘనసన్మానాలను పొందారు.

ఛలోక్తులు, చమత్కారాలతో సభికులను అలరించే మంచి వక్త. వీరికి సంతానం లేకపోవడంతో సోదరుని కుమార్తెను పెంచుకొని ప్రఖ్యాత సినీ దర్శకులు బాపుగారికి ఇచ్చివివాహం చేశారు. తెలుగు వారిలో కూడా హాలీవుడ్ నటులను పోలిన నటులున్నారని ప్రపంచానికి చాటినవాడు డాక్టర్ గోవిందరాజుల సుబ్బారావు. అతని నటనలో ఒక రమణీయత వున్నది. క్షణక్షణ నవ్యత ఉన్నది అని కురుగంటి నవ్యాంధ్ర సాహిత్య వీధులు గ్రంధంలో పేర్కొ న్నారు. 'సుబ్బారావు డైలాగ్ డెలివరీలో ఒక విలక్షణత ఉంది. అంత ఊతం తీసుకొని డైలాగ్ చెప్పడం అయనకే చెల్లింది. ఆయన డైలాగ్‌లో టైమ్ సెన్స్,విరుపులూ, విరామాలూ ఒక ప్రత్యేకత. సాత్వికాభినయాన్ని సొతం చేసుకొన్న నటశేఖరుడు గోవిం దరాజుల' అని నేతి పరమే శ్వరశర్మ పేర్కొన్నారు. గోవిందరాజుల 1959 అక్టోబర్ 29న మద్రాస్ నగరంలో స్వర్గస్తులయ్యారు.



# అభినయం అమోఘం గాత్రం సుమధురం

(ఆన్‌లైన్, చిలకలూరిపేట అర్బన్)

గాన గాంధర్వులు, నటశేఖరులు తెలుగు నాటకరంగంలో లెక్కకు మిక్కిలి ఉన్నారు. మధుర గానంతో... నటనా వైదుష్యం తో ప్రేక్షకులను ఆనందాబ్ధిలో ముంచెత్తిన వారూ ఉన్నారు. పండితుల నుంచి పామరుల వరకూ అలరించి చరితార్ధులైన సుప్రసిద్ధ నటులెందరు ఉన్నా ఆబాలగోపాలానికి సుపరిచితులైన నటకావతంసుడు అబ్బూరి వరప్రసాదరావు. ఆయన నాటకం ప్రదర్శించని గ్రామం ఆంధ్రదేశంలో లేదంటే అతిశయోక్తి కాదు. ఎవరైనా కమ్మగా గొంతెత్తిపాడితే ' అబ్బ అబ్బూరోడిలా' అనే నానుడి (మిగతా 113వ పేజీలో)


అబ్బూరి వరప్రసాదరావు

# తిక్కన మన గుంటూరువాడే!

(ఆన్‌లైన్ - గుంటూరు)

ప్రస్తుతం పాతగుంటూరు అని పిలుస్తున్న ప్రాంతమే తిక్కన కాలం నాటి గుంటూరు మండలానికి ప్రధాన కేంద్రం. మహాకవి తిక్కన పూర్వీకులు ఇక్కడ వుండేవారని, తిక్కన ఇంటిపేరు కొట్టరువు అని చరిత్రకారులు నిర్ధారించి చెప్పారు. తిక్కన నివాసానికి దగ్గరలో వుండి నేటికీ భక్తజన సందోహంతో కళకళలాడుతున్న అగస్తేశ్వర స్వామివారి ఆలయం ప్రాంతంలో లభించిన కొన్ని చారిత్రక ఆధారాలు ఈ విషయాన్ని నిర్ధారిస్తున్నాయి. తిక్కన వంశీకుల ఇలవేల్పు నల్ల శాణాంబ అని తెలుస్తోంది. అగస్తేశ్వరస్వామి ఆలయంలో ఏ ఉత్సవం జరిగినా ఊరేగింపులో తొలి కైంకర్యం తిక్కన ఇంటి దగ్గర జరిగేదట. తిక్కనకు నెల్లూరు సీమతో మేనమామ బంధుత్వం వుండేది. ఈ ఆధారంతోనే తిక్కన నెల్లూరు సీమకు చేరి మనుమసిద్ధి ప్రభువు వద్ద మంత్రిగా చేరారు. యుద్ధ విద్య, మంత్రాంగ లక్షణాలు కలిగిన కవి కనుకనే తిక్కన ఆంధ్రీకృత భారతంలో యుద్ధ వ్యూహాలు, సన్నివేశాలు చక్కగా కనిపిస్తాయి. రాజ్యతంత్రం, కవిత్వ తత్వం రెండూ వున్న ప్రతిభాశాలి కనుకనే తిక్కన నెల్లూరు మండలాధిపతి అయిన మదనగోపాల మనుమసిద్ధి దగ్గర మంత్రి, ఆస్థాన కవిగా వుండగలిగారు. కాకతీయ విభుడు రుద్రమదేవుడికి, మనుమసిద్ధికి అభిప్రాయ భేదం వచ్చినప్పుడు నేర్పుగా, మధ్యవర్తిగా వ్యవహరించారు. సామాజికంగా ఆనాడు శైవ, వైష్ణవ మతాల నడుమ వున్న వైరాన్ని హరిహరనాథ తత్వాన్ని భారతాంధ్రీకరణలో రుజువు చేసి సమాజంలో శాంతి (మిగతా 113వ పేజీలో)

# అభినయం అమోఘం-గాత్రం సుమధురం

(112వ పేజి తరువాయి)

తెలుగు నాట శిలాక్షరమ్మైపోయింది. విలక్షణమ్మైన గానంతో ప్రేక్షకులకు ఆరాధ్యదైవంగా నిలిచి ఖ్యాతి పొందిన నలుగురైదుగురు నటులలో అబ్బూరి మొదటి కోవకు చెందినవారు. తెలుగు నాటక రంగ చరిత్రలో అనతికాలంలోనే అశేషకీర్తిని పొందిన రంగమార్తాండ కపిలవాయి రామనాథ శాస్త్రి దారిలో నడిచి, అంతకన్నా సుస్థిరమ్మైన స్థానాన్ని పొందిన వరప్రసాదరావు కుటుంబీకులు కరణీకం చేయడానికి కృష్ణాజిల్లా పెనుమకూరుకు తరలివెళ్లడంతో బాల్యమంతా అక్కడే గడిచింది. అబ్బూరి ఏడుగురు సోదరులలో అందరికన్నా చిన్నవాడైన ఆదినారాయణ అప్పటికే లబ్ధప్రతిష్ఠుడైన నటుడు. ఆదినారాయణ బందరు డివిసుబ్బారావు కంపెనీలో పనిచేశారు. ఆదినారాయణ తనమిత్రులైన మల్లాది సూర్యనారాయణ, నందుల ఆంజనేయులతో కలిసి తెనాలిలో ఆంధ్రడ్రమెటిక్ కంపెనీని స్థాపించాడు. మల్లాది హరిశ్చంద్రునిగా, ఆదినారాయణ నక్షత్రకునిగా సత్యహరిశ్చంద్ర నాటకాన్ని విస్తృతంగా ప్రదర్శించారు. హేమాహేమీల వంటి నటుల మధ్యలో వశిష్టుని వంటి చిన్న పాత్రను పోషించినా ప్రేక్షకుల నుండి వన్స్‌మోర్‌ల రూపంలో విశేష స్పందన లభించేది.

ఆనతికాలంలోనే నటుడిగా గుర్తింపు పొందిన అబ్బూరిలో అంతర్లీనంగా దాగివున్న కళాకారుణ్ణి ఆ సంస్థకు హార్మోనిస్టుగా వున్న ఆంజనేయులు హరిశ్చంద్ర పాత్ర ఇచ్చారు. సంగీతంలోని ఎన్నో మర్యాదలనూ, మెళకువలను ఆయన నేర్పారు. హరిశ్చంద్ర పాత్రతో రాష్ట్రంలోని ముఖ్యమైన ప్రాంతాలలో అబ్బూరి పేరు పరిచయం జరిగింది. హరిశ్చంద్ర పాత్ర విజయవంతం కావటంతో శ్రీ కృష్ణుని పాత్రను తీసుకొని పూర్తిస్థాయి సమయాన్ని కేటాయించి సంగీతాన్ని నేర్చుకున్నారు. లయజ్ఞానం ఉన్న అబ్బూరి తన కంఠాన్ని రాగానికి అనుగుణంగా మలచుకున్నారు.

హరిశ్చంద్ర, శ్రీ కృష్ణుని పాత్రలను పోషించిన అబ్బూరి పండితుల దృష్టిలో శ్రీకృష్ణుని పాత్ర ఉన్నతమ్మైనవిగా నిలిచిపోయింది. బలిజేపల్లి లక్ష్మీకాంతం రచించిన సత్యహరిశ్చంద్ర నాటకంలో జాషువా రచించిన శ్మశాన స్థలి పద్యాలను చేర్చిన ఘనత అబ్బూరిదే. కరుణరసాన్ని వర్ణిస్తూ పాడిన జాషువా పద్యాలు ఆంధ్రదేశంలో మారుమోగిపోయాయి. హరిశ్చంద్ర పాత్రను ధీరోదాత్తునిగా మలచి గంభీరంగా, హృద్యంగా పద్యాలను ఆలపించడంతో ఆ పాత్రను ప్రాణప్రతిష్ఠ జరిగింది. 1944 నుండి సత్యహరిశ్చంద్ర, శ్రీ కృష్ణరాయబారం నాటకాలను వేలాది ప్రదర్శనలిచ్చారు.

సంగీతంలో తనదైన బాణీని సృష్టించిన ఆబ్బూరి అభినయంలో కూడా తన విలక్షణతను చూపారు. పౌరాణిక నాటకాలలో తోటి నటుడు నటిస్తున్న సమయంలో నటుడు తనకు సంబంధం లేనట్లుగా ప్రవర్తించడం పరిపాటి.కానీ అబ్బూరి తోటినటుని నటనకు అనుగుణమ్మైన రియాక్షన్స్ చూపేవారు. రంగస్థల మర్యాదలకు అధిక ప్రాధాన్యం ఇచ్చేవారు. పాత్రధారి ఏ స్థాయి నటుడైనా గౌరవించేవారు. సంవత్సరంలో పదినెలల కాలం విరామం లేకుండా నాటకాలను ప్రదర్శించేవారు. ఒకేరోజు వివిధ ప్రదేశాలలో నాటకాలలో నటించేంత బిజీగా అబ్బూరి నటించారు. తన సమకాలికులైన పేరు పొందిన నటులను గౌరవించి తన నాటకాలలో పాత్రలను ఇచ్చి పెద్దమొత్తంలో పారితోషికాన్ని సమర్పించేవారు.

అబ్బూరిని మద్రాసు కంపెనీ వారు ఆహ్వానించి సత్య హరిశ్చంద్ర, శ్రీ కృష్ణుని రాయబారంలోని ప్రధాన ఘట్టాలను రికార్డులుగా విడుదల చేశారు. దీనితో వాడవాడలా అబ్బూరి గొంతు మారుమోగింది. అబ్బూరి స్ఫూర్తితో ఎందరో నటులు హరిశ్చంద్ర పాత్రను నేర్చుకుని 'పిల్ల అబ్బూరులు' గా చలామణి అయ్యారు. రెండు చేతులా డబ్బు సంపాదించిన అబ్బూరి తన నటజీవితంలో మూడు వంతుల కాలం క్రమశిక్షణకు మారుపేరుగా నిలిచారు. అనూహ్యంగా దురభ్యాసాలవైపు మొగ్గు చూపిన అబ్బూరి పతనంవైపు అడుగులు వేశారు.

క్షయవ్యాధి సోకడంతో ఆరోగ్యం పూర్తిగా క్షీణించింది. మదనపల్లిలో చికిత్స పొందుతూ వ్యాధి ముదిరిపోవడంతో తెరమరుగైపోయారు. చివరిదశలో ఆర్థికంగా చితికిపోయారు. కొంత ఆరోగ్యం కుదుటబడ్డాక నాటకాలను తిరిగి ప్రదర్శించారు. అబ్బూరి సహాయార్థం అతని వల్ల లబ్ధిపొందిన నటులు, కాంట్రాక్టర్లు బెనిఫిట్ ప్రదర్శనలు ఏర్పాటు చేసి ఆర్థిక సహాయం అందించారు. దీనితో పుంజుకుని కొంత కాలం రంగస్థలంపై వీరవిహారం చేశారు. కానీ వ్యాధి తిరగబెట్టడంతో పరమపదించారు. దురలవాట్లు కళాకారుణ్ణి ఎంత పతనానికి దిగజారుస్తాయో అబ్బూరి జీవితం ఒక దర్పణం.

# తిక్కన మన గుంటూరువాడే!

(112వ పేజీ తరువాయి)

నెలకొనేందుకు కవిగా కంకణం కట్టుకున్నారు. నెల్లూరు మండలంలో కరణీకులుగా వున్న జైన మతస్తులు ఒక్కసారిగా విధులను బహిష్కరించినప్పుడు తన దగ్గర శిష్యులుగా వున్న వంద మందికి పరిపాలనా విధానంలో శిక్షణనిచ్చి ఆ వంద మందిచేత మరో ఆరువేల మందికి శిక్షణ నిప్పించి రాజ్య పాలన స్తంభించకుండా చేసిన పరిపాలనా దురంధరుడు తిక్కన.

## ఎలా వుండేవాడు

సుమతీ శతక కర్త బద్దెనకు గురువుగా, ఆంధ్ర సాహిత్య రంగం మీద, ఒక విశిష్టతను సంతరించుకున్న తిక్కన సోమయాజి రూపురేఖలు ఎలా వుండేవి అన్న ప్రశ్న తెలుగు పాఠకుడికి ఉదయించక తప్పదు. దీనికి సమాధానంగా కట్టమంచి రామలింగారెడ్డి తెలుగుజాతికి మహోపకారం చేశారనిపిస్తుంది. దశకుమార చరిత్ర ఆంధ్రకర్త తిక్కన రూపురేఖా విలాసాన్ని వర్ణించి చెప్పాడు. ఈ రూపురేఖా విలాసాన్ని చదివిన సి ఆర్ రెడ్డి భీమవరంలో గొప్ప చిత్రకారుడుగా పేరొందిన అంకాల సుబ్బారావును పిలిపించి కేతన వర్ణించిన విధానాన్ని వివరించి చెప్పాడు. ఈ వివరణ విన్న సుబ్బారావు తిక్కన రూపాన్ని చిత్రీకరించారు. ఆ చిత్రం రామలింగారెడ్డిని విశేషంగా ఆకట్టుకుంది. అలా తిక్కన రూపం తెలుగువారి కళ్ల ముందు మెదులుతుంది. తిక్కన కాలంనాటి గుంటూరు ఎలా వుండేది అని నేటి తరానికి కలిగే ఒక స్పందన పూర్వ సందేహం. ఈ సందేహ నివృత్తికి చారిత్రక ఆధారాలు దోహదం చేస్తున్నాయి. నోరి నరసింహ శాస్త్రి రచించిన రుద్రమదేవి, అడివి బాపిరాజు రచించిన హిమబిందు నవలలలో కథానుసారంగా ఇతర ప్రాంతాల నుంచి గుంటూరు వచ్చే మార్గాలు, గుంటూరులోని రహదారులు, సౌధాలు, చక్కగా చిత్రితమయ్యాయి. అవి ఆనాటి గుంటూరు మండలాన్ని మన కళ్ళకు కడతాయి.

# వేదాంతిగా మారిన వేషధారి

(ఆన్‌లైన్, చిలకలూరిపేట అర్బన్)

నటన ఒక సృజనాత్మక కళ. అడుగడుగునా నూతన తేజాన్ని సృష్టించి... సామాజికులను మెప్పించి.... రసానుభూతిని కలిగించి, ఏరోజుకారోజు సెహభాష్ అనిపించుకోవలసిన సజీవ కళ. నట జీవితానికి ఒక శరీర సౌష్టవమో, గాత్ర మాధుర్యమో, నటనాసామర్థ్యమో, వాచక పటిమయో, ఏ ఒక్కటో ఉంటే చాలదు. వీటి అన్నింటి యొక్క సమన్వయ శక్తిని కూడగట్టుకుని తన అంగిక, వాచక సాత్విక అభినయాల ద్వారా ప్రేక్షక లోకానికి తన్మయం కలగజేసినప్పుడే నటుడు నటరాజమూర్తి అయి భాసిల్లగలుగుతాడు. ప్రేక్షక హృదయ మాగాణాలలో తనదంటూ ఒక ప్రగాఢ ముద్రను ముద్రించగలుగుతాడు. రంగస్థలేతిహాసంలో తనకంటూ ప్రత్యేకంగా కొన్ని పేజీలు కేటాయింపచేసుకోగలుగుతాడు అనే నమ్మికతో నటనే హారంగా.... ఆహారంగా గల ధూళిపాళ నాటక, సినీరంగాలలో ఒక గొప్పనటుడిగా నిలిచిపోయారు. తెలుగు రంగస్థలాన్ని, వెండితెరను తేజోమయం చేసిన కళామూర్తులలో ఒకరైన ధూళిపాళ 1920 సెప్టెంబర్ 24న గుంటూరు జిల్లా దాచేపల్లిలో జన్మించారు.1935లో గుంటూరు సమీపంలో శిరంగిపాలెంలోప్రదర్శించిన శ్రీకృష్ణ తులాభారం నాటకంలోని నళిని పాత్ర ద్వారా రంగస్థల ప్రవేశం చేశారు. అనంతరం సవరం వీరాస్వామినాయుడు స్ఫూర్తి, శిష్యరికంలో నాటకరంగంలో పూర్తి పాదం మోపారు. శ్రీ కృష్ణ రాయబారంలో దుర్యోధనుని పాత్రను దాదాపు 20 సంవత్సరాల వయసు నుండి ధరించారు. 1949 లో ప్రభుత్వ ఆస్థాన కవి చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి సన్మాన సంఘం గుంటూరు ఎ.సి కళాశాలలో నిర్వహించిన పాండవోద్యోగ విజయాల నాటక పోటీలలో సుయోధనుని పాత్రను పోషించి ధూళిపాళ ఉత్తమ నటునిగా ఎంపికయ్యారు. ఆంధ్రనాటక కళాపరిషత్ నిర్వహించిన దుర్యోధన ఏక పాత్ర పోటీలలో ద్వితీయ బహుమతిని పొందారు. అప్పలాచార్యులు రచించిన లంకేశ్వర నాటకాన్ని విస్తృతంగాప్రదర్శించారు. మయసభ సన్నివేశాన్ని ప్రత్యేకంగా రూపొందించిన ధూళిపాళ దుర్యోధనునిగా అంధ్ర దేశంలో విశేషమైన ఖ్యాతి గడించారు.1940లో గుంటూరులో స్టార్ థియేటర్‌ను స్థాపించి మయసభ, పాండవోద్యోగ విజయాలు నాటకాలను రాష్ట్రంలో వందలాది ప్రదర్శనలిచ్చారు. కర్ణాటక, మహారాష్ట్ర, పశ్చిమ బెంగాల్, తమిళనాడులో విస్తృతంగా ప్రదర్శనలిచ్చారు.రోషనారలో రామసింహుని పాత్ర ధూళిపాళ నట జీవితాన్ని మలుపు తిప్పింది. మద్రాసు కృష్ణగాన సభలో ప్రదర్శించిన రోషనార నాటకాన్ని చూసిన ప్రముఖ సినీ దర్శకుడు బి.ఎ సుబ్బారావు ధూళిపాళను ప్రత్యేకంగా అభినందించారు. భీష్మచిత్రంలో దుర్యోధనుని పాత్రను ధూళిపాళ చేత ధరింపచేశారు. భీష్మలో దుర్యోధనుని పాత్రతో ధూళిపాళ అచిరకాలంలోనే మంచినటునిగా స్థిరపడి పోయారు. శ్రీకృష్ణార్జున యుద్ధం, పాండవవనవాసం,శ్రీకృష్ణ పాండవీయం వంటి మూడు వందల చిత్రాలలో నటించారు. యస్.వి.రంగారావు దర్శకత్వంలో నిర్మించిన బాంధవ్యాలు చిత్రంలో ధూళిపాళ ఉత్తమ నటునిగా రాష్ట్రప్రభుత్వ పురస్కారం పొందారు.



మల్లమాంబ,రాధ,విలాసవతి వంటి స్త్రీపాత్రలను అత్యద్భుతంగా ప్రదర్శించారు. చలనచిత్రరంగంలో ఎంతో పేరు ప్రఖ్యాతలు పొందినా కన్నతల్లి వంటి రంగస్థలాన్ని మాత్రం ఆయన మరవలేదు. మయసభ దృశ్యాన్ని పాండవోద్యోగాలు నాటకంతో జతచేసి ప్రదర్శించారు. ఆంధ్రప్రదేశ్ హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి అల్లాడి కుప్పుస్వామి ఆధ్వర్యంలో ధూళిపాళకు 'రంగస్థలరారాజు' నాటక అకాడమి నుండి నాటక కళాప్రపూర్ణ, మాజీ ముఖ్యమంత్రి టి. అంజయ్యచే కళాసరస్వతి, ఏలూరుప్రభాత్ థియేటర్ వారిచే రంగమార్తాండ బిరుదులను పొందారు. మద్రాసులోధూళిపాళ ఆర్ట్స్ అకాడమీ సంస్థను స్థాపించి తమిళనాడులో పలు నాటకాలను ప్రదర్శించారు. ఒంగోలు యన్.టి.ఆర్ కళా పరిషత్ జీవితకాల విశిష్ఠ పురస్కారాన్ని పొందారు. గుంటూరు మారుతీనగర్‌లో ఆంజనేయస్వామి దేవాలయాన్ని నిర్మించి అక్కడే స్థిరపడ్డారు.1999లో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ తొలి నంది నాటక పోటీలలో పద్య విభాగానికి న్యాయనిర్ణేతగా వ్యవహరించారు. 1999లో రాష్ట్రప్రభుత్వం యన్.టి.ఆర్ ఆత్మగౌరవ పురస్కారాన్ని పొందారు. తెలుగు విశ్వవిద్యాలయం వారి తెలుగు వెలుగులు పురస్కారాన్ని పొందారు. ప్రస్తుతం తురీయాశ్రమ జీవితం గడుపుతూ సన్యాసం స్వీకరించి మారుతీ సేవేంద్ర సరస్వతిగా పేరు పొందారు.

Quality Education within the reach of all :: Quality Education within the reach of all



# ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం

## దూరవిద్యాకేంద్రం, నాగార్జున నగర్ - 522 510 ఆం.ప్ర.



- ఆర్థిక, సామాజిక కుటుంబ పరిస్థితులు అనుకూలించక చదువు మధ్యలో ఆపివేసిన వారి కొరకు.
- చిన్న వయస్సులోనే కుటుంబ నిర్వహణ భారం పడి ఏదో ఒక వ్యాపకాన్ని ఎంచుకొన్న వారి కొరకు.
- వివాహం చేసుకొని తదుపరి చదువు ఆవశ్యకతను గుర్తించి అవకాశాలు కొరకు వెదికే మహిళల కొరకు.
- ఉద్యోగంలో చేరి ప్రమోషన్లకవసరమైన ఉన్నత విద్యార్హతలు సాధించాలనుకొనే వారి కొరకు.
- ఆర్థిక కారణాల రీత్యా కళాశాలలో చదువుకోలేని వారి కొరకు.
- ప్రభుత్వ, ప్రైవేటు సంస్థలలో పనిచేసే ఉపాధ్యాయులకు, ఇతర ఉద్యోగస్తులకు.
- వ్యాపార వ్యవహారాలు నిర్వహించుకొనే వారికి, స్వయం ఉపాధి కార్యక్రమాలు చేసుకొనేవారికి వయస్సు నిబంధనలు లేకుండా అందరికి అందుబాటులో ఉండే ఫీజులతో ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం దూరవిద్యా కేంద్రాన్నిస్థాపించి దిగువ కోర్సులను అందజేస్తుంది.

### P.G. COURSES

| CODE | COURSE NAME |
|---|---|
| 01 | M.Sc. (Botany) |
| 02 | M.Sc. (Zoology) |
| 03 | M.Sc. (Physics) |
| 04 | M.Sc. (Chemistry) |
| 05 | M.Sc. (Microbiology) |
| 06 | M.Sc. (Mathematics) |
| 07 | LL.M (Labour Laws) |
| 08. | LL.M (Constitutional Law and Administrative Law) |
| 09 | LL.M (Torts and Crimes) |
| 10 | LL.M (Corporate and Securities Law) |
| 11 | M.B.A. |
| 12 | M.Com. (Accountancy) |
| 13 | M.Com. (Banking) |
| 14 | M.A. (English) |
| 15 | M. A. (Telugu) |
| 16 | M.A. (Economics:with the option of "Economics of Industry") |
| 17 | M.A. (History) |
| 18 | M.A. (Political Science) |
| 19 | M.A. (Sociology) |
| 20. | M. A. (Economics : with the option of "Agricultural Economics and Rural Development") |
| 21 | M.A. Social Work |
| 22 | M.A. Psychology |
| 23 | M.H.R.M. |
| 24 | M.C.A. |
| 25 | M.H.M. (Master of Hotel Management) |
| 26 | M.Sc. (Applied Mathematics and Informatics) |
| 27 | M.Sc. (Applied Statistics and Informatics) |
| 28 | M.Sc. (IT) |
| 29 | M.A. (Journalism and Mass Communication) |

### M. Phil.

| | | | |
|---|---|---|---|
| 30 | English | 32 | Education |
| 31 | Telugu | 33 | Political Science |

### U.G. COURSES

| CODE | COURSE NAME |
|---|---|
| 40 | B.A. (Economics, History, Politics) |
| 41 | B.A. (Economics, Public Admn., Politics) |
| 42 | B.A. (Economics, Public Admn., Sociology) |
| 43 | B.A. (Economics, History, Sociology) |
| 44 | B.A. (Economics, Politics, Sociology) |
| 45 | B.A. (History, Politics, Sociology) |
| 46 | B.A. (Public Admn.,Politics, Sociology) |
| 47 | B.A. (Public Admn., Politics, History) |
| 48 | B.A. (Maths, Politics, Economics) |
| 49 | B.A. (Maths, English, History) |
| 50 | B.A. (Maths, Telugu, History) |
| 51 | B.A. (English, Economics, Public Admn.) |
| 52 | B.A. (English, Economics, Politics) |
| 53 | B.A. (English, History Politics) |
| 54 | B.A. (English, Politics, Public Admn.) |
| 55 | B.A. (English, History, Telugu) |
| 56 | B.A. (Telugu, History, Sociology) |
| 57 | B.A. (Telugu, History, Politics) |
| 58 | B.Com. (General) |
| 59 | B.Sc. (Botany, Zoology, Chemistry) |
| 60 | B.Sc. (Maths, Physics, Chemistry) |
| 61 | B.Sc. (Costume Design & Fashion Technology) |
| 62 | B.Sc. (Information Technology) |
| 63 | B.Sc. (Maths, Statistics, Computers) |
| 64 | B.B.M. |
| 65 | Bachelor of Hotel Management |
| 66 | B.A. (Maths, Economics, Statistics) |
| 67 | B.A. (Maths, Statistics & Computer Applications) |
| 68 | B.Com. (Computer Applications) |
| 69 | B.Com. (Marketing) |
| 70 | B.Com. (Foreign Trade) |
| 71 | B.Sc. (Maths, Physics, Electronics) |
| 72 | B.Sc. (Maths, Electronics, Computer Science) |
| 73 | B.Sc. (Maths, Physics, Computer Science) |

### B. Tech.

| | | | |
|---|---|---|---|
| 34 | Civil | 37 | EC |
| 35 | Mechanical | 38 | Computer Science |
| 36 | EEE | 39 | IT |

### CERTIFICATE / DIPLOMA / PG DIPLOMA / ONE YEAR COURSES

| Code | Course Name |
|---|---|
| 76. | Certificate Course in Consumer Awarenes |
| 77 | Certificate Course in HIV/AIDS Counseling |
| 78 | Certificate Course in Grief Counseling |
| 79 | Diploma in Consumer Awareness |
| 80 | B.L.I.Sc. (Bachelor of Library & Information Science) |
| 81 | PGDBI (PG Diploma in Bioinformatics) |
| 82 | PGDBT (PG Diploma in Biotechnology) |
| 83 | PGDHHM (PG Diploma in Hospital & Health Care Management) |
| 84 | PGDBM (PG Diploma in Business Management) |
| 85 | PGDMM (PG Diploma in Marketing Management) |
| 86 | PGDHRM (PG Diploma in Human Resource Management) |
| 87 | PGDFM (PG Diploma in Financial Management) |
| 88 | PGBFM (PG Diploma in Banking and Financial Management) |
| 89 | PGDIB (PG Diploma in International Business) |
| 90 | PGDTTM (PG Diploma in Travel and Tourism Management) |
| 91 | PGDIM (PG Diploma in Insurance Management) |
| 92 | PG Diploma in Hotel Management |
| 94 | PG Diploma in Journalism and Mass Communication |
| 95 | PGDCA |
| 96 | PG Diploma in Information Technology |
| 97 | PG Diploma in Network Administration |

**SPECIAL FEATURES : Poineer in starting PG and UG Science Courses under the distance mode. • Admissions are made twice a year i.e., Academic year Batch (July to June), Calendar Year Batch (January to December). • Examinations are held twice a year in May and December. • Supplementary examination and betterment facility to the CDE students. • Weekend Classes / Practicals through Study Centres of Student's Choice. • Wide network of Examination Centres for the convenience of the students. • No upper age limit for admission into any of the courses Candidates studying other courses on regular basis are also eligible for admission into any one of the courses offered by the CDE, TC and MC need not be submitted.**

## DIRECTOR, CENTRE FOR DISTANCE EDUCATION, ACHARYA NAGARJUNA UNIVERSITY

**Nagarjuna Nagar - 522 510, Guntur A.P. Ph : 0863-2293299, 2293356, 2293189 - Ext.180; Cell : 98482 85518**

website : www.nagarjunauniversity.ac.in; e-mail:cde@nagarjunauniversity.ac.in, anucde@yahoo.com, anucde@hotmail.com

Quality Education within the reach of all :: Quality Education within the reach of all

Quality Education within the reach of all :: Quality Education within the reach of all

Quality Education within the reach of all :: Quality Education within the reach of all


కంప్యూటర్ సెంటర్‌లో ఇంటర్నెట్ నేర్చుకుంటున్న విద్యార్థులు


చిలువూరులో ఇంటర్నెట్ కోసం ఏర్పాటు చేసిన ఏరియల్

# చిలువూరు ముంగిట సాంకేతిక విప్లవం

(దుగ్గిరాల, ఆన్‌లైన్)

జిల్లాలోని దుగ్గిరాల మండలం చిలువూరు గ్రామం దేశంలో తొలి ఇంటర్నెట్ విలేజ్‌గా ప్రసిద్ధి కెక్కింది. ప్రవాస భారతీయుడు కాట్రగడ్డ కృష్ణప్రసాద్, తను జన్మించిన చిలువూరు గ్రామానికి ఆధునిక పరిజ్ఞానాన్ని అందించడం ద్వారా గ్రామంలో ఇ-గవర్నెన్స్, ఇంటర్నెట్ సౌకర్యాల కోసం విశేష కృషి చేశారు.అభివృద్ధి చెందిన దేశాలలో సాంకేతిక విజ్ఞానం భారతదేశంలోని గ్రామీణ ప్రాంతంలో వారికి కూడా అందించాలన్న అశయంతో ఇంటర్నెట్ విలేజ్ ఏర్పాటుకు శ్రీకారం చుట్టారు.

2004 ఆగస్టు 20న రాష్ట్ర ముఖ్యమంత్రి డాక్టర్ వైఎస్ రాజశేఖర్‌రెడ్డి హైదరాబాద్ నుంచి రిమోట్ ద్వారా ఇంటర్నెట్ విలేజ్‌కు ప్రారంభోత్సవం జరిపారు. గ్రామీణ ప్రాంతాల్లోని విద్యార్థులకు, రైతులకు అవసరమైన సమాచారన్ని కంప్యూటర్‌లో భద్రపరిచి, ప్రజలకు అవసరమైన పలు సర్టిఫికెట్లను కూడా నేరుగా ఇంటర్నెట్ లేదా కంప్యూటర్ ద్వారా అందించేందుకు ఇక్కడ సాంకేతిక పరికరాలను ఏర్పాటు చేశారు. గ్రామంలోని వందలాది మంది విద్యార్థులు కంప్యూటర్ శిక్షణ పొంది పలు సంస్థలలో ఉపాధి పొందుతున్నారు. ప్రభుత్వం పథకాల్లైన రాజీవ్ గృహ కల్ప పథకానికి సంబంధించిన కంప్యూటరైజేషన్ ప్రక్రియను పూర్తిగా చేసేందుకు ఇక్కడ శిక్షణ పొందిన వారిని ఎంపిక చేసింది. రేషన్ కార్డుల జారీకి సంబంధించి డిపిఎల్ సెంటర్‌లలోను పలువురు ఎంపికైన విద్యార్థులు పనిచేస్తూ ఉపాధి పొందుతున్నారు. నేటికీ పరిసర గ్రామాల్లోని వారు చిలువూరులో కంప్యూటర్ శిక్షణ పొందడం జరుగుతోంది. నెట్‌వర్క్ కెమెరాతో పంట పొలాలకు ఆశించిన తెగుళ్ళు, తదితర అంశాలను గుర్తించి సిడిలను రూపొందించి, రైతులు వారి అవసరమైన సూచనలు పొందేందుకు అవకాశం కలుగజేశారు. ఇక్కడ ఉన్న ఐరిష్ కెమెరాలు కంటి పాపను ఉపయోగించి సంక్షేమ పథకాలు దుర్వినియోగం కాకుండా చేసే అవకాశం కలుగుతుంది. వృద్ధాప్య ఫించన్లు, స్కాలర్ షిప్‌లు, రేషన్ కార్డుల వంటివి ఒకసారి పొందిన వారు మరలా పొందకుండా జాగ్రత్త వహించే అవకాశం ఐరిష్ కెమెరా ద్వారా కలుగుతుంది. వైర్‌లెస్ నెట్‌వర్క్ ద్వారా జిల్లా కేంద్రాన్ని గ్రామంతో అనుసంధానం చేయటం ద్వారా త్వరితగతిన సేవలు వినియోగించుకునే అవకాశం కలుగుతుంది. వీడియో కాన్ఫరెన్స్ నెట్‌వర్క్ ఏర్పాటు కూడా ఇంటర్నెట్ విలేజ్‌లో ఉంది. ఎల్‌సిడి ప్రొజెక్టర్ వర్కర్ ద్వారా కంప్యూటర్, మానిటర్ అవసరం లేకుండా వందలాది మంది 16 ఎంఎం తెరపై గ్రామస్థులకు వివిధ సేవలను గురించిన సమాచారం ఒకేసారి అందించగలుగుతుంది. విద్యుత్ సరఫరా లేని సమయాల్లో కంప్యూటర్ సేవలు వినియోగించుకునేందుకు యుపిఎస్‌లు ఏర్పాటు కూడా ఉంది. విద్యార్థులకు అవసరమైన విద్యా పద్ధతులు అజీమ్ ప్రేమ్‌జీ ఫౌండేషన్ సిడిల ద్వారా అందజేస్తుంది. (మిగతా 117పేజీలో)

# చిలువూరు ముంగిట సాంకేతిక విప్లవం

(116వ పేజీ తరువాయి)

వైద్యరంగంలో ఆధునిక ట్రైనిల్ విధానాల ద్వారా అభివృద్ధి చేసిన ప్యాకేజిల ద్వారా పల్లె ప్రజలు పట్టణంలో మాదిరిగానే టెలి మెడిసిన్ ద్వారా వైద్య సదుపాయాలు



గ్రామంలో ఏర్పాటైన భారీ సిమెంట్ రోడ్డు

వివరాలు తెలుసుకునేందుకు కూడా ఉంది. కంప్యూటర్ ల్యాబ్ లోను, హైస్కూల్‌లోను 60 కంప్యూటర్ల ద్వారా విద్యార్థులు, యువతీ, యువకులతో పాటు గృహిణులు సైతం కంప్యూటర్ శిక్షణకు ఆసక్తిగా రావడం విశేషం. చిలువూరు గ్రామంలో పండే సపోటాలు రాష్ట్రంలో వేడిని కలిగి ఉన్న విజయవాడ, హైదరాబాద్, వైజాగ్, గుంటూరు వంటి నగరాలకు వేలాది బస్తాలు తరలివెళ్తుంటాయి. 600 ఎకరాల్లో గ్రామస్థులు సపోటాలు పండిస్తున్నారు. వివిధ మార్కెట్ల సపోట ధరలు ఎప్పటికప్పుడు ఇంటర్నెట్ ద్వారా తెలుసుకుని రైతులు ధరపై నిర్ణయం తీసుకునే వీలుకలుగుతుంది.



కంప్యూటర్ పరిజ్ఞానంపై ప్రశ్నలు అడిగితెలుసుకుంటున్న కాట్రగడ్డ కృష్ణప్రసాద్

చిలువూరు గ్రామంలో గుండా ఏడు మీటర్ల వెడల్పుతో 2.6 కి.మీ పొడవున నిర్మించిన సిమెంట్, తారు రోడ్లు నగరాన్ని తలపిస్తున్నాయంటే అతిశయోక్తి కాదేమో. కోటి రూపాయలతో నిర్మించిన ఈ రోడ్డు నిర్మాణంలో దశాబ్దాల నుండి తాము ఎదుర్కొంటున్న ఇబ్బందులు తొలగిపోతాయని గ్రామస్థులు హర్షం వ్యక్తంచేస్తున్నారు. రోడ్డు విస్తరణకు అవసరమైన లక్షలాది రూపాయల విలువైన స్థలానికి నష్టపరిహారాన్ని కాట్రగడ్డ చారిటీస్ అందించింది. అభివృద్ధి అంటే చిలువూరు గ్రామమే అన్న రీతిగా ఎన్ఆర్ఐల సహకారంతో రూపుదిద్దుకుంది.

# నాటక పరిషత్‌ల నిర్వహణలో
# గుంటూరు జిల్లా ప్రథమం

(ఆన్‌లైన్, చిలకలూరిపేట టౌన్)

ఇల్లు కట్టి చూడు... పెళ్లి చేసి చూడు అన్నది పాత సామెత. నాటకం ఆడిచూడు.. ఆడించి చూడు అన్నది ఆధునిక సామెత. వెండితెర, బుల్లితెర హోరులో రెపరెపలాడుతున్న నాటక కళాజ్యోతికి చేతులు అడ్డుపెట్టి జ్వాజ్వల్యమానంగా ప్రకాశింపచేయడానికి కృషి చేస్తున్న ఘనత నాటక కళాపరిషత్‌లకు దక్కుతుంది. దాదాపుగా ఆంధ్ర దేశంలో మాత్రమే జరుగుతున్న నాటక పరిషత్‌ల నిర్వహణలో గుంటూరు జిల్లా ప్రథమస్థానంలో నిలిచింది.

## సత్యహరిశ్చంద్ర నాటక పోటీలు

1916లో గుంటూరులో సత్యహరిశ్చంద్ర నాటక పోటీలు జరిగాయి. ఈ పోటీలలో బలిజేపల్లి లక్ష్మీకాంత కవి రచించిన సత్యహరిశ్చంద్ర నాటకాన్ని ప్రదర్శించాలని నియమం విధించారు. ఈ పోటీలకు అప్పటికే హరిశ్చంద్ర పాత్రలో సుప్రసిద్ధుడైన హరిప్రసాదరావు న్యాయనిర్ణేతగా వ్యవహరించారు. ఈ పోటీలలో బందరు నుంచి డి.వి.సుబ్బారావు ప్రదర్శించిన హరిశ్చంద్ర నాటకానికి ప్రథమ బహుమతితో పాటు హరిశ్చంద్రపాత్రను పోషించిన డి.వి.సుబ్బారావుకు ఉత్తమ నటన బహుమతులు లభించాయి.

## గయోపాఖ్యానం నాటక పోటీలు

1924లో తెనాలిలో గయోపాఖ్యానం నాటక పోటీలు జరిగాయి. ఈ పోటీలకు న్యాయనిర్ణేతలుగా తిరుపతి వెంకటకవులు, కొప్పరపు కవులు, శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి వ్యవహరించారు. ఈ పోటీలలో ఉత్తమ నటుడుగా లంకా సత్యనారాయణ బహుమతి పొందారు.

## ఆంధ్రనాటక కళాపరిషత్

ఆంధ్రనాటకరరంగ అభివృద్ధికి తెనాలి పట్టణంలో ఒక సమావేశాన్ని ఏర్పాటు చేసిన సురభి నాటక పితామహుడై వనారస గోవిందరావు ఆంధ్రదేశంలోని కవులు, కళాకారులు, విమర్శకులను అహ్వానించారు.

1929 జూన్ 19తేదీ ఉదయం గం.8-30 ని.లకు తెనాలిలో నిర్మించబడిన గోవిందరాయ నాట్యమందిరంలో 'సమావేశం ప్రారంభమైంది. ఆంధ్రనాటక కళాపరిషత్తు అనే సంస్థను ఈ సమావేశాలలో ప్రారంభించారు. సాంఘిక నాటక, నాటికలను మాత్రమే పోటీలలో ప్రదర్శించాలని ఏ సమాజానికి ఇష్టమైన నాటికను లేదా నాటకాన్ని ప్రదర్శించవచ్చని స్త్రీ పాత్రలను స్త్రీలే ధరించాలని పోటీలలో ప్రదర్శించిన నాటకం, లేదా నాటిక తిరిగి దరఖాస్తు చేయరాదని నిబంధనావళిని రూపొందించింది.

## ప్రగతి కళామండలి

సత్తెనపల్లి ప్రగతి కళామండలి సంస్థ 1974లో రజితోత్సవాలను నిర్వహించిన సందర్భంలో రాష్ట్రస్థాయి నాటక పోటీల నిర్వహణను ప్రారంభించింది. గత 31 సంవత్సరాల నుంచి క్రమం తప్పకుండా రాష్ట్రస్థాయి నాటిక పోటీలను నిర్వహించింది. ఈ పోటీలను ప్రస్తుతం నూతలపాటి సాంబయ్య నిర్వహిస్తున్నారు.




నరసరావుపేట రంగస్థలి లోగో

## కళావాహిని

గుంటూరు జిల్లా మురికిపూడిలో కందిమళ్ల కమలనాభుడు 1972లో ఈ సంస్థను నెలకొల్పారు. 1975లో తొలి సారిగా నాటిక పోటీలను నిర్వహించింది. 1979లో నాటక పోటీలను నిర్వహించారు.

## పొన్నూరు కళాపరిషత్

2000 సంవత్సరంలో పొన్నూరు కళాపరిషత్ స్థాపించబడింది. నాటక పోటీలతో పాటు తెలుగు సంస్కృతిని పరిరక్షించడానికి ఉగాది కవి సమ్మేళనం, అష్టావధానం, మూకాభినయం,మిమిక్రి, శాస్త్రీయ నృత్య పోటీలు, లలితసంగీతం పోటీలను ప్రతినెలా నిర్వహించడం విశేషం. ఈ పరిషత్తు వ్యవస్థాపకులు యస్.ఆంజనేయులు నాయుడు.

## కళాసదస్సు

చిలకలూరిపేటకు చెందిన కందిమళ్ల నారాయణమూర్తి, ప్రజానటుడు సి ఆర్ మోహన్, గుంటూరులో ఈ సంస్థను స్థాపించారు. 1971 నుంచి చిలకలూరిపేటలో నాటక పోటీలను నిర్వహించారు. రాష్ట్రంలో అప్పటివరకూ పరిషత్తులో పాల్గొన్న సమాజాలు తమ స్వంతఖర్చులతోనే నాటకాలను ప్రదర్శించే వారు. గెద్దనాపల్లిలో పంతం పద్మనాభం కళాపరిషత్ , చిలకలూరిపేటలోకళాసదస్సు తొలిసారిగా పరిషత్‌లో ప్రదర్శించే ప్రతి సమాజానికీ ప్రదర్శనా పారితోషకంతో పాటు విజేతలకు నగదు బహుమతులను ప్రదానం చేసే విధానాన్ని ప్రారంభించారు.

(మిగతా 119వ పేజీలో)

# నాటక పరిషత్‌ల నిర్వహణలో గుంటూరు జిల్లా ప్రథమం

( 118వ పేజీ తరువాయి)

### డాక్టర్ కాసరనేని సదాశివరావు కళాపరిషత్

గుంటూరు జిల్లా తక్కెళ్లపాడు గ్రామంలో 2002లో ఈ పరిషత్‌ను స్థాపించారు. ఈ పరిషత్‌లో పాల్గొనే కళాకారులకు అందించే ఆతిధ్యం మరువలేని విధంగా ఉంటుంది. మోపర్తి సదాశివరావు, కాళిదాసు, చిగురుపాటి రామకృష్ణ, యడపల్లి నాగమల్లేశ్వరరావు, తాడికొండ సుబ్బారావు ఈ పరిషత్ నిర్వాహకులు.

### కోన ప్రభాకరరావు మెమోరియల్

కోన ప్రభాకరరావు స్మృత్యర్థం వారి కుటుంబసభ్యులు ఏర్పాటు చేసిన ట్రస్ట్ ద్వారా నాటిక పోటీలను నిర్వహిస్తున్నారు. 1995లో స్థాపించిన ఈ పరిషత్ మొదటి రెండు సంవత్సరాలు హైదరాబాదులో నిర్వహించారు. గత ఎనిమిది సంవత్సరాలుగా కోన స్వస్థలమైన బాపట్లలో నిర్వహిస్తున్నారు. కోన ప్రభాకరరావు ట్రస్ట్ ఆధ్వర్యంలో దాదాపు రు.30లక్షలతో చక్కని ఆడిటోరియాన్ని బాపట్లలో నిర్వహించారు. కోన హేమచంద్, కోన గోవిందరావు, కెయస్‌టి శాయి, ఊట్ల బుడ్డయ్య చౌదరి వంటి వారు ఈ పరిషత్ నిర్వాహకులు.

### దొడ్డపనేని ఇందిర కళాపరిషత్

ప్రముఖ నిర్వాహకుడైన వేమూరి విజయభాస్కర్ ఈ పరిషత్‌ను తెనాలిలో 1987లో ప్రారంభించారు. దొడ్డపనేని ఇందిర స్మారకార్థం పలు సంవత్సరాలు నాటిక పోటీలను నిర్వహించారు.

### టి. కృష్ణమెమోరియల్ కళాపరిషత్

టి.కృష్ణ పేరుతో 1991 నుంచి 2001 వరకూ దండా గోపి చిలకలూరిపేటకు సమీపంలో మిట్టపాలెంలో రాష్ట్ర స్థాయి నాటిక పోటీలను నిర్వహించారు. నాటిక పోటీల సందర్భంగా నాటకరంగంలో విశేషమైన కృషి చేసిన వారికి కృష్ణచైతన్య కళాపురస్కారాన్ని ప్రదానం చేశారు. ఈ సంస్థ ఆధ్వర్యంలో మిట్టపాలెంలో ఓపెన్ ఎయిర్ ఆడిటోరియాన్ని నిర్మించారు.

### ఎల్‌విఆర్ కళాపరిషత్

గుంటూరు ఎల్‌విఆర్ అండ్ సన్స్ క్లబ్ రీడింగ్ రూమ్ 1998లో ఎల్‌విఆర్ కళాపరిషత్‌ను స్థాపించారు. సుప్రసిద్ధ రంగస్థల సినీనటులు మురళీమోహన్ ఈ పరిషత్‌ను ప్రారంభించారు. సాంకేతిక నిపుణులకు క్యాట్‌కార్డులు ఈ పరిషత్ బహూకరించింది.

### విశ్వశాంతి కళానికేతన్ నాటక పరిషత్

గుంటూరు జిల్లా వినుకొండలో 1994నుంచి ఈ పరిషత్‌ను నిర్వహిస్తున్నారు. రంగస్థల నటులకు ఎన్‌టిఆర్ పురస్కారాన్ని,రచయితలకు జాషువా పురస్కారాన్ని, ప్రజా కళాకారులకు పులుపుల శివయ్య పురస్కారాన్ని ప్రదానం చేస్తున్నారు. (మిగతా 120 వ పేజీలో)

# నాటక పరిషత్‌ల నిర్వహణలో గుంటూరు జిల్లా ప్రథమం

(119వ పేజీ తరువాయి)

### యువజన సమాఖ్య

గుంటూరు జిల్లా సాతులూరులో 1980 లో నార్నె గోపాలరావు ఈ సంస్థను ప్రారంభించారు. పది పర్యాయాలు ఈ పరిషత్ ద్వారా రాష్ట్రస్థాయి నాటికల పోటీలను నిర్వహించారు. ఈ సంస్థ సాతులూరు గ్రామంలో ఓపెన్ ఎయిర్ ఆడిటోరియంను నిర్మించింది.

### కొండవీడు కళాపరిషత్

గుంటూరు జిల్లా యడ్లపాడుకు సమీపంలో లింగారావుపాలెంలో ఈ సంస్థను 1996 ప్రాంతంలో స్థాపించారు. ఈ సంస్థ రాష్ట్రస్థాయిలో నాటిక పోటీలను నిర్వహించడమే కాకుండా సినీ రచయిత పోసాని కృష్ణమురళి సహకారంతో ఓపెన్ ఎయిర్ ఆడిటోరియంను నిర్మించింది.

### జంపని రామయోగి స్మారక కళాపరిషత్

చిలకలూరిపేటకు సమీపంలోని తాతపూడి గ్రామంలో జంపని వెంకటరాయుడు, హనుమంతరావు సోదరులు 1977లో ఈ పరిషత్తును స్థాపించారు. పరిషత్తులో పాల్గొన్న నాటికల మధ్య జరిగిన పోటీ బహుశా ఆంధ్రదేశంలోని ఏ పరిషత్తులో జరగలేదని కళాకారులు ఇప్పటికీ చెప్పుకుంటారు.

### గడగొట్టు మోహనకృష్ణ, నన్నపనేని వెంకటరత్నం కళాపరిషత్

సోమేపల్లి వెంకటసుబ్బయ్య, శ్రీనివాసరావు సోదరులు తాతపూడి గ్రామంలో ఈ సంస్థను ప్రారంభించారు. ఈ పరిషత్తుకు ప్రముఖ నటుడు, దర్శకుడు ఐ.రాజ్‌కుమార్ సలహాదారునిగా వ్యవహరించారు. ఈ పరిషత్తు ఆధ్వర్యంలో ఓపెన్ ఎయిర్ థియేటర్ నిర్మించారు.

### కాకతీయ కళాపరిషత్

ఒక గ్రామంలో ప్రజలందరూ సమిష్టి పండుగగా నిర్వహించే సంప్రదాయాన్ని ప్రవేశపెట్టిన ఘనత కాకతీయ కళాపరిషత్‌కు దక్కుతుంది. చిలకలూరిపేటకు సమీపంలో నాగభైరువారిపాలెంలో 1985లో ఈ పరిషత్‌ను ప్రారంభించారు. తెలుగు విశ్వవిద్యాలయ వైస్‌ఛాన్సలర్ ఆచార్య తూమాటి దోణప్ప విశ్వవిద్యాలయ కోస్తా ప్రాంత నాటక పోటీల నిర్వహణను ఈ సంస్థకు అప్పగించారు. ఈ సంస్థ 18 సంవత్సరాలపాటు నిర్విరామంగా నాటక నాటిక పోటీలను నిర్వహించింది.



కాకతీయ కళాపరిషత్ లోగో

### గుంటూరు కళాపరిషత్

గుంటూరు పట్టణంలో స్థాపించిన సంస్థ గుంటూరు కళాపరిషత్. అనుకున్న సమయానికే ప్రదర్శనలు ప్రారంభించడం అనే అంశాన్ని తూ.చ. తప్పకుండా పాటించింది. నాటకం కోసం నడక అంటూ పాదయాత్రలను నిర్వహించింది. ప్రతి సంవత్సరం ఏప్రిల్ 16న జరిగే తెలుగు నాటక రంగ దినోత్సవాన్ని పురస్కరించుకొని నాటకం, జానపద కళల వికాసానికి కృషి చేసిన పలువురిపి సత్కరిస్తోంది.

### ఇతర పరిషత్‌లు

తెనాలిలో తెనాలి నాటక పరిషత్, రసమయి డాక్టర్ అంబేద్కర్ కళాపరిషత్ బాపట్లలో సింగరాజు నాగభూషణం కళాపరిషత్, కళ్యాణం రఘురామయ్య కళాపరిషత్, బళ్లారి రాఘవ కళాపరిషత్, చిలకలూరిపేటలో సి ఆర్‌క్లబ్ కళాపరిషత్, కళాంజలి పరిషత్, శాంతి నికేతన్ పరిషత్ (బొప్పూడి), నరసరావుపేట నాటక కళాపరిషత్(నర్సరావుపేట), నవయువత, చెన్నకేశవ కళాపరిషత్ (మాచర్ల), ఉషోదయ కళాపరిషత్(సత్తెనపల్లి), సాగర్‌మాత నాటక పరిషత్ (రెంటచింతల),యన్‌టి ఆర్. కళాపరిషత్(పెదకంచర్ల), డైక్ మెన్‌కళాపరిషత్(ఫిరంగిపురం), నేతాజీ యూ త్‌క్లబ్(పెదవడ్లమూడి), పెదనందిపాడుకళాపరిషత్(పెదనందిపాడు), కర్షకకళాపరిషత్(గణేశునివారిపాలెం), టి.కృష్ణకళాపరిషత్ (మిట్టపాలెం),రాజీవ్‌గాంధీ కళాపరిషత్, కమలనాభుడు కళాపరిషత్ (మురికిపూడి), యువజన సంఘం (మంగళగిరి), చేతన కళానికేతన్(కట్రపాడు), అప్పాజోస్యులు విష్ణుభొట్ల ఫౌండేషన్ నాటిక పోటీలు (గుంటూరు, తెనాలి) ఆన వేమా నాటక పరిషత్, ఆంధ్ర విజ్ఞాన లలిత కళాపరిషత్, కళాసాధ(గుంటూరు)వంటివి జిల్లా వ్యాప్తంగా జరిగాయి.

# సరస్వతీపుత్రుడు... సంభాషణా విరించి

# సముద్రాల జూనియర్



చిత్తూరితో సముద్రాల



సముద్రాల జూనియర్

(ఆన్‌లైన్, చిలకలూరిపేట అర్బన్)

ఇంటిపేరు సముద్రాల. తెలుగు చలనచిత్ర పరిశ్రమలో నిజంగా సముద్రమంత గంభీరత్వాన్ని, విశాలత్వాన్ని కలిగినవారు సముద్రాల. సముద్రాల వేంకట రాఘవాచార్య తెలుగు సినీరంగంలో పాటల, మాటల రచయితగా వీరవిహారం చేశారు. అనంతరం వారి కుమారులు రామానుజాచార్యులు కూడా సినిమా రచయిత అయ్యారు. తండ్రి సముద్రాల సీనియర్‌గా కొడుకు సముద్రాల జూనియర్ పిలువబడ్డారు. గుంటూరు జిల్లా రేపల్లెకు సమీపంలోని పెద్దపులివర్రు గ్రామంలో 1923 ఏప్రిల్ 15న జన్మించిన సముద్రాల జూనియర్ ఎన్టిరామారావు నిర్మించిన తోడుదొంగలు చిత్రంతో సినీరంగప్రవేశం చేశారు. ఎన్టిఆర్ నటించిన దాదాపు 30 చిత్రాలకు సముద్రాలు జూనియర్ మాటల రచయితగా పనిచేశారు.

ప్రకృతి వైపరీత్యాలు సంభవించిన సందర్భంలో పోలీసు సంక్షేమనిధి, వీరజవానులు సంక్షేమనిధి కోసం ఎన్.టి.ఆర్ ఆదేశంపై ఈ మూడు నాటికలను రచించారు. ఈ నాటికలను ఒక విధంగా సినిమా నాటికలు అనవచ్చు. వ్రాసిన వారు సుప్రసిద్ధ సినీ రచయిత. వ్రాయించుకొన్నవారు సుప్రసిద్ధ సినిమా దర్శక నిర్మాత మహానటుడు, నటించిన వారందరూ అభిమాన సినిమా నటులు. మామూలు నాటకాలలాగా ఇందులో పునరుక్తి, పులుముడూ ఎక్కడా ఉండదు.

## శ్రీకృష్ణతులాభారం

నందితిమ్మన రచించిన పారిజాతాపహరణం ప్రబంధం ఆధారంగా ఎన్నో కథలూ, నాటకాలూ వెలువడ్డాయి. సురభి వారి పుణ్యమా అని నాటకంగా వాడవాడలా ప్రదర్శింపబడి తెలుగువారికి ఎంతో ఆత్మీయమైన ఇతివృత్తంగా నిలిచిపోయింది. అప్పటికే ఎన్.టి.రామారావు కృష్ణపాత్రలో ప్రజలకు ఆరాధ్యదైవంగా నిలిచిపోయారు. శ్రీకృష్ణతులాభారం పేరుతో నిర్మించిన సినిమా ద్వారా ఈ కథను రసరమ్యంగా తెలుగువారికి అందించారు. తెలుగువారికే కాక తనకు కూడా వ్యక్తిగతంగా ఇష్టమైన కథను సముద్రాల జూనియర్ చేత నాటికగా రాయించారు. ఇందులోని ఇతివృత్తం తెలుగువారికి సుపరిచితమైనది. నారదుడు పారిజాతపుష్పాన్ని కృష్ణునికి ఇచ్చి ఇష్టసఖికి బహూకరించమని అంటాడు. రుక్మిణి ఇంట ఉన్న కృష్ణుడు ఆ పుష్పాన్ని రుక్మిణికి ఇస్తాడు. ఈ విషయాన్ని చెలికత్తె ద్వారా తెలుసుకొన్న సత్యభామ వేటుపడ్డ కోడెతాచు లాగా లేచి అలకమందిరంలో శయనిస్తుంది. నీవు కోరిన పారిజాత వృక్షమునే తెచ్చి నీ పెరటిలో నాటెదనని కృష్ణుడు అభయమిస్తాడు. సత్య తన ప్రాణనాథుని నారదునికి దానం ఇస్తుంది. భర్తను తిరిగి పొందుటకు సరిపడు ఆభరణములు తూసి ఇవ్వమని నారదుడు అంటాడు. సత్యభామకు గర్వభంగం అవుతుంది. రుక్మిణి భక్తితో సమర్పించిన తులసీదళానికి కృష్ణుడు తూగుతాడు. రుక్మిణి పవిత్రప్రేమకు సత్య తల ఒగ్గుతుంది. ఈ ఇతివృత్తంలో 1969 లో గోదావరి వరదలు వచ్చినప్పుడు సముద్రాలు ఈ నాటకాన్ని రచించారు.తొలి ప్రదర్శన 1969 జులై 15న ప్రదర్శించారు. సైక్లోన్ రిలీఫ్ పేరుతో ఆరు లక్షల నిధులను సేకరించి ప్రభుత్వానికి సమర్పించారు. ఈ నాటకంలో కృష్ణునిగా ఎన్.టి రామారావు, సత్యభామగా సావిత్రి, రుక్మిణిగా దేవిక, నారదునిగా కాంతారావు,వసంతునిగా పద్మనాభం, జాంబవతిగా అనిత, నళినిగా సుమతి నటించారు. 1977 దివిసీమ ఉప్పెన సందర్భంగా కూడా ప్రజలను ఆదుకోవడానికి చలనచిత్ర పరిశ్రమ ఎన్.టి.రామారావు ఆధ్వర్యంలో ఈ నాటికను ప్రదర్శించింది. ఈ ప్రదర్శనలో కృష్ణునిగా ఎన్.టి.రామారావు, సత్యభామగా జమున, రుక్మిణిగా జయప్రద, జాంబవతిగా దీప, నళినిగా విజయభాను, నారదునిగా కాంతారావు నటించారు. ఈ నాటకాన్ని ఆ సమయంలో రాష్ట్రంలోని పలు ప్రాంతా లలో ప్రదర్శించారు.

## పోలీసు రామన్న

సమాజ శ్రేయస్సును, నైతిక విలువలను కాపాడుతూ ప్రజలకు అండదండలుగా నిలవవలసిన బాధ్యత గల వ్యక్తి పోలీసు. మంచీచెడూ మానవులలో ఎప్పుడూ ఉంటాయి. నీతి, అవినీతి మధ్య సతమతమయ్యే సాంఘిక జీవనంలో అవినీతికే ప్రాధాన్యమిస్తున్న ఈ రోజుల్లో నిజాయితీగా బతికేవారిని ఈ సంఘం బతకనివ్వదు. ఆకర్షణలకు బానిసలు కాకుండా ఆదర్శంగా బతకాలనుకొని ఈ సంఘవిద్రోహుల అత్యాచారాలకు బలైపోయి గుర్తింపు కూడా లేకుండాపోయిన రక్షకభటుని అమరగాథే ఈ నాటికలోని ఇతివృత్తం. పోలీసు సంక్షేమనిధి కోసం ఎన్.టి.రామారావు ఆధ్వర్యంలో 24న తొలిసారిగా గుంటూరులో ప్రదర్శించారు. మరుసటిరోజు హైదరాబాద్‌లో ప్రదర్శించారు. ప్రతి రక్షకభటుడూ న్యాయరక్షణకు, ధర్మరక్షణకు, ప్రజాసేవకు కంకణం కట్టుకోవాలి. ఆశావ్యామోహాలకు ఆత్మను అమ్ముకోకుండా ధర్మమార్గంలో నీతి, నిజాయితీగా జీవించాలి. దేశ సౌభాగ్యానికీ, శ్రేయస్సుకీ ప్రాణాలర్పించడానికైనా సిద్ధంగా ఉండాలనే సందేశంతో రాసిన ఈ నాటికలో ఎన్.టి.రామారావు, చిత్తూరు నాగయ్య, జమున,బాలయ్య,రాజబాబు, పేకేటి, బాలకృష్ణ ప్రభృతులు నటించారు.

## జయం మనదే

మానవుడు సుఖశాంతులతో బతకాలంటే దేశం సుభిక్షంగా ఉంటాలి. ఇల్లు కాలుతున్నప్పుడు నీళ్ల కోసం వెదికినట్లు కాకుండా ముందుగానే సుశిక్షతులైన యుద్ధవీరులను ఎల్లల మీద నిలబెట్టాలి. అందుకోసం మన ప్రతి కుటుంబం నుంచి ఒక యువకుడు సైనికుడిగా వెళ్లాలి. ఈ అవసరాన్ని, అవశ్యతను ఉత్తేజకరంగా, ఉద్రేకభరితంగా నిరూపించిన ఇతివృత్తంతో సముద్రాల రచించిన నాటిక జయం మనదే. ఈ నాటికను సముద్రాల 1965లోరచించారు. పాకిస్తాన్ భారతదేశంపై దురాక్రమణచేసి యుద్ధం ప్రకటించినప్పుడు దేశ రక్షణకై యుద్ధ భూమికి వెళ్లిన వీర జవానులకు నిధిని సేకరించడానికి ఎన్.టి.రామారావు ఆంధ్రదేశంలోని నలుచెరుగులా 1965 నవంబర్ 20నుండి డిసెంబర్ 11వరకూ పర్యటించి సాంస్కృతిక ప్రదర్శనలిచ్చారు.

# ప్రభుత్వ ప్రోత్సాహంతోనే చేనేతకు మనుగడ



పొడుగు తయారీలో కుంచెలాగుతున్న, రాట్నం వడుకుతున్న మహిళా కార్మికులు

('ఆన్‌లైన్' - భట్టిప్రోలు)

దేశ నాగరికతకు వన్నెతెచ్చిన చేనేత పరిశ్రమ పూర్వ వైభవానికి ప్రభుత్వం ప్రోత్సహించిననాడే మనుగడ కొనసాగుతుంది. స్వాతంత్ర్య ఉద్యమంలో రాట్నాన్ని చిహ్నంగా ఉద్యమాన్ని నడిపిన మహాత్మాగాంధీ విదేశీ వస్త్ర బహిష్కరణకు ఆనాడు ఉద్యమాన్ని నిర్వహించారు. అనంతరం చేనేత పరిశ్రమకు మంచి భవిష్యత్ వుంటుందని ఆశించిన కార్మికులకు అయిదేళ్ల అనంతరం రక్షణ కోసం ఉద్యమాన్ని చేపట్టక తప్పలేదు. 1952లో అప్పటి ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో 75 రోజులపాటు కార్మికులు సత్యాగ్రహాన్ని చేశారు. అదే ఏడాదిలో కీర్తిశేషులు ప్రగడ కోటయ్య నాయకత్వాన రేపల్లె తాలూకాలో 11రోజులపాటు సత్యాగ్రహాన్ని నిర్వహించారు. ప్రభుత్వాలు మారుతున్నప్పటికీ కార్మికులు ఎదుర్కొంటున్న సమస్యలు ఎక్కడవేసిన గొంగళి అక్కడే అన్న చందాన వున్నాయి. చేనేతకు కేటాయించిన 22రకాల వస్త్రాలను 11రకాలకు కుదించిన ఘనత పాలకులకే దక్కింది. సదరు 11 రకాల వస్త్రాలు కూడా మిల్లు యజమానులు విచ్చలవిడిగా తయారు చేస్తున్నప్పటికీ పాలకులు నిమ్మకు నీరెత్తినట్లుగానే వ్యవహరిస్తున్నారు. ఈ కారణంగా చేనేత పరిశ్రమ ప్రతి రెండు, మూడేళ్లకు సంక్షోభంలో కూరుకుపోవడం, ఉపాధిని కోల్పోయిన కార్మికులు ఆకలిచావులు ఆత్మహత్యలకు బలికాక తప్పడం లేదు. చేనేత పరిశ్రమను ప్రోత్సహిస్తామని చెబుతున్న పాలకులు పరిశ్రమకు వున్న రాయితీలను తగ్గిస్తూ మిల్లు యజమానులకు కోట్లాది రూపాయల రాయితీలను అందచేస్తుందన్నారు. చిలపల నూలు ధరలు పెరిగిపోతున్నప్పటికీ వాటిని అదుపు చేయడంలో ప్రభుత్వాలు విఫలం చెందాయి. చేనేత సహకార సంఘాల రక్షణ కోసం ఏర్పాటు చేసిన ఆప్కో సంస్థ అవినీతిలో కూరుకుపోయింది. దీంతో పలు సంస్థలను మూసివేయడం, వాటి ఆస్తులను కూడా తెగనమ్మేందుకు పాలకులు ప్రయత్నాలు చేసిన సంఘటనలు అనేకంవున్నాయి. ప్రభుత్వోద్యోగులు వారంలో ఒకరోజైన చేనేత వస్త్రాలను ధరించాలన్న నిబంధనలు రాష్ట్రంలో అమలు జరుగుతున్న దాఖలాలు కనిపించడం లేదు. చేనేత పరిశ్రమకు పూర్వవైభవం రావాలంటే తమిళనాట అనుసరిస్తున్న విధానాలు అనుసరించిన రోజునే సాధ్యమన్న విషయాన్ని మన రాష్ట్ర ప్రభుత్వం గుర్తించవలసివుంది. ఈవిషయంలో నిర్లక్ష్యం వహిస్తే ప్రాచీన కాలం నాటి చేనేత పరిశ్రమ భవిష్యత్ తరాలకు కనుమరుగయ్యే ప్రమాదముంది.


ఎత్తిపోతల జలపాతం అందాలు

# ప్రకృతి సోయగాల సమాహారం
# ఎత్తిపోతల జలపాతం

(ఆన్‌లైన్ - మాచర్ల, విజయపురిసౌత్) సృష్టిలోని ప్రకృతి సోయగాలను ప్రతి అణువు లోను నింపుకున్న ఎత్తిపోతల ఒక అపురూప దృశ్య కావ్యం. ప్రపంచ ఖ్యాతినార్జించిన నాగార్జునసాగ ర్‌కు కేవలం 13 కిలోమీటర్ల దూరంలో వుండి గుంటూరు జిల్లా మాచర్లకు చేరువలో వున్న ఈ ప్రాంతం ప్రకృతి ఆరాధికులకు ఓ వరం. నల్లమల అడవుల్లో నుండి (మిగతా 124వ పేజీలో)


దత్తాత్రేయుని ఆలయ ముఖద్వారం

# ప్రకృతి సోయగాల సమాహారం ఎత్తిపోతల జలపాతం



ఎత్తిపోతల దత్తాత్రేయుని ఆలయం

(123వ పేజీ తరువాయి)

అంతర్వాహినిగా చంద్రవంక పడమర నుండి ఉత్తరానికి ప్రవహిస్తూ మరో రెండు నదులను కలుపుకుంటూ, 70 అడుగుల ఎత్తు నుండి ఈ జలపాతం లోయలోకి ఎగిసి దూకే కన్నులవిందైన దృశ్యాన్ని చూసి తరించాల్సిందే. అలా దుమికిన గంగమ్మ విశాలమైన లోయ గుండా రెండువైపులా నిలువెత్తు కొండలతో, మొగిలిపొదలతో ఊసులాడుతూ ఉత్తర్వాహిణిగా ప్రవహిస్తూ 4కిలోమీటర్లు ప్రయాణం చేసి 'గంగ పాదాలు' అనే చోట కృష్ణానదిలో కలుస్తోంది. ఎత్తిపోతల జలపాతం వద్ద వన్యప్రాణి సంరక్షణలో భాగంగా అటవీశాఖ 1978 ప్రాంతంలో మొసళ్ళ కేంద్రంగా అభివృద్ధి చేయాలన్న తలంపుతో ఎనిమిది రకాల మొసళ్ళను ఇక్కడ వదలడం జరిగింది. ఇవి సంతానోత్పత్తి బాగా జరిగి ఇప్పుడు దాదాపు 100 వరకు ఉండవచ్చునని అంచనా. ఈ ప్రాంతంలో జింకలు, వన్యప్రాణుల పార్క్‌లు ఏర్పాటు చేసి ఒక మ్యూజియంను నెలకొల్పితే బావుంటుందనే తలంపు ఇక్కడకు విచ్చేసే పర్యాటకులు వ్యక్తం చేస్తుంటారు. పూర్వకాలంలో యతులు(ఋషులు) తపస్సు ఆచరించిన ప్రాంతం కనుక నాటి యతి తపోతలనే నేటి 'ఎత్తిపోతల'గా మారింది. ఇక్కడికి విచ్చేసే ప్రకృతి ప్రియులకు అందచందాలతో పాటు ఆధ్యాత్మిక చింతన కూడా అలవడుతుంది. ఈ కొండల పై వెలసిన దత్తాత్రేయ స్వామివారి ఆలయం, ఇంకొంచెం దూరంలోని మధుమతి ఆలయాలు పర్యాటకులను, భక్తులను విశేషంగా ఆకర్షిస్తాయి. ప్రతి ఏటా తొలి ఏకాదశి నాడు ఈ ప్రాంతం నుండే కాక ఇతర జిల్లాల నుండి వేలాది మంది భక్తులు ఇక్కడకు చేరుకొని పూజలు నిర్వహిస్తారు. మధుమతి దేవి ఆలయం నుండి కొండ పైన వున్న దత్తాత్రేయ స్వామి ఆలయంలోకి గుహ ద్వారాలున్నాయి. స్వతంత్ర్య పోరాట సమయంలో నాటి జాతి నాయకులు తలదాచుకోవడానికి ఈ ప్రాంతానికి విచ్చేయగా ఇక్కడి నాయకులు వారికి ఆహార పదార్థాలను సరఫరా చేశారని ఈ ప్రాంతంలో చెప్పుకుంటుంటారు. ప్రకృతి సౌందర్యాలు, ఆధ్యాత్మిక చింతనతో పాటు దేశ రక్షణకు ఈ ప్రాంతం ఉపయోగపడడం విశేషం. ఎత్తిపోతల అందాలను తెరకెక్కించాలనే ఉద్దేశ్యంతో ఇక్కడ ఎన్నో చలన చిత్రాలను నిర్మించారు. వివిధ పాటలు, సన్నివేశాలు అగ్రహీరోల పై సైతం ఇక్కడ చిత్రీకరించారు. ఎత్తిపోతలను పర్యాటకంగా అభివృద్ధి పరచాలనే ఉద్దేశ్యంతో టూరిజం శాఖ వినూత్నమైన రీతిలో వ్యవహరిస్తూ ప్రజలకు చేరువచేస్తోంది. ఇక్కడ పర్యాటకులకు సమావేశం హాల్,క్యాంటిన్‌ల ఆధునికీకరుణతో పాటు రాత్రి వేళల్లో సైతం పర్యాటకులను ఆహ్లాదపరచాలనే ఉద్దేశ్యంతో మ్యూజికల్ లైటింగ్ సిస్టమ్‌ను కూడా ఏర్పాటు చేశారు. రాష్ట్ర రాజధాని హైదరాబాదు నుండి టూరిజం శాఖ ఏర్పాటు చేసిన ప్రత్యేక బస్సుల ద్వారా కూడా ఎత్తిపోతలను సందర్శించవచ్చు.

# చారిత్రక ప్రసిద్ధి చెందిన జంపని

(ఆన్‌లైన్, వేమూరు)

గుంటూరు జిల్లా వేమూరు మండలంలో జంపని గ్రామం చరిత్ర ప్రసిద్ధి గాంచినది. ఈ గ్రామానికి పూర్వం శ్రీరంగరాయపురం అనే పేరు ఉండేది. చోళ రాజులకు 300 సంవత్సరాలకు పూర్వం గ్రామంలో రామేశ్వర, రంగ నాయక, వల్లభరాయస్వామి వార్ల ఆలయాలు ఉండేవి. క్రీస్తు శకం 10వ శతాబ్దంలో గణపతి రాయులు ఈ ఆలయాల పరిరక్షణ గావించాడు. జంపాడు అనే రెడ్డి ఆనాడు గ్రామాధికారిగా ఉండటం వల్ల ఈ గ్రామానికి జంపని అనే పేరు వచ్చినట్లు తెలుస్తోంది. 13వ శతాబ్దం వరకు గజపతులు, రెడ్లు ప్రభుత్వం చేశారు. ఆ కాలంలో గ్రామం తాలూకా కేంద్రంగా భాసిల్లింది. గ్రామమంతా తూర్పు దిక్కులో ఉండేది. కృష్ణాజిల్లా నుండి గుంటూరు ప్రాంతానికి వ్యాపారానికి వెళ్ళే ప్రతి ఒక్కరు గ్రామంలో విశ్రాంతి పొందేవారు. వీరభద్రరాజులు, గజపతుల నుండి ప్రభుత్వాన్ని చేజిక్కించుకుని పాలిస్తుండగా కర్ణాటక ప్రభువైన శ్రీకృష్ణదేవరాయులు వారిని జయించి 15వ శతాబ్దం ప్రారంభం వరకు పాలించారు. తదుపరి గ్రామాన్ని జంపని వారు అనే రాజులకు ఇచ్చారు. వారు వేణుగోపాలస్వామి ఆలయాన్ని అతి సుందరంగా నిర్మించారు.(నేటి షుగర్ ఫ్యాక్టరీ క్వార్టర్స్ ప్రాంగణంలో) క్రమేపి వేణుగోపాల, రంగనాయక వల్లభరాయస్వామి వార్ల ఆలయాలు ఖిల్లపడ్డాయి. సదాశివ రాయల ప్రభుత్వంలో మూర్తి నాగభట్టు అనే బ్రాహ్మణుడు గ్రామ పడమర భాగంలో చెన్న కేశవ స్వామి ఆలయం కట్టించాడు. మొగలాయి ప్రభుత్వంలో రద్దుపడిన ఈ

(మిగతా 128వ పేజీలో)


దేవనాగరి లిపిలోని శిలాశాసనము

# ప్రగతి పథంలో జిల్లా యువజన సంక్షేమ శాఖ



డా॥వై.ఎస్.రాజశేఖరరెడ్డి
రాష్ట్ర ముఖ్యమంత్రివర్యులు



శ్రీ కన్నాలక్ష్మీనారాయణ
రాష్ట్ర సహకార & రవాణాశాఖామాత్యులు



శ్రీ ధర్మానప్రసాదరావు
జిల్లా ఇన్‌చార్జ్ మంత్రి



శ్రీమతి జి. జయలక్ష్మీ, IAS
జిల్లా కలెక్టర్



శ్రీ వి. మార్క్
స్టెప్ ఆఫీసర్, స్వశక్తి, గుంటూరు.



కొప్పరావూరులో ఇందిరమ్మ గ్రామసభలో రాజీవ్ యువశక్తి ఋణాలను పంపిణీ చేస్తున్న సి.యమ్. డా॥ వై.యస్. రాజశేఖర్ రెడ్డి



వినుకొండలో రాజీవ్ యువశక్తి పథకం ప్రారంభోత్సవ సభలో ప్రసంగిస్తున్న ముఖ్యమంత్రి డా॥ వై.యస్. రాజశేఖర్ రెడ్డి



రాజీవ్ యువశక్తి ఋణాలను పంపిణీ చేస్తున్న జిల్లా ఇన్ చార్జి మంత్రి శ్రీ ధర్మాన ప్రసాదరావు



స్వాతంత్ర్య దినోత్సవ వేడుకల సంధర్భంగా రాజీవ్ యువశక్తి ఋణాలను పంపిణీ చేస్తున్న మంత్రి కన్నా లక్ష్మీనారాయణ

## స్టెప్ -- స్వశక్తి -- గుంటూరు.

## రాజీవ్ యువ శక్తి పథకముపై సంక్షిప్త సమాచారము

ప్రభుత్వము వారు నిరుద్యోగ సమస్య నిర్మూలనకు గాను 2004-05 అర్థిక సంవత్సరము నుండి "రాజీవ్ యువశక్తి పథకము" ను ప్రారంభించినారు. ఈ పథకము ద్వాఅ ఈ దిగువ తెల్పిన విధముగా పథకములు కలవు:

1. రాజీవ్ యువశక్తి (చిన్న తరహ వ్యాపారము) - ప్రాజెక్ట్ విలువ- రూ. 50,000/-
2. రాజీవ్ యువశక్తి (వ్యక్తి గతం) ప్రాజెక్ట్ విలువ - రూ. 1,00,000/-లు
3. రాజీవ్ యువశక్తి (గ్రూపు) - ప్రాజెక్ట్ విలువ - 3,00,000/-లు

రాజీవ్ యువశక్తి (గ్రూపు) పథకములో 5 గురు సభ్యులు వుండి, వారు 18 నుండి 35 సంవత్సరముల లోపు వారై వుండవలెను. వారి కుటుంబ సంవత్సరాదాయము రూ. 50,000/- లకు మించి యుండరాదు. గ్రూపు సభ్యులలో ఒకరు తప్పనిసరిగా 10 వ తరగతి పాసై వుండవలెను మిగిలిన సభ్యులు 7వ తరగతి ఉత్తీర్ణులై వుండవలెను.

2005-06 సంవత్సరమునకు మంజూరైనవి, సాదించిన ప్రగతి ఈ దిగువ తెల్పి న విధముగా కలదు.

| వరుస సంఖ్య | ఋణ వివరములు | 2005-06 | | | |
|---|---|---|---|---|---|
| | | మంజూరు చేసిన యూనిట్లు | | స్థాపించబడిన యూనిట్లు | |
| | | PHY | FIN | PHY | FIN |
| 1. | వ్యక్తి గతము | 650 | 612.476 | 487 | 456.981 |
| 2. | గ్రూపు | 205 | 516.400 | 73 | 176.300 |
| 3. | చిన్న తరహ వ్యాపారము | 2078 | 874.160 | 1535 | 642.669 |
| | మొత్తము | 2933 | 2003.036 | 2095 | 1275.950 |

యువజన సర్వీసుల శాఖ కమీషనర్ వారు 2005-06 వ సంవత్సరములో రాజీవ్ యువశక్తి పథకము క్రింద మంజూరు చేయబడిన యూనిట్లును ది. 30-09-06 లోపు గ్రౌండు చేయవలసినదిగా ఆదేశించినారు. యువజన సర్వీసుల శాఖ కమీషనర్ వారి ఉత్తర్వుల ప్రకారం మిగిలిన 838 రాజీవ్ యువశక్తి యూనిట్లను వెంటనే గ్రౌండు చేయగలవారము

| వరుస సంఖ్య | ఋణ వివరములు | 2005-06 | | | |
|---|---|---|---|---|---|
| | | మంజూరు చేసిన యూనిట్లు | | స్థాపించబడిన యూనిట్లు | |
| | | PHY | FIN | PHY | FIN |
| 1. | ఎస్.సి | 706 | 387.845 | 472 | 235.665 |
| 2. | ఎస్.టి | 131 | 84.630 | 90 | 45.885 |
| 3. | బి.సి. | 736 | 447.930 | 543 | 308.830 |
| 4. | మైనారిటి | 177 | 110.900 | 140 | 83.250 |
| 5. | ఓ.సి. | 1183 | 971.731 | 850 | 602.320 |
| | మొత్తము | 2933 | 2003.036 | 2095 | 1275.950 |

రాజీవ్ యువశక్తి పథకము ద్వారా ఋణము పొంది, యూనిట్లు స్థాపించని, స్థాపించి బ్యాంకుల వారికి చెల్లించవలసిన ఋణ వాయిదాలు సక్రమముగా చెల్లించని వారికి ఇప్పటి వరకు 225 మంది లబ్ధిదారులకు నోటీసులు ఇచ్చి బ్యాంకుల వారికి రికవరిలో కూడా ఈ కార్యలయపు సిబ్బంది సహాయపడుచున్నారు. ఇప్పటి వరకు రూ. 7.65 లక్షలు సొమ్ము బ్యాంకుల వారికి వసూలు చేయించడమైనది. ఇప్పటి వరకు 16 మంది లబ్ధిదారుల పై సి.అర్.పి.సి 420 మరియు 409 సెక్షన్లు ద్వారా క్రిమినల్ కేసులు సంబంధిత పోలీసు స్టేషన్లలో నమోదు చేయడమైనది.

**రాజీవ్ యువశక్తి :** 2006-07 అర్థిక సంవత్సరమునకు, యువజన సర్వీసుల శాఖ కమీషనర్ వారు 5270 మందికి ఋణములు మంజూరు చేయుటకు గాను లక్ష్యముగా నిర్ణయించినారు. సదరు లక్ష్యమును మండల/మునిసిపల్ జనాభా ప్రాతిపదికన కెటాయించడమైనది.

| వరుస సంఖ్య | డివిజన్ పేరు | చిన్నతరహ వ్యాపారం | | వ్యక్తి గతము | | గ్రూపు | | మొత్తము | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | | లక్ష్యము | సాధించిన ప్రగతి | లక్ష్యము | సాధించిన ప్రగతి | లక్ష్యము | సాదించిన ప్రగతి | లక్ష్యము | సాధించిన ప్రగతి |
| 1. | గుంటూరు | 1440 | 182 | 391 | 88 | 146 | 7 | 1977 | 277 |
| 2. | నర్సరావుపేట | 1219 | 128 | 330 | 39 | 120 | 0 | 1669 | 167 |
| 3. | తెనాలి | 1187 | 142 | 319 | 33 | 118 | 0 | 1624 | 175 |
| | మొత్తము | 3846 | 452 | 1040 | 160 | 384 | 7 | 5270 | 619 |

| వరుస సంఖ్య | సాంఘీక హోదా | 2005-06 | | | |
|---|---|---|---|---|---|
| | | మంజూరు చేసిన యూనిట్లు | | స్థాపించబడిన యూనిట్లు | |
| | | PHY | FIN | PHY | FIN |
| 1. | ఎస్.సి | 854 | 728.838 | 134 | 663.20 |
| 2. | ఎస్.టి | 348 | 296.934 | 8 | 57.50 |
| 3. | బి.సి. | 1317 | 1124.750 | 149 | 876.50 |
| 4. | మైనారిటి | 163 | 184.320 | 63 | 448.00 |
| 5. | ఓ.సి. | 2588 | 2164.158 | 265 | 1824.50 |
| | మొత్తము | 5270 | 4499.000 | 619 | 3869.70 |



స్వాతంత్ర్య దినోత్సవ సందర్భంగా యువజన సంక్షేమ శాఖ ఏర్పాటు చేసిన రక్తదాన శిబిరాన్ని ప్రారంభిస్తున్న కలెక్టర్ శ్రీమతి జయలక్ష్మి ఎస్.పి. శివధర్ రెడ్డి తదితరులు



జిల్లా యువజన సంక్షేమ శాఖ ఆధ్వర్యంలో నిరుద్యోగులకు ఏర్పాటు చేసిన శిక్షణ కార్యక్రమంలో ప్రసంగిస్తున్న కలెక్టర్ శ్రీమతి జయలక్ష్మీ, వేదిక పైన స్టెప్ ఆఫీసర్ మార్క్ తదితరులు



గుంటూరు నగరంలో సి.యమ్ కప్ 2006 రన్ కార్యక్రమంలో పాల్గొన్న యమ్ పి శ్రీ రాయపాటి సాంబ శివరావు, స్టెప్ ఆఫీసర్ మార్క్ తదితరులు



సి.యమ్ కప్ జిల్లాలో అందుకున్న కలెక్టర్ శ్రీమతి జయలక్ష్మీ జెడ్.పి.ఛైర్మన్ శ్రీమతి విజయ తదితరులు



స్వాతంత్ర్య దినోత్సవ వేడులక సంధర్భంగా పోలీస్ పేరడ్ గౌండ్స్‌లో స్టాల్స్‌ను సందర్శిస్తున్న మంత్రి కన్నా లక్ష్మీ నారాయణ జిల్లా కలెక్టర్ జయలక్ష్మీ

# చారిత్రక ప్రసిద్ధి చెందిన

# జంపని



చెన్నకేశవ స్వామి స్వరూపం



వీరాంజనేయ స్వామి వారి స్వరూపం



రామేశ్వరాలయాల్లోని మూల విరాట్

(126వ పేజీ తరువాయి)

నాములను తిరిగి అర్చకులకు ఇప్పించాడు. నేటి గ్రామం మధ్యలోని రామేశ్వరాలయాన్ని యాదవ కుల స్థులు జీర్ణ పునరుద్ధరణ చేసి గ్రామ శ్రేయస్సు కోసం జంపాలమ్మ, జరుగు లమ్మ, రావులమ్మ అనే గ్రామ దేవతల ఆలయాలు నిర్మించారు. క్రమేపి గ్రామ మంతా తూర్పునుండి పడమర దిక్కుకు చేరింది. 1761 ఏప్రియల్ 21న జన్మించిన రాజావెంకటాద్రి నాయుడు శతాధిక ఆలయాలు నిర్మించే భాగంలో 18,19 శతాబ్దాలలో తన దివ్యభావాలు ప్రసరింపజేశారు. 18వ శతాబ్దిలో జంపనిలోని శివ, విష్ణు, ఆల యాల పోషణార్థం అర్చకులకు ఈనా ములను రాసి ఇచ్చారు. వైఖానస, శైవ ఆగమ పండితులు అర్చకులుగా కొన సాగుతున్నారు.

నాటి నుండి గ్రామంలో నేటి వరకు అన్ని కులాల వారు సహజీవనం చేస్తున్నారు. గ్రామ శ్రేయస్సు కాంక్షించి నలు దిక్కులా రామ మందిరాలు, యాదవులు కృష్ణ మందిరాలు నిర్మిం చారు. సిద్ధి వినాయక, వీరాంజనేయ, మహలక్ష్మి, వృక్షరాజ ఆలయాలను 100 సంవత్సరాల క్రితమే గ్రామస్థులు నిర్మించారు. దేవ నాగర లిపిలో రాతిపై చెక్కిన గ్రామ చరిత్ర ఇటీవల చెన్న కేశ వాలయంలో బయల్పడ్డది. 75 సంవ త్సరాల నాడు గాంధీ మహాత్ముడు, నేటీ షిరిడీ సాయి మందిర ప్రాంగ ణంలో ప్రసంగం చేస్తూ ఆ వేదిక ఏనా టికైనా ఒక పుణ్య స్థలం కాగలదని పలి కినట్లు ఆయన ఆధ్యాత్మిక శక్తి వల్ల వాక్కు ఫలించి ఆ స్థలంలో షిరిడీ సాయి ఆలయ నిర్మాణం జరగడాన్ని విశేషంగా చెప్పుకుంటారు. ముస్లింలు, అధిక సంఖ్యలో ఉండటం వల్ల గ్రామంలో అతి సుందరమైన మసీదు నిర్మాణంతో పాటు వారి పండుగలు కూడా విశేషంగా జరుపుతారు. క్రైస్త వులు కూడా ఎక్కువ సంఖ్యలో ఉండటం వల్ల అతిపెద్ద చర్చి నిర్మాణం జరిగింది. అత్యంత చారిత్రాత్మకతను చాటుతున్న జంపని గ్రామం ఓ ఆధ్యా త్మిక నిలయంగా వర్ధిలుతోంది.



ఎన్ఇసి భవనాలు

### నూరుశాతం ఉపాధి లక్ష్యంగా

# ఎన్ఇసి పయనం

(ఆన్‌లైన్, నరసరావుపేట)

అత్యుత్తమ విద్యా ప్రమాణాలను అందిస్తూ మరో వైపు విద్యార్థులకు ఉపాధి అవకాశాలు కల్పించటంలో నరసరావుపేట ఇంజనీరింగ్ కళాశాల ముందంజలో వుంది. కళాశాలలో



చైర్మన్ మిట్టపల్లి వెంకట కోటేశ్వరరావు

చదివే ప్రతి విద్యార్థికి ఉద్యోగ అవకాశం కల్పించటమే లక్ష్యంగా ఎన్ఇసి కృషి చేస్తున్నది.

గేట్, జిఆర్ఇ టోఫెల్, క్యాట్ తదితర పోటీ పరీక్షల్లో కూడా ఈ కళాశాల విద్యార్థులు విశేష ప్రతిభ కనబరుస్తున్నారు. క్యాంపస్ ఇంటర్వ్యూల ద్వారా ఉద్యోగాలు సులువుగా విద్యార్థులు సాధించేందుకు ప్రత్యేక శిక్షణ ఇస్తున్నారు. పోటీ పరీక్షలు, క్యాంపస్ ఇంటర్వ్యూలకు హాజరయ్యే విద్యార్థుల కోసం కళాశాలలో ప్రత్యేక ఏర్పాట్లు చేశారు. నరసరావుపేట పట్టణానికి నాలుగు కిలో మీటర్ల దూరంలో కోటప్పకొండ (మిగతా 130వ పేజీలో)

## నూరు శాతం ఉపాధి లక్ష్యంగా

# ఎన్ఇసి పయనం

(129వ పేజీ తరువాయి)

రహదారిలో ఆహ్లాదకరమైన క్యాంపస్‌లో ఎన్ఇసి నిర్వహించబడుతున్నది. స్థాపించిన అనతి కాలంలోనే ఉత్తమ ఫలితాలు సాధించటంలో జెఎన్‌టియు పరిధిలో ప్రత్యేక స్థానాన్ని కళాశాల సాధించింది. ఎఐసిటిఇ దేశ వ్యాప్తంగా ఇచ్చిన రేటింగ్‌లో ఎన్ఇసి 32వ స్థానాన్ని సాధించింది. రాష్ట్ర ప్రభుత్వం ఆధ్వర్యంలో నిర్వహించబడుతున్న జవహర్ నాలెడ్జి సెంటర్‌ను నిర్వహిస్తున్నారు. ఎబివిపి నిర్వహించిన రాష్ట్ర వ్యాప్త సర్వేలో ఎన్ఇసికి ఎక్స్‌లెంట్ అవార్డు లభించింది. అలాగే జవహర్ నాలెడ్జి కేంద్రం నిర్వహణలో సెంటర్ ఆఫ్ ఎక్స్‌లెన్స్ గుర్తింపు పొందింది. ప్రతి ఏటా గేట్ పరీక్షల్లో కళాశాల విద్యార్థులు అత్యుత్తమ ర్యాంకులు సాధిస్తున్నారు. 1998లో గాయత్రి ఎడ్యుకేషనల్ సొసైటీ ఆధ్వర్యంలో నాలుగు బిటెక్ బ్రాంచ్‌లతో ఎన్ఇసిని ప్రారంభించారు. ప్రస్తుతం ఆరు బిటెక్ బ్రాంచ్‌లు, నాలుగు ఎంటెక్ బ్రాంచ్‌లు, ఎంసిఎ, ఎంబిఎ కోర్సులను కళాశాలలో నిర్వహిస్తున్నారు. అన్ని హంగులతో లైబ్రరీని ఏర్పాటు చేశారు. క్యాంపస్ ఇంటర్వ్యూల నిర్వహణ కోసం ప్రత్యేక విభాగాన్ని నెలకొల్పారు. ఇప్పటి వరకు క్యాంపస్ ఇంటర్వ్యూల ద్వారా గత రెండేళ్లలో 151 మంది విద్యార్థులు ప్రముఖ సాఫ్ట్‌వేర్ సంస్థల్లో ఉద్యోగాలు సాధించారు. ప్రస్తుత విద్యా సంవత్సరంలో ఇప్పటికే 82 మంది విద్యార్థులు ఉద్యోగాలు పొందటం విశేషం. పల్నాడు ప్రాంతంలో ఇంజనీరింగ్ విద్యను అందుబాటులోకి తేవాలనే ఉద్దేశంతో గాయత్రి ఎడ్యుకేషనల్ డెవలప్‌మెంట్ సొసైటీ చైర్మన్, కళాశాల అభివృద్ధి రథ సారధి మిట్టపల్లి వెంకట కోటేశ్వరరావు ఎన్ఇసిని స్థాపించారు. విద్యార్థులకు అవసరమైన అన్ని సౌకర్యాలు కల్పించటంలో ఆయన కృషి చేస్తున్నారు. నూరు శాతం విద్యార్థులు ఉద్యోగాలు సాధించాలనే లక్ష్యంతో కళాశాలలో అన్ని వసతులు కల్పిస్తున్నామని చైర్మన్ మిట్టపల్లి వెంకట కోటేశ్వరరావు వెల్లడించారు.



మిట్టపల్లి ఇంజనీరింగ్ కళాశాల భవన సముదాయం

### మిట్టపల్లి ఇంజనీరింగ్ కళాశాల

ఎన్ఇసి చైర్మన్ మిట్టపల్లి వెంకట కోటేశ్వరరావు నేతృత్వంలో గుంటూరుకు సమీపంలో జాతీయ రహదారి తుమ్మలపాలెం వద్ద శ్రీ మిట్టపల్లి ఇంజనీరింగ్ కళాశాలను ఈ ఏడాది ప్రారంభించారు. చిలకలూరిపేట, గుంటూరు పట్టణాల మధ్య తుమ్మలపాలెం వద్ద జాతీయ రహదారి పక్కనే ఆదునిక వసతులతో కళాశాలను నిర్మించారు. నాలుగు బిటెక్ బ్రాంచ్‌లను ప్రారంభించారు. కంప్యూటర్ సైన్స్ అండ్ ఇంజనీరింగ్, ఇన్ఫర్‌మేషన్ టెక్నాలజీ, ఎలక్ట్రానిక్స్ అండ్ కమ్యూనికేషన్ ఇంజనీరింగ్, ఎలక్ట్రికల్ అండ్ ఎలక్ట్రానిక్స్ ఇంజనీరింగ్ బ్రాంచ్‌లు ఒక్కొక్క దానికి 60 సీట్లు వున్నాయి. క్యాంపస్ ఇంటర్వ్యూలకు హాజరయ్యే విద్యార్థులకు ప్రత్యేక శిక్షణ ఇచ్చేందుకు ప్లేస్‌మెంట్ సెల్‌ను ఏర్పాటు చేస్తున్నారు. అనుభవజ్ఞులైన అధ్యాపకుల బృందం బోదనలో మంచి ఫలితాలు సాధించేందుకు శ్రీ మిట్టపల్లి ట్రస్ట్ విశేషంగా కృషి చేస్తుంది. ఈ కళాశాలకు మిట్టపల్లి వెంకట కోటేశ్వరరావు చైర్మన్‌గా వున్నారు. ఎన్ఇసి తరహాలో మిట్టపల్లి ఇంజనీరింగ్ కళాశాల అత్యున్నత విద్యా బోధన విద్యార్థులకు అందిస్తుందని కోటేశ్వరరావు వివరించారు. కళాశాలలో ఏర్పాటు చేసిన వసతులను సద్వినియోగ పరుచుకొని విద్యార్థులు మంచి ఫలితాలు సాధించాలని ఆయన పేర్కొన్నారు.


శ్రీ కనకపుట్టలమ్మ వారి ఆలయం





# చారిత్రక ఆలయాల నెలవు

# పెదకొండూరు

**(ఆన్‌లైన్, దుగ్గిరాల)**

రెండు శివాలయాల మధ్య ఒక వైష్ణవ ఆలయం ఉండుటయే ఈ గ్రామ ప్రత్యేకత : గుంటూరు జిల్లా దుగ్గిరాల మండలంలో కృష్ణానదీ తీరాన ఉన్న పెదకొండూరు గ్రామంలో అతి ప్రాచీనమైన విశిష్ట దేవాలయములు కలవు. ఇచ్చట 11వ శతాబ్దం నాటి శ్రీ రాజరాజేశ్వరి స్వామి ఆలయం, 13వ శతాబ్దం నాటి ఆనందేశ్వరస్వామి ఆలయం ఈ రెండు దేవాలయాల మధ్య జనార్ధన స్వామి ఆలయం, సుమారు 3000 సంవత్సరముల నాటి గ్రామదేవత అయిన శ్రీ కనకపుట్టలమ్మ అమ్మవారి ఆలయం కలవు. ఈ నాలుగు కాక గ్రామంలో క్రొత్తగా నిర్మించిన కోదండ రామస్వామి ఆలయం కూడా కలదు.

బౌద్ధ శిల్పాలు మలచిన తెల్లరాతితో మలచిన విలక్షణమైన ప్రసిద్ధి చెందిన అర్ధనారీశ్వర రూపము కలిగిన శివలింగము గల ఆనందేశ్వరస్వామి ఆలయం ఒక్క పెదకొండూరులో మాత్రమే ఉన్నది. మహాశివరాత్రినాడు శివుడు లింగోద్భవ మూర్తిగా అవిర్భవించెనని చెప్పబడుతున్న శివలింగము ఇతర శివలింగాల వలె శైవాగమ శాస్త్రాను గుణంగా లేదు. విజయవాడకు చెందిన 15 కి.మీ దూరంలో కృష్ణా నదీ తీరాన ఉన్న పెదకొండూరు గ్రామంలోని ఈ శివాలయం 12-13 శతాబ్దాల నాటిదనిపిస్తుంది. కృష్ణానదికి వరద వస్తే ముందుగా ఈ గుడి ద్వారం మునిగిపోతుంది. అన్ని ఆలయాల్లో కంటే ప్రాచీనమైన శివాలయం లోని ఆనందేశ్వర లింగం శిరస్సుపైన నాగాభరణం లింగంతో కలిసి ఉండుటయే గాక లింగము క్రింది భాగంలో అర్ధనారీశ్వర రూపం కలదు. విగ్రహానికి కుడివైపున కపాలము, త్రిశూలము,

(మిగతా 132వ పేజీలో)


పెదకొండూరు ఆలయాలకు రాజప్రవేశం

## చారిత్రక ఆలయాల నెలవు

# పెదకొండూరు




శ్రీ రాజరాజేశ్వరి స్వామివారి ఆలయం

(131వ పేజీ తరువాయి)

డమరుకము, చెవికి సర్పకుండలము ధరించిన పురుష రూపముగా నిలుచున్న సగభాగము కలదు. ఎడమ వైపు పార్వతీ అందెలు, పూలమాల, చేతులకు కంకణములు మొదలైన అలంకారములతో స్త్రీ రూపముగా ఉన్న మిశ్రమ విగ్రహము ఉబ్బెత్తు తక్కువగా ఉండునట్లు మలచబడి ఉన్నది. ఈ శివ లింగము అద్వైత భావనకు ప్రతీకగా చూపబడిన ఈశ్వరతత్వము గల అర్ధ నారీశ్వర రూపం కలిగి ఉన్నది. ఇది స్వయంభు దేవాలయం అని కాశీ పుణ్యక్షేత్రం తర్వాత ఇలాంటిది దక్షిణాదిలో మధురలోను, మరల ఇక్కడ మాత్రమే ఉన్నట్లు తెలుపుచున్నది. బ్రహ్మకు చెప్పబడే సత్, చిత్, ఆనంద ములచెడెడి లక్షణములతో ఆనంద స్వరూపుడు, అర్ధనారీశ్వరుడు కనుక ఆనందేశ్వరుడని స్వామికి పేరు. జగత్తు యొక్క సృష్టి, స్థితి , లయలకు అర్ధనారీశ్వర రూపమే కారణమగుచున్నది. శివ లింగము వెనుక భాగమున సర్పము యొక్క పడగ మధ్య నుండి ఒక జూలు కనిపించును.

పెదకొండూరులో నున్న మరొక ప్రసిద్ధి దేవాలయం శ్రీ రాజ రాజేశ్వర ఆలయం. ఇది 11-12 శతాబ్దాలలో నిర్మించబడినదని చెప్పబడుచున్నది. ఇది శైవాగమాలనను గురించియే ప్రతిష్ఠించబడియుండెను. రాజమహేంద్రవరంను పాలించిన రాజరాజ నరేంద్రుని అనుమాయులు గాని లేక రెండవ రాజరాజుకి సామంతుడైన రెండో డొంకరాజు తన ప్రభువు పేరుతో ఈ ఆలయాన్ని నిర్మించి ఉండవచ్చని తెలియుచున్నది. క్రీ.శ 1135లో జరిగిన గోదావరి యుద్ధంలో వేంగి దేశాన్ని చాళుక్యుల నుండి విడిపించిన విజయ సూచకంగా ఆలయ ప్రతిష్ఠ జరిగియుండును. ఆనందేశ్వర స్వామి గుడి ప్రాచీనమైనదనను ఆ గుడి కూడా ఈ సందర్భములోనే పునర్నిర్మాణరి చేయబడినది కావచ్చు. ఈ ఆలయం గ్రామ స్మశాన వాటికకు పక్కనే ఉంది. స్మశానంలోని పాగ స్వామికి పారుటయే ఇక్కడ మరొక విశిష్టత.

పెదకొండూరులో విశేషంగా చెప్పుకునే రెండు శివాలయాల మధ్య ఉన్న మరో ఆలయం జనార్ధన స్వామి ఆలయం. ఈ ఆలయం గ్రామం మధ్యనే ఉండటంతో నడిందేవుడు గుడి అనిపిలుస్తారు. ఇచట శాసనములు ఏమి కనపడుటలేదు. వైష్ణవ ఆగమానికి అనుగుణంగా నిర్మించబడింది. ఈ జనార్ధన స్వామి ఆలయం. ఈ స్వామికి ధనుర్మాసంలోను ముక్కోటి ఏకాదశి నాడు, ఇతర పర్వదినాల్లోనూ విశేష పూజలు జరుపుతారు. దేవుని ఊరేగింపు కొరకు ఒక చక్కని టేకు చెక్కలతో నిర్మించబడిన రథము ఉన్నది. అయితే ఇప్పుడది శిథిలమై ఉన్నది. మంగళగిరి లోనున్న రథము వలెనే ఇది కూడా ఉన్నది. అంతేగాక ఈ ఆలయంలో స్వామికి ఎదురుగా ధ్వజ స్తంభం దగ్గర మరొక ఆలయం శ్రీ ఆంజనేయస్వామి ఆలయం. ఈ ఆలయంలో విశిష్టంగా ఆంజనేయ స్వామి విగ్రహాలు రెండు ప్రతిష్ఠించబడి ఉన్నాయి. రెండు విగ్రహాలు కృష్ణానదిలో లభించాయని ఆ రెండిటిలో ఒక విగ్రహం ప్రతి సంవత్సరం కొంచెం కొంచెం పెరుగుతున్నదని ఒక విగ్రహం స్థిరంగా ఉన్నదని అక్కడి అర్చకులు తెలిపారు. పెదకొండూరులో విశిష్టంగా చెప్పుకునే విశేషంగా పూజలందుకునే గ్రామ దేవత శ్రీ కనక పుట్టలమ్మ అమ్మవారు. ఋష్యాదులచే ప్రతిష్ఠింపబడిన దేవతలను దర్శించు భక్తులకు విశేష పుణ్య ఫలములు కలుగునని పురాణములు చెప్పుచున్నవి. అలాంటి దేవాలయంలో శ్రీ కనక పుట్టలమ్మ వారి దేవాలయం విశిష్ఠమైంది. త్రేతా యుగమున ఎందరో మహా తల్లులు ఆయోనిజులుగా జన్మించిరి. అట్టి వారిలో సీత, సావిత్రి, రేణుక చెప్పుకోదగినవారు. అట్టి త్రేతాయుగమున గిరిరాజైన రేణువుసంతానము కొరకు తన ఆరాధ్య దైవమైన అంబికా దేవిని, ఆరాధించినంత ఆ దేవి కరుణించి ప్రత్యక్షమై ఒక బాలికను అందించెను. కొంతకాలమునకు రేణుక దేశ మందలి శక్తి పీఠములు దర్శింపగోరి, కృష్ణా తీరము వెంబడి శ్రీశైలం పోవుచుండగా (మిగతా 134వ పేజీలో)



# జీవనోపాధి కల్పిద్దాం - వలసలను నివారిద్దాం

# ముఖ్యమంత్రి ఉపాధి హామీ పథకము



# జిల్లా నీటి యాజమాన్య సంస్థ, గుంటూరు జిల్లా.



డా॥ వై.ఎస్.రాజశేఖరరెడ్డి
రాష్ట్ర ముఖ్యమంత్రి వర్యులు



శ్రీ డి. శ్రీనివాస్
గ్రామీణాభివృద్ధి శాఖామాత్యులు



శ్రీ కన్నాలక్ష్మీనారాయణ
రాష్ట్ర సహకార మరియు రవాణా శాఖామాత్యులు



శ్రీ ధర్మాన ప్రసాదరావు
జిల్లా-ఇన్‌చార్జ్ మంత్రి



శ్రీమతి కూచిపూడి విజయమ్మ
జిల్లా పరిషత్ చైర్‌పర్సన్

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము వారు జి.ఓ.యం.యస్. నెం:415 పంచాయితీరాజ్ మరియు రూరల్ డెవలప్‌మెంటు (ఆర్.డి.-2) డిపార్టుమెంటు, తేది 04-10-2006 నందు గుంటూరు జిల్లాలోని బొల్లాపల్లి, చిలకలూరిపేట, ఈపూరు, నూజెండ్ల, పిడుగురాళ్ళ శావల్యాపురం మరియు వినుకొండ మండలములను కరువు పీడిత ప్రాంతాలుగా గుర్తించి, సదరు మండలములలోని వ్యవసాయ కూలీలకు పనికల్పించి జీవన భృతి ఏర్పాటు చేయుటకు గాను ఆంధ్రప్రదేశ్ గ్రామీణ ఉపాధి హామీ పథకములో నిర్దేశించిన ప్రకారము పనులు చేయించుటకు ఉత్తర్వులు యిచ్చియునారు.

## ముఖ్యోద్దేశ్యము :

గ్రామీణ ప్రాంతాల్లో నైపుణ్యం అవసరం లేని కూలీ పనిచేయటానికి సిద్ధంగా ఉన్న కుటుంబాలలో వున్న 18సం॥లు పైబడి వున్న వారందరికి పని కల్పించి వేతన భృతిని పొందేలా చేయడం ద్వారా జీవనోపాధి భద్రత పెంచడం, వలసల నివారించటం దీని ముఖ్యోద్దేశ్యము జాతీయ గ్రామీణ ఉపాధి హామీ చట్టం ననుసరించి అమలు చేయబడుతుంది.

## ఈ స్కీము క్రింద చేపట్ట తగిన పనులు:

నీటి నిలువ ఉ నీటటి యాజమాన్య పనులు (వాటర్ షెడ్ పనులు)
కరువు నివారణ పనులు
షెడ్యూలు కులములు / షెడ్యూలు తెగలవారికి కేటాయించిన భూములు, భూసంస్కరణల ద్వారా పంచబడిన భూములు అభివృద్ధి పనులు ఇందిరా అవాజ్ యోజన క్రింద నిర్మాణ పనులు చేపట్టవచ్చును.
చెరువులలో పూడిక తీయించు పనులు
భూమి అభివృద్ధికి సంబంధించిన అన్ని పనులు
మురుగు నీటి పారుదల కాల్వల త్రవ్వకము పనులు
అన్ని కాలములలోను ఉపయోగపడు రోడ్ల నిర్మాణపు పనులు మున్నగవవి.

## స్కీము వివరములు :

1. ఈ పథకము ననుసరించి గ్రామ సంఘము ద్వారా గుర్తించబడి, గ్రామ పంచాయితీకి సమర్పించిన పనులను చేపట్టబడును.
2. ఈ స్కీము గ్రామీణ ప్రాంతములో నివసిస్తూ కూలి పని చేయకోరు ప్రతివ్యక్తికి వారి కోరిక మేరకు పని కలల్పించబడుతుంది.
3. గ్రామీణ స్థాయిలో ఎంతమందికి పని కల్పించవలసియున్నదో ఫీల్డ్ అసిస్టెంట్ల సహాయముతో గ్రామకార్యదర్శులు తయారు చేసి మండల పరిషత్ అబివృద్ధి అధికారి వారికి తెలియచేయవలసివున్నది.
4. గ్రామ స్థాయి నుంచి వచ్చిన జాబితాలను పరిశీలించిన పిమ్మట సంబంధిత మండల పరిషత్ అభివృద్ధి అధికారి పనికల్పించబలసిన వ్యక్తులకు జాబ్ కార్డులు జారీ చేయుచూ వారి పేరున సమీప బ్రాంచి పోస్టాపులందు అక్కౌంట్లను ప్రారంభింప చేయుదురు.
5. స్త్రీ, పురుషులకు సమానముగా వేతనములు చెల్లించబడును.
6. గ్రామీణ స్థాయిలో సాధారణముగా రోజుకు 7 గం॥లు పనిచేయు ప్రతి ఒక్కరికి కూలి కనీసము రూ. 80,00 లకు తగ్గకుండా వారి పనిననుసరించి (రివైజ్డ ఎస్.ఎస్.ఆర్. ప్రకారం) చెల్లించబడును.
7. వేతనములు (కూలి) మొదట ప్రతి 15 దినముల కొకసారి జమ చేయుట జరుగుతుంది.
8. ఇతర వివరములకు గ్రామ స్థాయిలో పంచాయితీ సెక్రటరీ గారిని, మండల స్థాయిలో సంబంధిత మండల అభివృద్ధి అధికారిని సంప్రదించవలయును.

ఎవరిని సంప్రదించాలి ?

మీ గ్రామ పంచాయితీ కార్యదర్శి, ఫీల్డ్ అసిస్టెంట్, మండల అభివృద్ధి అధికారి,

మరిన్ని వివరాల కోసం

**జిల్లా కలెక్టర్ / ప్రాజెక్ట్ డైరెక్టర్, జిల్లా నీటి యాజమాన్య సంస్థ, గుంటూరు.**
**ఫోన్ : 2221742, 2219928**



శ్రీ బొమిరెడ్డి రాజశేఖరరెడ్డి
ప్రాజెక్ట్ డైరెక్టర్
జిల్లా నీటి యాజమాన్య సంస్థ, గుంటూరు.



శ్రీమతి శ్రీ జి. జయలక్ష్మి I.A.S.
కలెక్టరు మరియు
జిల్లా మేజిస్ట్రేటు, గుంటూరు.



ఉపాధి హామీ పథకంపై శిక్షణ కార్యక్రమంలో ప్రసంగిస్తున్న కలెక్టర్ జయలక్ష్మి, జడ్.పి.చైర్‌పర్సన్ విజయమ్మ,రాష్ట్ర స్పెషల్ కమీషనర్ బిందుశర్మ, ప్రాజెక్టు డైరెక్టర్ బి.రాజశేఖర్‌రెడ్డి




ఉపాధి హామీ పథకం కరపత్రాన్ని విడుదల చేస్తున్న కలెక్టర్ జయలక్ష్మి, జడ్.పి.చైర్‌పర్సన్ విజయమ్మ, స్పెషల్ కమీషనర్ బిందుశర్మ, ప్రాజెక్ట్ డైరెక్టర్ బి.రాజశేఖర్‌రెడ్డి



శ్రీ జనార్థన స్వామి వారి ఆలయం

## చారిత్రక ఆలయాల నెలవు

# పెదకొండూరు

(132వ పేజీ తరువాయి)

శరత్‌కాలమందు దేవీ నవరాత్రులు ప్రారంభమయినవని మదిన తలంచి అరణ్యంలో కృష్ణానది ఒడ్డున మంచి ప్రదేశంలో మర్రిచెట్టు నొకదానిని గాంచి అచ్చోట రాతిని చతుర్భుజములు కల్గిన అందమైన స్త్రీ రూపిణిగా మలచి పీఠమందు కొన్ని బీజాక్షర సంపుటములు వ్రాసి ప్రాణ ప్రతిష్ఠ చేసినది. పూజ ఫలములు, పుష్పములు, ఉంచుటకు కొన్ని మట్టి పాత్రలు తయారుచేసుకుని పూజకుపక్రమించెను. దేవి నవరాత్రుల మొదటి రోజు సాయంత్రం కృష్ణానది యందు స్నానమాచరించి బీజాక్షరి సహిత శక్తిమాతలు అభిషేకించి తొమ్మిది రోజులు, తొమ్మిది విధాలుగా పూజలుచేసింది. అరణ్యమునందు తిరుగు శిరమున మణిగల సర్పరాజములు, ఫల, పుష్ప, పత్రములు దెచ్చి పూజా పాత్రల యందుంచినవట. తొమ్మిదోవ రోజు రేణుక పూర్ణాహుతి గావించి దీక్ష విరమించెను. ఈ తొమ్మిది రోజులు తనకు సాయపడిన సర్పరాజములను చూసి రేణుక సర్పరాజములారా ఈ దేవీ నవరాత్రుల రోజులలో దీక్షయందు నాకెంతో సహాయపడినారు. సంతోషం ఇకముందు కూడా ఈ అమ్మకు నిత్యము ఫల, పత్ర, పుష్పాదులతో మీరే పూజలు చేయవలయునని, ఆనతి ఇచ్చి రేణుక శ్రీశైలమునకు పయనమై పోయెను. ఆప్రకారంగా సర్పములు శ్రీ కనకపుట్టలమ్మ వారి పూజలు చేయుచుండెను.

కొన్ని శతాబ్ధముల నుండి పెదకొండూరు గ్రామము చుట్టు ప్రక్కల గ్రామములలో కెల్లా పెద్దది. గ్రామమందు వైదిక, నియోగి, మధ్య, వ్యాపారాదిగల బ్రాహ్మణోత్తములు అనేక వృత్తిపనివారు, పండితులు, గణిత శాస్త్రవేత్తలు, విద్వాంసులు, త్రికాల వేదులు, పెదకొండూరు నందు కలరు. ఒకరోజు అడవి సరుకుల కొరకు ఇద్దరు వ్యవసాయదారులు బాడుగకు బండ్లు కట్టుకుని అడవి మార్గమున పలోయి త్రేతాయుగమున రేణుక పూజించిన ప్రతిమ ఉన్న పుట్ట వద్దకు వెళ్ళగా వారికి మైకము కమ్ముటచే దిక్కుతోచక బండ్లు విప్పుకుని చలిమంటలు వేసుకుని ఆ రాత్రి బండ్ల మీద పడుకొనిరి. రెండు ఝాముల రాత్రి గడిచిన తరువాత వారికి స్వప్నములో పాములతో నిండియున్న పుట్ట అందుప్రతిమ ఒక యోగిని పూజలు చేయడం, ఆయోగినియే ప్రతిమను తీసుకుని వెళ్ళి పూజించు కోమని చెప్పడం జరిగినదట. అంతట వారు మేల్కొని ఒకరికొకరు స్వప్నములో జరిగిన సంఘటనలు చెప్పుకుని మెలుకువతో నుండి ఉదయముననే పుట్టవద్దకు చేరి చూడగా ఫల, పుష్పములను సర్పములు పుట్టలోనికి తీసుకుపోవటము చూచిన వారికి మొదట ఆశ్చర్యము, అధైర్యము కలిగిన వెంటనే కలలో గాంచిన అమ్మను తలచుకుని అంతులేని ధైర్యముతో వారి చేతులను పుట్ట కొవెలలోనికి పోనిచ్చి పుట్టను పెకిలించి శ్రీ కనక పుట్టలమ్మను బయటకు తీసిరి. తదుపరి అచ్చట సర్పములు కూడా మాయమైనవట.

ఆ రైతులు తల్లి ప్రతిమను బండి మీద (మిగతా 135వ పేజీలో)

# చారిత్రక ఆలయాల నెలవు పెదకొండూరు



శ్రీ ఆనందేశ్వర స్వామి వారి ఆలయం

(134వ పేజీ తరువాయి)

పెట్టుకుని పెదకొండూరు గ్రామము చేరిరి. విశాల ప్రదేశమందు ఒక పాక వేసి అందు అమ్మవారిని ప్రతిష్ఠించి ప్రతి రోజు ధూప, దీప నైవేద్యములు ఆరగింపుచేసేడివారు. అప్పటినుండి శ్రీ కనకపుట్టలమ్మ తల్లి గొప్ప మహిమలు గల అమ్మయని గ్రామ, గ్రామములయందు బహుళ ప్రచారములో నున్నది. తల్లిని నమ్మి దర్శించి ఎవరు ఏమి కోరినా అవి భక్తుల నడవడులను బట్టి సమకూరును. సంతానములేనివారు, సంతానము పొందుచున్నారు. వ్యాపారులు, వర్తకులు, ఉద్యోగులు, విద్యార్థులు, శ్రీ అమ్మవారిని దర్శించి విశేష ఫలములు పొందుచున్నారు.

## ఆలయ చరిత్ర

ఇప్పటి వరకు పెదకొండూరులో దక్షిణ హిందూ దేశ శాసన సంపుటము 10 వ భాగములో 174, 189, 521 నెంబర్లు గల మూడు శాసనాలు లభించినవి. 174 శాసనం ప్రకారం శక సంవత్సరం,1092 క్రీ.శ. 1170 నాటిది. శ్రీ విక్రమ చోడ మహారాజు యొక్క సామ్రాజ్యం విస్తరించజేసిన వాడును, నాలుగు ఇండ్లకు యజమాని కొండూరు గ్రామాధిపతి అయిన కన్దరాజు అను బ్రహ్మణుడొకడుండెడివాడు. ఆయనకు కామరాజు, ద్రోణరాజు, భీమరాజు, రామరాజు అను నలుగురు పుత్రులుండిరి. ద్రోణరాజు కొడుకు మల్లదేవుడు శ్రీ రాజరాజేశ్వర స్వామి నిత్య దీపారాధనల కొరకు 24 ఆవులను 1000 దండముల విస్తీర్ణము గల క్షేత్రమును దానమొసగెనని తెలియుచున్నది.

1134 లో జరిగిన గోదావరి సంగ్రామం నాటికి కొండూరు 18–20 గ్రామాలకు కేంద్రంగా ఒక పెద్ద గ్రామంగా ఉండటంతో పెదకొండూరు అని పిలువబడుచున్నదని తెలియుచుంది. కన్దరాజు నాలుగు కుటుంబాలలో పెద్ద వాడును, ఆయన కాలంలో విక్రమ చోడ దేవరాజు యొక్క సామ్రాజ్య లక్ష్మిని కూడా నిలబెట్టెనని శాసనములు తెలియుచున్నది. 189వ శాసనము క్రీ.శ 1173 నాటిది. ఈ శాసనం ప్రకారం సపూర్వం గుడులలో మగవారితో పాటు కొందరు స్వామినులు కూడా పరిచారికలుగా ఉంటూ మాన్యాలు అనుభవించేవారని తెలియుచున్నది.

# మన ఎంపిలు, ఎమ్మెల్యేలు


నాదెండ్ల మనోహర్
ఎమ్మెల్యే, తెనాలి


మక్కెన మల్లికార్జునరావు, వినుకొండ


కాసు కృష్ణారెడ్డి, నరసరావుపేట


గుదిబండి వెంకటరెడ్డి, దుగ్గిరాల


గాదె వెంకటరెడ్డి, బాపట్ల


జంగా కృష్ణమూర్తి, గురజాల


రాయపాటి సాంబశివరావు
ఎంపి గుంటూరు


వల్లభనేని బాలశౌరి
ఎంపి తెనాలి


దగ్గుబాటి పురందేశ్వరి
ఎంపి బాపట్ల


జెడి శీలం
రాజ్యసభ సభ్యుడు


లాల్‌జాన్ బాషా
రాజ్యసభ సభ్యుడు


మేకపాటి రాజమోహనరెడ్డి
ఎంపి నరసరావుపేట


యర్రం వెంకటేశ్వరరెడ్డి
ఎమ్మెల్యే, సత్తెనపల్లి


షేక్ నంబూరు సుభాని
ఎమ్మెల్యే, గుంటూరు-1


పిన్నెల్లి లక్ష్మారెడ్డి
ఎమ్మెల్యే, మాచర్ల


దేవినేని మల్లికార్జునరావు
ఎమ్మెల్యే, రేపల్లె


సోమరౌతు సతీష్ పాల్‌రాజ్
ఎమ్మెల్యే, వేమూరు


డొక్కా మాణిక్యవరప్రసాద్
ఎమ్మెల్యే, తాడికొండ


కన్నా లక్ష్మీనారాయణ
పెదకూరపాడు ఎమ్మెల్యే, సహకార, రోడ్డు రవాణ మంత్రి


ధూళిపాళ్ళ నరేంద్ర, పొన్నూరు


తాడిశెట్టి వెంకటరావు, గుంటూరు-2


రావి వెంకటరమణ, ప్రత్తిపాడు


మోపిదేవి వెంకటరమణ, కూచినపూడి


మర్రి రాజశేఖర్, చిలకలూరిపేట


మురుగుడు హనుమంతరావు,మంగళగిరి

## ఎంత పానకం ఒలికినా..

# చీమ చేరదు.. ఈగ వాలదు

## మంగళాద్రిలో నృసింహుని మహత్యం



మంగళగిరిలో వేంచేసి ఉన్న లక్ష్మీనృసింహ స్వామి

(ఆన్‌లైన్...మంగళగిరి)

తీపి పదార్థం పడితే క్షణాలలోనే ఈగలు, చీమలు చేరడం సహజంగా సృష్టి ధర్మం. ఈ ధర్మానికి విరుద్ధంగా బహుతీపిగా వుండే పానకం భారీగా ఒలికిపోతాన్నా.. పానక ద్రవ్యం మడ్డిలా పేరుకుపోతున్నా మంగళాద్రి పర్వతంపై చీమలు, ఈగలు ఈ తీపి చెంత చేరవు. ఇది మంగళాద్రి శ్రీ పానకాల నృసింహస్వామి వారు నేటి కృతయుగంలో సైతం ప్రత్యక్షంగా చూపుతున్న మహత్యం. అలాగే భక్తుడు నివేందించిన నైవేద్యాన్ని నేరుగా స్వీకరించే ఏకైక ప్రత్యక్ష దైవంగా స్వీకరించే భగవానుడు కూడా మంగళగిరి శ్రీ పానకాల నృసింహస్వామివారే కావడం ఈ క్షేత్రం గొప్పతనం. ఈ క్షేత్రానికి శ్రీ ఆంజనేయస్వామి క్షేత్రపాలకుడై పట్టణానికి నాలుగు దిక్కులా సంరక్షకునిగా వున్నారు.

గుంటూరు జిల్లాలో కృష్ణా తీరానికి సమీపంలో వున్న ప్రసిద్ధ పుణ్యక్షేత్రాలలో అమరావతి, సీతానగరం, మంగళగిరి ప్రముఖమైనవి. ప్రకాశం బ్యారేజి చేరువలో రెండు అతి పెద్ద క్షేత్రాలు వుండగా వాటిలో ఒకటి శక్తి క్షేత్రమైన కనకదుర్గమ్మ వారి ఆలయం కాగా, రెండవది దక్షిణ భారతావనిలోనే ప్రసిద్ధ వైష్ణవ క్షేత్రమైన మంగళగిరి శ్రీ లక్ష్మీనృసింహ స్వామివారి దేవస్థానం. యాత్రికులు దర్శించవలసిని మహా పుణ్యక్షేత్రం. కేవలం ఆధ్యాత్మికంగానే కాకుండా చక్కని ఆహ్లాదభరితమైన పట్టణంగా కూడా మంగళగిరి యాత్రికులను అలరిస్తున్నది. యుగయుగాల దేవుడు శ్రీ పానకాల నృసింహస్వామి వారిని దర్శించుకునేందుకు సులువైన రీతిలో ఘాట్ రోడ్డు నిర్మాణం కూడా జరిగింది.

### పురాణ ప్రాశస్త్యం

దివ్య క్షేత్రంగా విరాజిల్లుతున్న మంగళగిరికి పురాణాలలో చాలా గొప్ప ప్రాశస్త్యం వుంది. ఈ క్షేత్రంలో ఎగువ, దిగువ సన్నిధులు ఉన్నాయి . రెండు సన్నిధులలో శ్రీ నృసింహ స్వామి వారే మూలదైవం. ఎగువ సన్నిధిలో శ్రీ స్వామి వారు శ్రీ పానకాల నృసింహస్వామిగా ప్రసిద్ధి చెందారు. ఈ స్వామి యుగయుగాల దేవుడు. యుగయుగాల్లో కెల్లా తొలియుగంగా పురాణాలలో పేర్కొనబడే కృతాయుగారంభంలోనే శ్రీ స్వామి వారు ఇక్కడ పర్వతం పై స్వయంభువై వెలశారు. వ్యాప ప్రణీతమైన బ్రహ్మ వైవర్త పురాణంలో ఈ క్షేత్రం ఆవిర్భావం గురించి వివరించారు. నముచి అనే రాక్షసుణ్ణి శ్రీ విష్ణుమూర్తి సంహరించే సందర్భంగా ఇక్కడ స్వామివారు వెలశారు.

ముని పుంగవులను బాధిస్తున్న నముచిని సంహరించేందుకు శ్రీ స్వామివారు సముద్రపు నురగలో ముంచిన సుదర్శన చక్ర రూపంలో వెంటాడగా నముచి భయపడి ఈ పర్వతం మీది సొరంగంలోకి పారిపోయినట్టు పురాణాలు చెబుతున్నాయి. సుదర్శన రూపుడైన శ్రీ స్వామి ఆ సొరంగంలోకి వెళ్లి నముచిని అక్కడే వధించినట్టు క్షేత్ర పురాణం చెబుతున్నది. సందర్భంగా మిక్కిలి ఉగ్రరూపుడైన శ్రీ స్వామివారిని ప్రసన్నం చేసుకునేందుకు మంగళస్వరూపిణియైన శ్రీ అమ్మవారు దేవతలతో కలిసి స్వామిని అర్చించినట్టు చెబుతారు.

ఈ సందర్భంగా స్వామివారు శాంతించి తాను ఇక్కడే నివసించగలనని కృతయుగంలో అమృతాన్ని, త్రేతాయుగంలో నెయ్యిని, ద్వాపరయుగంలో గోక్షీరాన్ని, కలియుగంలో బెల్లం పానకాన్ని సేవిస్తూ భక్తుల కోర్కెలను తీర్చగలనని స్వామి వారు దేవతలకు అభయమిచ్చారు.

ఆనాటి నుంచి శ్రీ స్వామివారు తాను చెప్పిన విధంగా ఆయా యుగాలలో భక్తుల నుంచి అమృతం, నెయ్యి, గోక్షీరం, బెల్లం పానకాన్ని ప్రత్యక్షంగా సేవిస్తూ భక్తులను ఆనంద పారవశ్యులను గావిస్తున్నారు. ఈ క్షేత్రంలో భక్తులు సమర్పించిన నివేదనాన్ని స్వయంగా స్వీకరించి సగభాగాన్ని భక్తులకు తన ప్రసాదంగా కక్కివేయడం ఓ అద్భుతమైన దృశ్యం. ఇదే గొప్ప విశేషమనుకుంటే కింద భారీగా ఒలికిపోయే బెల్లం పానకంపై ఈగలు, చీమలు చేరకపోవడం మరో ఘనమైన ఘటనగా చెప్పుకోవచ్చు.

ఇంతటి ప్రాశస్త్యాన్ని కలిగిన ఎగువ సన్నిధిపైకి చేరుకోవడం వయసు పైబడిన వారికి కష్ట మనిపించడంతో ఇటీవల ఘాట్‌రోడ్డుకూడా విజిటియం ఉడా సహకారంతో నిర్మించారు. ఘాట్ రోడ్డునిర్మాణానికి 25లక్షలు ఇచ్చిన ఆసంస్థ 5లక్షల వ్యయంతో ఘాట్ ముఖద్వారాన్ని కూడా నిర్మించింది. ఇక దిగువ సన్నిధి విషయానికొస్తే మూడు చూడచక్కని గోపుర ప్రాకారాలతో శ్రీ రాజ్యలక్ష్మి సమేత నృసింహ స్వామి వారి దేవస్థానం భక్తులను ఎంతగానో ఆకట్టుకుంటున్నది.

ఇక్కడ స్వామివారి విగ్రహాన్ని ద్వాపరయుగంలో ధర్మరాజు ప్రతిష్ఠించాడని పురాణాలు చెబుతున్నాయి. అమ్మవారిని ఎడమ తొడపై కూర్చుండబెట్టుకుని వున్నట్టుగా ఈ విగ్రహం కనిపిస్తుంది. శ్రీ స్వామి వారి ఆలయం పక్కనే శ్రీ రాజ్యలక్ష్మి అమ్మవారి ఆలయం వుంది. ఈ అమ్మవారి విగ్రహం భక్తులను విశేషంగా ఆకట్టుకునే విధంగావుంటుంది. ఈ ఆలయ ప్రాకారంలోనే శ్రీ కోదండరామస్వామి వారి ఆలయం దక్షిణముఖంగా వుంది. ఆ పక్కనే అద్దాల మహల్, వాహనశాల, మండపం వున్నాయి.

### అద్భుత కళాఖండం మంగళగిరి గాలిగోపురం

దిగువ సన్నిధికేకాదు మొత్తంగా మంగళగిరికే గుర్తింపును తెచ్చిన అద్భుతమైన కళాఖండం తూర్పు రాజగోపురం. ధరణి కోట సంస్థానాధీశుడైన రాజా వాసిరెడ్డి వెంకటాద్రినాయుడు 1807-09 కాలంలో ఈ గోపుర నిర్మాణాన్ని చేపట్టారు. తక్కువ పీఠంతో అత్యంత ఎక్కువగా ఎత్తులేచిన ఈ గోపురం నిర్మాణ విశిష్టత దృష్ట్యా యావత్ భారతదేశంలోనే అద్భుతమైన నిర్మాణంగా ప్రసిద్ధి గాంచింది. ఈ పదకొండు గోపురానికి మరో రెండేళ్లలో రెండు శతాబ్దాలు నిండనున్నాయి. ఇప్పటికే 25లక్షల వ్యయంతో గాలిగోపుర నిర్మాణానికి అద్భుతంగా మెరుగులు దిద్ది సహజ నిర్మాణం దెబ్బ తినకుండా గోపురానికి మరమ్మతులు జరిపి ప్రతి ఒక్కరూ ఆశ్చర్యపోయేవిధంగా తీర్చిదిద్దారు.

### క్షేత్రపాలకులు ఆంజనేయస్వామి

మంగళగిరి క్షేత్రానికి క్షేత్రపాలకునిగా శ్రీ ఆంజనేయస్వామి వున్నారని పురాణాలు చెబుతాయి. ఇందుకు అనుగుణంగా క్షేత్రానికి నాలుగు వైపులా ఆంజనేయ స్వామి ఆలయాలు వున్నాయి.

తూర్పున తోపు ఆంజనేయ స్వామి, పడమరన కోనేటిలోని ఆంజనేయస్వామి ఆలయం, ఉత్తరాన ఎగువ సన్నిధిలో విరిగిపడే కొండచరియను చేతితో అడ్డుకొంటున్నట్టుగా మలచిన శ్రీ వీరాంజనేయ స్వామి, దక్షిణాన మిద్దె సెంటర్‌లోని శ్రీ ప్రపత్తి ఆంజనేయస్వామి ఆలయం వున్నాయి.

మంగళగిరి పానకాల స్వామి దేవాలయం, గాలిగోపురం

# లాభాల బాటలో ఇసుకపల్లి చేనేత సహకార ఉత్పత్తి సంఘం

('ఆన్‌లైన్' - రేపల్లె)

రెండున్నర దశాబ్దాలుగా ఇసుకపల్లి చేనేత సహకార ఉత్పత్తి విక్రయ సంఘం లిమిటెడ్ అధ్యక్షులు కౌతవరపు వెంకట సుబ్బారావు, ఉపాధ్యక్షుడు నీలి కనకయ్య, పాలకవర్గ సభ్యులు, చేనేత కార్మికుల సమిష్టి కృషి ఫలితంగా లాభాల దిశగా పయనిస్తున్నది. 1938 ఫిబ్రవరి 12వ తేదీన కౌతరపు రామ్మూర్తి ఈసొసైటీని స్థాపించారు. గుంటూరు జిల్లా పరిధిలో 42 చేనేత సొసైటీల్లో ఇసుకపల్లి చేనేత సొసైటీ ఆర్థిక పరిపుష్టిని సాధించి మందలాది మంది చేనేత కార్మికులకు చేయూతనందిస్తూ స్వయం ఉపాధి కల్పిస్తున్నది. ఈసొసైటీలో మగ్గాలపై పనిచేస్తున్న చేనేత కార్మికులు దుప్పట్లు, టవల్సు, లుంగీలు, షర్టింగ్, దోవతులు, న్యాప్‌కిన్స్, పిల్లో కవర్సు ఉత్పత్తిచేసి జిల్లా వ్యాప్తంగా హోల్‌సేల్‌గా సరఫరా చేస్తున్నారు. ప్రతి ఏటా 50లక్షల మేర చేనేత ఉత్పత్తులు విక్రయాలు చేస్తూ టర్నోవరు చేస్తున్నారు. వీటితో పాటు కొత్తరకమైన జ్యాకార్డును ఈ సొసైటీలో తయారు చేస్తున్నారు. 190మంది సభ్యులున్న ఇసుకపల్లి సొసైటీ వ్యాపార విస్తీర్ణము బ్లాక్ నెం 12 నుండి 14, 32 నుంచి 35 వరకు పరిమితమై వున్నది.

1956లో ఇసుకపల్లి చేనేత సొసైటీ అధ్యక్షునిగా కౌతరపు వెంకట సుబ్బారావు పదవీ బాధ్యతలు చేపట్టారు. అప్పటికీ ఈసొసైటీ రూ 5వేలు నష్టాల్లో వుండగా, ప్రస్తుతం 24,29,260 రూపాయలు గుంటూరు జిల్లా కేంద్ర సహకార బ్యాంకు రేపల్లె శాఖలో వున్నాయి. సొసైటీ షేర్ క్యాపిటల్ 5,93,885 రూపాయలు, సభ్యుల వాటా ధనము 2,23,490 రూపాయలు, ప్రభుత్వ వాటా ధనము 3,70,395 రూపాయలు, రిజర్వ్‌ఫండ్ కింద 14,22,349 రూపాయలు, నగదు పరిమితి కింద 20.37 లక్షలు వుంది. 2004-05 సంవత్సరంలో నికరలాభం రూ 4,73,387.57పైసలు కాగా, ప్రభుత్వం 4,11,118 రూపాయలు రిబేటు, బకాయిలు సొసైటీకి చెల్లించాల్సి వుంది. అప్కో నుంచి 4,27,370 రూపాయలు ఈసొసైటీకి జమ కావాల్సివుంది. ఈ సొసైటీలో అయిదుగురు సిబ్బంది పనిచేస్తున్నారు. సొసైటీకింద సమారు కోటి రూపాయల విలువగల సొసైటీ భవనం, వర్క్‌షెడ్, అద్దకాల ఖార్ఖానా ఆస్తులు వున్నాయి. కాగా పాలకవర్గ డైరెక్టర్లుగా మాచర్ల వీరరాఘవయ్య, దివి తాతయ్య, అవ్వారు వెంకటేశ్వరరావు, కౌతరపు వెంకట నాంచారరావు, బట్టు వెంకట సీతారామయ్య, కొర్నిపాటి భారతి, గుర్రం నాగమల్లేశ్వరమ్మలతోపాటు సహాయ అభివృద్ధి అధికారిగా ఎస్.రమేష్, మేనేజర్‌గా శోభన్‌బాబు, సభ్యులు సొసైటీ అభివృద్ధికి తమవంతు కృషి చేస్తున్నారు.

## సొసైటీ అధ్యక్షుడు వెంకట సుబ్బారావు



ఇసుకపల్లి చేనేత సహకార ఉత్పత్తి, విక్రయ సంఘ భవనం, ఇన్‌సెట్‌లో సొసైటీ అధ్యక్షుడు కౌతరపు వెంకట సుబ్బారావు, ఉపాధ్యక్షుడు నీలి కనకయ్య.

### ఇసుకపల్లి చేనేత సొసైటీలో అమలు చేస్తున్న వివిధ ప్రభుత్వ పథకాలు

★ మగ్గముల ఆధునీకరణ పథకం: ఈ పథకం కింద ప్రభుత్వ సహాయంతో రెండు వీవింగ్ షెడ్డులు నిర్మాణం చేసి, 35 ఫ్రేము మగ్గములు ఏర్పాటు చేసి మగ్గాలపై దుప్పట్లు, టవల్స్, లుంగీలు, షర్టింగ్ ఉత్పత్తి చేస్తున్నారు.

★ చేనేత పారిశ్రామిక త్రిప్టు ఫండ్ సేవింగ్స్, సెక్యూరిటీ పథకం: 1984 నుంచి ఈ సొసైటీలో అమలు చేస్తున్నారు. ఈ పథకం కింద 170 మంది సభ్యులు చేరారు.

★ గృహనిర్మాణ పథకం: ప్రభుత్వ ఆర్థిక సహాయంతో 68 మంది. సభ్యులకు వర్కుషెడ్‌తో కూడిన పక్కా గృహాలు నిర్మించారు.

★ గోడౌన్ కం షోరూమ్ నిర్మాణం పథకం: 1989-90 సంవత్సరంలో ఎన్‌సిడిసి స్పాన్సరు స్కీమ్ ద్వారా 2,03,000 రూపాయలతో గోడౌన్ కం షోరూమ్‌ను నిర్మించారు.

★ చేనేత అభివృద్ధి పథకం : కేంద్ర ప్రభుత్వ పథకం కింద హేండ్లూమ్ డెవలప్ మెంటు సెంటర్, క్వాలిటి డైయింగ్ యూనిట్ కింద 10,17,500 రూపాయలు మంజూరు చేశారు.

★ హెల్త్ ప్యాకేజి పథకం: ఈ పథకం కింద 22,310 రూపాయలతో సొసైటీ పరిధిలోని 70మంది వ్యాధిగ్రస్తులకు వైద్య చికిత్స కోసం నిధులు పంపిణీ చేయటంతోపాటు, ఉచిత వైద్య ఆరోగ్య శిభిరాలు నిర్వహించారు.

★ ప్రాజెక్టు ప్యాకేజి పథకం: సొసైటీ సభ్యులకు నూతన డిజైన్ల తయారీ గురించి రూ 14.30 లక్షలు వెచ్చించి శిక్షణనిచ్చారు.

★ ఇంటిగ్రేటెడ్ కో ఆపరేటివ్ డెవలప్‌మెంట్ ప్రాజెక్టు(గుంటూరు): వస్త్రాల వ్యాపారానికి మార్జిన్ మనీ కింద రూ 3లక్షలు మంజూరు చేశారు. ఈ నిధులతో సంఘ సభ్యులకు అదనంగా పని కల్పించారు.

★ ఇంటిగ్రేటెడ్ హ్యాండ్‌లూమ్ ట్రైనింగ్ ప్రాజెక్టు(ఐహెచ్‌టిపి): కేంద్ర ప్రభుత్వం 2004-05 సంవత్సరానికి సంఘ సభ్యులు 20మంది సభ్యులకు శిక్షణనిచ్చారు. శిక్షణకోసం 4,29,250 రూపాయలు మంజూరు చేశారు. ఈ సందర్భంగా ఇసుకపల్లి చేనేత సహకార ఉత్పత్తి సొసైటీ అధ్యక్షుడు కౌతరపు వెంకట సుబ్బారావు 'ఆన్‌లైన్'తో మాట్లాడుతూ సొసైటీ సభ్యులు, పాలకవర్గం సిబ్బంది, స్థానిక ఎమ్మెల్యే దేవినేని మల్లికార్జునరావు, తెనాలి ఎంపి వల్లభనేని బాలశౌరిలు సమష్టిగా అందిస్తున్న కృషి ఫలితంగా అభివృద్ధి బాటలో పయనిస్తోందన్నారు. సొసైటీ పాలకవర్గ సభ్యులకు 3.70లక్షలు డివిడెండ్ అందచేశామన్నారు. వృద్ధాప్య ఫించన్లు వందమందికి, క్రెడిట్‌కార్డులు 64మందికి అందచేశామన్నారు. దీని వల్ల రూ 5వేల నుంచి 25వేల రూపాయలకు బ్యాంకులో రుణసౌకర్యాన్ని పొందవచ్చన్నారు. పాతపద్ధతి ప్రకారం వస్త్రాల అమ్మకాలపై 20శాతం రిబేటును సంవత్సరంలో 60 రోజులు కల్పించాలని కోరారు. రిబేటు తగ్గించటం వల్ల 50శాతానికి వ్యాపారం తగ్గిందన్నారు. అదేవిధంగా సభ్యుల త్రిప్టుఫండ్ ప్రతి సంవత్సరం రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలు సభ్యులకు కంట్రిబ్యూషన్ అందేవిధంగా చూడాలన్నారు: సభ్యుల త్రిప్టుఫండ్ బకాయిలు వెంటనే విడుదలచేయాలని ఐసిడిపి నుంచి వడ్డీ లేని రుణాన్ని సంఘానికి రూ 5లక్షలు మంజూరు చేయాలని ఆయన ప్రభుత్వాన్ని కోరారు.

## నాలుగు దశాబ్దాలుగా కార్మికుల సేవలో

# గుంటూరు మున్సిపల్ వర్కర్స్ యూనియన్

(ఆన్‌లైన్ - గుంటూరు సిటీ)

మునిసిపల్ కార్మికుల సంక్షేమమే లక్ష్యంగా నాలుగు దశాబ్దాల క్రితం ఏర్పడిన 'ది గుంటూరు మునిసిపల్ వర్కర్స్ యూనియన్' అవిశ్రాంతంగా కృషి చేస్తున్నది. యూనియన్ ఆవిర్భావం జరగకముందు ఎంతో దయనీయంగా ఉండే కార్మికుల జీవన స్థితిగతులు యూనియన్ జరిపిన అనేక పోరాటాల ఫలితంగా నేడు వారి జీవితాల్లో వెలుగులు ప్రసరిస్తున్నాయి. డ్వాక్రా గ్రూపులుగా ఏర్పడిన పారిశుధ్య కార్మికులు కార్పొరేషన్ సహకారంతో శానిటేషన్ పనులు, ట్రాక్టర్లను లీజుకు తిప్పుతూ స్వయం సమృద్ధి సాధించారు. కొన్ని గ్రూపులు అయితే ట్రాక్టర్లపై బ్యాంకుల నుంచి తీసుకొన్న రుణాలను సకాలంలో తీర్చేసి వాహనాలపై పూర్తి యాజమాన్య హక్కులు పొందాయి. కార్మికులకు ఆపద్బాంధువుడిగా ఉన్న వరికల్లు కోటేశ్వరరావు అకాల మరణం చెందిన తరువాత ఆయన తనయుడు వరికల్లు రవికుమార్ యూనియన్‌ను ముందుకు నడిపిస్తున్నారు.

### కార్మికులకు బాసటగా యూనియన్

ఆకలి, నిరక్షరాస్యత, అంటరానితనాల మధ్య కొట్టుమిట్టాడే పారిశుద్ధ్య కార్మికుల అభ్యున్నతి కోసం కమ్యూనిస్టు పార్టీ నేతృత్వాన 'ది గుంటూరు మునిసిపల్ వర్కర్స్ యూనియన్' ఏర్పడింది. పారిశుధ్య కార్మికులంతా అధికారుల చేతల్లు కీలుబొమ్మలుగా మారి ఎన్నో బాధలను అనుభవించారు. అధికారుల ధోరణిపై యూనియన్ రాజీ లేని పోరాటం చేసింది. కార్మికులకు సామాజిక జీవితంలోను, ఉద్యోగ నిర్వహణలోను సమానత్వాన్ని, స్వేచ్ఛని సాధించి పెట్టింది. రౌతు నాగయ్య, అంతరాజు చిన్నముని, ఉప్పలపు సుబ్బరామయ్య, భూపతి వీరరాఘవులు, వరికల్లు కోటేశ్వరరావు లాంటి నాయకులు యూనియన్ పొత్తిటి నుంచే తమ పోరాటపు అడుగులను ప్రారంభించారు.

### యూనియన్ సాధించిన విజయాలు

1960 చివరిలో మునిసిపల్ రంగంలోకి ప్రవేశించిన వరికల్లు కోటేశ్వరరావు కార్మికుల జీవితాలను పలు కోణాల నుంచి పరిశీలించారు. పారిశుద్ధ్య కార్మికుల హక్కులకు రూపకల్పన చేసి అందుకు అనుగుణంగా ఉద్యమాలను నడిపి ఆశించిన ఫలితాలను రాబట్టి కార్మికుల జీవితాలకు మెరుగులు దిద్దడంలో అసాధారణమైన పాతను నిర్వహించారు. కార్మిక సంక్షేమం కోసం అనేక జీవోలను ప్రభుత్వం ద్వారా విడుదల చేయించారు.

దీని ఫలితంగానే 1977వ సంవత్సరం నుంచి కార్మికులను 4వ తరగతి ఉద్యోగులుగా గుర్తించుతూ ప్రభుత్వం ఉత్తర్వులు ఇచ్చింది. అప్పటివరకూ కార్మికునికి నెలకు రూ. 50గా ఉన్న మూలవేతనం టైంస్కేలుగా రూపొందింది. రిటైర్ అయిన కార్మికులకు పింఛన్‌తో బాటు అన్ని సౌకర్యాలు సమకూరాయి. ప్రస్తుతం పిహెచ్ వర్కర్లు 2005 పిఆర్‌సి ప్రకారం నెలకు దాదాపుగా రూ. 9 వేలకు పైగా జీతం పొందుతున్నారు. కార్మికులకు ఉద్యోగ భద్రత కల్పించడమే కాకుండా నగరంలోని దర్గా మాణ్యం, డిఎస్‌నగర్, నల్లచెరువు, సుద్ధపల్లి డొంక లాంటి ప్రాంతాల్లో ఇళ్ళ స్థలాలు కేటాయింపు చేయించేందుకు పోరాటాలు చేశారు. అంతేకాకుండా *(మిగతా 139లో..)*

## నాలుగు దశాబ్దాలుగా కార్మికుల సేవలో...

# 'గుంటూరు మునిసిపల్ వర్కర్స్ యూనియన్'

(138వ పేజీ తరువాయి)

కార్మికులను కౌన్సిలర్లుగా గెలిపించిన ఘనత కూడా కోటేశ్వరరావుకే దక్కుతుంది.

ఉపాధి కోల్పోయిన బదిలీ కార్మికులకు అండగా...

నేడు ప్రైవేటు కార్మికులకుగా ఉన్న వారంతా 1994కు ముందు బదిలీ కార్మికులుగా పిలవబడేవారు. పర్మినెంటు కార్మికులు చనిపోయిన, రిటైర్ అయిన , గైర్హాజరైన, ప్రమోషన్ పొందిన సెలవు పెట్టిన వారి స్థానాల్లో బదిలీ కార్మికులు పని చేసేవారు. 1996లో కార్మికులు రాష్ట్ర వ్యాప్త సమ్మె చేసిన సందర్భంలో బదిలీ కార్మికుల సమస్య ప్రధాన అంశంగా నిలిచింది. దీనిపై చర్చించిన ప్రభుత్వం 581, 30 నెంబరు జీవోలను జారీ చేసింది. ఫలితంగా వేలమంది కార్మికులకు ఉపాధి లభించింది.

సొసైటీ, డ్వాక్వా గ్రూపుల ఏర్పాటు

యూనియన్ ఆధ్వర్యంలో సొసైటీ, డ్వాక్వా గ్రూపులను ఏర్పాటు చేసి వాటి ద్వారా కార్మికులను పనులు చేసుకోవడానికి మార్గం కల్పించింది. ఆ నాటి యూనియన్ ప్రధాన కార్యదర్శి వి.కోటేశ్వరరావు నేతృత్వంలో 1999లో ఒక్కొక్క గ్రూపునకు 10 మంది సభ్యులతో ఝాన్సీ స్త్రీ సంఘం, కల్పనా జోషి స్త్రీ సంఘంలు ఏర్పాటు అయ్యాయి.. ఆ నాటి కార్పొరేషన్ కమిషనర్ కృష్ణ బాబు యూనియన్ నేత కోటేశ్వర రావు విజ్ఞప్తి మేరకు రెండు సంఘాలకు పారిశుద్ధ్య పనులు అప్పగించారు. వీటి ఆదర్శంతో ఎన్నో గ్రూపులు ఏర్పడి నేడు వేల సంఖ్యలో పారిశుద్ధ్య కార్మికులు ఉపాధి పొందుతున్నారు. కార్మికుల వేతనం రూ. 35 నుంచి దశలవారీగా నేడు రూ. 80కు పెంపుదల చేయించడంలో యూనియన్ క్రియాశీలక పాత్రను పోషించింది. అయితే ఇటీవల పారిశుద్ధ్య కాంట్రాక్టుల్లో టెండర్ పద్ధతిని ప్రవేశ పెట్టడం వలన నేడు 300 మంది కార్మికులు ఉపాధి కోల్పోయారు. ప్రస్తుతం కాంట్రాక్టు పద్ధతిపై పని చేస్తున్న వారిని పర్మినెంటు కార్మికులుగా గుర్తించే వరకూ యూనియన్ పోరాటం జరుపుతుందని ప్రధాన కార్యదర్శి వరికల్లు రవికుమార్ పేర్కొన్నారు.

బాపట్ల ఇంజనీరింగ్ కళాశాల భవనం

BAPATLA ENGINEERING COLLEGE



# కేంబ్రిడ్జి ఆఫ్ ఆంధ్రప్రదేశ్‌గా బాపట్ల ఎడ్యుకేషన్ సొసైటీ

(ఆన్‌లైన్-బాపట్ల)

కళల కాణాచి,అపర బాసర, చారిత్రాత్మక సాక్ష్యాలకు ప్రత్యామ్నాయ రూపకం, కేంబ్రిడ్జి ఆఫ్ ఆంధ్రప్రదేశ్‌గా ప్రాచుర్యం పొందిన భావపురి. సముద్రతీర ప్రాంతంలో ఇసుక ప్రాంతంగా పేరుండి నిష్ప్రయోజనంగా వున్న భావపురి 1964లో బాపట్లకు చెందిన మేధావులు సాంకేతిక విద్య ప్రపంచానికి సువర్ణ మణిహారంగా, చదువుల తల్లి నుదుటి పైన సిరులొలికే సింధూరంగా బాపట్ల ఎడ్యుకేషన్ సొసైటీని ప్రారంభించారు. సొసైటీ ఏర్పాటు చేసిన కొద్ది కాలంలోనే కర్లపాలెం రోడ్డులో తీరప్రాంత గ్రామాల్లోని ప్రజలను అక్షరాస్యులుగా తీర్చి దిద్దాలనే సంకల్పంతో బాపట్ల ఆర్ట్స్ అండ్ సైన్సెస్ కళాశాలను ప్రారంభించారు. రాజకీయంగా, సామాజికంగా జరుగుతున్న మార్పుల్లో భాగంగా బాపట్ల ఎడ్యుకేషన్ సొసైటీ అధ్యక్షుడిగా ముప్పలనేని శేషగిరిరావు ఎంపికయ్యారు. ముప్పలనేని రాకతో బాపట్ల ఎడ్యుకేషన్ సొసైటీ దినదినాభివృద్ధి చెందుతూ, తన 40 సంవత్సరాల జీవితాన్ని ఎడ్యుకేషన్ సొసైటీకి అంకితం చేసి కేంబ్రిడ్జి ఆఫ్ ఆంధ్రప్రదేశ్‌గా తీర్చి దిద్దారు. అంతర్జాతీయంగా బాపట్ల ప్రాంతానికి గుర్తింపు తేవడానికి ఇప్పటికీ కృషి చేస్తూనే ఉన్నారు. అంతర్జాతీయ స్థాయిలో ప్రమాణాలను పాటిస్తూ అద్వితీయ రీతిలో 'గేట్'ర్యాంకులను సాధిస్తూ ఆశించిన విజయాలు అందిస్తూ మహోన్నత లక్ష్యాలతో ముందుకు సాగుతూ ఆంధ్రప్రదేశ్‌లో అగ్రగామిగా నిలిచిన ఏకైక విద్యాసంస్థ బాపట్ల ఎడ్యుకేషన్ సొసైటీ. కెజి నుండి పిజి వరకు విద్యాభ్యాసాన్ని ఒక చోట అందించే లక్ష్యాన్ని సాకారం చేస్తూ సాంకేతిక విద్యారంగంలో సాటిలేని ఫలితాలకు, నేటి విద్యాబోధనలకు ప్రతీకగా నిలిచింది బాపట్ల ఇంజనీరింగ్ కళాశాల. దేశ విదేశాలలో ఈ కళాశాలలో చదువుకొన్న విద్యార్థిని, విద్యార్థులు సాధిస్తున్న ప్రగతి ఎడ్యుకేషన్ సొసైటీకి ప్రశంసలు.

ముప్పలనేని శేషగిరిరావు, బాపట్ల ఎడ్యుకేషన్ సొసైటీ అధ్యక్షుడు

బాపట్ల ఇంజనీరింగ్ కళాశాల

బాపట్ల ఇంజనీరింగ్ కళాశాల 1981లో స్థాపించబడి ఎఐసిటిఇ న్యూఢిల్లీ వారిచే ఆమోదించబడింది. కళాశాలలోని ఆరు కోర్సులు ఎన్‌బిఎ గుర్తింపు స్థాయిని పొందటంతో పాటు ప్రపంచ బ్యాంకు మరియు కేంద్ర ప్రభుత్వ మానవ వనరులశాఖ వారి సాంకేతిక ప్రమాణాల ఉన్నతిని సాధించే కార్యక్రమం ద్వారా అనుసంధాన సంస్థగా ఎంపిక చేయబడింది. ఎఐసిటిఇ, యుజిసి వారి ద్వారా స్వయం ప్రతిపత్తి పొందబోతున్నది. నాలుగు లక్షల చదరపు అడుగులతో సువిశాలమైన ప్రాంగణంలో సిహెచ్ఇ, (మిగతా 142లో..)






























# కేంబ్రిడ్జ్ ఆఫ్ ఆంధ్రప్రదేశ్‌గా బాపట్ల ఎడ్యుకేషన్ సొసైటీ



బాపట్ల ఆర్ట్స్ సైన్సు కళాశాల

(140వ పేజీ తరువాయి)

సిఇ, సిఎస్ఇ, ఇసిఇ, ఇఇఇ, ఇఐఇ, ఐటి మరియు ఎంఇ, ఎంటెక్‌లో ఇసిఇ మరియు ఎంఇ, క్యాడ్, క్యామ్ పోస్ట్‌గ్రాడ్యుయేషన్ స్థాయిలో ఎంసిఎలతో సహా ఆరు సైన్సు కోర్సులు కలిగివుంది.

గత నాలుగు సంవత్సరాలుగా ప్రతి సంవత్సరం 150 మందికి పైగా విద్యార్థులు 'గేట్'లో అర్హత పొందుతున్నారు. 1997 'గేట్' సివిల్ ఇంజనీరింగ్‌లో అఖిల భారతస్థాయిలో ప్రథమస్థానం సాధించారు. 2000 నుంచి 2003 సంవత్సరాలలో మ్యాథ్స్ ఒలంపియాడ్‌లో ప్రథమ స్థానాన్ని సాధించారు.

అంతర్జాతీయ స్థాయిలో సెంట్రలైజ్‌డ్ ఎయిర్ కండిషన్ లైబ్రరీ, ల్యాబ్ సదుపాయం కలదు. 42,767 సంపుటలతో 10 విదేశి పత్రికలతో కలిసి 154 సాంకేతిక పత్రికలతో గ్రంథాలయం నిర్వహించబడుతున్నది. ఇందులో విద్యార్థులకు 30 టెర్మినల్స్ ద్వారా 250 విదేశీ పత్రికలు చదువుకునే అవకాశం గల డిజిటల్ లైబ్రరీ సౌకర్యం కలదు.

## బాపట్ల ఫార్మసీ కళాశాల

బాపట్ల ఎడ్యుకేషన్ సొసైటీ మరో ఆణిముత్యం ఫార్మసీ కళాశాల. ఈ కళాశాల డి.ఫార్మసీ, బి.ఫార్మసీ, ఎం.

ఫార్మసీతో పాటు ఫార్మాస్యూటికల్ బయోటెక్నాలజీ కోర్సులకు రీసెర్చి కళాశాలగా గుర్తింపు పొందింది.

## పాలిటెక్నిక్ కళాశాల

బాపట్ల ఎడ్యుకేషన్ సొసైటీ కలికితురాయి. బాపట్ల పాలిటెక్నిక్ కళాశాల . ఈ కళాశాలలో ఇసిఇ, ఇఇఇ, ఎంఇ, సిఎస్ఇ, డిప్లొమో ఇన్ బయోటెక్నాలజీ కోర్సులను అందిస్తుంది.

రాష్ట్రంలోనే కాకుండా ఇతర రాష్ట్రాల నుంచి సైతం ఈ కోర్సుల కోసం విద్యార్థులు

(మిగతా 143లో..)



లైబ్రరీ భవనం

# కేంబ్రిడ్జి ఆఫ్ ఆంధ్రప్రదేశ్‌గా బాపట్ల ఎడ్యుకేషన్ సొసైటీ

(142వ పేజీ తరువాయి)

కళాశాలలలో చేరుతున్నారు.

## ఆర్ట్స్ అండ్ సైన్సెస్ కళాశాల

బాపట్ల ఎడ్యుకేషన్ సొసైటీ ఏర్పడటానికి మూలకారణమైంది. బాపట్ల ఆర్ట్స్ అండ్ సైన్సు కళాశాల. ఈ కళాశాలలో ఇంటర్మీడియట్ స్థాయిలో ఎంపిసి, బైపిసి, హెచ్ఇసి, హెచ్‌టిసి, సిఇసి డిగ్రీ స్థాయిలో బిఎ, బికాం, బిఎస్సీ విభాగాలలోని పలు కోర్సులను విద్యార్థులకు అందుబాటులో వుంచింది.

పిజి విభాగంలో ఎంఎస్‌సి బయోటెక్నాలజీ కోర్సును అందజేస్తున్నారు.

## బాపట్ల జూనియర్ కాలేజి

మారుతున్న కాలాని అనుగుణంగా విద్యార్థులకు సంబంధిత కోర్సులలో శిక్షణ కల్పించాలనే సదుద్దేశ్యంతో బాపట్ల జూనియర్ కళాశాల ఏర్పాటు చేశారు.

రెసిడెన్సియల్ విద్యా విధానంలో వేలకు వేల రూపాయలు ఫీజులు దుర్వినియోగం కాకుండా ఇంటర్మీడియట్ స్థాయిలో ఎంపిసి,బైపిసి, ఇంగ్లీషు మీడియంలో ఏర్పాటు చేశారు.

## బాపట్ల పబ్లిక్ స్కూల్

కెజి నుండి పిజి వరకు విద్యారంగంలో గ్రామీణ స్థాయిలో దశదిశలా విస్తరించాలనే బాపట్ల ఎడ్యుకేషన్ సొసైటీ ఆశయ సాధనకు నిలువుటద్దం బాపట్ల పబ్లిక్ స్కూల్. ఎల్‌కెజి నుండి పదవ తరగతి వరకు ఇంగ్లీషు మీడియంలో విద్యాబోధన చేయడానికి ప్రత్యేకంగా ఏర్పాటు చేశారు.

## వాడరేవులో మెడికల్ సైన్సెస్

బాపట్ల ఎడ్యుకేషన్ సొసైటీ ఆధ్వర్యంలో చీరాల వాడరేవులో పారామెడికల్ కోర్సులతో పాటు డెంటల్,మెడికల్ కాలేజి ఏర్పాటుకు సన్నాహాలు ప్రారంభించడం జరిగింది.



బాపట్ల ఫార్మసీ కాలేజీ

# చారిత్రాత్మకం..

# బాపట్ల పురపాలక సంఘం

(ఆన్‌లైన్-బాపట్ల)

బాపట్ల సాహితీ సాంస్కృతిక,విద్య, రాజకీయ రంగాల్లో అగ్రగామిగా నిలిచింది. 1936లో తొలి జాతీయ కాంగ్రెస్ సమావేశం ఇక్కడ జరిగింది. పలువురు దేశ భక్తులకు నిలయంగా స్వాతంత్రోద్యమంలో బాపట్ల ప్రముఖ పాత్ర వహించింది. ప్రథమ ఆంధ్ర మహాసభకు శ్రీకారం చుట్టింది బాపట్ల. స్వాతంత్రోద్యమంలో స్త్రీ హితేషిణి మండలి ద్వారా మహిళలను చైతన్య వంతం చేసింది బాపట్ల. 'చేయేత్తి జైకొట్టు తెలుగోడా' అన్న వేములపల్లి శ్రీకృష్ణకు స్థానమిచ్చింది బాపట్ల. "ఏ దేశమేగినా ఎందు కాలిడినా పొగడరా నీ తల్లి భూమి భారతిని" అన్న తన గేయ రచన ద్వారా జాతిని జాగృతం చేసిన రాయప్రోలు గడ్డ ఇది.



ప్రస్తుత మున్సిపల్ ఛైర్మన్ కూరపాటి మరియదాసు

మురళీ లేని మురళి గాన రవళి, ఈలపాట రఘురామయ్యకు స్థానమిచ్చింది బాపట్ల. 1927లోనే జిల్లాలో ప్రథమంగా ఇక్కడ హైస్కూలు భవనం ఏర్పాటు జరిగింది. 1945లో దక్షిణ భారతదేశంలోనే ప్రప్రథమంగా ఇక్కడ వ్యవసాయ కళాశాలను ఏర్పాటు చేశారు. 1917లో దిగ్గజులైన పండితులతో శంకర విద్యాలయం, వేదపాఠశాల ఏర్పడి నేటికి కొనసాగుతోంది. చోళ రాజుల కాలంలో1400ల సంవత్సరాల క్రితం భావన్నారాయణ స్వామి పేరుతో దేవస్థాన నిర్మాణం జరిగిన సమయంలో 'భావపురి'గా బాపట్ల ఏర్పడింది. బాపట్ల పంచాయతీగా జిల్లాలో ప్రముఖ పాత్ర వహించిన బాపట్లలో 1951లో ద్వితీయ శ్రేణి పురపాలక సంఘంగా గుర్తింపు పొందింది.

1952నుంచి ఇప్పటి వరకు ఎనిమిది మంది మున్సిపల్ ఛైర్మన్లు పదవులు నిర్వహించారు. 1955 నుంచి 1957 వరకు వెలగపూడి సుబ్బారావు ప్రప్రథమంగా ఛైర్మన్ పదవిని నిర్వహించారు. ఈయన హయాంలో పట్టణంలోని ఇసుక రోడ్లు కంకర రోడ్లుగా రూపాంతరం చెందాయి. కిరోసిన్ దీపాలకు బదులు పెట్రోమాక్స్ లైట్లు వీధి దీపాలుగా మార్చారు. పంచాయతీ కార్యాలయంగా ఉన్న భవనాన్ని ట్రావెలర్స్ బంగళాగా అభివృద్ధి చేశారు.

కమ్యూనిస్టుల సహకారంతో ఇండిపెండెంట్ అభ్యర్థిగా గెలుపొందిన శీరం రాధాకృష్ణమూర్తి 1956వరకు ఛైర్మన్ పదవిని అలంకరించారు. శీరం హయాంలో మున్సిపల్ మార్కెట్ కాంప్లెక్స్ ఏర్పడింది. 1960 నుంచి 1961వరకు, 1969 నుంచి 1970 వరకు కాంగ్రెస్‌పార్టీకి చెందిన కాకుమాను భావన్నారాయణ ఛైర్మన్‌గా పనిచేశారు. ఈయన హయాంలో మున్సిపల్ పార్కులు, పలు పాఠశాలలకు పక్కా భవనాలు, షాపింగ్ కాంప్లెక్సులు, రహదారుల నిర్మాణం జరిగింది. 1970 నుంచి 1971 వరకు యడవల్లి సూర్యనారాయణ ఛైర్మన్ పదవిని అలంకరించారు. ఆయన కాలంలో పార్కుల అభివృద్ధికి రక్షిత మంచినీటి పథకానికి శ్రీకారం చుట్టారు. 1982 నుంచి 1987 వరకు ఛైర్మన్‌గా పదవి నిర్వహించిన తాడి నరసింహారావు పట్టణాన్ని ఎంతో అభివృద్ధి చేశారు. మున్సిపల్ ఆదాయాన్ని పెంచారు. రక్షిత మంచినీటి పథకం రుణం 26లక్షల రూపాయలను ప్రత్యేక గ్రాంటుగా మార్పించారు. సూర్యలంకకు రక్షిత మంచినీటి సరఫరాను చేసి పురపాలక సంఘానికి ఏటా 12లక్షల రూపాయల ఆదాయం పెరిగేలా ఏర్పాటు చేశారు.

షాపింగ్ కాంప్లెక్సులను నిర్మించారు. 1988 నుంచి 1994 వరకు కాంగ్రెస్‌పార్టీకీ చెందిన నీలం సత్యానారాయణ ఛైర్మన్ పదవి నిర్వహించారు. ఈయన హయాంలో మురికివాడల అభివృద్ధికి విశేష కృషిన సల్పారు. 1995 నుంచి 2000 వరకు పదవి నిర్వహించిన తెలుగుదేశంపార్టీకి చెందిన కొటికలపూడి వెంకట రాఘవరావు హయాంలో పురపాలక సంఘంలో ఎనిమిది కోట్ల రూపాయలతో వివిధ అభివృద్ధి పనులు చేపట్టారు.

2001లో మొట్టమొదటి మహిళా ఛైర్మన్‌గా జిట్టా ప్రమీలారాణి ఎన్నికయ్యారు. ఈమె హయాంలో గత 50 సంవత్సరాలలో సాధించలేని అభివృద్ధిని సాధించారు. మున్సిపల్ హైస్కూల్ ఆవరణలో 42లక్షల వ్యయంతో కళాక్షేత్రం, కోటి రూపాయల రామానాయుడు నిధులతో వార్డులలో పలు అభివృద్ధి కార్యక్రమాలు, ఐడిఎస్ఎంటి పథకం కింద కోటి రూపాయలతో రోడ్లు, షాపింగ్ కాంప్లెక్సుల నిర్మాణం,తొమ్మిది కోట్ల రూపాయలతో ఫ్లైఓవర్ బ్రిడ్జి, 2.25 కోట్ల రూపాయలతో ప్రభుత్వ ఆస్పత్రి భవనం, కోటి 80లక్షల రూపాయలతో కోర్టు భవనాలు, రక్షిత మంచి నీటి పథకానికి చెందిన రెండవ సమ్మర్ స్టోరేజి ట్యాంకు నిర్మాణం, మున్సిపల్ కౌన్సిల్ హాలు ఏర్పాటు కార్యక్రమాలను చేపట్టారు. 2005వ సంవత్సరంలో మొదటి సారిగా దళిత వ్యక్తి కూరపాటి మరియదాసు ఛైర్మన్‌గా ఎన్నికయ్యారు.

వీరి హయాంలో 50లక్షల రూపాయల వ్యయంతో మున్సిపల్ భవన నిర్మాణం, ప్రపంచ బ్యాంకు నిధులతో రోడ్ల నిర్మాణం, రెండు కోట్ల 50లక్షల రూపాయల వ్యయంతో అదనపు రక్షిత మంచినీటి పథకం ఏర్పాట్లు జరుగుతున్నాయి. 1951లో బాపట్ల పట్టణం జనాభా 14 వేలు, 11మంది కౌన్సిలర్లతో తొలి కౌన్సిల్ సమావేశాలు జరిగాయి.

1956లో 46వేల జనాభా కలిపి 28 వార్డులుగా అభివృద్ధి జరిగింది. 1991లో పట్టణ జనాభా సుమారు లక్షకు చేరుకోవడంతో 17.92 చదరపు మీటర్ల విస్తీర్ణం గల బాపట్ల పట్టణాన్ని 34 వార్డులుగా విభజించారు. ప్రస్తుతం పురపాలక సంఘం పరిధిలో2001 జనాభా లెక్కల ప్రకారం 68వేల 126 మంది ఓటర్లు ఉన్నారు.

# బాపట్ల ప్రాంతంలో జరిగిన స్వాతంత్ర్యోద్యమ ఘట్టాలు

(ఆన్‌లైన్-బాపట్ల)

### 1919 చీరాల మున్సిపల్ పన్నుల నిరాకరణ

ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్య గారి ఆధిపత్యమున 600 మంది యువకులతో రామదండును ఏర్పాటు చేయడం జరిగింది. దండు ఆధ్వర్యంలో మున్సిపల్ పన్నులు నిరాకరించారు. చీరాల-పేరాల ప్రజలు మున్సిపల్ ఏరియాను వదలి ఊరిబయట తాటాకు పాక వేసుకుని 14 నెలల జీవనం చేశారు. బ్రిటిష్ ప్రభుత్వం పాకలన్నిటిని తగులబెట్టించి ఉద్యమంలో పాల్గొన్న వారిని శిక్షించారు. చీరాల రంగయ్య,జూలకంటి వెంకటసుబ్బారావు,రావూరి ఆలివేలి మంగమ్మ, దాసరి కృష్ణమ్మ, తేలప్రోలు ఆంజేయులు, వి.సుబ్రమణ్యం, చేబ్రోలు వెంకట సుబ్బయ్య, బత్తిన రాఘవులు, గోడవర్తి లక్ష్మయ్య, గుడిపల్లి పేరయ్య, గ్రంథి పెదరాయుడు, నూనె నరసింహం, మద్ది వెంకటసుబ్బయ్య,శికాకొల్లి వెంకట సుబ్బయ్య, అప్పాజోస్యుల వెంకటేశ్వర్లు,ఈసునూరి సుదర్శనం, అమర సుబ్రమణ్యం, గుగ్గిలం సుబ్బారావులను శిక్షించారు. 1920 ట్రిబ్యూనల్ బాయ్‌కాట్ ఉద్యమంలో చీరాల,బాపట్ల,పొన్నూరు గ్రామాలలోని పాఠశాలన్నీయు బహిష్కరించినాయి. విదేశీవస్త్ర దహనాలు జరిగాయి. 64 గ్రామ కాంగ్రెస్ సంఘాలు ఏర్పాటు చేయడం జరిగింది. బాపట్ల బార్ నుండి ఆరుగురు లాయర్లు ప్రాక్టీసు మానివేసి ఉద్యమంలో చేరారు. రెవెన్యూ, ఉపాధ్యాయ ఉద్యోగాలను సంబంధించి ఆరుగురు వారి ఉద్యోగాలకు రాజీనామా చేసి ఉద్యమంలో పాల్గొన్నారు.

### తిలక్ స్వరాజ్య నిధి

మహాత్మాగాంధీ పొన్నూరు,బాపట్ల తీరప్రాంత గ్రామాల్లో స్వరాజ్యనిధిపై స్వాతంత్ర సమరం పై ఉపన్యాసించారు. పొన్నూరులో 1116రూపాయలు, బాపట్లలో 7,272 రూపాయలు, చీరాలలో వెయ్యి రూపాయలతో పాటు ఆహార వస్తువులను తిలక్ స్వరాజ్య నిధికి అందించ వలసిందిగా గాంధీకి సమర్పించారు. ఆ ఉద్యమంలో పాల్గొని ఉపన్యాసం చేసి ప్రచారం చేసిన వారికి నాటి బ్రిటిష్ ప్రభుత్వం జైలు శిక్షలు విధించింది. జైలు శిక్ష పడిన వారిలో ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్య,గ్రంథి నాగేశ్వరరావు,పాతూరి అప్పయ్య శాస్త్రి,మంతెన కృష్ణంరాజు,భట్టిప్రోలు సూర్యప్రకాశ రావు,పిల్లుట్ల హనుమంతరావు, అడుసుమల్లి శ్రీనివాస రావు, డాక్టర్ ఎం.మల్లికార్జునుడు, డాక్టర్ యండ్లూరి సాంబశివరావులు జైలు శిక్ష అనుభవించారు.

### పెదనందిపాడు పన్నుల నిరాకరణ

1-1-1932 నుండి కాంగ్రెస్ ప్రకటన అనుసరించి పన్నుల నిరాకరణ ప్రారంభమైంది. గుంటూరుజిల్లా కలెక్టర్ రూథర్‌పర్డ్ పెదనందిపాడులో మిలటరీ సహాయంతో క్యాంపు చేసి సంకా సీతారామయ్య, దాసరి శ్రీరాములు, మరొక సంకా సీతారామయ్య అనే వ్యక్తులను తమ గుర్రం వెంట పరుగెత్తున్నట్లు శిక్ష విధించి ఎనిమిది మైళ్ళ దూరంలో నున్న చిలకలూరిపేటకు పరుగెత్తించారు. ఎటువంటి ఆహార పానీయాలు ఇవ్వకుండా చితకబాది కలెక్టర్, మిలటరీ సిబ్బంది మూడు మాసాలు పెదనందిపాడులో క్యాంపు చేశారు. పన్నుల నిరాకరణ, సత్యాగ్రహంతో పొన్నూరుకు చెందిన 10మంది శిక్షింప పడ్డారు. గొల్లపూడి సీతారామశాస్త్రి, మద్దిరాల కృష్ణయ్య, మాచిరాజు రామ్మూర్తి, ఉన్నవ లక్ష్మీబాయమ్మ, గౌస్‌బేగ్ సాహెబ్, రామస్వామిచౌదరి, అనంతరావు, మంతెన నాగరాజు, ఇ.సూర్యనారాయణ,వాసి రెడ్డి వెర్రయ్యలు శిక్షింప బడ్డారు. 1922న కాంగ్రెస్ ఆదేశానుసారం నెహ్రూ కమిటీ గుంటూరుకు వచ్చిన సందర్భంగా 144వ సెక్షన్ ఉల్లంఘించి 47మంది అరెస్ట్ కాబడ్డారు. అడుసుపల్లి శ్రీనివాసరావు, కారంచేటి కుమారస్వామి,జాగర్లమూడి రామయ్య, ఎనమంద్ర వెంకటప్పయ్య, సంకా సీతారామయ్య(కరణం), సంకా సీతారామయ్య, దాసరి శ్రీరాములు, సంకా కృష్ణమూర్తి, రావూరి శ్రీశైలపతి, సంకా బలరామయ్య, మాదవపెద్ది లక్ష్మీనరసయ్య, కొల్లిమర్ల పిచ్చయ్య. మన్నం సీతాపతి, (మిగతా 146లో..)

(162వ పేజీ తరువాయి)

# ప్రజాప్రతినిధులు

| | | | |
|---|---|---|---|
| 11. | మంగళగిరి | జి.వీరాంజనేయులు | కాంగ్రెస్ |
| 12. | తాడికొండ (ఎస్‌సి) | డాక్టర్ టి.వెంకయ్య | కాంగ్రెస్ |
| 13. | సత్తెనపల్లి | డి.బాలకోటిరెడ్డి | కాంగ్రెస్ |
| 14. | పెదకూరపాడు | కె.లక్ష్మీనారాయణ | కాంగ్రెస్ |
| 15. | గురజాల | కెవి నర్సిరెడ్డి | కాంగ్రెస్ |
| 16. | మాచర్ల | ఎస్.శివరామకృష్ణప్రసాద్ | తెలుగుదేశం |
| 17. | వినుకొండ | ఎస్.రాజకుమారి | కాంగ్రెస్ |
| 18. | నరసరావుపేట | డాక్టర్ కె.శివప్రసాదరావు | తెలుగుదేశం |
| 19. | చిలకలూరిపేట | డాక్టర్ కె.జయమ్మ | తెలుగుదేశం |

**1994 శాసనసభ**

| | | | |
|---|---|---|---|
| 1. | కూచినపూడి | ఇ.సీతారావమ్మ | తెలుగుదేశం |
| 2. | రేపల్లె | ఎంవి సుబ్బయ్య | తెలుగుదేశం |
| 3. | వేమూరు | ఎ.రాజేంద్రప్రసాద్ | తెలుగుదేశం |
| 4. | దుగ్గిరాల | జి.వెంకటరెడ్డి | కాంగ్రెస్ |
| 5. | తెనాలి | డాక్టర్ ఆర్.రవీంద్రనాధ్‌చౌదరి | తెలుగుదేశం |
| 6. | పొన్నూరు | డి.నరేంద్రకుమార్ | తెలుగుదేశం |
| 7. | బాపట్ల | ఎం.శేషగిరిరావు | తెలుగుదేశం |
| 8. | ప్రత్తిపాడు | డాక్టర్ ఎం.పెదరత్తయ్య | తెలుగుదేశం |
| 9. | గుంటూరు-1 | ఎస్‌ఎం జియావుద్దీన్ | తెలుగుదేశం |
| 10. | గుంటూరు-2 | చల్లా వెంకటకృష్ణారెడ్డి | తెలుగుదేశం |
| 11. | మంగళగిరి | ఎస్.రామమోహనరావు | సిపిఎం |
| 12. | తాడికొండ(ఎస్‌సి) | జెఎంఎస్‌వి ప్రసాద్ | సిపిఐ |
| 13. | సత్తెనపల్లి | పి.భారతి | సిపిఎం |
| 14. | పెదకూరపాడు | కె.లక్ష్మీనారాయణ | కాంగ్రెస్ |
| 15. | గురజాల | వై.శ్రీనివాసరావు | తెలుగుదేశం |
| 16. | మాచర్ల | కె.పున్నారెడ్డి | తెలుగుదేశం |
| 17. | వినుకొండ | డాక్టర్ వి.యలమందరావు | తెలుగుదేశం |
| 18. | నరసరావుపేట | డాక్టర్ కె.శివప్రసాదరావు | తెలుగుదేశం |
| 19. | చిలకలూరిపేట | ఎస్.సాంబయ్య | కాంగ్రెస్ |

**1999 శాసనసభ**

| | | | |
|---|---|---|---|
| 1. | కూచినపూడి | ఎం.వెంకటరమణారావు | కాంగ్రెస్ |
| 2. | రేపల్లె | ఎం.వెంకటసుబ్బయ్య | తెలుగుదేశం |
| 3. | వేమూరు | ఆలపాటి రాజేంద్రప్రసాద్ | తెలుగుదేశం |
| 4. | దుగ్గిరాల | గుడిబండి వెంకటరెడ్డి | కాంగ్రెస్ |
| 5. | తెనాలి | డాక్టర్ గోగినేని ఉమ | తెలుగుదేశం |
| 6. | పొన్నూరు | ధూళిపాళ్ళ నరేంద్రకుమార్ | తెలుగుదేశం |
| 7. | బాపట్ల | మంతెన అనంతవర్మరాజు | తెలుగుదేశం |
| 8. | ప్రత్తిపాడు | డాక్టర్ మాకినేని పెదరత్తయ్య | తెలుగుదేశం |
| 9. | గుంటూరు-1 | ఎస్‌ఎం జియావుద్దీన్ | తెలుగుదేశం |
| 10. | గుంటూరు-2 | డాక్టర్ శనక్కాయల అరుణ | తెలుగుదేశం |
| 11. | మంగళగిరి | మురుగుడు హనుమంతరావు | కాంగ్రెస్ |
| 12. | తాడికొండ | జెఆర్ పుష్పరాజ్ | తెలుగుదేశం |
| 13. | సత్తెనపల్లి | వైవి ఆంజనేయులు | తెలుగుదేశం |
| 14. | పెదకూరపాడు | కన్నా లక్ష్మీనారాయణ | కాంగ్రెస్ |
| 15. | గురజాల | జంగా కృష్ణమూర్తి | కాంగ్రెస్ |
| 16. | మాచర్ల | జూలకంటి దుర్గాండ | తెలుగుదేశం |
| 17. | వినుకొండ | వీరపనేని యల్లమందరావు | తెలుగుదేశం |
| 18. | నరసరావుపేట | డాక్టర్ కోడెల శివప్రసాద్ | తెలుగుదేశం |
| 19. | చిలకలూరిపేట | ప్రత్తిపాటి పుల్లారావు | తెలుగుదేశం |

(మిగతా 164వ పేజీలో)

# భావ సౌందర్యాల విరి భావపురి

(ఆన్‌లైన్-బాపట్ల)

చారిత్రక సాక్ష్యాలకు సజీవంగా నిలచిన ప్రసిద్ధ దేవాలయాలతో ఆలరారుతున్న భావపురి, విద్యారంగంలో కేంబ్రిడ్జి ఆఫ్ ఆంధ్రప్రదేశ్‌గా, సాహిత్య రంగంలో భావ సౌందర్యాల విరిగా, రాజకీయ రంగంలో ఆణిముత్యాలను అందించిన రాజకీయపరంగా, బౌద్ధరామాలకు నిలయంగా, వ్యవసాయ రంగానికి పట్టుకొమ్మగా విరాజిల్లుతున్నది. బాపట్ల చిత్రపటంలోనే గాకుండా, దేశ చిత్ర పటంలోనే ఒక ప్రత్యేక స్థానాన్ని సంతరించుకుంది. ఆంధ్రప్రదేశ్‌లో భూస్వామ్య వ్యతిరేక ప్రజాతంత్ర ఉద్యమానికి శుభారంభం చేసిన గడ్డ భావపురి. ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రం కావాలనే నినాదాన్ని మొట్టమొదట బాపట్లలో 1913లో జరిగిన ఆంధ్రమహాసభ లేవనెత్తింది. బాపట్లలో 1944 పొగాకు రైతు మార్కెట్ కమిటీ ఎన్నికలో సీనియర్ కమ్యూనిస్టు నాయకుడు కొల్లా వెంకయ్య గెలిచారు. 1946 శాసనసభ ఎన్నికల సందర్భంలో విశాలాంధ్రలో ప్రజారాజ్యం అనే నినాదంతో ఒక కార్యక్రమాన్నికమ్యూనిస్టు పార్టీ తీసుకొంది. అలాగే కమ్యూనిస్ట్ నాయకులను బాపట్ల ప్రాంతాలలో వుంచి వారి బాధ్యత తీసుకున్నారు. కామ్రేడ్ చంద్ర రాజేశ్వర రావు, దాసరి నాగభూషణరావు తదితరులు ఈ ప్రాంతంలో ఉండి ఉద్యమాన్ని నడిపారు. 1977లో నల్లమడ ప్రాంత రైతు సంఘం స్థాపించి దాని నిర్వహణకు కృషి చేసిన ఘనత కమ్యూనిస్టులదే. ఈ ప్రాంతంలో ఈ రోజు కాల్వలు వచ్చి సమాయానికి సాగు నీరు అందుతుంది. 'చెయ్యెత్తి జైకొట్టు తెలుగోడా' అన్న వేములపల్లి శ్రీకృష్ణను శాసనసభకు మొదటిసారిగా అందించిన ఘనత భావపురిదే. అపర బాసరగా ఖ్యాతి చెంది, కళారంగంలో సారస్వత మాగాణిగా నిలిచింది. శ్రీ భావన్నారాయణస్వామి స్వయం భువునిగా వెలియడం వల్ల భావపురిగా నామాన్ని సంతరించుకొని ప్రసిద్ధ అధ్యాత్మిక సాంస్కృతిక విద్యాకేంద్రంగా నేడు బాపట్ల పట్టణం విలసిల్లుతున్నది. స్వయంభువునిగా వెలసిన శ్రీ భావన్నారాయణస్వామి వారికి

(మిగతా 164వ పేజీలో)

## "ఆంధ్రజ్యోతి" కి చతుర్ధ వార్షికోత్సవ శుభాకాంక్షలు

నాలుగు సం॥ల నుండి ప్రజల సమస్యలను వెలుగులోకి తెస్తూ అందరి అభిమాన పత్రికగా నిలిచిన 'ఆంధ్రజ్యోతి' దినపత్రికకు శుభాకాంక్షలు.

ప్రజలకు దసరా శుభాకాంక్షలు

అత్తలూరు గ్రామపంచాయితీ

కార్యదర్శి : దాసరి గురవయ్య

మరియు వార్డు సభ్యులు



తిరుమలకొండ అంకమ్మరాజు
సర్పంచ్

## ఆంధ్రజ్యోతికి 4వ వార్షికోత్సవ శుభాకాంక్షలు



శ్రీ యర్రం వెంకటేశ్వరరెడ్డి
శాసనసభ్యులు, సత్తెనపల్లి

ఆంధ్రజ్యోతి నాలుగు వసంతాలు పూర్తి చేసుకొని 5వ వసంతంలోకి అడుగిడుతున్న సందర్భంగా శుభాకాంక్షలు

ఆంధ్రజ్యోతి 4



శ్రీ కట్టా సాంబయ్య
మార్కెట్‌యార్డ్ చైర్మన్, సత్తెనపల్లి

### షేక్ నాగూర్ మీరాన్

కార్యదర్శి, సత్తెనపల్లి క్లబ్, కాంగ్రెస్ నాయకులు



## మేడికొండూరు గ్రామ పంచాయతి



సోపల్లి నరశింహారావు
సర్పంచ్

పత్రికా రంగంలో అగ్రగామిగా నిలుస్తూ నాలుగు సంవత్సరాలు పూర్తి చేసుకొని ఐదవ సంవత్సరములోకి అడుగిడుతున్న ఆంధ్రజ్యోతి దిన పత్రికకు మా హృదయ పూర్వక శుభాకాంక్షలు తెలియచేస్తూ...

ఉప సర్పంచ్ : లాం అనురాధ రాజ్యలక్ష్మి

వార్డు సభ్యులు :

1. పాములపాటి జయరావు 2. షేక్ మొహిద్దీన్ బి 3. జమ్ముల వెంకటలక్ష్మి 4. పాములపాటి రమాదేవి 5. చదలవాడ ప్రసాద్ 6. నెలకుదిటి శేషారత్నం 7. మార్తా శ్రీనివాసరావు 8. చేకూరి నవనీతం 9. కుర్రా ఝాన్సిలక్ష్మి 10. లాం ఆనందరావు 11. షేక్ మాబు సుభాని 13. పాలపర్తి పురుషోత్తం 14. మద్దినేని వసుంధర

గ్రామ పరిపాలనాధికారి : రంగిశెట్టి పోతురాజు

## ప్రజాప్రతినిధులు

(163వ పేజీ తరువాయి)

2004 శాసనసభ

| | | | |
|---|---|---|---|
| 1. | కూచినపూడి | ఎంవి రమణారావు | కాంగ్రెస్ |
| 2. | రేపల్లె | దేవినేని మల్లిఖార్జునరావు | కాంగ్రెస్ |
| 3. | వేమూరు | సతీష్‌పాల్‌రాజ్ | కాంగ్రెస్ |
| 4. | దుగ్గిరాల | గుదిబండి వెంకటరెడ్డి | కాంగ్రెస్ |
| 5. | తెనాలి | నాదెండ్ల మనోహర్ | కాంగ్రెస్ |
| 6. | పొన్నూరు | ధూళిపాళ్ళ నరేంద్రకుమార్ | తెలుగుదేశం |
| 7. | బాపట్ల | గాదె వెంకటరెడ్డి | కాంగ్రెస్ |
| 8. | ప్రత్తిపాడు | రావి వెంకటరమణ | కాంగ్రెస్ |
| 9. | గుంటూరు–1 | నంబూరు సుభాని | కాంగ్రెస్ |
| 10. | గుంటూరు–2 | తాడిశెట్టి వెంకట్రావు | కాంగ్రెస్ |
| 11. | మంగళగిరి | మురుగుడు హనుమంతరావు | కాంగ్రెస్ |
| 12. | తాడికొండ | డి.మాణిక్యవరప్రసాద్ | కాంగ్రెస్ |
| 13. | సత్తెనపల్లి | యర్రం వెంకటేశ్వరరెడ్డి | కాంగ్రెస్ |
| 14. | పెదకూరపాడు | కన్నా లక్ష్మీనారాయణ | కాంగ్రెస్ |
| 15. | గురజాల | జంగా కృష్ణమూర్తి | కాంగ్రెస్ |
| 16. | మాచర్ల | పిన్నెల్లి లక్ష్మారెడ్డి | కాంగ్రెస్ |
| 17. | వినుకొండ | మక్కెన మల్లిఖార్జునరావు | కాంగ్రెస్ |
| 18. | నరసరావుపేట | కాసు కృష్ణారెడ్డి | కాంగ్రెస్ |
| 19. | చిలకలూరిపేట | మర్రి రాజశేఖర్ | కాంగ్రెస్ |

## భావ సౌందర్యాల విరి భావపురి

(163వ పేజీ తరువాయి)

క్రిమిచోళ మహారాజు క్రీ.శ.594లో ఆలయం కట్టించారు. క్రీ.శ.594 నుండి నేటి వరకు అనేక వెలునీడలను చవిచూసింది. క్రీ.శ.594 నుండి క్రీ.శ.1574 వరకు హిందూ రాజులు పాలించగా చైతన్య కేంద్రంగా విలసిల్లింది. క్రీ.శ.1760 నుండి ఈస్ట్ ఇండియా కంపెనీ అధికారాన్ని బాపట్ల ప్రాంతంపై చెలాయించింది. కాగా క్రీ.శ.1803లో అమరావతికి చెందిన రాజావాసిరెడ్డి వెంకట్రాదినాయుడు బహద్దూర్ బాపట్ల ప్రాంతాన్ని బహిరంగ వేలంలో కొనుగోలు చేశారు. శ్రీ భావన్నారాయణుని ఆలయంతో సహా పలు ఆలయాల నిర్వహణలను మెరుగుపరచే కార్యాచరణ అమలు పరిచారు.

### స్వాతంత్ర్య సమరంలో...

స్వాతంత్ర్య సంగ్రామంలో బాపట్ల ప్రాంతం గణనీయమైన పాత్ర నిర్వహించింది.పూర్వపు తాలూకాలో ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్య పన్నుల నిరాకరణోద్యమం నడిపిన సంగతి అందిరికి విదితమే. 1920లో సహాయ నిరాకరణోద్యమం జరుగగా బాపట్ల తాలూకాలోని

(మిగతా 165వ పేజీలో)

## దూళ్ళిపాళ్ళ గ్రామ పంచాయతీ

రాయపాటి రుక్మిణమ్మ

- ▲ గ్రామంలో అంతర్గత రోడ్ల నిర్మాణం అభివృద్ధికి కృషిచేస్తా.
- ▲ మురుగు కాల్వల నిర్మాణం చేపడతా.
- ▲ భాగ్యనగర్ కాలనీకి రక్షిత మంచినీరు అందేలా చూస్తా.
- ▲ పంచాయతీ సభ్యులు, ఎం.పి.టి.సి, ఎం.ఎల్.ఏ యర్రం వెంకటేశ్వరరెడ్డి, ఎం.పి రాయపాటి సాంబశివరావు ల సహకారంతో పంచాయతీ అభివృద్ధికి కృషిచేస్తా.

కృష్ణారావు
గ్రామ కార్యదర్శి

రాయపాటి రుక్మిణమ్మ
సర్పంచ్

దూళ్ళిపాళ్ళ, సత్తెనపల్లి మండలం

## "ఆంధ్రజ్యోతి" కి చతుర్థ వార్షికోత్సవ శుభాకాంక్షలు



శ్రీ పిన్నెల్లి లక్ష్మారెడ్డి
శాసన సభ్యులు, మాచర్ల

"మా అక్షరం- మీ ఆయుధం" నినాదంతో తెలుగు పత్రికా రంగంలో సంచలనాలను సృష్టిస్తున్న 'ఆంధ్రజ్యోతి' దిన పత్రికకు చతుర్ధి వార్షికోత్సవ శుభాకాంక్షలు.

బడుగు, బలహీన వర్గాల ప్రజల 'ఆశాజ్యోతి' మాచర్ల శాసనసభ్యులు శ్రీ పిన్నెల్లి లక్ష్మారెడ్డి గారికి దుర్గి యం.పి.పి శ్రీనాళి పకీరయ్య గారికి దసరా శుభాకాంక్షలు.



శ్రీ నాళం పకీరయ్య
దుర్గి, ఎం.పి.పి.



బి.వి. నరసింహారావు
MPDO దుర్గి

కె. వినోద్ కుమార్
జూనియర్ అసిస్టెంట్,
దుర్గి MPDO కార్యాలయం



## "ఆంధ్రజ్యోతి" కి చతుర్థ వార్షికోత్సవ శుభాకాంక్షలు

### ప్రగతి పథంలో ఆత్మకూరు గ్రామ పంచాయితి, దుర్గి మండలం

శ్రీ మేకపాటి రాజమోహనరెడ్డి
పార్లమెంట్‌సభ్యులు, నరసరావుపేట

శ్రీ పిన్నెల్లి లక్ష్మారెడ్డి
శాసన సభ్యులు, మాచర్ల

శ్రీ కుర్రి పున్నారెడ్డి
డిసిసిబి చైర్మన్, గుంటూరు

శ్రీ చవ్వా రాయపరెడ్డి
మాజీ సర్పంచ్, ఆత్మకూరు

ఆత్మకూరు గ్రామ ప్రజలకు, వార్డు మెంబర్లకు, గ్రామ పెద్దలకు దసరా శుభాకాంక్షలు మరియు ఆంధ్రుల అభిమాన పత్రిక 'ఆంధ్రజ్యోతి' కి చతుర్థి వార్షికోత్సవ శుభాకాంక్షలు..

చవ్వా ప్రభావతి
సర్పంచ్

యస్.కె. దస్తగిరి
గ్రామ కార్యదర్శి

## 'ఆంధ్రజ్యోతి'కి శుభాకాంక్షలు




సమాజంలోని మంచిని ప్రోత్సహిస్తూ... చెడును చీల్చి చెండాడుతూ... వెనుకంజ వేయకుండా అక్షర యజ్ఞానికి పూనుకొని పాఠకుల హృదయాలను సొంతం చేసుకున్న ఆంధ్రజ్యోతీ... ఇదే విధానంతో నింగికెదగాలని హృదయపూర్వకంగా కోరుకుంటూ...

శ్రీ వాణి గురుకులం, ప్రిన్సిపాల్ అండ్ స్టాఫ్
పి.వి. నరసరాజు, ఎగ్జిక్యూటివ్ మెంబర్,
ఆంధ్రప్రదేశ్ ట్యుటోరియల్
అండ్ కాన్వెంట్స్ అసోసియేషన్, మాచర్ల

వాణీ విద్యానికేతన్, ప్రిన్సిపాల్ అండ్ స్టాఫ్
కె.వి. రమణ, అధ్యక్షులు
ఎపి ట్యుటోరియల్స్ అండ్
కాన్వెంట్స్ అసోసియేషన్, మాచర్ల డివిజన్

చక్రధర్ పబ్లిక్ స్కూల్
జన్నా శ్రీనివాసరెడ్డి, ప్రిన్సిపల్
శ్రీశైలం రోడ్, మాచర్ల

బాల విద్యానికేతన్ విద్యాసంస్థలు
ఎస్‌కె సైదా, ప్రిన్సిపల్
పాతబజారు, మాచర్ల

శ్రీ జెనిత్ పబ్లిక్ స్కూల్
ఎన్. పద్మజారాణి, B.Sc., B.Ed.,
ప్రిన్సిపల్, 13వ వార్డు, మాచర్ల

నవీన రెసిడెన్షియల్ స్కూల్
రామదాసు, ప్రిన్సిపల్,
శివప్రియనగర్, గుంటూరురోడ్, మాచర్ల

విశ్వభారతి విద్యానికేతన్
ఆర్.ఎల్. చెన్నకేశవరావు, ప్రిన్సిపల్,
నెహ్రూనగర్, 3వ లైను, మాచర్ల

**మాతృశ్రీ విద్యాలయము**, కన్యకా పరమేశ్వరి దేవాలయం వెనుక, పాతబజారు, మాచర్ల
డైరెక్టర్ : డి.వి.ఆర్.కె. భువనేశ్వరరావు, ప్రిన్సిపల్ : దాసరి కృష్ణకుమారి

**మాతృశ్రీ పబ్లిక్ స్కూల్**, రామాటాకీస్ లైన్, మాచర్ల
డైరెక్టర్ : దాసరి ఉమాదేవి, ప్రిన్సిపల్ : జెస్సి థామస్

## శ్రీ శ్రీ శ్రీ మహంకాళి అమ్మవారి ఆలయం



కంఠంరాజు కొండూరు (మెరంపూడి, దుగ్గిరాల మండలం.)

గుంటూరు జిల్లా దుగ్గిరాల మండలం కంఠంరాజు కొండూరు గ్రామ పొలిమేరులో వేంచేసియున్న శ్రీ మహంకాళి అమ్మవారు గ్రామ మాజీ సర్పంచ్ కీ. శే॥ దేవ భక్తుని సుబ్బారావుగారి స్వప్నంలో కన్పించి గ్రామ ఈశాన్య దిక్కున ఉన్న దిబ్బయందు పుట్ట తవ్వించి తనను బయటకు తీయవలసిందిగా కోరియున్నది. త్రవ్వించి అమ్మవారిని బయటకు తీసిన నాటినుంచి ప్రతి ఆదివారం విశేషంగా పూజలు జరిపిస్తుండగా భక్తులు అమ్మవారిని కొలుస్తూ వచ్చారు. శ్రీ యార్ల గడ్డ నరసింహారావుగారి పొలములో వెలసిన అమ్మవారిని దర్శించిన వారిలో సంతానము లేని వారికి సంతానము, వివాహము కాని వారికి వివాహము, మాటలు రాని వారికి మాటలు రావటం, ఇలా కొలిచిన వారి మ్రొక్కులు తీర్చుతుండటంతో కృష్ణా, గుంటూరు జిల్లాలో ఆలయ ప్రతిషం గణనీయంగా పెరిగింది.

ఫౌండర్ ట్రస్ట్
దేల భక్తుని రంగప్రసాద్

ఆలయ మేనేజర్
అన్నవ రెడ్డి రామకోటి రెడ్డి.





























# భావ సౌందర్యాల విరి భావపురి

(164వ పేజీ తరువాయి)

64 గ్రామాలలో సంఘాలను ఏర్పరచి ఉద్యమాలను నడిపారు. కొందరు రెవెన్యూ ఇన్‌స్పెక్టర్లు,గుమాస్తాలు తమ ఉద్యోగాలకు స్వస్తి చెప్పి న్యాయవాదులతో పాటు ఉద్యమంలో చేరారు. మహాత్మాగాంధీజీ బాపట్ల ప్రాంత పర్యటనకు రాగా తిలక్ స్వరాజ్య నిధికి నగదుతో పాటు బంగారు ఆభరణాలను దేశ భక్తులు సమర్పించారు. సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొన్నందుకు 'ఆంధ్ర రత్న' దుగ్గిరాలతో పాటు మంతెన కృష్ణంరాజు, బూదరాజు లక్ష్మీనరసింహారావు, పిల్లుట్ల హనుమంతరావు, అడసుపల్లి శ్రీనివాసరావు పంతులు వంటి వారు జైలు పాలయ్యారు. జరిమానాలు కూడా చెల్లించారు. ఉద్యమంలో భాగంగా 1921 డిసెంబరు 31న 48మంది గ్రామోద్యోగులు రాజీనామాలు సమర్పించారు. పన్నుల నిరాకరణోద్యమంలో భాగంగా నాటి బాపట్ల తాలూకాలోని పెదనందిపాడులో సాగిన ఉద్యమం మరుపురానిది. 'ఆంధ్ర శివాజీ' పర్వతనేని వీరయ్యచౌదరి నాయకత్వంలో జరిగిన పెదనందిపాడు ఉద్యమాన్ని అణచివేసేందుకు నాటి జిల్లా కలెక్టరు రూథర్‌పర్డ్ మిలటరీ క్యాంపును ఏర్పాటుచేశారు. సంకా సీతారామయ్య, దాసరి శ్రీరాములులను పెదనందిపాడు నుంచి చిలకలూరి పేట వరకు ఎనిమిది మైళ్ళు గుర్రం వెంట శిక్షణగా పరుగెత్తించారు. 1930లో సాగిన ఉద్యమంలో పాల్గొన్నందుకు తాలూకాలోని 124మందిని నాటి ప్రభుత్వం జైలుకు పంపింది. విదేశీ వస్తు బహిష్కరణలో పాల్గొన్నందుకు 44మందిని ఆరు నెలల నుండి రెండు సంవత్సరాల వరకు శిక్ష విధిస్తూ జైలుకు పంపింది. స్థానం పార్థసారధి, నాళం శ్రీరామచంద్రరావు వంటి వారు స్వాతంత్ర్య ఉద్యమంలో పాల్గొన్నారు.

## ప్రథమ ఆంధ్రమహాసభ

తెలుగువారికి ప్రత్యేక రాష్ట్రం కావాలంటూ ప్రథమ ఆంధ్ర మహాసభ 1913లో బాపట్ల టౌన్‌హాలులో జరిగింది. రెండుసార్లు గాంధీజీ బాపట్ల ప్రాంతాన్ని సందర్శించారు. 1934లో భారత తొలి రాష్ట్రపతిగా పేరు గడించిన బాబూరాజేంద్రప్రసాద్ సందర్శించారు. 1936లో పెనుతుపాను సంభవించగా బాధితుల సహాయార్థం విరాళాల సేకరణకు గాంధీజీ తమ రెండవ పర్యటనగా వచ్చారు. భారత తొలి ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ, జయప్రకాష్ నారాయణ, రాజాజీ వంటి ప్రముఖులు కూడా బాపట్ల ప్రాంతాన్ని సందర్శించిన వారిలో ఉన్నారు.

## కళలకు నిలయం

కళల కాణాచిగా బాపట్ల ఖ్యాతి గడిపించింది. శ్రీ భావన్నారాయణ స్వామి సన్నిధిలో ఎందరో పరిచారికలు, దేవదాసిలు, పురుష నృత్యకారులు స్వామి వారికి సేవలందించినట్లు ఆయన శాసనాలు వెల్లడిస్తున్నారు. కొండవీడును రాజధానిగా చేసుకొని పాలించిన కొమరగిరి ప్రభువు కర్పూర వసంతరాయులు ఆస్థాన నర్తకి లకుమాదేవి బాపట్ల శ్రీ భావన్నారాయణస్వామి ఆలయంలో నృత్యపూజకు తొలుత ఉద్దేశించబడినది. ప్రసిద్ధ దేవ నర్తకి మలమ్మ తన అనంతరం తన కుమార్తెల కుసుమ స్వామి సేవకునియోగించాలని ఆమె ఆశించింది. అయితే కొమరగిరి ప్రభువు తన సేనాధిపతి దొడ్డపు రెడ్డిని ఆహ్వాన పత్రంతో పాటు రెండు పల్లకీలను పంపడంతో తల్లి మలమ్మ మాత్రం వెళ్ళడానికి నిరాకరించి తన కుమార్తె లకుమా అభీష్టం మేరకు సాగనంపింది. నాటికి నేటికి కళలకు,కళాకారులకు కేంద్రం ఉంది. కళారంగంలో పద్మశ్రీ స్థానం నరసింహారావు, కొమరవోలు హనుమంతరావు, కోన వెంకట్రావు, కోన ప్రభాకరరావు, అద్దంకి శ్రీరామమూర్తి, పి.వీరయ్యచౌదరి, సింగరాజు నాగభూషణం,డాక్టర్ కొర్రపాటి గంగాధరరావు, కె.ఎస్.టి.సాయి, కె.బి.శర్మ, ఊట్ల బుడ్డయ్యచౌదరి, పి.వి.రామ్‌కుమార్, ఇ.నరసింహారావు వంటి కళాకారులను

(మిగతా 166వ పేజీలో)
















# భావ సౌందర్యాల విరి భావపురి

(165వ పేజీ తరువాయి)

రూపొందించింది. సినీ రంగం లోని బాలివుడ్‌లో ప్రత్యేక స్థానాన్ని సంతరించుకొని గిన్నీస్ బుక్ ఆఫ్ రికార్డు కెక్కిన ప్రముఖ సినీ నిర్మాత డి.రామా నాయుడు బాపట్ల ప్రాంతీయుడే. క్రీడా రంగంలో లక్కరాజు కృష్ణయ్య, దాసరి శ్రీమన్నారాయణ, మలిశెట్టి వెంకటకృష్ణా రావు, కోనప్రభాకరావు ,కొక్కు సుబ్ర హ్మణ్యం, చలికొంత తాతారావు, ఆమంచి కోటేశ్వరరావు, ఖాదర్‌వలి, కర్పూరపు రామారావు, మదన్‌మోహన్ వంటి వారున్నారు.

## రాజకీయ కేంద్రం

బాపట్లకు గుర్తింపు తెచ్చిన ప్రము ఖుల్లో ప్రముఖ విద్యావేత్త డాక్టర్ ఉమ్మా రెడ్డి వెంకటేశ్వర్లు ఒకరు. అఖిల భారత కాంగ్రెస్ ప్రధాన కార్యదర్శిగా వ్యవహ రించిన వల్లూరి బసవరాజు, పలు రాష్ట్రాలకు గవర్నర్‌గా, రాష్ట్ర ఆర్థిక మంత్రిగా, రాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షులుగా వ్యవహరించి తన దక్షతను నిరూపించిన కోనప్రభాకరావులు జాతీయ స్థాయిలో బాపట్లకు గుర్తింపు తెచ్చారు. బాపట్ల అసెంబ్లీ 1952లో ఏర్పడగా తమ తొలి ప్రజాప్రతినిధిగా సిపిఐ నాయకులు వేములపల్లి శ్రీకృష్ణను శాసనసభకు పంపిన ఘనత బాపట్లది. ప్రముఖ రైతు నాయకులు ఆచార్య ఎన్.జి.రంగా, మంతెన వెంకటరామరాజు, కొమ్మినేని వెంకటేశ్వరరావు, కామ్రేడ్ కొల్లా వెంకయ్య, వంటి రాజకీయ ప్రముఖులు బాపట్ల ప్రాంతీయులు కావడం విశేషం.

## శ్రీలు పొంగిన జీవగడ్డ

బాపట్ల శ్రీలు పొంగిన జీవగడ్డ-ప ద్యశ్రీలకు పుట్టినిల్లు 'ఏదేశమేగినా ఎందు కాలిడినా పొగడరా నీ తల్లిభారతిని అని గేయ రచనద్వారా జాతిని జాగృతం చేసిన రాయప్రోలు సుబ్బారావు, పద్మశ్రీ స్థానం నరసింహారావు, పద్మశ్రీ కొమర వోలు చంద్రశేఖర్, చీఫ్ ఎలక్షన్ కమిషన ర్‌గా పనిచేసిన జి.వి.కృష్ణమూర్తి, ఇంగ్లాండు క్రికెట్ టీమ్ ఓపెనింగ్ బ్యాట్స్‌మన్ రామన్ సుబ్బారావు బాపట్ల వాస్తవ్యులే. పద్మశ్రీ ఈలపాట రఘురామయ్య, పద్మవిభూషణ్ నోరి గోపాలకృష్ణమూర్తి బాపట్లవారు. ఆంధ్ర రత్న దుగ్గిరాల, ప్రముఖ కవి గుర్రం జాషువా వంటి వారు రూపొందించిన విద్యాసంస్థలు బాపట్లలో ఉన్నాయి. బాపట్ల సమీప సముద్ర తీరంలోని సూర్యలంక పర్యాటకులను విశేషంగా ఆకర్షిస్తోంది.

# జిల్లా నుంచి లోక్‌సభకు వెళ్లిన ప్రముఖులు

**1952**

**గుంటూరు** ఎస్‌వీఎల్ నరసింహం (స్వతంత్ర)
**నరసరావుపేట** జి.రామయ్యచౌదరి (స్వతంత్ర)
**ఒంగోలు** పివి రాఘవయ్య (స్వతంత్ర)
**తెనాలి** కె.రఘురామయ్య (కాంగ్రెస్)

**1957**

**తెనాలి** ఎన్‌జి రంగా (కాంగ్రెస్)
**గుంటూరు** కె.రఘురామయ్య (కాంగ్రెస్)
**ఒంగోలు** ఆర్.నారప రెడ్డి (కాంగ్రెస్)
**మార్కాపురం** సి.బాలిరెడ్డి (కాంగ్రెస్)

**1962**

**గుంటూరు** కె.రఘురామయ్య (కాంగ్రెస్)
**మార్కాపురం** జి.యలమందా రెడ్డి (కమ్యూనిస్టు)
**ఒంగోలు** ఎం.నారాయణస్వామి (కమ్యూనిస్టు)
**తెనాలి** కొల్లా వెంకయ్య (కమ్యూనిస్టు)

**1967**

**ఒంగోలు** కొంగర జగ్గయ్య (కాంగ్రెస్)
**గుంటూరు** కె.రఘురామయ్య (కాంగ్రెస్)
**నరసరావుపేట** మద్ది సుదర్శనం (కాంగ్రెస్)

**1971**

**గుంటూరు** కె.రఘురామయ్య (కాంగ్రెస్)
**నరసరావుపేట** మద్ది సుదర్శనం (కాంగ్రెస్)

**1977**

**గుంటూరు** కె.రఘురామయ్య (కాంగ్రెస్)
తెనాలి ఎం.నాగేశ్వరరావు (కాంగ్రెస్)
**బాపట్ల** పి.అంకినీడు ప్రసాద రావు (కాంగ్రెస్)
**నరసరావుపేట** కె.బ్రహ్మ నందరెడ్డి (కాంగ్రెస్)

**1980**

**గుంటూరు** ఎన్ జి రంగా (కాంగ్రెస్)
**తెనాలి** ఎం.నాగేశ్వరరావు (కాంగ్రెస్)
**బాపట్ల** పి.అంకినీడు ప్రసాద రావు (కాంగ్రెస్)
నరసరావుపేట కె.బ్రహ్మ నందరెడ్డి (కాంగ్రెస్)

**1984**

| | | |
|---|---|---|
| **గుంటూరు** | ఎన్‌జి రంగా | (కాంగ్రెస్) |
| **తెనాలి** | ఎన్.వెంకటరత్నం | (తెలుగుదేశం) |
| **బాపట్ల** | చిమటా సాంబు | |
| **నరసరావుపేట** | కె.నారాయణస్వామి | (తెలుగుదేశం) |

(మిగతా 168వ పేజీలో)

(167వ పేజీ తరువాయి)

1989 లోక్‌సభ

| | | |
|---|---|---|
| గుంటూరు | ఎన్‌జి రంగా | కాంగ్రెస్ |
| తెనాలి | ఎస్.బసవపున్నయ్య | కాంగ్రెస్ |
| బాపట్ల | ఎస్.బెంజిమన్ | కాంగ్రెస్ |
| నరసరావుపేట | కెవి కృష్ణారెడ్డి | కాంగ్రెస్ |

1991 లోక్‌సభ

| | | |
|---|---|---|
| గుంటూరు | లాల్‌జాన్‌బాషా | తెలుగుదేశం |

## జిల్లా నుంచి లోక్‌సభకు వెళ్లిన ప్రముఖులు

| | | |
|---|---|---|
| తెనాలి | డాక్టర్ యు.వెంకటేశ్వర్లు | తెలుగుదేశం |
| బాపట్ల | డాక్టర్ డి.వెంకటేశ్వరరావు | తెలుగుదేశం |
| నరసరావుపేట | కెవి కృష్ణారెడ్డి | కాంగ్రెస్ |

1996 లోక్‌సభ

| | | |
|---|---|---|
| గుంటూరు | రాయపాటి సాంబశివరావు | కాంగ్రెస్ |
| తెనాలి | టి.శారద | తెలుగుదేశం |
| బాపట్ల | డాక్టర్ యు.వెంకటేశ్వర్లు | తెలుగుదేశం |
| నరసరావుపేట | కోట సైదయ్య | తెలుగుదేశం |

1998 లోక్‌సభ

| | | |
|---|---|---|
| గుంటూరు | ఆర్.సాంబశివరావు | కాంగ్రెస్ |
| తెనాలి | పి.శివశంకర్ | కాంగ్రెస్ |
| బాపట్ల | ఎన్.జనార్ధన్‌రెడ్డి | కాంగ్రెస్ |
| నరసరావుపేట | కె.రోశయ్య | కాంగ్రెస్ |

1999 లోక్‌సభ

| | | |
|---|---|---|
| గుంటూరు | యంపరాల వెంకటేశ్వరరావు | తెలుగుదేశం |
| బాపట్ల | దగ్గుబాటి రామానాయుడు | తెలుగుదేశం |
| నరసరావుపేట | నేదురుమల్లి జనార్ధనరెడ్డి | కాంగ్రెస్ |
| తెనాలి | డాక్టర్ ఉమ్మారెడ్డి వెంకటేశ్వర్లు | తెలుగుదేశం |

2004 లోక్‌సభ

| | | |
|---|---|---|
| గుంటూరు | రాయపాటి సాంబశివరావు | కాంగ్రెస్ |
| బాపట్ల | దగ్గుబాటి పురంధరేశ్వరి | కాంగ్రెస్ |
| నరసరావుపేట | మేకపాటి రాజమోహనరెడ్డి | కాంగ్రెస్ |
| తెనాలి | వల్లభనేని బాలశౌరి | కాంగ్రెస్ |

## ప్రాచీన చరితకు నిలువుటద్దం
# ఉండవల్లి గుహాలయం

(ఆన్‌లైన్...తాడేపల్లి)

విష్ణుకుండినుల కళాప్రావీణ్యానికి ప్రత్యక్ష నిదర్శనంగా ఉండవల్లి గుహాలయాలను పేర్కొనవచ్చు. పవిత్ర కృష్ణానదికి మైలున్నర దూరంలో వున్న చారిత్రక కట్టడాలే ఈ ఉండవల్లి గుహాలయాలు. ఈ గుహాలయంలో ప్రసిద్ధి గాంచిన 25అడుగుల పొడవు, ఆరు అడుగుల వెడల్పుగల ఏకరాతి అనంత పద్మనాభ స్వామి విగ్రహం పేరెన్నికగన్నది. కొండను తొలిచి పొడవాటి స్తంభాలపై క్రీ.శ. రెండు లేక మూడవ శతాబ్దంలో నాలుగంతస్తులుగా చెక్కారు. మొదటి అంతస్తులో 16 మండపాలతో కూడిన గర్భాలయంలో నృసింహస్వామి, విఘ్నేశ్వరుడు, దత్తాత్రేయ కనిపిస్తారు. రెండవ అంతస్తులో శేషతల్పంపై శయనించిన విష్ణుమూర్తి రూపమైన అనంత పద్మనాభ స్వామి ఏకరాతి విగ్రహం దర్శనమిస్తుంది. ఈ గుహలపై 1955లో బాపట్ల ఆర్ట్స్ అండ్ సైన్స్ కళాశాలకు చెందిన చరిత్ర ప్రధానోపాధ్యాయులు సిఎస్ శాస్త్రి పరిశోధలనలు జరిపారు. అనేక బౌద్ధారామాలు (మిగతా 169లో)















# ప్రాచీన చరితకు నిలువుటద్దం


ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన ఉండవల్లి గుహలు

(168వ పేజీ తరువాయి)
నిర్మించిన గోవింద శర్మ ఈ గుహలు నిర్మించారు. ఆరు, ఏడు శతాబ్ద కాలంలో రెడ్డిరాజులు గుంటూరును రాజధానిగా పాలిస్తున్న కాలంలో ఇటువంటి బౌద్ధాలయాలు ప్రతిదానిని హిందూ దేవాలయాలుగా మార్చాలని కోరడంతో దీనికి కొన్ని మెరుగులు దిద్ది అనంత పద్మనాభ స్వామిగా మార్చినట్టు కథనం. 14వ శతాబ్దంలో ఇక్కడ కొండవీటిరాజులు వేసిన ఓ శాసనం ప్రకారం ఇది ఆరు, ఏడు శతాబ్దాల నాటిదని క్రీ.శ. 1343లో అన్నారెడ్డి కుమారుడు పంచమరెడ్డి అనంత పద్మనాభునికి దానాలు ఇచ్చినట్టు తెలుస్తుంది.

1958వ సంవత్సరంలో ఈ గుహలను పురావస్తు శాఖవారు స్వాధీన పరుచుకుని పాడైన కొన్ని శిల్పాలకు మెరుగులు దిద్దారు. సొరంగ మార్గం వల్ల ఎవరికీ ఎలాంటి ప్రమాదం కలుగకుండా దానిని మూసి వేశారు. ఇక్కడ నుంచి కొండవీడు కోటకు, మండళగిరి కొండకు, కనకదుర్గమ్మ కొండకు రహస్య సొరంగ మార్గాలు వుండేవని చెప్పుకుంటారు. ఇప్పుడిప్పుడే కాస్త పర్యాటకులు ఉండవల్లి గుహాలయాలకు విచ్చేస్తున్నారు.

# సీతానగరంలో అలరిస్తున్న అంజనీ పుత్రుడు

(ఆన్‌లైన్...తాడేపల్లి)
గుంటూరు జిల్లా తాడేపల్లి మండల పరిధిలో జిల్లా ముఖద్వారమైన కృష్ణా నదీ తీరములో వందేళ్ల చరిత్ర గల పుణ్యక్షేత్రం శీతానగరం. ఇక్కడ ఆంజనేయస్వామి స్వయంభువుగా వెలిశారని పురాణగాధలు చెబుతున్నాయి. శీతానగరంలో గల శ్రీమద్ వీరాంజనేయ సమేత కోదండ రామాలయం కాక శ్రీ రాజరాజేశ్వరి అమ్మవారి ఆలయం, సోమేశ్వర స్వామి ఆలయం, శ్రీ సంగనాగమల్లేశ్వర స్వామి ఆలయం పేరెన్నికగన్నవి.

సుమారు వందేళ్ల క్రితం నిర్మించిన ఆలయం ఇది. ఈ ఆలయం కట్టించినవారు తమ్మన అంకమ్మ శ్రేష్టి. చాలా చిత్రమైన పద్ధతిలో ఈ ఆలయం ఏర్పడింది. అంకమ్మ శ్రేష్టి, ఆయన తల్లి కుటుంబం గడవక విజయవాడ వచ్చి (స్వగ్రామం ప్రకాశం జిల్లా) ఒక షావుకారు ఇంటిలో వంట చేయడానికి కుదిరారు. శ్రేష్టి తల్లి కొడుకును గుగ్గిళ్లు అమ్ముకురమ్మని చెప్పగా విజయవాడ నుంచి బయలుదేరిని శ్రేష్టి అలసిపోయి శీతానగరం వైపు వచ్చి ఒక చెట్టు కింద నిద్రించారట. నిద్రలో ఎవరో పిలిచినట్టుగా వుంటే లేచి చూడగా ఆయనకు శ్రీమద్ వీరాంజనేయ స్వామి దర్శనమిచ్చి ఈ ప్రాంతానికి వచ్చేందుకు భక్తులకు రహదారి ఏర్పాటు చేయమని కోరారట. అప్పట్లో ఈ ప్రాంతం అంతా అడవి వలె ఉండేది. శ్రేష్టి వెంటనే విజయవాడ వెళ్లి తన తల్లిని తీసుకువచ్చి జరిగిన విషయం చెప్పగా అక్కడ వీరాంజనేయుని విగ్రహం దేదీప్యమానంగా వెలుగుతూ కనిపించిందట. ఈ విషయం తెలుసుకున్న షావుకారు ఆ ముళ్ల మార్గం అంతా శుభ్రపరచి రహదారి మార్గం ఏర్పాటు చేయించారు. అలా 1911లో ఆలయం ఏర్పాటైంది. 1913లో ముఖ మండపం ఏర్పాటైంది. భక్తులు ఇక్కడ ఉన్న ఆంజనేయుని ఉగ్రరూపం చూసి తట్టుకోలేక పోయేవారట. ఎవరైనా తప్పులు చేసి ఈ ఆలయం వద్దకు వస్తే అప్పట్లో వారి దుస్తులు కాలడమో, అనర్థాలు జరగడమో సంభవించేదట. అప్పటి పెద్దల్ని కొందరు ఈ విషయమై సంప్రదించగా కోదండరాముణ్ని ప్రతిష్టిస్తే ఆంజనేయస్వామి శాంతిస్తాడని చెప్పారట. దీనితో 1919లో ఇక్కడ కోదండ రామాలయం ఏర్పడింది.



అప్పటినుంచి 1946 వరకు ఆలయ బాధ్యతలు శ్రేష్టిగారే నిర్వహించేవారు. ఆయన స్వర్గస్తులైన అనంతరం ఆయన భార్య వెంకటసుబ్బమ్మ 1954వరకు ఆలయ బాధ్యతలు చూశారు. వీరికి సంతానం లేకపోవడంతో వీరి గోత్రికులైన తమ్మన వీర హనుమంతు కోటేశ్వరరావును దత్తత చేసుకోగా ఆయన ఆలయ బాధ్యతలు అనువంశక ధర్మకర్తగా నిర్వర్తిస్తున్నారు. 1965లో దేవాదాయ ధర్మాదాయశాఖకు ఈ ఆలయ బాధ్యతలు అప్పగించారు.



నంబూరులో పంట పొలాలను పరిశీలించి అధికారులతో చర్చిస్తున్న బేయర్ క్రాప్ సైన్సు వైస్ ప్రెసిడెంట్ ఎం.రామారావు

## రైతు జనసంక్షేమమే ధ్యేయంగా

# బేయర్ క్రాప్ సైన్స్

(ఆన్‌లైన్ - గుంటూరు)

ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన బేయర్ క్రాప్ సైన్సు అంతర్జాతీయ ప్రమాణాలకు ధీటుగా అధునాతన సాంకేతిక పరిశోధనతో రూపొందించిన ధడేకి, అడ్మైర్ ఉత్పత్తులను ఇటీవల విడుదల చేశారు. ఇప్పటికి 140 సంవత్సరాలుగా ఎన్నో విశిష్ట ఉత్పాదనలను సుమారు 165 దేశాలకు పైగా వున్న కోట్లాది మంది రైతులకు అందిస్తూ గత సంవత్సరం ప్రపంచంలో అతి పెద్ద కంపెనీలలో ఒకటైన అవంటీస్ క్రాప్ సైన్సును విలీనం చేసుకుంది. ప్రపంచంలో 400 కంపెనీల మొత్తం మార్కెట్ షేర్ 78 శాతం కాగా, బేయర్ ఒక్కటే 22 శాతం మార్కెట్ షేర్‌తో అగ్రస్థానంలో వుంది. ప్రతి ఏటా పరిశోధనలు, అభివృద్ధి నిమిత్తం 14 వేల కోట్ల రూపాయలను వ్యయం చేస్తున్నది.

నూతనంగా ప్రవేశపెట్టిన ఉత్పత్తుల్లో ఒకటైన అడ్మైర్, ధడేకి వరి, ఇతర పంటలపై బాగా పని చేస్తుంది. అభివృద్ధి చెందిన దేశాలైన జపాన్, కొరియా రైతులు ఇప్పటికే విరివిగా దీనిని వాడుతున్నారు. దీనిని భారతదేశంలోని ప్రభుత్వ వ్యవసాయ విశ్వవిద్యాలయాలు, పరిశోధనా మండలి డిడిఆర్ వారి వివిధ ప్రాంతీయ పరిశోధనశాలల్లో క్షుణ్ణంగా పరిశీలించి మనదేశంలో వరి, పత్తి, మిర్చి పైర్లపై వచ్చే తెగుళ్ళ నివారణకు లభ్యమవుతున్న వీరి ఉత్పత్తుల్లో అత్యున్నత శ్రేణికి చెందినదిగా సిఫార్సు చేశారు.

నూతన ఉత్పత్తులైన ధడేకి, అడ్మైర్‌లు పత్తి పంటపై ఆశించే పచ్చదోమ, పేనుబంక, ఆకుముడత తదితర తెగుళ్ళను నివారిస్తుంది. అటువంటి తరుణంలో పాత పద్ధతుల్లో కాక కొత్త సాంకేతిక విలువలతో కూడిన మందులను వాడటం రైతులకు క్షేమదాయకమని బేయర్ క్రాప్ సైన్సు సౌత్ ఇండియా జనరల్ మేనేజర్, జోనల్ మార్కెటింగ్ మేనేజర్‌లు తెలిపారు.

నిష్ణాతులైన డాక్టరేట్స్‌తో ఒక ప్రత్యేకమైన బయలాజికల్ డిపార్టుమెంట్‌లను స్థాపించి ఎప్పటికప్పుడు చీడపీడల ఉధృతిని పర్యవేక్షించటం, వాటి నిరోధక శక్తి పెంపుదలను గమనించటంతోపాటు వాటిని నియంత్రించటానికి తగు సలహాలు, సూచనలు ఇస్తారని, రైతుల్లో ఎంతో ప్రాచుర్యం పొందిన బేయర్ కంపెనీ విత్తన శుద్ధి దగ్గర నుంచి పంట కోతకు వచ్చేంతవరకు అవసరమయ్యే కలుపు, పురుగు తెగుళ్ళు నివారించే ప్రత్యేక తరహాలో పని చేసే ఉత్పాదనలను రైతులకు అందిస్తున్నారు.

# జన్మభూమి రుణం తీర్చుకుంటున్న

# డా॥ రామినేని  ఫౌండేషన్



**రామినేని అయ్యన్న చౌదరి**
ఫౌండర్, రామినేని ఫౌండేషన్

భారతీయ సంస్కృతి మరియు హిందూయిజం ఆదర్శాలకు సంబంధించి కట్టడాల వారసత్వాన్ని పరిరక్షించి, అభివృద్ధి పరిచే లక్ష్యంతో USA లోని ఓహియో రాష్ట్రంలో సిన్ సిన్నాటిలో స్వర్గీయ డా॥ రామినేని అయ్యన్న చౌదరి పిల్లలచే 1995లో డా॥ రామినేని ఫౌండేషన్ స్థాపించబడింది. అంతేగాక కళలు, శాస్త్రం మరియు మానవ విజ్ఞాన శాస్త్రాల మిశ్రమ రంగాల నుండి తీసుకోబడిన ఉన్నత పండితులను సాహసవంతులుగా, ధృడ నిర్భలయులుగా, పరోపకారులుగా వారి ప్రయత్నాలకు వీలు కల్పించడమే ఈ సంస్థ యొక్క ప్రాథమిక లక్ష్యం.

## డా॥ రామినేని అయ్యన్న చౌదరి (డా॥ RAC)

డా॥ RAC 1929 అక్టోబరు 12న ఆంధ్రప్రదేశ్‌లోని గుంటూరు జిల్లా, బ్రాహ్మణ కోడూరు గ్రామంలో రైతు కుటుంబంలో స్వర్గీయ శ్రీ వీరయ్య చౌదరి మరియు స్వర్గీయ శ్రీమతి కన్యాకుమారికి జన్మించారు. ఆయన తండ్రి సలహా మేరకు వ్యవసాయంతోపాటు లలిత కళలలో చొరవచూపారు. డా॥ RAC గుంటూరు జిల్లాలో పాఠశాల విద్య పూర్తి చేసి బనారస్ హిందూ విశ్వవిద్యాలయం నుండి గణితంలో పోస్ట్ గ్రాడ్యుయేషన్ డిగ్రీ పొందారు. 1955 వరకు ఆయన గుంటూరు జిల్లాలోని పాలపర్రు, కృష్ణాజిల్లాలోని మొవ్వలో ఉపాధ్యాయుడిగా పనిచేశారు. ఉన్నత విద్యాభ్యాసంకై డా॥ RAC 1955లో అమెరికా వెళ్ళారు. అక్కడ ఆయన మిన్నీపాలిస్‌లోని మిన్నెసోట విశ్వవిద్యాలయం నుండి మాస్టర్ ఆఫ్ సైన్స్ ఇన్ ఎకనామిక్స్ అండ్ ఫైనాన్స్‌తోపాటు డాక్టరేట్ కూడా పూర్తి చేశారు. విద్యాభ్యాస కాలంలో ఆయన తల్లిదండ్రులపై ఆధారపడక పార్ట్‌టైం ప్రాతిపదికన పనిచేస్తూ స్వయంగా ఆర్థిక వనరులను సమకూర్చుకునేవారు. తర్వాత 1963-1973 వరకు నార్త్ ల్యాండ్ కాలేజిలో ప్రొఫెసర్‌గా ఆశ్లాండ్ అండ్ జేవియర్ యూనివర్శిటీ, సిన్‌సెన్నాటిలో పనిచేశారు. 1973లో ఆయన తన సేవలను సామాజిక, సాంస్కృతిక రంగాలకు అంకితం చేసేందుకై చాలా ముందుగానే పదవీ విరమణ పొందినారు. డా॥ RAC పదవీ విరమణ తర్వాత రియల్ ఎస్టేట్ వ్యాపారంలోప్రవేశించి ఓహియో రాష్ట్రంలోని సిస్ సిన్నాటిలో డౌన్‌టౌన్ ప్రాపర్టీ మేనేజ్‌మెంట్ Inc., ని స్థాపించారు. నాయకుని లక్షణాలతో ముందుకు సాగారు. నేడు ఈ సంస్థ ఉన్నత స్థానంలో ఉన్నది. డా॥ RAC కి 1967లో సుగుణతో వివాహమైంది. ఆయనకు 6గురు పిల్లలు. మన సంస్కృతి నాగరికతలో అపార నమ్మకమున్నందున వారికి ధర్మప్రచారక్, శారదాదేవి, సత్యవాది, బ్రహ్మానంద, వేదాచార్య మరియు హరిచంద్ర అని సంప్రదాయక వేద పేర్లు పెట్టుకొన్నారు. ఆయన తన పిల్లలను పాశ్చాత్య సంస్కృతి నుండి తప్పించేందుకు ఇంట్లోనే విద్యాబుద్ధులు నేర్పారు. ఆయనచే ప్రారంభించిన వ్యాపారంలో శిక్షణలో పొందిన వారు జాగ్రత్తగా చూసుకుంటున్నారు. డా॥ RAC 1958లో USA లో విద్యాభాస కాలంలో హిందూ సంస్కృతి మరియు నాగరికతను వికసింపజేసేందుకు హిందూ అసోసియేషన్ ఆఫ్ మిన్నెసోటాను స్థాపించి క్రమంగా భారతీయ ఉత్సవాలు మరియు సామాజిక కార్యకలాపాలను నిర్వహించారు. ఆయన తన జన్మస్థలంలో సంగీత, సాహిత్య, సంస్కృతి, హిందూధర్మ నిలయంను స్థాపించి భారతీయ లలిత కళలకు అంకితం చేశారు. డా॥ RAC వెంపటి చినసత్యం మార్గదర్శకాల మేరకు కూచిపూడి నాట్య పాఠశాల మరియు వేద పాఠశాలను కూడా స్థాపించాలని ప్రణాళిక రూపొందించారు.



**వేదాచార్య**
కన్వీనర్, రామినేని ఫౌండేషన్



రామినేని ఫౌండేషన్ ఫౌండర్ రామినేని అయ్యన్న చౌదరి గారికి నివాళులర్పిస్తున్న ఆర్థిక శాఖామాత్యులు శ్రీ కె. రోశయ్య



రామినేని ఫౌండేషన్ కన్వీనర్ వేదాచారిని ఆశీర్వదిస్తున్న త్రిదండి రామానుజ చినజీయర్ స్వామి

## డా॥ రామినేని ఫౌండేషన్ USA

ఈ సంస్థ యొక్క లక్ష్యాలు మరియు సంక్షిప్త వివరాలు ఇప్పటికే మీ వద్ద ఉన్నాయి. దీనికి తోడు సంస్థ యొక్క గత కార్యకలాపాలు దిగువ తెలియజేస్తున్నాము.

హైదరాబాద్‌లో 12 అక్టోబరు 1999న హోటల్ గ్రాండ్ కాకతీయలో డా॥ ఆర్‌ఎఫ్ ప్రారంభించబడి క్రింద పేర్కొన్న వాటిని నిర్వహించింది. ఈ వేడుకలో ముఖ్య అతిథిగా డా॥ సి. నారాయణరెడ్డిగారు మరియు విశిష్ట అతిథులుగా డా॥ వెంపటి చిన్నసత్యం, ప్రొఫెసర్ ఎన్. గోపి, ప్రొఫెసర్ పి. శివారెడ్డి మరియు డా॥ గుమ్మడి వెంకటేశ్వరరావు పాల్గొన్నారు.

**సాంస్కృతిక కార్యక్రమం :** డా॥ వెంపటి చిన సత్యం బృందంచే కూచిపూడి నృత్య ప్రదర్శన.

**సన్మానం : విశిష్ట పురస్కారం :** డా॥ జిఎన్. రావు, వ్యవస్థాపకులు & డైరెక్టర్, ఎల్.వి. ప్రసాద్ ఐ ఇనిస్టిట్యూట్.

**విశేష పురస్కారం :** బాపు-రమణ , ఆదర్శ స్నేహితులు మరియు రూపకర్తలు : డా॥ నండూరి రామమోహనరావు, విశేషానుభవంగల జర్నలిస్టు & రచయిత : శ్రీ కాళీపట్నం రామారావు, తెలుగు కధాపోషకులు

భారతదేశంలో 12 అక్టోబరు, 2000 నాడు హోటల్ గ్రీన్‌పార్క్‌లో డా॥ మొది వార్షికోత్సవమును జరుపుకొని దిగువ తెలిపిన వాటిని నిర్వహించింది. ఈ ఉత్సవానికి డా॥ అక్కినేని నాగేశ్వరరావుగారు ముఖ్య అతిథిగా మరియు డా॥ ఎన్. శివప్రసాద్, ప్రొఫెసర్ కాకర్ల సుబ్బారావు, శ్రీ ఎం. మురళీమోహన్ విశిష్ట అతిథులుగా పాల్గొన్నారు.

సాంస్కృతిక కార్యక్రమం : "అన్నమయ్య పద కోకిల" శ్రీమతి శోభరాజు మరియు బృందంచే భక్తి సంగీత కార్యక్రమం.

డా॥ RAC జన్మస్థలాన్ని మరియు తన కుటుంబ వృత్తిని మరచిపోకుండా తన 4వ కుమారుడు వేదాచార్య సహాయంతో బ్రాహ్మణకోడూరులో వ్యవసాయ కార్యరంగాన్ని అభివృద్ధి చేశారు. భారతదేశాన్ని తరచుగా సందర్శించినప్పుడు విలువైన మార్గదర్శకాలను పశుసంరక్షణకై అందించారు. హిందుస్థాన్ థెరప్యూటిక్స్ ప్రై. లిమిటెడ్, హైదారాబాద్ పేరుతో ఫార్ములేషన్స్ తయారీ యూనిట్‌ను నెలకొల్పి, వ్యవసాయదారులకు అధిక నాణ్యత మరియు తక్కువ ఖర్చుతో కూడిన పశు సంరక్షణ మందులను అందిస్తున్నారు. డా॥ RAC గారి 70వ జన్మదినోత్సవం సందర్భంగా వారి పిల్లలు డా॥ రామినేని ఫౌండేషన్‌ను భారతదేశంలో 12-10-1999న ప్రారంభించి దాని సామాజిక మరియు సాంస్కృతిక కార్యకలాపాలను విస్తృతంచేసి ప్రాథమిక లక్ష్యాన్ని నెరవేర్చేందుకు కృషి చేస్తున్నారు.

హైదరాబాద్‌లో డాక్టర్ రామినేని ఫౌండేషన్ అవార్డుల ప్రదానోత్సవంలో మంత్రి రోశయ్య చేతులమీదుగా జ్ఞాపికను అందుకుంటున్న సినీనటి అంజలీదేవి

మెరిట్ సర్టిఫికెట్‌ను అందజేస్తున్న జడ్‌పి చైర్‌పర్సన్ విజయమ్మ. వేదికపై ఎంపి రాయపాటి, జడ్‌పి మాజీ చైర్మన్ పాతూరి తదితరులు

దురదృష్టవశాత్తు అరోగ్యకారణాల వల్ల వ్యవస్థాపకులైన డా॥ RAC గారు 24-4-2000 నాడు సిన్‌సిన్నాటిలో మరణించారు. సన్మానాలు మరియు ఇతర సామాజిక కార్యకలాపాలు అందజేసే సంస్కృతిని కొనసాగించాలని అతని పిల్లలు నిర్ణయించారు. పురస్కారములు -99, పురస్కారములు-2000, పురస్కారములు-2001, పురస్కా రములు-2002, పురస్కారములు-2003, పురస్కారములు-2004 పేరుతో సన్మాన కార్యక్రమాలను నిర్వహించి 12-10-2005న పురస్కారములు-2005 నిర్వహించాము. గతంలో జరిగిన వేడుకల వివరాలు జతరపరచబడినవి.

ఆంధ్రప్రదేశ్ ఉన్నత విద్యా మండలిచే నిర్వహించబడిన 10వ తరగతి పబ్లిక్ పరీక్షలలో అత్యున్నత మార్కులు సాధించిన బాలబాలికలను మెరిట్ అవార్డులను ఇవ్వాలని 2001 పురస్కారముల సమయంలో నిర్ణయించడమైనది. ఎంపిక చేయబడిన పాఠశాలలన్నీ గ్రామీణ ప్రాంతాల (గుంటూరు జిల్లాలోని బ్రాహ్మణకోడూరు, పాలపర్రు మరియు తెనాలి మరియు కృష్ణా జిల్లాలోని మొవ్వ)లోని జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాలలకు చెందినవే. ఈ ఎంపిక వెనుక దాగివున్న ఉద్దేశ్యమేమనగా గ్రామీణ ప్రాంతాల విద్యార్థులను ప్రోత్సహించి జీవితంలో ఉన్నత లక్ష్యాలను సాధింపచేయడం. ఈ ప్రదేశాలు కూడా డా॥ RAC గారి స్వస్థలమేకాక ఆయన విద్యాభ్యాసం చేసి, అక్కడే ఉపాధ్యాయుడిగా పనిచేసియున్న స్థలం.

గ్రామీణులను ప్రోత్సహిస్తున్న ఈ నేపథ్యంలో పురస్కారములు-2003 కాలంలో ఒక్కో అసెంబ్లీ నియోజకవర్గం ఉండి 19 మందికి పైగా 10వ తరగతి విద్యార్థులను మెరిట్ అవార్డులు బహుకరించడమే కాక ఈ సంవత్సరం గుంటూరు జిల్లాలో ఒక్కో మండలంలో ఒక్కొక్కరు చొప్పున 57 మంది విద్యార్థులకు అందజేయబడినవి. ఇది పైన తెలిపిన 4 విద్యార్థులకు అదనం.

**సన్మానం : విశిష్ట పురస్కారం :** డా॥ కె. వరప్రసాద్ రెడ్డి, ఎండి, శాంతా బయోటెక్నిక్స్ (ప్రై) లిమిటెడ్.

**విశేష పురస్కారం :** డా॥ లాల్జీ సింగ్, డైరెక్టర్ సిసిఎంబి, హైదరాబాద్

డా॥ కె. విశ్వనాథ్, సినీ దర్శకులు

శ్రీ కాళోజి నారాయణరావు, విశేసానుభవంగల రచయిత

ఈ వేడుకులకు కేంద్ర రక్షణ శాఖ సహాయ మంత్రి శ్రీ యు.వి. కృష్ణంరాజుగారు ముఖ్య అతిథిగా పాల్గొనగా, జస్టిస్ జాస్తి చలమేశ్వర్, ఆం.ప్ర హైకోర్టు మాజీ న్యాయమూర్తి, శ్రీ ఎ. గంగాధరరావు, శ్రీ పి.వి.ఆర్.కె. ప్రసాద్, ఐఎఎస్ మరియు శ్రీ ఎం.వి. భాస్కరరావుగార్లు విశిష్ట అతిథులుగా పాల్గొన్నారు.

**సాంస్కృతిక కార్యక్రమం :** శ్రీ వందేమాతరం శ్రీనివాస్ మరియు బృందంచే సంగీత కచేరి

**సన్మానం : విశిష్ట పురస్కారం :** ప్రొఫెసర్ డి.సి. రెడ్డి, వైస్ చాన్సలర్, ఉస్మానియా విశ్వవిద్యాలయం

**విశేష పురస్కారం :** ఓల్గా, ప్రఖ్యాత రచయిత్రి

శ్రీ ఎం.ఎ. సుభాన్, వ్యవస్థాపకులు : కళాసాగర్, చెన్నై

శ్రీమతి జి. నిర్మలమ్మ, ప్రఖ్యాత సినీ ఆర్టిస్ట్



బ్రాహ్మణ కోడూరులో రామినేని ఫౌండేషన్ నిర్మించిన ఓవర్‌హెడ్ ట్యాంక్

ఈ వేడుకలకు శ్రీమతి కె. ప్రతిభా భారతి, ఆంప్ర శాసనసభ స్పీకర్ ముఖ్య అతిథిగా పాల్గొనగా, శ్రీ టి. దేవేందర్‌గౌడ్, ఆంప్ర హోంమంత్రి, డా॥ కోడెల శివప్రసాదరావు, ఆంప్ర ఆరోగ్య శాఖామంత్రి శ్రీ ఐ. వెంకట్రావు, చైర్మన్ ఆంప్ర వైస్ అకాడమీ డా॥ మాడుగుల నాగఫణిశర్మ గార్లు విశేష అతిథులుగా పాల్గొన్నారు.

**సాంస్కృతిక కార్యక్రమం :** ప్రఖ్యాత చలన చిత్ర హాస్య కళాకారులచే హాస్యవల్లరి

**సన్మానం : విశిష్ట పురస్కారం :** డా॥ చుక్కా (ఐఐటి) రామయ్య డా॥ ఎన్. కోటేశ్వరరావు, ప్రముఖ రచయిత, సయ్యద్ ఎండి. ఆరిఫ్, నేషనల్ చీఫ్ బ్యాడ్మింటన్ కోచ్

ఈ కార్యక్రమాన్ని శ్రీశ్రీశ్రీ గణపతి సచ్చిదానంద స్వామీజీ ప్రారంభించగా మాజీ ముఖ్యమంత్రి నారా చంద్రబాబు నాయుడుగారు ముఖ్యఅతిథిగా పాల్గొన్నారు. కర్ణాటక, హిమాచల్ ప్రదేశ్ మాజీ గవర్నర్ రమాదేవి విశేష అతిథులుగా, గుంటూరు జడ్‌పి చైర్మన్ పాతూరి నాగభూషణంగారు గౌరవ అతిథిగా, సినీ నటుడు ఎ.వి.ఎస్. తదితరులు పాల్గొన్నారు.

**సాంస్కృతిక కార్యక్రమం :** సినీనటుడు టి.ఎల్.కాంతారావు, బి. సుబ్బరాయన్

**సన్మానం : విశిష్ట పురస్కారం :** హేమలత లవణం

**విశేష పురస్కారం :** డా॥ యార్లగడ్డ నాయుడమ్మ పిల్లల వైద్యనిపుణులు

ఈ కార్యక్రమాన్ని శ్రీశ్రీశ్రీ త్రిదండి రామానుజ చినజీయర్ స్వామిజీ ప్రారంభించగా, శాసనసభ స్పీకర్ కెఆర్ సురేష్ రెడ్డి ముఖ్యఅతిథిగా పాల్గొన్నారు.

కేంద్ర బొగ్గు గనుల శాఖ మంత్రి డాక్టర్ దాసరి నారాయణరావు విశేష అతిథులుగా, గుంటూరు జడ్‌పి చైర్మన్ పాతూరి నాగభూషణం, పొన్నూరు ఎమ్మెల్యే ధూళిపాళ్ళ నరేంద్ర కుమార్‌లు గౌరవ అతిథులుగా, సినీ నటులు తనికెళ్ళ భరణి, ఎ.వి.ఎస్ తదితరులు పాల్గొన్నారు.

**సన్మానం : విశిష్ట పురస్కారం :** ప్రముఖ గ్యాస్ట్రో ఎంటరాలజిస్టు పద్మశ్రీ డాక్టర్ నాగేశ్వరరెడ్డి, ప్రముఖ కవి, పద్మభూషణ్ డాక్టర్ బోయిభీమన్న, ఆంధ్ర మహిళసభ పూర్వ అధ్యక్షురాలు కె. సుగుణమణి, నవోదయ పబ్లికేషన్స్ ప్రచురణకర్త నవోదయ రామ్మోహనరావు.

హైదరాబాద్‌లో 12 అక్టోబర్ 2006న డాక్టర్ ఆర్ ఎఫ్ ఏడవ వార్షికోత్సవం జరిగింది.

ఈ కార్యక్రమములో రాష్ట్ర వైద్య ఆరోగ్యశాఖామంత్రి కొణిజేటి రోశయ్య, ప్రభుత్వ సలహాదారుడు సిసిరెడ్డి, పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వ విద్యాలయం వైస్ ఛాన్సలర్ డాక్టర్ అవుల మంజులత, సినీనటుడు పరుచూరు గోపాలకృష్ణ, గుంటూరు జిల్లా పరిషత్ మాజీ చైర్మన్ పాతూరి నాగభూషణం, పొన్నూరు ఎమ్మెల్యే ధూళిపాళ్ళ నరేంద్ర కుమార్ తదితరులు పాల్గొన్నారు.

**సన్మానం, విశిష్ట పురస్కారం :** ఢిల్లీలోని ఆల్‌ఇండియా మెడికల్ సైన్స్ కార్డియాలజీ విభాగం హెడ్ ప్రొఫెసర్ కె. శ్రీనాధరెడ్డి

**విశేష పురస్కారం :** త్రివేణి పత్రిక సంపాదకుడు ఐ.వి. చలపతిరావు, సినీనటి అంజలీదేవి, పిఠాపురం విశ్వవిజ్ఞాన అధ్యాత్మిక పీఠం వ్యవస్థాపకుడు డాక్టర్ ఉమర్ ఆలీష్.

8322, Arborcrest Drive, Cincinnati, Ohio - 45236-140, USA. C-12, Madhuranagar, Hyderabad - 500 038. India



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLVA101M208 |
| పుస్తకం పేరు | ఆంధ్రజ్యోతి |
| తారీఖు | 08 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 173 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | Bhanu |
| పేజీలు విడదీసినది | Bhanu |
| స్కాన్ చేసినది | Naveeda |
| పరీక్ష చేసినది | THASIN |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |